# శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావు (నాన్న)గారి

## శతజయంతి సంచిక

1913-2013

## పూజాపుష్పాలు











శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావు (నాన్న) గారి

# శతజయంతి సంచిక

## పూజా పుష్పాలు


ప్రధాన సంపాదకులు

పురుషోత్తమ పుత్ర భార్గవ

**పి.యస్.ఆర్. ఆంజనేయ ప్రసాద్**

విశ్వజనని సంపాదకులు- శ్రీనాథపీఠ సంచాలకులు

సంపాదక వర్గము

**మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి**

**ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం**



ప్రచురణ

**విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి**







| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణ | : | అక్టోబరు 2013, నాన్నగారి శతజయంతి |
| కాపీలు | : | 1000 |
| వెల | : | రూ. 200/- |
| ప్రతులకు | : | శ్రీ విశ్వజననీ పరిషత్<br>జిల్లెళ్ళమూడి - 522 113.<br>బాపట్ల తాలుకా, గుంటూరుజిల్లా.<br>ఫోన్ : 08643 -227324, 227492 |
| డి.టి.పి. | : | క్రియేషన్ గ్రాఫిక్స్<br>7/3 అరండల్‌పేట, గుంటూరు-2.<br>ఫోన్ : 0863-2250885 |
| ప్రతులకు | : | శ్రీ లక్ష్మీ గణపతి ఆర్ట్ ప్రింటర్స్<br>2/4 బ్రాడీపేట, గుంటూరు-2.<br>ఫోన్ : 0863-2235036. |




*His Holiness - Jagadguru*

**SRI SIDDHESWARANANDA BHARATISWAMY**

*Siddheswari Peetadhipati - Courtallam*

Mounaswamy Mutt,
Courtallam - 627 802
(Via Tenkasi),
Thirunelveli (Dt.)
TAMILNADU
Ph:04633-283707

పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు
**శ్రీ సిద్ధేశ్వరానందభారతీస్వామి**
సిద్ధేశ్వరీ పీఠాధిపతి - కుర్తాళం

Camp Office :
B1-C40,
Kaalipeetham Street,
4th Line,
Ravindra Nagar,
GUNTUR-522 006
Ph : 0862-2231625
2256666



## ఆశీర్వాద శ్రీముఖము

జిల్లెళ్ళమూడి అమ్మ మాతృశ్రీ అనసూయాదేవికి వేల లక్షల భక్తులున్నారు. వారిలో డెబ్బై అయిదు శాతం జనులకు అమ్మ భర్త నాగేశ్వరరావు గారు తెలుసు. అర్కపురిలో అడుగుపెట్టిన వారికి ఆదరము, అభిమానం అందించే గౌరవనీయ వ్యక్తి ఆ సహృదయ శేఖరుడు. అమ్మ దర్శనం తర్వాత పరిచితులంతా ఆయన దగ్గరికి వెళ్ళేవారు. సౌహార్దము, సౌజన్యము మూర్తీభవించిన ఆయన శతజయంతి సంవత్సరం సందర్భంగా ఆప్తులు - భక్తులు సంచిక ప్రచురించటం చాలా ముదావహం. ఇందులోని వ్యాసాలు చదువుతుంటే మామూలు వాళ్ళకు తెలియని గుప్త సౌమనస కోణము లెన్నో ఉన్న సంగతి తెలుస్తుంది. విశ్వజననియైన అమ్మ నాగేశ్వర గేహిని. భార్య అన్న స్థితిని దాటి లోకానికి అమ్మగా ఎదుగుతుంటే చూచి పరిశీలించి సత్యశోధకునిగా తృప్తి పొంది సహకరించిన ధీశాలి నాగేశ్వరరావుగారు. వారిని గూర్చి వచ్చిన రచనలు ఎందరికో కనువిప్పు కలిగిస్తవి. ఈ సంచిక సహృదయాదరమును పొంది ప్రకాశించును గాక!

నారాయణ స్మరణతో

సిద్ధేశ్వరానంద భారతీ స్వామి



# నాన్నగారి శతజయంతి సంచిక - విషయసూచిక





## ENGLISH SECTION







# శ్రీ విశ్వజననీ పరిషత్ పాలక వర్గము



| | | |
|---|---|---|
| శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు | - పాట్రన్ | 9966148773 |
| శ్రీ మరకాని దినకర్ | - అధ్యక్షులు | 9849041691 |
| శ్రీ కె. నరసింహమూర్తి | - ఉపాధ్యక్షులు | 9848044432 |
| శ్రీ కె.బి.జి. కృష్ణమూర్తి | - ఉపాధ్యక్షులు | 9866099120 |
| శ్రీ వారణాసి ధర్మసూరి | - ఉపాధ్యక్షులు | 9848010418 |
| శ్రీ వై.వి. శ్రీరామమూర్తి | - ప్రధానకార్యదర్శి | 7702285959 |
| శ్రీ వల్లూరి రమేష్ బాబు | - స్థానిక కార్యదర్శి | 9676944949 |
| శ్రీ జె. యానాది | - కార్యదర్శి | 9246223602 |
| శ్రీ యస్. మోహనకృష్ణ | - ఆర్గనైజింగ్ సెక్రటరీ | 9491885770 |
| శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్ | - కరస్పాండెంట్,యం.ఓ.సి | 9490643352 |
| శ్రీ లక్కరాజు రామకోటేశ్వరరావు | - కోశాధికారి | 9440959112 |
| శ్రీ డి.వి.యన్. కామరాజు | - సభ్యుడు | 9849573845 |
| శ్రీ ఐ. రామకృష్ణారావు | - సభ్యుడు | 9845316704 |
| శ్రీ పి. ప్రేమగోపాల్ | - సభ్యుడు | 9848207357 |
| శ్రీ కొండముది సుబ్బారావు | - సభ్యుడు | 9908018236 |
| శ్రీ కట్టమూరి వెంకటేశ్వరరావు | - సభ్యుడు | 9440681604 |
| శ్రీ భట్టిప్రోలు రామచంద్ర | - సభ్యుడు | 9441061599 |
| శ్రీ యం. రామకృష్ణాంజనేయులు | - సభ్యుడు | 9959784476 |
| శ్రీ నాదెండ్ల లక్ష్మణరావు | - సభ్యుడు | 9490385992 |
| శ్రీ చక్కా శ్రీమన్నారాయణ | - సభ్యుడు | 9963385818 |
| శ్రీమతి ఎ. కుసుమా చక్రవర్తి | - సభ్యుడు | 9440497489 |
| శ్రీ బొప్పూడి రామబ్రహ్మం | - సభ్యుడు | 9440138452 |

చైర్మన్ విద్యాపరిషత్ అభివృద్ధి సంఘం





అమ్మ - నాన్నగారితో సుబ్బారావు కూతురు హైమ




# సంపాదకీయము పూజా పుష్పాలు




మాతృశ్రీ జీవిత మహోదధిలో మనమంతా తరంగాల మనేది నిస్సంశయం. మరి నాన్నగారు సముద్రమందలి నీటిలో తడిగా నిండి ఉండటమే కాక లోతైన, గంభీరమైన మనస్తత్వం కలిగినవారు. అంతేకాదు అమ్మ జీవితమనే గొప్ప ఉదకమునకు నిధియైనవారు (ఉదకమునకు నిధి ఉదధి). పురుషుడు అంటే భాగవత సంప్రదాయ ప్రకారం జీవుడు. పురము అంటే శరీరము. శరీరమునందుండే వాడు జీవుడు. నాన్నగారు పరమపురుషుడు, పరమేశ్వరి పురుషుడు, పరమేశ్వరి ఎన్నుకున్న పురుషుడు, పరమాత్మపురుషుడు. అమ్మ అన్నది "నాకన్నా పురుష డెవరురా?" అని. నిజమే అన్ని పురములలో ఉండగలిగిన శక్తి, అన్ని జీవులలో ఉండగలిగిన జీవచైతన్యశక్తి తప్ప నిజమైన పురుష డెవ రుంటారు? అమ్మ పురుషుడైతే మరి నాన్నగారెవరు ? పరమ పురుషుడని చెప్పుకున్నాం. అమ్మ కన్న అభిన్నమైనా, భిన్నంగా కనిపిస్తున్న పరమాత్మ అన్నమాట. అందుకే అమ్మ నిరంతరం నాన్నగారినే తలుస్తుంటుంది. నాన్నగారి పాదశబ్దమే వింటుంటుంది. మాతృశ్రీ జీవిత మహోదధిలో అంతర్లీనంగా నాన్నగారిచరిత్ర పరచుకొని ఉన్నది.

నాన్నగారిని గూర్చి ఒక 'జంటిల్‌మన్' అని చెపితే చాలదు. దాని అర్థం ఒక మర్యాదస్థుడు అని మాత్రమే. నాన్నగారు అంతమాత్రమే కాదు. సహృదయ, సౌజన్య, సౌమనస్య సంపన్నుడు. లేకపోతే లౌకికంగా ఒక సామాన్య గృహస్థే అయితే తన భార్యవద్దకు వందలు వేలు జనం వస్తే ఊరుకుంటాడా? భార్య ఒడిలో ఎందరో సేదతీరుతుంటే సహిస్తాడా? ఆ మహానుభావుని దయ, ఓరిమికి తలవంచి నమస్కరించి తీరవలసిందే. ఒక భర్తగా ఎన్ని నిగ్రహించుకొని ఉండాలి? తన భార్యను లోకానికంతకూ తల్లిగా త్యాగం చేసిన మహోన్నత వ్యక్తిత్వం సామాన్యమైన విషయమా!

'అజాతశత్రువు' అనే పదం భారతంలో ధర్మరాజు విషయంలో విన్నాం. అంటే 'పుట్టని శత్రువులు కలవాడు'. అంటే శత్రువులు లేనివాడు. ధర్మరాజుకు శత్రువులు లేరా? దుర్యోధనాదులంతా శత్రువులుకారా ! అంటే ధర్మరాజుకు వారు శత్రువులు కారు. వారికి ధర్మరాజు శత్రువు కావచ్చు. ధర్మరాజు మాత్రం వారిని బంధువులు గానే చూచాడు. లేకపోతే గంధర్వుల నుండి విడిపించేవాడు కాదు. అలాగే నాన్నగారి మనస్సులో శత్రువులెవరూ లేరు. 'స్మితభాషి, పూర్వభాషీచ రాఘవః ' అన్నట్లుగా చిరునవ్వుతో ముందుగానే పలుకరించేవారు.

ఒక ఉదార మనస్విగా, ఒక ఆదర్శవంతుడైన గృహస్థుగా తన శ్రీమతిని చూడటానికి వచ్చిన వారికి భోజనభాజనాదులు సమకూర్చేవారు. వారి ఇల్లే ఒక అన్నపూర్ణాలయమైంది. "వండ నలయదు వేవురు వచ్చిరేని అన్నపూర్ణకు నుద్దియౌ అతని గృహిణి. అతిధులేతేర నడికి రేయైన పెట్ట వలయు భోజ్యమ్ము లింట నవ్వారిగాగ' అని మనుచరిత్రలో చెప్పినట్లు అమ్మ నాన్నగారింటి గృహిణిగా – వచ్చిన వారికి వండిపెట్టేది. అయితే ఒక్క తేడా. ఇంట్లో వస్తువులు సమృద్ధిగా ఉన్నా లేకపోయినా పెట్టేది. అమ్మ అన్నపూర్ణ కదా ! నాన్నగారి గౌరవానికి మర్యాదకు ఏలోటూ రానిచ్చేది కాదు. దీనికి అమ్మ జీవితంలో ఎన్నో దృష్టాంతాలున్నాయి.



అమ్మను నాన్నగారిని చూస్తుంటే అనసూయలు అత్రి మహర్షి స్మృతిపథంలో మెదలుతున్నారు. అత్రికి ముగ్గురు సంతానము. చంద్రుడు, దత్తాత్రేయుడు, దుర్వాసుడు. ముగ్గురు సంతానము నాన్నగారికి కూడా. చంద్రుని అంశతో హైమ, దత్తాత్రేయుని అంశతో సుబ్బారావు, దుర్వాసుని అంశతో రవి పుట్టారేమో ! అత్రి భార్య అనసూయ పరమ పతివ్రత. భర్తనే దైవముగా నెంచి పూజించినది. మన అమ్మ కూడా అంతే. అనసూయ తనను పరీక్షింప వచ్చిన త్రిమూర్తులను పసిబాలురనుచేసింది. త్రిమూర్తుల భార్యలు వచ్చి అర్థించగా మరల వారి భర్తలను వారికిచ్చింది. వారు అనసూయకు బిడ్డలుగా పుడతామన్నారు. వారి అంశలే పైన చెప్పినవారు. సుమతి భర్త కౌశికుని, బ్రతికించి సూర్యుని ఉదయింపచేసి లోకమునకు చీకటి పోగొట్టి వెలుతురు ప్రసాదించినది. లోకంలో ఒకప్పుడు అనావృష్టి క్షామము వచ్చింది. అనసూయాదేవి లోకానికి క్షామ మున్నంతకాలము అందరినీ తన తపశ్శక్తిచే పోషించింది. ఇక అమ్మ జీవితంలో చూస్తే ఎన్నో సన్నివేశాలలో సూర్యచంద్రులామె చెప్పుచేతలలో ఉన్నట్లు తెలుస్తుంది. ఇక లోకాన్ని పోషించడంలో కొంతకాలం కాదు సర్వకాల సర్వావస్థల యందు పోషిస్తూనే ఉన్నది. అమ్మ త్రిమూర్తులకే కాదు సృష్టిలోని- సకలజీవరాశిని తన బిడ్డలలాగా ఆదరించింది. అమ్మ నాన్నలు అత్రి అనసూయలేమో అనిపిస్తుంటుంది అప్పుడప్పుడు.

అసలు అత్రి అంటే మూడు లేనివాడు. త్రిగుణా లయిన సత్వరజస్తమోగుణాల కతీతుడు అని అర్థం. చంద్రుడు రజోగుణం వల్ల, దుర్వాసుడు తమోగుణం వల్ల, దత్తాత్రేయుడు సత్వగుణం వల్ల జన్మించిన వారు. వీటన్నింటికి అతీతుడు అత్రి. ఆయన భార్య అనసూయ. అనసూయ అంటే అసూయకు తావులేనిది. అమ్మ కూడా ఆ విషయాన్ని స్పష్టంగానే చెప్పింది.

అమ్మ నాన్నలు కూడా మరణించారు కదండి అనే వారున్నారు. అసలు మరణం అంటే ఏమిటి? భయం. అమ్మ నాన్నగార్లు మృత్యుంజయులు. మరణం అంటే 'భయం లేని వారంతా మృత్యుంజయులే' అన్నది అమ్మ. అమ్మ నాన్నలు మృత్యుంజయులు కావటమే కాదు మనందరికీ కూడా అభయం ప్రసాదించి ఆ భయం లేకుండా చేయగలిగిన వారు. శరీరాలు వదలటం వేరు, మరణించటం వేరు. శ్రీరాముడూ, శ్రీకృష్ణుడూ శరీరాలు వదిలారు. అలాగే అమ్మ నాన్నలు కూడా శరీరాలు వదిలారు. కావాలనుకుంటే ఎప్పుడైనా ఏ రూపంలోనైనా రాగలరు. అది వారి ఇచ్ఛ, కాలాతీతులు, రూపాతీతులు అయిన వారు. అంటే సర్వత్రా వ్యాపించి ఉన్నవారు శాశ్వతులు, సనాతనులు. మీరంతా నేనే 'మీరందరూ నేనే' మీరు కానిది నేనేదీ కాదు. మీరందరూ నా అవయవాలు అని చెప్పగలిగినవారు "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్" అన్నమాట. అయితే ఈ మాటలు అమ్మ బయటకు అన్నది, నాన్నగారు అనలేదు. 'అంతర్బహిశ్చ తత్సర్వం' లాగా, ఇద్దరూ బయటకు ఇద్దరుగా కనిపిస్తున్నా అంతర్లీనంగా ఇద్దరూ ఒకటే అయిన సత్యానికి బొమ్మా బొరుసులు - అవతారమూర్తుల జననమరణాలు దివ్యమైనవి, "జన్మ కర్మ చమే దివ్యం" అన్నట్లుగా. అవి దివ్యమైన లీలలు మాత్రమే - ప్రత్యక్ష దైవమైన సూర్యుని ఉదయాస్తమయాల వలెనే ఉంటాయి. అస్తమించినంత మాత్రాన సూర్యుడు లేడంటామా? నిజానికి సూర్యచంద్రులు ఆవిర్భవిస్తారు. పుట్టరు. మనం అమ్మకు సుప్రభాతం చేస్తాం. పవళింపు సేవచేస్తాం - ఏ దేవతకైనా చేస్తూనే ఉంటారు. సుప్రభాతం అంటే వారిని మేల్కొల్పటమనా ! నిరంతర నిర్నిద్రుడు భగవంతుడు. అంటే మనలోని దివ్యత్వాన్ని మేలుకొలుపుతున్నామన్నమాట. నిజానికి భగవంతుడు నిద్రపోతే ప్రపంచంలో సృష్టి ఉండదు.



విధాత అంటే సృష్టి చేసే బ్రహ్మ అని అర్థం. విష్ణు సహస్రనామాల్లో "విధాతా ధాతురుత్తమః" అని ఉంది. అంటే బ్రహ్మను కూడా సృష్టించినవాడు. అమ్మ తన పొట్టను చూపిస్తూ ఇది తిన్న పొట్ట కాదు నాన్నా! కన్నపొట్ట అన్నది. అమ్మ పాదాలు కడుగుతూ ఇవి బ్రహ్మ కడిగిన పాదాలు కదమ్మా! అంటే "అవును నాన్నా! మీరు బ్రహ్మలు కాకపోతే కదా!" అన్నది. ఈ బ్రహ్మల చేత పాదాలు కడిగించుకున్న అమ్మ తన పతిబ్రహ్మ పరబ్రహ్మ పాదాలు కడిగి, తీర్థంగా సేవిస్తూ ఈ తీర్థప్రభావమే మీకు తీర్థం వేసే అవకాశాన్నీ, అధికారాన్నీ ఇచ్చింది అన్నది. అదీ నాన్నగారి పాదాల మహిమ.

భాగవతంలో గొల్లపిల్లలు ఆవుమందలుకాస్తూ ఆకలిగా ఉన్నదని కృష్ణునికి చెప్పారు. "ఇక్కడే ఋషులు యజ్ఞం చేస్తున్నారు. నేను చెప్పానని చెప్పి తినటానికి తెచ్చుకోండి అన్నాడు" కృష్ణుడు. వాళ్ళు వెళ్ళి అడిగితే "కృష్ణుడు అడిగితే ఇస్తామా? యజ్ఞం పూర్ణాహుతి కాకుండా ఏమీ పెట్టం పొమ్మ"న్నారు. గోపాలురు వచ్చి ఆ విషయం చెవితే కృష్ణుడు ఋషుల భార్యలను అడిగి తెచ్చుకోమన్నాడు. గోపాలురు "పరమాత్మ అడిగాడా! తీసుకెళ్ళండి" అని యజ్ఞనివేదనకు చేసిన అన్ని పదార్థాలు ఇచ్చి పంపారు. ఆ తర్వాత ఋషులు భార్యలను కోపగించగా వారికి హోమజ్వాలలో కృష్ణపరమాత్మ కనిపించాడు. యోగీశ్వరేశ్వరుడు యజ్ఞఫలప్రదాత అయిన కృష్ణుని గుర్తించి ఋషులు పశ్చాత్తాపపడ్డారు. ఆకలితో ఉన్నవారికి అన్నం పెట్టటం కన్నా యీ యజ్ఞాలు ఎందుకనుకున్నారు ఋషిపత్నులు, ఋషులు కూడా.

అమ్మ నాన్నగారూ చేసిన పని అది. చేస్తున్న పని అది. "నేను మీ యిష్టప్రకారం నడుస్తున్నట్టుంటుంది కాని నా యిష్ట ప్రకారమే మిమ్మల్ని నడిపిస్తున్నాను. మీ నడకను నడతకు ప్రేరణ నే నిచ్చేదే" అన్న అమ్మను తన ఇష్ట ప్రకారం నడిపించినవారు నాన్నగారు. అందుకే నాన్నగారు లోకారాధ్యులైనారు.

"మన యశోద చిన్ని మగవాని కనెనట చూచి వత్తమమ్మ సుదతు లార!" అన్నట్టు కనకమ్మ బామ్మ వందయేళ్ళ క్రింద బ్రహ్మాండం వంశంలో బ్రహ్మాండమంత బిడ్డను కన్నది. ఆ చిన్ని మగవాని శతజయంతి ఉత్సవాలు చూడటానికి, మనోజ్ఞమైన (చిన్ని), లీలావిలాసాలు చూడటానికి అమ్మ ఏలానూ వస్తుంది, హైమా వస్తుంది. అమ్మతో పాటు బిడ్డలం మనమూ వద్దాం. నాన్నగారి శతజయంతి ఉత్సవాలలో పాల్గొందాము. పంచు కుందాము.

**"భాగవతము తెలిసి పలుకుట కష్టంబు**
**శూలికైన తమ్మి చూలికైన**
**విబుధవరుల వలన విన్నంత కన్నంత**
**తెలియవచ్చినంత తేటపరతు"** అన్నాడు పోతన్న గారు భాగవతాన్ని గూర్చి.

ఈనాడు నాన్నగారిని గూర్చి విబుధులు తమకు తెలిసింది చెప్పటానికి ముందుకు వచ్చారు. అయితే ఎవరైనా ఎంత చెప్పగలరు ? నాన్నగారిని గూర్చి అమ్మ చెప్పాలి లేదా నాన్నగారే చెప్పాలి. ఎందుకంటే వారిద్దరిని గూర్చి వారికి తెలిసినంతగా ఇతరులకు తెలియదు గనుక. అయితే అంతమాత్రాన పరిశోధకులు ఊరుకుంటారా! వారి శోధించింది, వారు సాధించింది వారు చెపుతారు. రెక్కలు గల పక్షి ఆకాశంలో ఎంత ఎత్తుకు ఎగురగలిగితే అంత ఎత్తుకు ఎగురుతుంది. ఎంత దూరంపోగలిగితే అంతదూరం పోగలుగుతుంది. అంత మాత్రం చేత ఆకాశం ఆది అంతం తెలుసుగోగలదా? అయినా ఎగురకుండా ఉండదు. అలాగే నాన్నగార్ని గూర్చి ఎవరికి తెలిసినంతవారు తమ తమ అనుభవ రచనా పుష్పాలు సమర్పించారు. నాన్నగారి పాదపద్మాలపై పూజా పుష్పాలుగా సమర్పింపబడాలన్నదే అందరి ధ్యేయం.

**- పురుషోత్తమపుత్రభార్గవ**
**పి.యస్.ఆర్.ఆంజనేయప్రసాద్**





# నాకు తెలిసిన నాన్నగారు



డా॥పొత్తూరి వేంకటేశ్వరరావు, హైదరాబాద్,

ముందే ఒక మాట చెప్పాలి. "నాకు తెలిసిన నాన్నగారు" అని శీర్షిక పెట్టడంలో ఉద్దేశం నాకు నాన్నగారిని గురించి చాలా తెలుసునని కాదు. నాకు తెలిసింది కొంతే. ఆ కొంతలో కొంత చెప్పే ప్రయత్నమే ఈ వ్యాసం.

నాన్నగారు అని మనం గౌరవంతో పిలుచుకున్న బ్రహ్మాండం నాగేశ్వరరావు గారు చాలా గొప్ప వ్యక్తి. అమ్మకు పతిదేవుడు కావటం వల్ల ఆయనను నాన్నగారు అని పిలుచుకొన్నాము. అమ్మను "అమ్మా !" అని పిలుస్తాము. కాని నాగేశ్వరరావు గారిని నాన్నగారు అంటాము. అమ్మను అమ్మా అని పిలవటంలో చనువు ఉంది. సాన్నిహిత్యం ఉంది. "నాన్నాగారూ!" అని పిలవటంలో గౌరవం ఉంది. ఒకింత దూరం కూడా ఉంది. మనతో మాట్లాడేటప్పుడు అమ్మ ఎప్పుడూ "మీ నాన్నగారు" అనే అంటుండేవారు. నాగేశ్వరరావు గారు "మీ అమ్మగారు" అంటూండేవారు. గారు శబ్దం లేకుండా అమ్మను గురించి ఆయన మాట్లాడిన సందర్భం నాకు తెలిసినంతలో లేదు.

బ్రహ్మాండం నాగేశ్వరరావు గారు చాలా గొప్పవ్యక్తి. ఎందువల్ల ! గొప్పతనం ఆయన జిల్లెళ్ళమూడి గ్రామానికి కరణం అయినందువల్ల వచ్చినది కాదు. అమ్మకు భర్త అయినందువల్ల ఆయనను గురించి మనందరం తెలుసుకొనే అవకాశం కలిగింది. కాని అందువల్లనే ఆయన గొప్పవారు కాలేదు. వ్యక్తిగా ఆయన గొప్పతనానికి కారణాలు ఉన్నాయి.

నాన్నగారు నాకు తనతో మాట్లాడే అవకాశాలు చాలా కల్పించారు. నేను జిల్లెళ్ళమూడి వెళ్లినప్పుడల్లా ఆయన గ్రామంలో ఉంటే మేమిద్దరం తప్పనిసరిగా ఎంతో కొంతసేపు మాట్లాడుకొనేవాళ్ళము. ఆయన తనతో కలసి భోజనం చేసే అవకాశాలను కూడా చాలాసార్లు కల్పించారు. అది ఆయన ఔదార్యం, నా అదృష్టం. అమ్మను చూడటానికి వచ్చిన చాలామందితో ఆయన మాట్లాడేవారు. అలాగే నాతోనూ మాట్లాడారు. కాని, నాకు బహుశ ఇతరుల కంటే ఎక్కువ అవకాశాలు ఇచ్చి ఉండవచ్చు, మేము ఎక్కువ సేపు మాట్లాడి ఉండవచ్చును. నాన్నగారు రాజకీయాలలో పాల్గొనక పోయినప్పటికీ అపారమైన రాజకీయ పరిజ్ఞానం కలిగినవారు. ఆయనకు దగ్గర స్నేహితులలో ఒకరు కోనా ప్రభాకరరావుగారు, మంత్రిగా, స్పీకరుగా, గవర్నరుగా పనిచేసిన ప్రముఖ నాయకుడాయన. అరే, ఒరే అనుకునే స్నేహబంధం వారిది. నాన్నగారు కాంగ్రెస్ పార్టీ అభిమాని. కాని ఎప్పుడూ సభ్యులు కారు. స్వాతంత్ర్యోద్యమ కాలం నుంచి కాంగ్రెస్ చరిత్ర తెలిసినవారు. తన అభిమానాన్ని ఆయన దాచుకోరు. నేను పత్రికలలో పనిచేస్తున్నవాడను గనుక నాతో ఆయన ప్రధానంగా రాష్ట్రపరిస్థితులను, గురించి, ముఖ్యంగా రాజకీయ పరిణామాలను గురించి మాట్లాడేవారు. జర్నలిస్టుగా నాకు ఒక పార్టీ పట్ల ప్రత్యేకమైన అభిమానం గాని, మరొకపార్టీ పట్ల వ్యతిరేకత గాని లేదు. అది నా విధానం. నాయకుల విషయం లోనూ నా వైఖరి అదే. అభిప్రాయాలు ఉంటాయి. కాని, అవి పార్టీలతోనూ, నాయకులతోనూ నా సంబంధాలను ప్రభావితం చేయవు. నాన్నగారికి కాంగ్రెస్ పార్టీ పట్ల ఉన్న అభిమానాన్ని దృష్టిలో పెట్టుకొని సరదాగా నేను ఆ పార్టీని ఆక్షేపిస్తూ మాట్లాడేవాడిని. ఆయనకు బాధకలిగేది. అది కొద్దిపాటి కోపంగా కూడా మారేది. ఆవేశంతో కాంగ్రెస్‌పార్టీని సమర్థిస్తూ మాట్లాడేవారు.



కోనా ప్రభాకరరావు గారు నాకు గూడా తెలుసు. మాకు దూరపు బంధుత్వం కూడా ఉంది. అయినా, నాన్నగారిని కాస్త కవ్వించడానికి "ఆయన బాపట్లకో, గుంటూరుజిల్లాకో రాష్ట్రానికో ఏమి చేశాడండీ! ఒక్క మంచి పనిలేదు ఘనంగా చెప్పడానికి" అంటే ఆయన రెచ్చిపోయి ప్రభాకరరావుగారు ఎన్నెన్ని మంచి పనులు చేశారో ఏకరువుపెట్టేవారు. నాన్నగారు కాస్త గొంతు పెంచి, కోపంగా మాట్లాడుతుంటే మేము దూరంగా బయట ఉన్నప్పటికీ, అమ్మ గదిలో ఉన్నప్పటికి అన్నీ గమనిస్తూండేది. తరువాత అమ్మతో మాట్లాడుతున్నప్పుడు "నాన్నగారికి ఎందుకు కోపం వచ్చింది? నువ్వు ఏమన్నావు? ఆయన ఏమి మాట్లాడారు?" అని అడిగేది. నేను చెప్పేవాడిని. అప్పుడు, మరికొన్ని సందర్భాలలో కూడా నాన్నగారి పట్ల నాకు గౌరవం ఇనుమడింపచేసే విధంగా అమ్మ ఆయనను గురించి ఎన్నో మంచి మాటలు చెప్పేది. కేవలం మాటలే గాదు. అమ్మ నాన్నగారి పట్ల గౌరవాన్నీ, భక్తిశ్రద్ధలను చేతలలో చూపేది. అమ్మ ఉదయం పళ్లు తోముకొని ముఖం కడుక్కున్న తరువాత తన మంగళసూత్రాలమీద నీరు పోసి, దానిని తీర్థంగా తీసుకొనేవారు. నాన్నగారి ఆలయప్రవేశం తరువాత కూడా. నా ఆసక్తిని గమనించి ఒకసారి అమ్మ చెప్పారు. అవి నాన్నగారి పాదాలుగా భావించి తాను తీర్థం తీసుకొంటున్నానని వివరించారు. నాన్నగారికి బాధకలగటం గాని, కోపం తెప్పించేట్లుగాని మాట్లాడవద్దని అమ్మ వాచ్యంగా చెప్పలేదు గాని హితవు మృదువుగా అందించింది.

అమ్మ నాకు తనతో మరెవ్వరూ లేకుండా మాట్లాడే అవకాశాలు 1960-70 మధ్యకాలంలో అనేకసార్లు కల్పించింది. అది నాపై అమ్మ చూపిన కరుణ. తలుపులు వేసి మాట్లాడుకొంటున్నప్పు డెప్పుడైనా నాన్నగారు వచ్చేవారు. ఏదైనా కుటుంబ విషయాలు మాట్లాడు కొంటారేమోనని నేను బయటికి వెళ్లేవాడ్ని. ఒక్కొక్కసారి అమ్మ వెళ్లవద్దన్నట్లు నా చేతిని నెమ్మదిగా నొక్కేది. అప్పుడు నేను ఆగిపోయేవాడిని. నాన్నగారు వచ్చినప్పుడు అమ్మ పమిట సర్దుకొని ఆయన ఏమి చెపుతారో జాగ్రత్తగా వినాలన్నట్లు ఒద్దికగా కూర్చునేది. ఆయన వచ్చినప్పుడు పడుకొని ఉంటే లేచి కూర్చొనేది. బిడ్డలపైన ప్రేమా, ఎంతోమందిమి ఉన్నప్పటికీ సరదాగా ఛలోక్తులు విసరుతూ ఉండే అమ్మ నాన్నగారు రాగానే ఒక్కసారిగా భర్త పట్ల భయభక్తులు కలిగిన భార్యగా మారిపోయేది. ఆయన భోజనం చేశారో లేదో పడుకొన్నారో లేదో తనకు ఎవరూ చెప్పవలసిన అవసరం లేకుండానే తెలిసినప్పటికీ ఇతరులను అడిగి తెలుసుకొంటూండేది. నాన్నగారికి శ్రద్ధగా సేవచేయమని అందులో ఒక సందేశం ఇమిడి ఉంది. నాన్నగారు రాత్రి పడుకొనే వేళ వెళ్లి ఆయనకు సేవచేసి వస్తుండేది. కాళ్ళు పిసికి వస్తున్నానని చెప్పేది. అమ్మ తిరిగి వచ్చాక ఆమెకు కాళ్లు, చేతులు పిసికే అవకాశాన్ని అక్కడున్న బిడ్డలకు ఇస్తుండేది.

నాన్నగారి గొప్పతనం ఆయన మాలాంటి వారెందరికో అమ్మ దగ్గర చనువుగా మెలిగే అవకాశాన్ని కలిగించటం. చిన్న పిల్లల దగ్గర నుంచి వృద్ధుల వరకు అన్ని వయస్సుల వాళ్లూ అమ్మ ఒడిలో వాలిపోతారు. బ్రహ్మాండం సుబ్బారావు (నాగేశ్వరరావు గారి పెద్ద కుమారుడు) అమ్మఒడి "పరిష్వంగాల జీవనది" అన్నాడు. కవితాత్మక వర్ణన. ఎంతో ఆర్తితో తమ కష్టాలను చెప్పుకోడానికి వచ్చిన బిడ్డలను, వాళ్ల వయస్సుతో నిమిత్తం లేకుండా అమ్మ దగ్గరకు తీసి, ఒడిలో చేర్చుకొని ఓదారుస్తున్న దృశ్యాలు సర్వసాధారణం. అమ్మ అప్పుడప్పుడు అనేవారు నాన్నగారి మంచితనం వల్లనే మీ అందరూ నా దగ్గరకు రాగలుగుతున్నారు. నా పిల్లలు వలె నా ఒడిలోకి వచ్చి చనువుగా ఉండగలుగుతున్నారు అని. ఎవరైనా తన భార్యతో పరపురుషులు ఇలా దగ్గరకు



వస్తే చూసి భరించగలరా? అది నాన్నగారి గొప్ప మనసు" అన్నారు. అది అక్షరాలా నిజం. ఒకసారి నాన్నగారు ఈ ప్రస్తావన చేశారు. "మీ అందరికీ ఆమె అమ్మ. నాకు భార్య. భర్తగా నాకు, భార్యగా తనకు కొన్ని విడి బాధ్యతలు ఉంటాయి. అందరు దంపతులు గానే మేమూ" అన్నారు. నాన్నగారి అవసరాలను గుర్తించి ఏ విధమైన అసంతృప్తి, లోటు రాకుండా జాగ్రత్త పడుతుండేది అమ్మ. నాన్నగారు గ్రామాంతరం వెళ్లేటప్పుడు అమ్మకు చెప్పి వెళ్ళేవారు. అమ్మ బొట్టుపెట్టి పంపిస్తుండేది. అమ్మకు ఒకింత నలతగా ఉన్నట్లు కనిపిస్తే నాన్నగారు తరచు అమ్మదగ్గరికి వచ్చి ఎలా ఉన్నదీ పరామర్శించి వెళుతుండేవారు.

అమ్మ తీవ్రమైన అనారోగ్యంతో హైదరాబాదు వచ్చి 1980లో కొన్ని రోజులు రాజగోపాలాచారి గారి ఇంట్లో ఉన్నారు. అప్పుడు నాన్నగారు కూడా వెంట వచ్చారు. అమ్మ రాత్రింబవళ్లు చాలా బాధ పడుతుండేది. నాన్నగారు చాలా దిగులుపడ్డారు. ఆందోళన ఆయన ముఖంలో స్పష్టంగా కనిపిస్తుండేది. అమ్మ బాధను చూడలేక, అమ్మను చూడకుండా ఉండనూ లేక ఆయన పడిన అవస్థను నేను చూశాను.

నేనొకసారి కట్టుబట్టలతో జిల్లెళ్ళమూడి వెళ్ళాను. అమ్మను చూసి వెంటనే తిరిగి వెళ్లాలని ఆలోచన. కాని, అమ్మ ఉండమన్నది. గుడ్డలు తెచ్చుకోలేదమ్మా అని చెప్పాను. నాన్నగారు తన వద్ద ఉన్న ఖద్దరు ధోవతి కొత్తది నాకు ఇచ్చారు. నాకు 1962 వరకు సిగరెట్లు తాగే అలవాటు ఉండేది. అమ్మతో చాలా ముఖ్యమైనవి విషయాలు మాట్లాడుతున్నప్పుడు సైతం కుతిగా వుంటే "అమ్మా ! ఇప్పుడే వస్తా" అని చెప్పి బయటికివెళ్ళి సిగరెట్టు కాల్చి వచ్చేవాడిని. అమ్మ ఓపికగా వేచిచూచేది. కొన్నాళ్లకు ఆపని నాకే అసహ్యం అనిపించింది. అమ్మ నాకు విడిగా మాట్లాడే మహాదవకాశాన్ని ఇస్తే ప్రతిక్షణాన్ని సద్వినియోగం చేసుకోకుండా సిగరెట్ల కోసం బయటికి వెళ్లడమేమి టనిపించింది. అంతకు ముందునుంచే సిగరెట్లు మానేయాలనే ఆలోచన నాకు ఉంది. ఇప్పుడది బలపడింది. నా ఆర్థికపరిస్థితులు, చైనాతో భారతదేశానికి యుద్ధం వచ్చి పౌరులందరు ఎంతో కొంత విరాళాలను రక్షణనిధికి పంపిస్తుంటే నేనేమీ ఇవ్వలేకపోయిన దుస్థితి మొదలైన కారణాలు సిగరెట్లు మానేయాలని నిర్ణయానికి కారణాలైనాయి గాని మానలేకపోయేవాడిని. అమ్మ దర్శనానికి వెళ్ళిన ఒకసారి ఎలాగైనా అమ్మకు చెప్పాలి? అమ్మతో చెపితే సిగరెట్లు మానగలననే ఆలోచన వచ్చింది. ఎన్నిరోజులు ఉన్నా చెప్పలేకపోయాను. సిగిరెట్లు మీద ప్రీతి నాకు తగ్గలేదని అర్థమవుతున్నది. ఇక కొద్దిసేపటిలో హైదరాబాదుకు బయలుదేరతాననగా అమ్మ దగ్గర కూర్చున్నాను సెలవు తీసుకుందామని. అమ్మ కబుర్లు చెపుతున్నది. అమ్మ నా సంకల్పం చెప్పడానికి అలా అవకాశం ఇచ్చింది. అయినా చెప్పలేదు. 'అమ్మా! బయల్దేరుతానమ్మా!' అన్నాను. అమ్మ "సరే నాన్నగారితో చెప్పిరా" అన్నది. నేను నాన్నగారితో చెప్పాను. "ఇప్పుడు దుర్ముహూర్తం. కాసేపు ఆగి వెళ్ళండి" అన్నారు. దురలవాటు బలం నా సంకల్పం కార్యరూపం దాల్చకుండా చేసింది. నేను మళ్లీ అమ్మ దగ్గరకు వెళ్ళాను. చూడగానే అమ్మ నవ్వింది. అమ్మతో మాట్లాడుతూ కూర్చున్నాను. అమ్మ దురభ్యాసాలను గురించి వాటివల్ల కష్టాలు పడ్డవాళ్లను గురించి మాట్లాడటం మొదలుపెట్టింది. నేను బిత్తరపోయాను. "నువ్వు చెప్పదలచుకొన్నదేదో చెప్పరా!" అన్నట్లున్నవి అమ్మ మాటలు. అప్రయత్నంగా " అమ్మా ! సిగరెట్లు మానేయాలనుకొంటున్నానమ్మా. మానేస్తా" అన్నాను. అమ్మ విని ఊరుకొన్నది. సంభాషణ మరో అంశంమీదకు మళ్ళింది. అటుతరువాత నేను సిగరెట్లు తాగలేదు. రోజూ అయిదారు పెట్టెల సిగరెట్లు కాల్చేవాడిని. ఒక్కసారిగా మానేయటం వల్ల నాకేమీ ఇబ్బంది కాలేదు. పైగా ఆకలి పెరిగి ఆరోగ్యం కుదుటపడింది. ఇలా నాచేత



సిగరెట్లు మాన్పించిన సంఘటనలో నాన్నగారి పాత్ర చిన్నది కాదు. ఆయన ఎప్పుడూ చెప్పని విధంగా కాస్సేపు ఆగి వెళ్లమని చెప్పడం, తిరిగి వెళ్లినప్పుడు అమ్మతో సంభాషణ నేను సిగరెట్లు మానేస్తానని చెప్పడానికి దోహదం చేయడం ఒక దానితో ఒకటి సంబంధం ఉన్నవే.

2013 సంవత్సరానికి విశ్వజననీపరిషత్తు వారు ప్రచురించిన క్యాలెండర్‌లో అమ్మ, నాన్నగారు ఉన్న చిత్రాన్ని ప్రచురించారు. అందులో అమ్మ రెండు పాదాలలో ఒకటే పూర్తిగా కనిపిస్తుంది. నాన్నగారి రెండు పాదాలలోనూ ఒకటే బాగా కనిపిస్తుంది. పెద్దలకు మ్రొక్కేటప్పుడు ఎవరమూ ఒక పాదానికి మ్రొక్కము. ఇప్పుడు మనకు తన పాదం ఒకటి చూపించి రెండవపాదం నాన్నగారి పాదానికి మ్రొక్కమన్నట్లున్నది ఈ చిత్రం. మొదటిది మనం పూజించే అమ్మపాదం. రెండవది అమ్మ పూజించే నాన్నగారి పాదం. ఆ రెండు కలసి అమ్మ దివ్యమాతృత్వం. అది అమ్మ నాన్నగారికి ఇచ్చిన గౌరవం. తాను ఇవ్వటమే కాదు. మనందరినీ ఇవ్వమంటున్నది.

ముందే చెప్పాను. నాన్నగారిని గురించి నాకు తెలిసింది తక్కువేనని. తెలిసిన దానిలోనూ కొంతే చెప్పాను. నాన్నగారిని గురించి సమగ్రంగా చెప్ప గలిగిన శక్తి అమ్మకే ఉన్నది. అమ్మకు తెలిసిన చాలా విషయాలు మనలో ఎవరికీ తెలిసే అవకాశం లేదు. నాన్నగారిని గురించే కాదు. ఎవరి గురించైనా అందరికీ అన్ని విషయాలూ తెలియవు. అత్యంత ప్రసిద్ధులైన వారి విషయంలో వారి జీవిత విశేషాలను గురించి పరిశోధనలు జరుగుతాయి. జీవితచరిత్రలు వెలువడుతాయి. వారందరూ గొప్పవాళ్లే. గొప్పతనం వేరు, కీర్తివేరు. కీర్తి, గొప్పతనం కలసి కొందరిని ప్రసిద్ధులను కావిస్తాయి. ప్రసిద్ధులు కాకపోయినా, గొప్పవాళ్లయిన వారు కొందరు ఉంటారు. నాన్నగారు అందులో ఒకరు.

నాకు వలెనే ఎంతో కొంత తెలిసిన సోదరీ సోదరులు ఇంకా కొందరున్నారు. వాళ్ల పరిస్థితీ ఇంతే.

నాన్నగారు చాలా గొప్పవ్యక్తి అనడానికి ఆయన దయవల్లనే అమ్మ దగ్గరకు మనందరం వెళ్లి, చనువుగా ఉండగలిగామన్న ఒక్క కారణం చాలు. నాన్నగారి శతజయంతి సందర్భంగా ఆయన స్మృతికి శతసహస్ర వందనాలు.



# నాగేశ్వరో విజయతే

డాక్టర్ పన్నాల రాధాకృష్ణశర్మ, హైదరాబాద్

బ్రహ్మాండవంశ జలరాశి తుషారరశ్మిః
ఆరాధితాంఘ్రి యుగళస్తనయై రశేషైః ।
మన్దస్మితాంకురలసద్వదనారవిన్దః
నాగేశ్వరో విజయతే విమలస్వభావః ॥ 1

యత్పాదపద్మయుగళం నిజకంఠ వర్తి
మాంగళ్యసూత్ర మిషతోలసతీతి మత్వా ।
భక్త్యాఽ న్వహంపరమయా భజతేఽ నసూయా
నాగేశ్వరోవిజయతే సహి లబ్ధకీర్తిః ॥ 2

సర్వేజనాశ్చ యదుదారదయావిశేషాత్
ఆసాద్య మాతర మజస్ర మఖండ భక్త్యా ।
సంసేవ్య జన్మ సఫలం కలయంత్యతీవ
నాగేశ్వరో విజయతే సహి నిర్మలాత్మా ॥ 3





# అమ్మ - నాన్నగారు - నేను



శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు

నాన్నగారితో నా అనుబంధాన్ని గూర్చి రాయాలనే ఆలోచన ఒకింత మానసిక ఉద్వేగానికి గురి చేస్తుంది. కాగితాల మీద పెట్టలేని ఎన్నో స్మృతులు మది లోకి వస్తున్నాయి. ఇందులో అనేకం. అందరికీ అవసరమయినవి కాకపోవచ్చు. ఈ మానసిక నేపధ్యంలో సోదరులు శ్రీ పి.యస్.ఆర్.గారి కోరిక కాదనలేక నాన్నగారితో గడిపిన గతస్మృతులు గుర్తుచేసుకొనే ప్రయత్నం చేస్తున్నాను. సామాన్యంగా అందరి కుటుంబాలలో లాగానే బాల్యంలో నాకూ అమ్మ దగ్గరే చనువు ఎక్కువగా ఉండేది.

అమ్మ వేటపాలెంలో వున్న రోజులలో 1946వ సంవత్సరంలోనే నేను జన్మించాను. బాల్యంలో జరిగిన అనేక సంఘటనలు గుర్తున్నా ఆనాటి నాన్నగారి రూపం నా మనస్సులో ముద్రపడిన గుర్తులేదు. జిల్లెళ్ళమూడిలో మేమున్న ఇల్లు యిప్పుడు నాగేశ్వరాలయ ప్రాంగణంలోనే వుండేది. అది తాటాకు కప్పిన మట్టిగోడల పూరిల్లు. గాలీ వెలుతురులతో సూర్యచంద్రుల నిలయంగా వుండేది. వంట ఇల్లు యిప్పుడు పాదుకాలయం కట్టినచోట అనేది స్పష్టంగా గుర్తు. అమ్మ స్వయంగా వంట చేసి పెట్టేది. ఇది రాస్తున్నప్పుడు అమ్మ చేసి పెట్టిన పొట్లకాయకూర, చారు గుర్తుకు వచ్చి, చేసినది ఎంతైనా ఎందరికో అమ్మ కడుపునిండా పెట్టిన దృశ్యాలు నా కళ్ళముందు మెదలుతున్నాయి. వంటింట్లో ఒక మూల పగిలిన జాడీ రంధ్రం నుంచి 100 వోల్టుల బల్బు మించిన కాంతి ప్రసరిస్తుండేది. అందరూ అక్కడ ఒక నాగుపాము వుందనీ, దానికి కావాల్సిన ఆహారం అమ్మ అందిస్తుందని అనుకొనేవారు. ఆ జాడీ మీద పెట్టిన పుట్ట మట్టినే అమ్మ అందరికీ ప్రసాదంగా యిచ్చేది. ఆ మట్టి అద్భుత సువాసనలు వెదజల్లుతూ మధురాతి మధురంగా వుండేది. ఆ మట్టే దివ్యౌషధంగా తీసుకొంటూ వుపశమనం పొందిన వారెందరో ఉన్నారు.

నాన్నగారు మాత్రం గ్రామకరణంగా అనేకమందితో గ్రామ వ్యవహారాలలో మునిగి కరిణీకంలో భాగంగా, పొలాల కొలతలంటూ నిర్విరామంగా శ్రమించేవారు. పొగాకు తోటలు వేసి, ఆ వచ్చిన పంటను గ్రేడింగ్ చేయించి, చెక్కులు కట్టి, ఐ.యల్.టి.డి. కంపెనీకి పంపి, కొత్త నోట్లతో తిరిగి రావటం, నాకు బాగా గుర్తు. ఏ పనికైనా వెళ్ళే ముందు అమ్మకి చెప్పి తిరిగి వచ్చిన తర్వాత అమ్మకు ఫలితాన్ని గురించి వివరించేవారు. ఆ రోజులలో మాకు తెలిసిన బంధువులు అతికొద్ది మంది. అందులో లోకనాథం బాబాయి, శారద (పాప) అత్తయ్య, సీతాపతి తాతయ్య, కామేశ్వరమ్మమ్మ, నరసింహారావు మామయ్య. 1954వ సంవత్సరంలో రాజు బావ వచ్చాడు. నా ప్రాథమిక విద్య జిల్లెళ్ళమూడిలోనే జరిగింది. 1956లో మా బాబాయి అప్పికట్ల జిల్లా పరిషత్ స్కూల్లో టీచర్‌గా పనిచేస్తుండేవారు. నాన్నగారు నన్నూ, హైమనూ చదువుకోసం వారి దగ్గరకు పంపారు. అప్పటికే సుబ్బారావు అన్నయ్య మా బాబాయి దగ్గర వుండి చదువుకొంటున్నాడు. హైమక్కయ్యకు తరచు తలనొప్పి వస్తూండేది. ఆకారణంగా ఆ రోజులలో ఆడపిల్లకు చదువు లేకపోయినా ఫరవాలేదని హైమక్కయ్యని తిరిగి జిల్లెళ్ళమూడికి పంపించారు. నేను 1956-1957 సంవత్సరాలలో వారి వద్ద వుండి 6, 7 తరగతులు



చదివాను. అప్పట్లో జిల్లెళ్ళమూడి అమ్మ దర్శనానికి జనం రావటం మొదలయింది. అందులో పూండ్ల నించి నోరి మాణిక్యమ్మగారు, యల్లమంద, గుంటూరు నుంచి తంగిరాల కేశవశర్మ తదితరులు వస్తూ వుండేవారు. మా పిన్ని అనారోగ్య కారణాన నేను కొన్ని రోజులు పూండ్లలో మాణిక్యమ్మగారి యింటి నుంచి, మరికొన్ని రోజులు జిల్లెళ్ళమూడి నించి అప్పికట్ల స్కూలుకి వెళ్ళి రావాల్సి వచ్చేది. మరి కొన్ని రోజులు మర్రిపూడిలో మా బామ్మగారితో వుండి చదువుకొన్నాను. అక్కడ వుండగానే నాకు చాలా ఉధృతంగా ఆటలమ్మ పోసింది. అది చాలా ప్రమాద కరంగా పోసిందని చెప్పుకోగా విన్నాను. అమ్మని వదిలి వుండటం నాకు కష్టం అనిపించింది. అమ్మ లేకుండా చదువుకోనని పేచీ పెట్టాను. అమ్మను నా కోసం మర్రిపూడి పంపారు నాన్నగారు. ఆ సమయంలో శ్రీ రఘువరదాసుగారు సన్యాసాశ్రమ స్వీకరణం చేసి శ్రీ అవధూతేంద్రసరస్వతీస్వాములవారయ్యారు.

నేను, అమ్మ, రెడ్డి సుబ్బయ్యన్నా మర్రిపూడి బయలుదేరాం. త్రోవలో ఒక విచిత్రమైన సంఘటన గమనించాను. మేము ప్రయాణిస్తున్న ఎడ్లబండి పూండ్ల కాలువ దాటటం కష్టం కాగా అక్కడ ఆపారు. సుబ్బయ్య అన్నయ్య మొదట నన్ను ఎత్తుకొని కాలవ ఆవతలకి చేర్చాడు. అమ్మతో నిన్నుకూడా ఎత్తుకొని ఆవతల ఒడ్డుకు చేర్చుతాను అన్నాడు. అమ్మ ఆశ్చర్యంగా నీవెలా ఎత్తుకోగలవు? నేను బరువు కదా ! అన్నది. నీ వెంత బరువమ్మా! ప్రయత్నిస్తాను అన్నాడు సుబ్బయ్యన్న. అందుకు అమ్మ సమ్మతించింది. ఆయన ఎంత ప్రయత్నించినా అమ్మని ఎత్తుకోవటం కాదు కదా ! కదల్చలేకపోయాడు. ఆయనకు చమటలు పట్టినాయి. ప్రాధేయపడుతూ అమ్మా నన్నేం చేయమంటావు ? అన్నాడు. మరొకసారి ప్రయత్నించి చూడు అన్నది అమ్మ. ఈ సారి అవలీలగా అమ్మని కూడా ఎత్తుకొని ఆవలి ఒడ్డుకు చేర్చాడు. ఆదృశ్యం ఈనాటికి తలచినపుడల్లా కళ్ళకు కట్టినట్లుంటుంది. నాన్నగారు మాత్రం మేమెక్కడున్నా మా అవసరాలు తీరుస్తూ వచ్చి వెళుతూండేవారు. నాన్నగారు రోజూ సాయంత్రం భోజనానంతరం ఒక మంచం మీద పడుకొని పద్యాలు పాడుకొనేవారు.

నాన్నగారు, శ్రీ కోనా ప్రభాకరరావుగారు బాల్య స్నేహితులు. ఇరువురూ కలసి ఎన్నో నాటకాలు ప్రదర్శించారని నాన్నగారే చెప్పగా విన్నాను.

మా తాతగారు శ్రీ బ్రహ్మాండం వెంకట సుబ్బారావు గారు నాన్నగారి 16వ ఏటనే చనిపోయారు. నాన్నగార్కి ఇంటి బరువు బాధ్యతలు అతి పిన్నవయసులోనే ఏర్పడ్డాయి. బాబాయి, అత్తయ్య అంటే నాన్నగార్కి ఎనలేని అనురాగం. తుదివరకు వారి పట్ల ఎంతో ఔదార్యం చూపేవారు. నాన్నగారి విద్యాభ్యాసం అత్యంత కష్టంగా, క్లిష్టంగా కొనసాగింది. ఆ క్రమంలో వారు వారాలు చేసుకొని కూడా చదువు కొన్నానని చెప్పేవారు. నాన్నగారి పినతండ్రి గారైన శ్రీ పులిపాక చలపతిరావుగారు నాన్నగారిని అత్యంత ప్రేమతో ఆదరించి వారు చదువుకొనేందుకు సహకరించారు. బ్రహ్మాండం వారే అయిన ఆయన పులిపాక వారికి దత్తత పోయారు.

మమ్మల్ని బాగా చదువుకోమని చెప్పే క్రమంలో – నాన్నగారు తన చిన్నతనాన చదువుకొనేందుకు పడిన కష్టాన్ని, తన బాధ్యతల భారాన్ని, సరిగా చదువుకోకపోతే జీవితంలో జరిగే నష్టాల్ని – మాకు గుర్తు చేసేవారు. నా జీవితం గూడ మంచులో ప్రయాణం, అడుగువేసిన తర్వాత మరొక అడుగు వరకే కనబడుతుందనే వారు.

1957-58 లలో ఒక సంవత్సరం బాపట్లలో చదువు కోవాల్సి వచ్చింది. ఒకసారి శలవురోజు



జిల్లెళ్ళమూడికి చేరిన నేను, తిరిగి బాపట్ల స్కూలుకి అమ్మని వదిలి వెళ్ళలేక, అమ్మ కూడా నాతో బాపట్ల వస్తేనే, అక్కడ చదువుతానని మారాం చేశాను. అమ్మ కూడా నాతో బాపట్ల వచ్చింది. ఆ రోజులలో నేను అమ్మా వున్నయింటికి మొదటిసారిగా అమ్మని దర్శించేందుకు చీరాల సోదరులు వచ్చారు. ఆ చీరాల సోదరులలో నాన్నగారి బాల్య స్నేహితులు శ్రీ నోరి వెంకటేశ్వర్లు గారు కూడా వున్నారు. అప్పటి నుంచి చీరాల నుంచి అమ్మను దర్శించుకోవాలని వచ్చేవారి సంఖ్య క్రమంగా పెరగసాగింది. వారందరికీ అమ్మ స్వయంగా వంటచేసి పెట్టేది. వారిలో నాన్నగారి స్నేహితులు కూడా వున్నారు. నాన్నగారు వారితో కాలక్షేపం చేయటం చూచాను. అందరికీ భోజన వసతి సదుపాయాలు ఖర్చు, శ్రమ అనుకోకుండా అన్నీ నాన్నగారే చూచుకొనేవారు. ఒక అట్ల తద్దె రోజు చీరాల సోదరులందరికి తెల్లవారు ఝామున వంట చేసి అమ్మ భోజనం పెట్టింది. ఆ పంక్తిలో నాన్నగారు కూడా వచ్చి తానూ తింటానన్నారు. మీరెట్లా వారితో తింటారు మీరు తినలేరు అని అమ్మ ఆయనను వారించింది. అయినా నాన్నగారు వారి పంక్తిలో భోజనానికి కూర్చున్నారు. అమ్మ స్వయంగ అందరికీ వడ్డించింది. అందరికి వడ్డించిన పదార్థాలు రుచికరమైన వాసనలు వెదజల్లగా నాన్నగారికి వడ్డించిన ఆహారం సువాసనలు వెదజల్లటంతో నేను తినలేను అంటూ లేచి వెళ్ళటం నేను కనులారా చూచాను.

1958-59 సంవత్సరం చీరాల సోదరులు శ్రీ అడుసుమల్లి శ్రీహర్షరావుగారి ప్రోద్బలంతో వారింట్లోనే వుండి చీరాలలో చదువుకోవటం జరిగింది. తర్వాత సుబ్బారావు అన్నయ్య చీరాల కాలేజీలో నేను స్కూలులో మా బామ్మగారు మాకు వండి పెడుతుండగా శ్రీ రాజుపాలెం రామచంద్రరావుగారి సంరక్షణలో ఉండి చదువుకొన్నాము. అమ్మా, నాన్నగార్లు మమ్మల్ని స్వయంగా దగ్గరుండి చదివించలేకపోయినా ఆ లోపం మాకు గోచరించకుండా అత్యంత ప్రేమాదరణలు చూపించి, మమ్మల్ని అన్ని విధాల అక్కున చేర్చుకొన్న ప్రేమమూర్తులను మాకు అందించారు. వారిలో శ్రీ రాజుపాలెం రామచంద్రరావు గారు, సీతారామమ్మ మరియు శ్రీ వల్లూరి మోహనరావు బాలకృయ్య దంపతులు. వారి కుటుంబసభ్యులతో ఆత్మీయానుబంధం, అమ్మానుబంధం యిప్పటికీ కొనసాగుతూనే వుంది. చీరాలలో యస్.యస్.ఎల్.సి, బాపట్లలో పి.యు.సి. పూర్తిచేశాను. ఆరోజులలో శ్రీ ఎక్కిరాల భరద్వాజగారు హైదరాబాదు నుంచి తరచు అమ్మ దర్శనార్థం జిల్లెళ్ళమూడి వస్తుండేవారు. పి.యు.సి. పూర్తి చేసిన నన్ను ఐ.ఎ.యస్.కి తర్ఫీదు యిస్తాననీ, నన్ను హైదరాబాద్‌లో చదవమనీ ప్రోత్సహించారు. కానీ నాన్నగారు తనకు అక్కడ చదివించే శక్తిలేదని వారించారు. కొన్నిరోజులు అమ్మకు గూడా యిదొక సమస్యగా పరిణమించింది. శ్రీ అధరాపురపు శేషగిరిరావన్నయ్య, అమ్మల జోక్యంతో నాన్నగారు నేను హైదరాబాద్‌లో చదివేందుకు సమ్మతించారు. ఆర్థికంగా ఎన్ని యిబ్బందులున్నా అందుకు తగిన ఏర్పాటు చేశారు. 1970 లో నా డిగ్రీ పూర్తయిన వెంటనే కొద్ది కాలం ఆర్.టి.సి.లో పనిచేశాను. 1971 ఏప్రియల్ నించి స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, బాపట్లలో చేరాను.

నాన్నగారు సుబ్బారావన్నయ్యను గానీ, హైమను గానీ, నన్ను గానీ ఎన్నడూ మందలించిన సంఘటనలు లేవనే చెప్పాలి. ఒకసారి నా చిన్నప్పుడు అంటే 1962లో రాజుబావను చూద్దామని నోరి వెంకటేశ్వర్లు గారి కారులో కొమ్మూరు బయలుదేరాను. మార్గమధ్యంలో కాలువ అడ్డం రావడంతో కారు దిగి గుఱ్ఱబ్బండి ఎక్కి వెళ్ళుతుండగా అది తలక్రిందులుగా పడి నోరి వెంకటేశ్వర్లు



గారి చేయి విరిగింది. అది తెలిసినప్పుడు మాత్రమే నాన్నగారు నోరి వెంకటేశ్వర్లు గారినీ, నన్నూ మందలించారు. నోరి వెంకటేశ్వర్లు గారు నాన్నగారి స్నేహితులు. నీకు పిల్లవాడితో స్నేహమేంటిరా! వాడితోనా కలసి తిరిగేది? అనీ, నన్ను అంత పెద్దవాడితో నీ స్నేహమేమిటి? నీ వయసెంత? ఆయన వయసెంత ? అని మాత్రమే మందలించారు. అదే మొదటిసారి చివరిసారి ఆయన కోప్పడడం.

నేను బాపట్లలో ఉన్న రోజులలో నాన్నగారు తరచుగా మా యింటికి వచ్చి పోతుండేవారు. అలాగే నేను వేటపాలెంలో ఉన్నపుడు బాంకుకు వచ్చి హెడ్ క్యాషియర్‌గా నాకున్న ప్రత్యేకమైన గది ఆ దర్జా చూచి ఎంతో ఆనందించారు. ఆ రోజులోనే నన్నొక కోరిక కోరారు. చైతన్యకు 5 సంవత్సరాల 5 నెలల 5వరోజున అక్షరాభ్యాసం చేయించమని. నాకు సెలవు దొరకదు అందుకోసం ఆపవద్దు అమ్మ వద్ద నేను రాకపోయినా జరిపించమని కోరాను. నాన్నగారు అంగీకరించలేదు. మొత్తం మీద నాన్నగారు కోరిక ప్రకారమే అక్షరాభ్యాసం జరిపించాము.

ఇంతకు ముందు జరిగిన మరొక సంఘటన చెప్పాలి. 1973లో నా వివాహం జరిగిం తర్వాత 1974లో నాకొక ఆడపిల్ల పుట్టింది. అనసూయ అని నామకరణం చేయించుకున్నాం. ఆ పిల్లకు అనారోగ్యం డిహైడ్రేషన్‌తో గుంటూరులో డాక్టర్ జ్యోత్స్న పర్యవేక్షణలో విజయకుమారి హాస్పిటల్‌లో వైద్యం జరుగుతున్నది. కొంచెం నెమ్మదించింది అని చెపితే జన్నాభట్ల వారింట్లో భోజనం చెయ్యటానికి వెళ్ళాను. భోజనం చేస్తుండగా నాన్నగారు హాస్పిటల్ నుండి అక్కడికి హడావిడిగా వచ్చి పెద్దగా ఏడుస్తూ పిల్లకు సీరియస్ అయి చనిపోయిందని చెప్పారు. నాన్నగారి చూచి మేమూ చలించిపోయాం.

1979 వ సంవత్సరం నాకు యస్.బి.ఐ.లో ఆఫీసర్‌గా ప్రమోషన్ మీద వేటపాలెంకి ట్రాన్స్‌ఫర్ కాగా వెళ్ళాను. నేను వేటపాలెంలో వుండగా అమ్మకి తీవ్ర అనారోగ్యం చేసింది. ఆ విషయం నాకు చాలా ఆలశ్యంగా తెలిసింది. నేను వెంటనే అమ్మను చూచేందుకు జిల్లెళ్ళమూడి వెళ్ళి ఆక్సిజన్ పెట్టి వున్న అమ్మని చూచి బాధకలిగి ఇంతటి విషమ పరిస్థితి కలిగితే అమ్మ అనారోగ్యం గురించి నాకెందుకు తెలియబర్చలేదని నాన్నగార్ని అడిగాను. గంభీర వదనంతో శోకతప్తుడైన నాన్నగారు నాకేమీ తోచలేదురా! అంటూ వారి నిస్సహాయతని వ్యక్తం చేశారు. 1980 సెప్టెంబరు 12వ తేదీన అమ్మకు మెరుగైన వైద్యం అందించే నిమిత్తం హైదరాబాదు తరలించారు. తుదకు అమ్మకి లంగ్ క్యాన్సర్ అని నిర్ధారించారు. ఆ వార్తతో అందరూ దుఃఖ సముద్రంలో మునిగిపోయారు. అమ్మని అమెరికా తీసుకెళ్ళాలని సోదరులు శ్రీ టి.రాజగోపాలచారిగారు భావించారు. అది క్రియారూపం దాల్చటం కష్టం అని కొందరు వాదించారు.

చివరకు నాన్నగారే అమ్మను నీకొచ్చింది క్యాన్సరా? అని గంపెడు దుఃఖంతో వున్నా, గంభీరంగా అడిగారు. అందుకు అమ్మ నాకు క్యాన్సర్ అని భయమా? లేక నేను పోతానని భయమా ? అంటూ ఎదురు ప్రశ్నించింది. అమ్మతో తర్కించక ప్రాధేయపూర్వకంగా నీవు ఏమైనా ఇది తగ్గించుకోవాలి అని నాన్నగారు అమ్మ వంక చూడటం బాగా గుర్తు. ఆ తర్వాత అనూహ్యంగా అమ్మ ఆ జబ్బును ప్రక్కన పెట్టి కోలుకోసాగింది. 1980 నవంబర్ 19, 20 తేదీలలో ఆరోగ్యంగా వున్న అమ్మతో హైద్రాబాద్ నించి తిరిగి అందరం సంతోషంగా జిల్లెళ్ళమూడి చేరాం. అయితే ఆ ఆనందం ఎక్కువకాలం నిలువలేదు. అమ్మ అనారోగ్యంగా వున్నపుడు నాన్నగారి వేదన చూచిన నేను జిల్లెళ్ళమూడికి ట్రాన్స్‌ఫర్ చేయించుకొని ఒక కొడుకుగా ఆయనతో గడపాలని



భావించాను. కానీ నా కోరిక తీరకుండానే నాన్నగారు 1981 ఫిబ్రవరి 17వ తేది మహాభినిష్క్రమణం చేశారు.

నేనెందుకు జిల్లెళ్ళమూడి రావలని అనుకున్నానో అది సగం దెబ్బతిన్నది. 1982లో నాకు జిల్లెళ్ళమూడి ట్రాన్సఫర్ అయింది. నేను వద్దనుకున్నాను. అమ్మ ఒక్క సంవత్సరం ఉండరా నా దగ్గర అన్నది. ఉన్నాను. ఆ సమయంలోనే అమ్మ 1960 మొదటి రోజులలో ఎలా ఉండేదో అలా ఉన్నదని అందరూ భావించారు. అమ్మ 40 రోజులు మేమున్న యింట్లో, మాతోనే ఉన్నది. 1.4.1985న అమ్మ పుట్టిన రోజున అమ్మకు పూజ చేసుకున్నాను ప్రత్యక్షంగా. అమ్మకు అదే నా చివరి పూజ. ఆశ్చర్యం ఏమిటంటే 1985 జూన్ 14న అమ్మ ఆలయంలో చేరింది. నేను 14.6.86న బలవంతంగా మాచర్ల ట్రాన్సఫర్‌పై వెళ్ళాల్సి వచ్చింది.

ఒక విషయం మాత్రం స్పష్టం. నాన్నగారు అందరూ జిల్లెళ్ళమూడి రావాలనుకున్నారు. అందరినీ కావాలనుకున్నారు. ఎన్నడూ జనాన్ని చూచి విసుక్కోలేదు. వ్యక్తిగతంగా ఉమ్మడి కుటుంబంగా ఎలా ఉన్నారో విశ్వకుటుంబం పెద్దగా కూడా అలాగే అందరి క్షేమాన్నీ కాంక్షించారు. తల్లిదండ్రులను వదిలి ఓరియంటల్ కాలేజీలో చదువుకోవటానికి వచ్చిన పిల్లల పట్ల ఎంతో ప్రేమగా ఉండేవారు. పిల్లలతో సరదాగా గడిపే వారు. టేబుల్ టెన్నిస్ వంటి ఆటలు ఆడుతుంటే వచ్చి పాల్గొనేవారు. చిన్నలతో కూడా కలసిపోయేవారు. పెద్దలలో పెద్దగా వ్యవహరించేవారు. నా పట్ల తండ్రిగా నాన్నగారు చూపించినంత శ్రద్ధ ప్రేమ నేను నాన్నగారి పట్ల నా బాధ్యత నిర్వర్తించలేకపోయానేమోనని నా కనిపిస్తుంటుంది అప్పుడప్పుడు.





అమ్మ రెండవ కుమారుడు రవికుటుంబసభ్యులతో అమ్మ





# అర్ధనారీశ్వర తత్త్వం



శ్రీ లక్ష్మణ యతీంద్రులు

(28.2.81న జిల్లెళ్ళమూడిలో అమ్మ సన్నిధిలో శ్రీనాన్నగారి ఆరాధన సందర్భంగా సభ జరిగింది. ఆ సభలో శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రులవారు ప్రధానవక్త. వారి ప్రసంగం నుండి కొన్ని భాగాలు అందజేస్తున్నాము)

మనము వెనుకటి కాలంలో ఒక వేషం చూస్తూ ఉండేవాళ్ళం, అర్ధనారీశ్వర వేషమూ అని. ఒక వ్యక్తి సగభాగము పార్వతీ అమ్మవారుగా వేషం ధరించి, తక్కిన సగభాగము సదాశివుడుగా రూపం సంతరించుకొని ఒక చిన్న తెరకట్టి ఆ తెర ఇటువైపు లాగితే ఈ సగము సదాశివుడుగా కనపడేది. ఆ ప్రక్కకు లాగితే తక్కిన నగభాగము అమ్మవారుగా కనపడేది. దానిని అర్ధనారీశ్వర వేషము అనేవాళ్ళు. వారు యథార్థానికి అర్ధనారీశ్వరులు కారు గనుక అర్ధనారీశ్వరవేషం ధరింపవలసి వచ్చింది. యథార్థమయిన అర్ధనారీశ్వర తత్త్వం ఇక్కడ ఉండి మనకు మొన్న మొన్నటి వరకూ తన అనుభవాన్ని ఇచ్చింది. అయితే ఒక చిత్రమయిన ఊహ చేయండి. ఈ రెండు వేషాలూ ధరించి కేవలం ఇవతలి భాగం మాత్రమే ఈ కుడివైపులో ఉన్నపుడు పురుషభాగం మాత్రమే ఒక అద్దంలో కనబడుతుంది. అట్నుంచి అద్దంలో చూస్తున్నారు. ఈ స్త్రీ రూపంలో ఉన్న ఎడమభాగం మాత్రమే ఒక అద్దంలో కనబడుతుంది. అట్నుంచి ఇంకొ అద్దంలో చూస్తున్నారు. చూచినపుడు ఈ వ్యక్తి వేరు, ఆ వ్యక్తి వేరు అనుకోవడంకద్దు, అద్దంలో ప్రతిబింబమే చూస్తున్నాము గనుక అంటే యథార్థ స్వరూపాన్ని చూడలేని స్థితిలో ప్రతిబింబాన్ని మాత్రమే చూచి అదే అసలు మూర్తి అనుకుంటున్న స్థితిలో వేరు వేరు అనుకునే ఆ స్థితిలో ఆ అద్దాలను రెండూ తీసివేసి వ్యక్తి కనబడ్డపుడు అవి రెండు కాదు ఒకటే – అని మనకు అనుభవం లోనికి వస్తుంది. ఆ అనుభవంలోనికి వచ్చినపుడు రెండు తత్త్వాలు ఒకటిగా నున్నది అనుకుంటాము. ఆ వేషాలు తుడిచేస్తే ఒకటిగా కనపడతారు. అప్పుడు పూర్ణనారిగా కనపడ్డా పూర్ణేశ్వరుడు ఆ నారిలోనే ఉంటాడు. పూర్ణపురుషుడుగా కనపడ్డా అమ్మ ఆ పూర్ణపురుషునిలోనే ఉంటుంది. ఆ రెంటినీ విభజించి చూడడానికి అసలు రెండు రెండయినది. రెండు రెండుగాక ఒకటి రెండుగా కనపడ్డపుడు ఆ రెంటినీ ఒకటిగా తెలుసుకోవడమే మనయొక్క ధర్మం కానీ, అవి రెండు కాదు అని గుర్తించడమే మన యొక్క బాధ్యత కానీ అందులో రెండవదాన్ని విడదీసి చూడాలని ప్రయత్నం చేయడం లేదు. ఇక్కడ మొన్న మొన్నటి వరకు రెండద్దాలలో రెండు ప్రతిబింబాలను చూసాము. ప్రతిబింబాన్ని చూడటవేమొంది, వ్యక్తులుగా చూస్తున్నాము గదా! అని అనుకుంటాము మనము. యథార్థానికి వ్యక్తులుగా చూడటంలే. యదార్థతత్త్వం మనకు అనుభవంలోనికి రావడంలే. వచ్చిందని అను కుంటున్నాము. మనకు ఏది అనుభవములోనికి వచ్చిందను కుంటున్నామో అది పూర్ణతత్త్వం కాదు. పూర్ణతత్త్వాన్ని ఇంకా మనము గుర్తించవలసే ఉన్నది. యథార్థమయిన పూర్ణతత్త్వాన్ని మనం గుర్తిస్తే, అనుభవిస్తే, మనకు ఆందోళన అన్నది గానీ, ఆవేదన అన్నదిగానీ, మరొక బాధగాని, వ్యధగానీ వీటికి తావు లేదు. కేవలం ఆనందస్వరూపులుగా ఉంటాము మనము.

అమ్మా, నాన్నగారూ వేరు కాదు, అమ్మా నాన్నగారూ వేరయితే మనం అవుతాం. అలా కాదు. అమ్మా నాన్నగారూ ఒకటయితే ఆ తత్త్వమవుతుంది. ఒకటయిన తత్త్వమిక్కడ రెండుగా దిగివచ్చింది. ఆ



రెండుగా దిగివచ్చిన తత్త్వం తిరిగి ఒకటయి ఉన్నదీనాడు. అంతేగానీ 'నాన్నగారు పరమ పదించారండీ' అనటం సరికాదు. ఇప్పుడు పరమపదించడం అంటే అదివరకు ప్రాకృత పదంలో ఉన్నారా? ఎప్పుడూ ఉన్నది పరమపదమే.

నాన్నగారు ఈ శరీరాన్ని విడిచిపెట్టారు అంటే ఏమన్నమాట అర్థం ? ఒకానొక తేజస్సు, ఒక చైతన్యం, రెండురూపాలు ధరించి ఉన్నపుడు ఇక్కడ రెండు దీపకళికలు ఉన్నాయి.

ఈరెండు దీపకళికలలో రెండుగా వెలుగుతున్న ఒక ప్రమిదలో వత్తులు వేశారు. ఒకటంటే ఒకటిగా ఎప్పుడూ ఉండవు. వత్తులు, జంటగా ఉంటాయి. ఆ ఉన్నవత్తులు రెండు జ్వాలలుగా ఉన్నాయి. అనుకోకుండా ఆ జ్వాలలు రెండూ ప్రక్కనుంచి కలిపారు. ఏమవుతుంది? ఒకటే జ్వాలగా ఉంటుంది. అయ్యయ్యో ! ఒక జ్వాల చచ్చిపోయిందండీ ! అని అనుకుంటామా? జ్వాల ఒకటిగా కనపడుతుంది. ఈ రెండుగా ఉన్న జ్వాలలో నుంచి ఒక జ్వాల రెండవ జ్వాలలో ప్రవేశించింది గానీ, ఇది చచ్చిపోలేదు. పోవడానికి చావూ లేదు దానికి. అది చచ్చేతత్త్వం కాదు. చావున్న స్థితికాదు. ఈ రెండు జ్వాలలూ ఒకటవుతాయి. ఒక జ్వాలయ్యేటప్పటికీ ఒకటిగా కనపడుతుంది. ఆ ఒకటిగా ఉన్నపుడు అతః పూర్వ మున్నటువంటి ప్రేమ, అతః పూర్వమనురాగం, ఆ రెంటిలో ఏమయినా కొంతమార్పు వస్తుందా మనకు?





అమ్మనాన్న గార్లతో రవిన్నయ్య, హైమక్కయ్య, కనకమ్మ బామ్మగారు





# దేవదేవుడు



శ్రీ కొండముది రామకృష్ణ, జిల్లెళ్ళమూడి

"కాలవ నిండా నీళ్ళున్నప్పటికీ, దాహం తీర్చుకోవాలంటే రేవు కావాలి" - అన్నది అమ్మ. అదొక గొప్ప వాక్యం, పరమసత్యం. అట్లాగే సర్వత్రా భగవంతుడు వ్యాపకమై ఉన్నాడు - అనుకున్నా, సర్వమూ భగవంతుడే అనుకున్నా - సామాన్యుడు భగవంతుడిని గుర్తించడానికి ఒక ఆలంబనం అవసరం. జ్ఞాని దృష్టిలో సర్వమూ దైవమే. అందువల్లనే అమ్మ అన్నది, "ఎంత వెదికినా నాకు అది కానిది కనుపించడం లేదు" అని. ఈ వాక్యం కేవలం అమ్మ స్థితిని మాత్రమే తెలియజేయడం లేదు; ఒక జ్ఞాని యొక్క దృష్టిని, ఒక పరమ సత్యాన్నీ ఒక పారమార్థిక పరాకాష్ఠస్థితిని సూచిస్తున్నది.

అమ్మకు - నాన్నగారు పెండ్లి అయిన క్షణం నుండే దేవుడు. అమ్మ నాన్నగారిని గురించి ఎప్పుడు ఎవరికి చెప్పినా తన దైవమనే చెప్పింది. అట్లాగే ఆచరించింది. అట్లాగే ఆరాధించింది. అమ్మ తన బిడ్డలనూ దైవమనే భావించింది. తన భర్తనూ దైవమనే పూజించింది. ప్రకృతి సర్వాన్నీ దైవంగానే సంభావన చేసింది. బిడ్డలనూ, లోకాన్నీ అనురాగ పూర్వకంగా, వాత్సల్యపూరితంగా అనుగ్రహిస్తే, భర్తను సమ్మానపూర్వకంగా, సమాదరంగా, సభక్తికంగా ఆరాధించింది.

అమ్మను మనం దైవంగా గుర్తించాము, దైవంగా కొలుస్తున్నాము. మన దృష్టి అమ్మదృష్టి కాదు. మనం కనిపించిన సర్వాన్నీ దైవంగా చూడడం లేదు. మనకు మంచీ, చెడూ వేరు. వెలుగూ చీకటీ వేరు. సుఖమూ దుఃఖమూ వేరు వేరు. మురికికాల్వనూ, గంగానదినీ సమంగా చూడలేము. మానవుడినీ మాధవుడినీ ఒకే పీఠంపై నిలుపలేము.

మనం మిగతా జగత్తునూ, అమ్మనూ చూసే కోణాలు వేరు. అమ్మ మన దృష్టిలో విశిష్టస్థానం ఆక్రమించుకున్నది. అమ్మ తన మాటలవల్ల క్రియలవల్ల మన గుండెల్లో గుడి కట్టుకున్నది. మన హృదయాల్లో అమ్మకు గల ఆసనం అత్యున్నత మయినది, అత్యుత్తమ మయినది, అద్వితీయమయినది, అనుపమ మయినది. అందుకే అమ్మను మనం ప్రేమిస్తాము, గౌరవిస్తాము, పూజిస్తాము. అందుకే దేవుడి ఉనికిని అంగీకరించని వాళ్ళు కూడా అమ్మను దేవుడుగా సమ్మతిస్తారు, దేవుడు అంటే మానవాతీత మయిన శక్తి కనుక.

అటువంటి అమ్మకు నాన్నగారు దేవుడు. అంటే మనకు దేవదేవుడు.

మనకు ఏమి కావాలో మనకంటే అమ్మకు బాగా తెలుసు, "మీరు అడిగిందెల్లా యివ్వను, మీకు ఏం కావాలో తెలుసుకుని అది మాత్రమే యిస్తాను" అని అమ్మ అనేక పర్యాయాలు ఉద్ఘాటించింది.

అందుకనే అమ్మ మన భావాల్నీ, అవసరాన్నీ ఆలోచించి అనసూయేశ్వరాలయాన్ని సంకల్పం చేసింది. అదొక మహత్తర సంకల్పం ! మానవమాత్రులు ఊహించడానికి కూడా శక్యం కానిది.

అందరికీ ప్రీతిపాత్రమైనది అమ్మ. నాన్నగారిలోని మానవాతీత గుణసంపద, దైవికశక్తి అవగతమూ, అనుభూతము కొందరికి మాత్రమే. కానీ సర్వవిభేద రహితంగా అమ్మ అనుగ్రహం అనవరతమూ ప్రసారితం అవుతుంది కాబట్టి అమ్మ సర్వలోకాన్నీ కరుణించే నిమిత్తమే అనసూయేశ్వరాలయానికి రూపకల్పన చేసింది.

ఈ అనసూయేశ్వరాలయ రూపకల్పనలో ఎన్నో అపూర్వ విషయాలు యిమిడి ఉన్నాయి. అమ్మ -



నాన్నగార్లంటే శ్రీ లక్ష్మణయతీంద్రులు ప్రవచించినట్లు ఒకే ప్రమిదలోని రెండు జ్యోతులు. ఒకే వస్తువు యొక్క యిరుపార్శ్వాలు.

ఈ అఖండజ్యోతిని జిల్లెళ్ళమూడిలో ఒక దేవాలయంలో సుప్రతిష్ఠితం చేసి సర్వలోకాలకూ ఆ వెలుగునూ, వెన్నెలనూ పంచాలనేది అమ్మ ఆకాంక్ష.

అమ్మ ఏ కార్యక్రమం చేపట్టినా – అది ప్రణాళికా బద్ధమయ్యే ఉంటుంది. మనకు అర్థం కాక అదేదో హఠాత్తుగా జరిగినట్లు, అనుకోకుండా జరిగినట్లు విభ్రాంతుల మవుతుంటాము.

శ్రీ లక్ష్మణయతీంద్రులు సెలవిచ్చినట్లు 1981 ఫిబ్రవరి 16వ తేదీన ఒక జ్యోతి మరో జ్యోతిలో సంలీనమయింది. అంతకు పూర్వం కూడా అమ్మ అర్థనాగేశ్వరుడే; నాన్నగారిలో అమ్మ అంతర్లీనమై లేకపోలేదు. చూడగలిగిన కళ్ళకు యీ మనోహరరూపాలు సుస్పష్టమే.

1981 ఫిబ్రవరి 17వ తేదీ సాయంకాలం అమ్మను చూసిన వాళ్ళకూ, అమ్మ చేసిన క్రియను చూసినవాళ్ళకూ, నేటికీ ఆ దృశ్యం జ్ఞప్తికి తెచ్చుకుంటే శరీరం రోమాంచితం అవుతుంది. ఆ క్రియ అపూర్వమయినది. అత్యద్భుత మయినది. మానవాతీతమయినది,

మనం సామాన్య మానవ దృక్పథంతో అవలోకిస్తే అకస్మాత్తుగా విగతజీవుడయిన తన భర్తను, ప్రాణప్రదంగా ప్రేమించే తన భర్తను గ్రామానికి మధ్యగా, దేవాలయ గర్భగుడిలో సగభాగం భవిష్యత్తులో తన కోసం భద్రపరచు కుని, మిగతా సగభాగంలో అసంఖ్యాక జనం హృదయ విదారకంగా దుఃఖాక్రాంతులై ఉండగా తాను మాత్రం నిర్లిప్తంగా, ఉదాసీనంగా, ఏదో బొమ్మలాటలోవలె భూస్థాపితం ఎవరు చేయగలరు ?

"అంతకు పూర్వమే నిర్మాణమై యిందుకు ఎదురు చూస్తున్నట్లున్న దేవాలయమే – అమ్మ భవిష్యత్ కార్యక్రమ ప్రణాళికారచనకు నిదర్శనం. పరమ కారుణ్యంతో 1981 ఫిబ్రవరి 17వ తేదీన ఒక అపూర్వ దేవాలయాన్ని జగత్తుకు అంకితం చేసింది. ఈ దేవాలయ అర్చనా విధానం కూడా అత్యద్భుతంగా ఉంటుంది.

1981 ఫిబ్రవరి 18వ తేదీ ఉదయం అమ్మ ఆ గర్భగుడిలో అఖండజ్యోతిని వెలిగించి అర్చనకు శ్రీకారం చుట్టింది. ఆనాటి నుండి అక్కడ ఉదయం మహన్యాస పూర్వకంగా ఏకాదశ రుద్రాభిషేకం జరుగుతుంది. సాయంకాలం అమ్మనామాలతో అర్చన జరుగుతుంది. అందుకే అది అనసూయేశ్వరాలయం అయింది.

అమ్మ ఆ దేవాలయానికి వస్తే గర్భగుడికి ప్రదక్షిణం చేస్తుంది. అభిషేకం చేస్తుంది. అర్చన చేస్తుంది. నివేదన చేస్తుంది. హారతి యిస్తుంది. సర్వోపచారాలూ చేస్తుంది. మన మందరమూ అక్కడ అమ్మ ఉన్నదనే భావంతో అర్చన చేస్తాము. అమ్మ నామాలే చదివి పూజలు చేస్తాము. అమ్మ అక్కడకు వచ్చినప్పుడు తానే స్వయంగా పూజలు, నివేదనలు అందుకొనడానికి ఏమీ సంకోచించదు.

మనం గతంలోకి వెళ్ళి జ్ఞాపకాల పొరలను తొలగించి చూస్తే ఎన్నో సంవత్సరాలు ప్రతి మే 5వ తేదీన అమ్మ ఆ గర్భాలయంలో అనుగ్రహ ముద్రలో మనకు దర్శనం ప్రసాదించింది.

మనం నిత్యం చూస్తుంటాము – నాన్నగారి భావనతో ఎందరో అమ్మకు ధోవతులు సమర్పిస్తారు. అమ్మ వాటిని నిర్లిప్తంగా స్వీకరిస్తుంది.

ఒక విచిత్ర భావన మన మనస్సులో పరిమళించి మనను ఆనంద పరవశులను చేస్తుంది. అమ్మతో కలిసి నాన్నగారు మన మధ్యనే ఉన్నారు. నాన్నగారితో కలిసి అమ్మ దేవాలయంలో ఉన్నది. అందుకే అనసూయేశ్వ రాలయం ఒక అత్యద్భుత సృష్టి. అమ్మ మానవ లోకానికి కరుణతో ప్రసాదించిన మహావరం.







# జిల్లెళ్ళమూడి నాన్నగారు



శ్రీ కె.బి.జి.కృష్ణమూర్తి, జిల్లెళ్ళమూడి

జిల్లెళ్ళమూడిలో నాన్నగారు అని అనగానే జిల్లెళ్ళమూడి కరణంగారు, బ్రహ్మాండం నాగేశ్వరరావు గారు అని చెప్పకుండానే చెప్తుతారు. ఆ ఊళ్ళో ఎవరిని అడిగినా 1950-60 దశకంలో ఎవరు జిల్లెళ్ళమూడికి వచ్చినా అమ్మను చూడాలంటే కరణం గారింటికి వెళ్ళవలసిందే. ఆ ఇల్లు ఒక మూరిల్లు. సూర్యచంద్రాదులను ఆ ఇంటిలో కట్టివేశారా అన్నట్లు వుండేది. ఆ ఇంట్లో ఒక పడకకుర్చీ, ఆ కుర్చీ మీద వ్రాసుకోటానికి వీలుగా ఒక చెక్క ప్లాన్క్. ఆ కుర్చీలో కూర్చుని కరణీకం లెక్కలు వేసుకుంటూ నిరాడంబరంగా కూర్చునేవారు నాన్నగారు. ఆ ఇంటికే ఒక తపాలాపెట్టె వ్రేలాడి కట్టబడి వుండేది. కారణం ఆ వూరికి ఈయన కరణంగారే కాదు, బ్రాంచి పోస్ట్ మాస్టర్ కూడా. వెళ్ళినవారు 'అమ్మగారు ఉన్నారాండీ' ?అని అడిగితే ఆయన "ఇదిగో ! నీ కోసం ఎవరో వచ్చారని" చెప్పేవారు అమ్మతో. అమ్మ దర్శనం ఇచ్చేది ఆ వచ్చినవారికి. ఆవిడను చూడగానే ఒక దేవతను చూచినట్లు వుండేది. ఆవిడకు నమస్కరించి ఆవిడ ఇచ్చిన ఆతిథ్యం స్వీకరించేవారు. ఆ ఊళ్ళో బ్రాహ్మణ కుటుంబం వీరు ఒక్కరే. అందుకని వచ్చిన వారికి భోజన సౌకర్యం ఆ ఇంట్లోనే జరిగేది. అట్లా 1958 వరకు వచ్చిన వారికి భోజన సౌకర్యం, వసతి నాన్నగారే ఇచ్చేవారు. వచ్చిన వారిని ఆత్మీయులుగా చూడటం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య.

ఆయనకు శతజయంతి మహోత్సవాలు ఇప్పుడు జరుగుతున్నవి. అయితే నా మనస్సులో మెదిలేది నాన్నగారికి అత్యంత ఆప్తుడు, బంధువు అయిన మా సోదరులు రామకృష్ణకు తండ్రి కొండముది సుబ్బారావు, అప్పికట్ల గ్రామకరణం. నాన్నగారి వివాహానికి ఈయన ప్రముఖ పాత్ర ఎంతో వుందని అమ్మ చరిత్ర చెపుతోంది. అంటే ఆయనకు కూడా ఇప్పుడు శతవసంతాలు నిండి ఉండేవి. వీరికి అత్యంత స్నేహితుడు బాపట్ల కోనా ప్రభాకరరావు గారు. అమ్మ వివాహ ఏర్పాట్లలో ఈయన వంతు పాత్ర కూడా గణనీయంగానే వుందని అమ్మ చరిత్రే చెపుతున్నది.

నేను జిల్లెళ్ళమూడిలో అమ్మ సన్నిధిలో 1962-63 నుండి వుండటానికి కారణభూతులు నాన్నగారే అని చెప్పక తప్పదు. అప్పటి నాన్నగారి పాత్ర అటువంటిది. ఈ జీవిత నాటకరంగంలో అన్ని పాత్రలూ వాడు నిర్ణయించినవే అనేది పరమ సత్యం. ఈ సత్యమైన విధిని తప్పించుకొనటానికి ఎవ్వరికీ వీలులేదు. ఎవరి పాత్ర, విశిష్టత వారిదే. విధిని తప్పించుకోవటం విధాతవల్ల కూడా కాదు. ఈ నాటకంలో నాన్నగారే హీరో.

నాన్నగారింట్లో పాలేరుగా మంత్రాయి అనేవాడు వుంటూ వుండేవాడు. ఆ మంత్రాయికి అమ్మ అంటే అత్యంత భక్తిశ్రద్ధలు. వాడికి ఎక్కడున్నా అమ్మ ఎట్లా వున్నదోఅనేదే ధ్యాస. నాన్నగారిపొలంపనులకు వెళ్ళి పొలం దున్ను తున్నప్పుడు కాడి మేడిలో అమ్మను స్పష్టంగా చూస్తుండే వాడు. అమ్మకు ఏ మాత్రం ఆపద వాటిల్లినా ఆ కాడి మేడి అట్లాగే పొలంలో వదిలివేసి ఇంటికి పరుగెత్తేవాడు. జిల్లెళ్ళమూడిలో నాన్నగారికి గ్రామపార్టీలుండేవి. నాన్నగారి వ్యతిరేకులు ఆ ఊళ్ళో కొంతమంది అమ్మను చంపటానికి కూడా అనేక ప్రయత్నాలు చేయటం నా దృష్టిలో 2, 3 ఉదంతాలు వున్నవి. వాటి వివరాలు ఇక్కడ ఇప్పుడు వ్రాయటం సందర్భోచితం కాదని వదిలేస్తున్నాను. కాని అటువంటప్పుడు కూడా అమ్మ తన మాతృతత్వాన్ని ఎట్లా ప్రకటిస్తుందో వ్రాయనలవికాదు.



నాన్నగారు నన్ను 'గోపాలకృష్ణమూర్తీ' అని 'గోపాల కృష్ణమూర్తిగారూ!' అని ఎంతో ఆప్యాయంగా పలకరించే వారు. ఒకసారి 1971 లో నాకు ఫ్లూరసీ అనే ఊపిరితిత్తుల వ్యాధి వచ్చి చీరాలలో డాక్టర్ నారపరాజు శ్రీధరరావుగారి ఆసుపత్రిలో చేరాను. చీరాలలో బూదరాజు శేషగిరిరావు గారి ఇంటి దగ్గర మేడమీద ఒక పోర్షన్ అద్దెకు తీసుకొని డాక్టర్ గారు రోజు వచ్చి చూచిపోయేటట్లుగా ఏర్పాటు చేయబడింది. అప్పుడు నాన్నగారికి కూడా ఫ్లూరసీ వచ్చి డాక్టర్ శ్రీధరరావుగారి దగ్గరే వైద్యం చేయించుకుంటూ నేను వున్న ఇంటిలోనే ఆయన కూడా ఉండేవారు. మా యిరువురికీ వంట చేసి పెడుతూ మాకు కావలసిన సేవలు మా పినతల్లిగారు చేస్తూ వుండేవారు. అట్లా 3 నెలలు వున్నాము. అప్పుడు అమ్మ మా యిరువురినీ చూడటానికి చీరాలలో డాక్టర్ శ్రీధరరావు గారింటికి వచ్చి మమ్ములను చూచారు.

నేను జిల్లెళ్ళమూడిలో అమ్మ గదిలో వుండే రోజులలో నాన్నగారు అమ్మ గదిలోనికి వచ్చి "ఏమండీ మీ అమ్మగారు లేవలేదేమిటి ? ఒంట్లో బాగాలేదా?" అని అడిగారు. నేను "అమ్మకు జ్వరమండి, ఒళ్ళు కాలిపోతున్నది" అన్నాను. "ఎంతుంది, ఏమిటి?" అనేవారు. నేను "104 డిగ్రీలు వుండవచ్చు" అనేవాడ్ని. "అంతేనా? దానికే పడుకోవాలా అండీ" అనేవారు. నాన్నగారు ఒక్కొక్కప్పుడు మూలుగుతూ పడుకుండేవారు. "నాన్నగారూ! మూలుగుతున్నారేమిటండీ" - అంటే "నాకు జ్వరం తగిలిందయ్యా, ఒంట్లో బాగోలేదు" అనేవారు. "జ్వరమా! ఎంతుందేమిటి?" అంటే (99)అని మూలుగుతూ చెప్పేవారు. '99కే మూలగాలాండీ ? అమ్మకు 104 జ్వరమొస్తే దీనికే పడుకోవాలా ? అన్నారు కదా !" అంటే, నాన్నగారు "మీ అమ్మగారికేమయ్యా ? ఎంత జ్వరమైనా చిలక కొయ్యకు వేసి స్నానం చేసి రాగలదు" అనే వారు. ఎక్కడకు ఆయన వెళ్ళినా ఆయనతో పాటే అమ్మ వుంటుందని అమ్మ వచ్చినప్పుడు వుండే ప్రత్యేకమైన సువాసననుబట్టి నాకు అర్థమయ్యేదని చెప్పేవారు. 'శ్రీ నాగేశ్వర పాదపద్మ యుగళీచింతాసుధా స్వాదినీ, శ్రుత్యంత స్తవనీయ దివ్యచరితా' అని డాక్టర్ పన్నాల రాధాకృష్ణశర్మగారు వ్రాసినట్లు నాన్నగారు ఏడో మైలు వద్ద బస్సులో క్రిందకు దిగగానే నాతో అమ్మ అనేది. "నాన్నగారు ఇప్పుడు బస్సు దిగారని" అంటే నాన్నగారి అడుగుల సవ్వడి ఎప్పుడూ అమ్మ హృదయంలోనే వుంటుందని తెలియచేస్తుంది.

నాన్నగారు ఎప్పుడూ "నేను జిల్లెళ్ళమూడి అమ్మగారి భర్తను అని చెప్పుకుంటేనే నాకు మర్యాద గౌరవం వుంటుంది కాని "జిల్లెళ్ళమూడి కరణాన్ని అని చెప్పుకుంటే నన్ను ఎవరు గౌరవిస్తారయ్యా" అనేవారు. ఒకసారి నేను జిల్లెళ్ళమూడి అమ్మను అని చెప్పుకుంటూ తిరగేటువంటి ఒక ఆవిడ జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను సందర్శించింది. అప్పుడు అమ్మ ఆమెతో అన్నది. "నీకు జిల్లెళ్ళమూడి అమ్మను అని చెప్పుకోవటం నీకు గొప్ప. కాని నేను జిల్లెళ్ళమూడి కరణంగారి భార్యను అని చెప్పుకోవటం నాకు గొప్ప. నీవు జిల్లెళ్ళమూడి కరణం గారి భార్యవు కాలేవుగా?" అన్నది. పతియే దైవమని భావించి ఏ కార్యక్రమాలలోనైనా అమ్మ పాల్గొనే ముందర నాన్నగారి పాదాలకు నమస్కరించేది. సంక్రాంతి పండుగ ముందర, భోగి రోజు నాన్నగారికి బొట్టు పెట్టి ఆయన పాదాలకు నమస్కరించి ఆ పాదాలపై భోగిపండ్లు పోసిన తరువాతనే హైమాలయంలో కాని ఆ పండుగకు విచ్చేసిన వేలాదిమంది సోదరీ సోదరులు ఆడ, మగ, పిన్న, పెద్ద తేడా లేకుండా ఒకే పంక్తిలో కూర్చోబెట్టి భోగిపండ్లు పోసేది. నాన్నగారిని అమ్మ నాగేంద్రునిగా, నాగేశ్వరునిగా, సోమశేఖరునిగా అభివర్ణించేది. అటువంటి నాన్నగారి శతజయంతి ఉత్సవ సందర్భంలో యావన్మంది సోదరీ సోదరులకు ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించేటట్లుగా అమ్మ సేవలో తరించేటట్లుగా అమ్మను ప్రార్థిస్తున్నాను.





# నాన్నగారి శతవర్ష మహోత్సవం



శ్రీ మన్నవదత్తాత్రేయశర్మ, జిల్లెళ్ళమూడి

"పతిని ఆధారంగా చేసుకుని పంచభూతాలను జయించినదే పతివ్రత" అని అమ్మ చాటిచెప్పింది. "పెళ్ళిలో పెద్దపులి ఉన్నదని భయపడేవారి కోసం ఈ నా పెళ్ళి" అన్నారు. వివాహబంధంలో ఉన్న పరిమితమైన అనురాగం సర్వత్రా నింపటం అమ్మ వివాహంలో ఉన్న ప్రత్యేకత. ఈ పథంలో అమ్మ గృహిణి అయినది. అమ్మ భర్త శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు అమ్మకి స్వయాన మేనత్త కొడుకు; అమ్మ తండ్రికి చెల్లెలు అయిన కనకమ్మ గారి కొడుకు. ఈయన తండ్రి బ్రహ్మాండం సుబ్బారావుగారు, బాపట్ల తాలూకా రేటూరు గ్రామ కాపురస్తులు. వీరు జిల్లెళ్ళమూడి రేటూరు గ్రామ కరణీకం చేసేవారు. అమ్మ జన్మస్థలం గుంటూరుజిల్లా పొన్నూరు మండలంలో మన్నవ అనే చిన్నగ్రామం. అమ్మ తండ్రి సీతాపతిశర్మగారు మన్నవ గ్రామకరణం. అమ్మ తల్లి రంగమ్మగారు. అమ్మ చిన్నతనంలోనే రంగమ్మగారు శరీరం చాలించారు. బంధుత్వం వుండటం వలన రాకపోకలు వుండేవి. నాగేశ్వరరావుగారు చిన్నతనంలో ఆటలు బాగా ఆడేవారు; నాటకాలు వేసేవారు. నాటకాలు అన్నా ఆటలన్నా బాగా ఇష్టం. మొదటి నుండి కష్టపడి జీవితాన్ని సాగించిన వ్యక్తి. సంపద - సౌభాగ్యాలకి, అందచందాలకి అతీతమైన అనుబంధమే నిజమయిన ప్రేమ. "అందమైన భర్త కాదు, భర్తే అందం" అన్నారు అమ్మ. ఈ పథంలో అమ్మ భౌతికబంధానికి అతీతమయిన ఆత్మానుబంధంతో వివాహం చేసుకుని పునీతజీవితం గడిపి జగత్తుకి ఆదర్శగృహిణి అయినది.

అమ్మ మామగారు రేటూరు - జిల్లెళ్ళమూడి కరణీకం చేస్తున్న రోజులలో రేటూరు నుండి జిల్లెళ్ళమూడి వస్తూ పోతూ కరణీకం చేసేవారు. అమ్మ వివాహం బాపట్లలో అమ్మ చినతాతగారైన చిదంబరరావుగారింట్లో 1936 మే 5వ తేదీన జరిగింది. అప్పటికి అమ్మకి 13 సంవత్సరాలు. తరువాత అమ్మ మామగారైన సుబ్బారావు గారు చనిపోయారు. జిల్లెళ్ళమూడి గ్రామకాపురస్తులు వారి ఊరిలోనే కరణంగారు ఉండాలనే ఉద్దేశంతో నాగేశ్వరరావు గారితో సంప్రదించి వారి కుటుంబానికి కొన్ని ఏర్పాట్లు చేసి జిల్లెళ్ళమూడి చేర్చారు. ఈ విధంగా అమ్మ జిల్లెళ్ళమూడి వచ్చి స్థిరపడటం జరిగింది.

అమ్మ ప్రకటనలు - "జీవితం భౌతిక బంధానికి అతీతమైనది. కొండంత తండ్రికాదు, తండ్రే కొండ. ఆధారం అమ్మ, అవకాశం నాన్న. ప్రకోపింపచేసేది అమ్మ. ప్రకోపించే వాడు నాన్న." అందువలన నాన్నగారి ద్వారా జరిగిన సంఘటనలకి ఆయన నిమిత్తమాత్రమే. పెద్ద సంపద ఉన్నా లేకపోయినా, సుఖదుఃఖాలకి సంపద - సౌభాగ్యాలకి అతీతంగా సుఖమయ జీవితం ఎట్లా గడపాలో అమ్మ సంసారజీవితం సకలమానవాళికీ ఆదర్శం. అమ్మకి భౌతికమయిన సంతానం ముగ్గురు. పెద్ద కొడుకు సుబ్బారావు, తరువాత కుమార్తె హైమవతి, చిన్నకొడుకు రవీంద్రరావు. వీరిలో హైమవతి 1968 ఏప్రియల్ 5వ తేదీ నాడు గుంటూరు జనరల్ హాస్పిటల్‌లో శరీరం చాలించటం జరిగింది. ఏప్రియల్ 6న ఆనాడు అమ్మ నివసించే పర్ణశాలకి ఎదురుగా భూగృహంలో ఖననం చేశారు అమ్మ. "హైమను తపోభూమికి శంఖుగా పెట్టాను. హైమ అమరం'' అన్నారు అమ్మ. బహుముఖకోణాలలో అమ్మని అవగాహన చేసుకొనటానికి కారణం అమ్మ గృహిణి అయినందు



వలన. అందుకు అవకాశం ఇచ్చింది అమ్మ భర్త. ఈ విధంగా నాన్నగారు (అమ్మభర్త) అవకాశం ఇచ్చారు.

"సారం కలిగింది సంసారం. సంతాపం లేనిది సంతానం" అని తెలియచేశారు అమ్మ. లోకాన్ని దివ్యమయంగా చూడటం, అనేకత్వాన్ని సారమయంగా అనుభవించటం ఆధ్యాత్మిక పరాకాష్ఠ. సంసారం సారం కలిగినది అని చాటి చెప్పటంలో పరమార్థం ఇదే. సంసారం అవరోధం అనే భ్రమ నుండి మేల్కొలిపింది అమ్మ. అయితే ఈ కుటుంబబంధం సంకుచితమయి వెట్టిస్వార్థం కావటం వలన అది సంఘర్షణకి దారి తీస్తున్నది. కాని ప్రకృతిసిద్ధమయిన అనేకత్వాన్ని తీసివేయటం అసంభవం. ఈ అనేకత్వం నుండే ఏకాత్మతా ఆనందాన్ని కలుగచేస్తూ సామాజిక సుస్థిరతను ప్రతిష్ఠిస్తూ "సారం కలిగినది సంసారం" అని తెలియచేశారు అమ్మ.

ఇకపోతే "సంతాపం లేనిది సంతానం" అని చాటి చెప్పటంలో పరమార్థం తల్లితండ్రులకి సంతాపం కలుగ చేయకుండా సంతానం ప్రవర్తించాలని తెలియచేశారు అమ్మ. శ్రవణకుమారుడు, ధర్మవ్యాధుడు ఈ విధంగా అనేకమంది ఉత్తమ సంతానంలా ఉండాలి అని కుటుంబపరంగా చెప్పారు. ఈ సంతానం నాకు సంతాపం అనే భావన లేకుండా తల్లిదండ్రులు పెంచి పెద్ద చెయ్యాలని ఇటు తల్లిదండ్రులకి అటు సంతానానికి ఆదర్శ ప్రబోధం చేసి జీవించారు అమ్మ.

"వివాదం లేనిది వివాహం" అనీ "కళంకరహిత మయిన మనస్సుని కళంకరహితంగా మరొకరికి అర్పించటమే కళ్యాణం" అన్నారు అమ్మ. ఈనాడు అనేక విషయాలలో వివాదాలు కుతర్కం తప్ప చక్కని సంవాదం కనపడటం లేదు. అందుకని కుటుంబం నుండి దేశం అనెడి కుటుంబం విశ్వకుటుంబం వరకు సంబంధ బాంధవ్యాలు ఎట్లా ఉండాలి, అనేక వర్గాలమధ్య ఏవిధంగా సమస్యలు పరిష్కరించుకోవాలి అనెడి విషయంలో మౌలికమైన మూలసూత్రంగా అమ్మ తెలియచేశారు.

ఆర్థిక సామాజిక అసమానతలు ఎక్కువయి సంఘర్షణలు పెరిగి అస్థిరత ఏర్పడింది ఒకవైపు. పరిమిత మైన స్వార్థం పెరిగి, సామాజిక దృష్టి నశించింది మరొక వైపు. ఇటువంటి విషయాలలో సంపద-దారిద్ర్యాలలో కష్టసుఖాలలో ఒకరినొకరు ఏవిధంగా ఆదుకుంటూ జీవించాలి అనేది అమ్మ తెలియచేసిన ఉదాత్తకుటుంబ వ్యవస్థ. దీనికంతా కారణం అమ్మ సంసారి కావటం. మొట్టమొదట అమ్మఇల్లు ఒక చిన్న అన్నపూర్ణాలయంగా నడిచేది. వచ్చీపోయే వారికి అన్నపానాదులు సమ కూర్చటంలో నాన్నగారు ఎంతో సహకరించేవారు. ఎంతోమంది అమ్మ వాత్సల్యాన్ని పొందటానికి కారణం నాన్నగారు ఇచ్చిన అవకాశమే. అమ్మ వ్యక్తిగా ఉండగా ఆయన ఏనాడూ ప్రత్యేకత కోరుకోలేదు. ఏ విధమయిన కీర్తినీ ఆశించకుండా ప్రత్యేకత లేకుండా నలుగురిలో ఒకరుగా జీవించేవారు. ఆయన పుట్టినరోజులు ప్రత్యేకంగా చేసేవారు కాదు. ఎవరికీ తెలిసేది కాదు. ఆయన శరీరం చాలించిన తరువాత, అమ్మ కూడా వ్యక్తిగా, అవ్యక్తం అయి మహాసిద్ధిపొందిన తరువాత అమ్మ చెంతకు వచ్చీ పోయే వారిలో కొందరికి అమ్మ స్వయంగా నాన్నగారి పుట్టినరోజు చెప్పి చేయమని చెప్పారు; వారిలో ప్రముఖులు శ్రీ మన్నవ రంగనాథం గారి కుమార్తెలు జయ, రమ.

అమ్మ కూడా మహాసిద్ధిపొందిన తరువాత జయ, రమ నాన్నగారి పుట్టిన రోజు చేయటం మొదలైంది. వారికి వంద సంవత్సరాలు పూర్తి అయిన సందర్భం ఈ సంవత్సరం. 1913 ఆశ్వయుజమాసం బహుళ సప్తమినాడు ఆయన జన్మించారు. ఈ సంవత్సరం విజయదశమి వెళ్ళిన తరువాత పూర్ణిమ వెళ్ళిన సప్తమి నాటికి 100 సంవత్సరాలు నిండుతుంది. ఈ సందర్భంగా



వంద చోట్ల అమ్మ బిడ్డలకి అన్న సంతర్పణ చేయాలని అమ్మ వ్యక్తిగా ఉన్నప్పుడు ఏర్పడిన సంస్థ శ్రీవిశ్వజననీపరిషత్ తీర్మానం చేసి, కొన్ని చోట్ల కార్యరూపాన్ని కలుగచేసి శ్రీకారం చుట్టింది. ఇంకా అనేకచోట్ల ఈ కార్యక్రమాన్ని యజ్ఞంగా స్వీకరించి అమ్మబిడ్డలు పూర్తి చేయాలి. కేవలం కార్యక్రమాలు చేయటమే కాక అమ్మ నుండి వెల్లివిరిసిన పవిత్ర వాత్సల్యం, నిరహంకార సమర్పణ, అనపేక్షమయిన త్యాగనిరతి అనెడి ఉన్నతమయిన సంస్కారశీల సంపదతో చేయాలి. తల్లి, తండ్రి బిడ్డలకి చేసినట్లు, అన్నదమ్ములు అక్కాచెల్లెళ్ళకు చేసినట్లు సోదరబంధంతో చేసినట్లు చేయటమే దీనిలోని పరమార్థం.

'భావం తెలిసి ప్రవర్తించేది భార్య. బాధ్యత తెలుసుకుని ప్రవర్తించేవాడు భర్త" అని భార్యాభర్తల విషయంలో తెలియచేసి సమాజం నడవడికని ఉన్నతంగా మలచి కుటుంబం నుండి విశ్వకుటుంబం వరకు ఆదర్శాన్ని తెలియచేశారు అమ్మ. తన యింటికి అందరిల్లు అని, అమ్మ చెంతకు చేరిన వారికి విశ్వకుటుంబం అని తెలియచేశారు. నేను, నా వాళ్ళు అనెడి రక్తసంబంధ బంధం ఉంటుంది సహజంగా. దీనిని విడనాడక విస్తృతమయిన ఆత్మబంధంతో చేసెడి ఉదాత్తమయిన సంస్కారానికి దోహదం చేస్తాయి పారమార్థిక భావంతో చేసెడి కార్యక్రమాలు. ఇదే అనేక చోట్ల అమ్మబిడ్డలకి అన్నం పెట్టుకోవటం లేక వైద్యశిబిరాల్ని నిర్వహించడం మొదలైన కార్యక్రమాలలో ధ్యేయం. మానవాత్మ వికాసానికి దోహదం చేసెడి అమ్మ అందించిన సాధనా వ్యవస్థ శ్రీ విశ్వజననీ పరిషత్. భౌతికమైన విషయ సమస్యలకి తాత్కాలిక పరిష్కారం కాక శాశ్వతమైన నిరహంకార వాత్సల్య ప్రపూర్ణమైన లౌకిక కర్మ ఈనాడు మనం జరుపుకుంటున్న ఈ కార్యక్రమం. తండ్రి బాధ్యత, తల్లి వాత్సల్యం యొక్క మేలు కలయికతో ఉన్నతమయిన మార్గదర్శనంతో కూడుకున్న గురుత్వం దీనిలో వుంది. ఇదేజాతి, అంతర్జాతి సుఖ-శాంతులతో వర్ధిల్లటానికి కావలసిన అక్షయ ధ్యేయ సంపదామృత స్రోతస్సు. దీనిలోని అర్థాన్నీ పరమార్థాన్నీ గ్రహించి అమ్మ సంతానకోటి తను - మన - ధనాలతో అంకితమయి జయప్రదం చేసి అమ్మ కృపకు పాత్రులవుదాం.



# ఆశ్రు తర్పణాలు అక్షర దర్పణాలు

శ్రీ నటరా, హైదరాబాద్

ఎక్కిళ్ళ నడచుకుని చెక్కిళ్ళు తుడుచుకుని
పాడాలి ఈ పాట పలకాలి మా నోట
తనవల్ల కావలసిన కర్మ పూర్తి కాగా
తన ఆయువు తల్లి కిచ్చి ధర్మమూర్తి వేగ
దేహాలయమును విడిచి దేవాలయమున నిలిచె
ఆలయ ఘంటారవమే ఆయన కంఠారవము
మా నాయన కంఠారవము ॥ఎ॥

ఏకోదరులము మనము శోకోదరులైన దినము
నిఖిల లోకములన్నీ నీరైపోయిన క్షణము
గగనాన తారలెన్నో కన్నీటిధారలన్ని
అవి అశ్రుతర్పణాలు ఇవి అక్షర దర్పణాలు ॥ఎ॥
వంటలు నాదును సాగె గంటలు కూడను మ్రోగె
తిండి తిన్నది ఎవరు ? తండ్రీ అని అనని దెవరు?
క్షణమే యుగమై పోయె జగమే సగమై పోయె
జరిగిపోయెను ద్రోహం జగతికి ఇది శోకాహం ॥ఎ॥



# నాగేశ్వరాలయము చారిత్రక ఆధ్యాత్మిక నేపథ్యము



శ్రీ పి.హైమానంద్, సత్తెనపల్లి

శివుని ఆజ్ఞ లేక చీమైనా కుట్టదు అనే సామెత ఉన్నది. జిల్లెళ్ళమూడిలో అమ్మ అనుజ్ఞ అనండి, ఆజ్ఞ అనండి, సంకల్పం అనండి దానికి ఏ పేరు పెట్టినా అమ్మ ఇచ్ఛతోనే ఏదైనా జరుగుతుందనేది అక్కడి అందరి సోదరీసోదరుల విశ్వాసం. ఎందుకంటే ప్రత్యక్షంగా పరోక్షంగా అమ్మ పరిపూర్ణ సార్వభౌమతను, లీలలను అనుభవించినవారు కనుక.

విష్ణుమూర్తి శేషశాయి, పరమేశ్వరుడు నాగాభరణుడు. దేవతలలో కూడా చాలమందికి గణేశుడు, సుబ్రహ్మణ్యుడు ఏదో రకంగా ఈ నాగములతో సంబంధం ఉన్నది అనిపిస్తున్నది.

అమ్మ జీవితంలో కూడా ఈ నాగానుబంధం బాగానే కనిపిస్తున్నది. అమ్మ పుట్టిన 21వ రోజున పెంచటానికి గొల్లనాగమ్మ తన ఇంటికి తీసుకొని పోతుంటే నాగేంద్రుడు ఎదురువచ్చి నాట్యం చేసి వెళ్ళాడు. అమ్మ తలపై నాగేంద్రుడు పడగబట్టి నట్లు చూచాడు మౌలాలీ. మస్తాను, మాధవాచార్యులు, పూజారి గారు కూడా నాగేంద్రుని దర్శనం చేశారు. చిదంబరరావుతాతగారిచే నాగులచవితి నాడు అమ్మ నాగేంద్రుని శిరసుపై చేయి పెట్టిస్తుంది. అదే సమయంలో అమ్మ తలపైకెక్కి భుజాలపైకి దూకాడు నాగేంద్రుడు. అధరాపురపు శేషగిరిరావు గారి కూతురు పద్మ జిల్లెళ్ళమూడిలో చూచింది. తంగిరాల రాధ కూడా అందరింటి వేదిక వెనుక బండ ఎత్తితే (ఒక వంద పాముపిల్లలు) కనిపిస్తే భయపడి ప్రక్కకు పోయాడు. అమ్మ పూజ జరుగుతుంటే చూడటానికి ఒక నాగేంద్రుడు వచ్చి పూజా పుష్పాల పళ్ళెం క్రిందకు వెళ్ళింది. అందరూ భయపడితే అమ్మ, "అదేం చేయదు. అది పూజ చూడటానికి వచ్చిందిలే" అన్నది. అన్నింటినీ మించి నాన్నగారి పేరు నాగేశ్వరుడే – నాన్నగారిని మరిడమ్మ తాతమ్మ 'నాగేంద్రా!' అని పిలిచేది. అమ్మ తనకు నాన్నగారే ఆధారమంటుంది. "ఆధారం ఆధారమైతే సర్వం సహస్రారమే" అంటుంది అమ్మ.

1941 లో అమ్మ, నాన్నగారు జిల్లెళ్ళమూడిలో అడుగు పెట్టారు. నాన్నగారున్న పూరిపాక ప్రక్కన ఒక రావి చెట్టున్నది. ఆ రావి చెట్టు దగ్గర ఒక పుట్ట ఏర్పడింది. ఆ పుట్టలో నుండి కాంతి బయటకు వస్తుండేది. అందులో నాగేంద్రుడు ఉండేవాడు. తొలిరోజులలో అంటే 1950 దశకంలో అమ్మ వద్దకు వచ్చేవారు ఏవైనా పండ్లు తెస్తే అమ్మ పుట్ట దగ్గరలో ఉన్న ఒక జాడీలో పెట్టేది. ఆ జాడీ క్రింది భాగంలో ఒక ప్రక్కన చిన్న పగులుండేది. ఆ పగులులో నుండి కాంతి బయటకు వస్తుండేది. ఆ జాడీలో నాగేంద్రుడుండేవాడు. నాన్నగారు పాకపైన ఉన్న తాటాకులు పోయి వెలుతురు అందులోంచి వస్తున్నదేమో అని దానిని కప్పించారు. అయినా ఆ కాంతి అలాగే వస్తుండేది. ఆ జాడీలోని చిన్న గిన్నెలో తేనె వంటి పదార్థం ఉండేది. అది అందరకూ ప్రసాదంగా ఇస్తుండేది అమ్మ. ఆ రావి చెట్టు దగ్గర ఉన్న పుట్టమట్టి ప్రసాదంగ అందరికీ పెట్టేది.

ఆ మట్టి సంవత్సరాల పర్యంతం సువాసనాభరితమై, మధురమై అమృతోపమానమైనది అనేది అందరూ అనుభవించారు. పూండ్ల నుండి మాణిక్యమ్మగారు వచ్చే సమయానికి ఒక రోజు అమ్మ



పైట చెరగులో ఒక పాము ఆడుకుంటున్నది. అది చూచి ఆమె భయపడగా రెడ్డి సుబ్బయ్య అది మామూలే భయపడవద్దు అని ఆమెకు సర్ది చెప్పాడు.

జిల్లెళ్ళమూడిలో సోదరుడు రామరాజు కృష్ణమూర్తి ధ్యానంలో ఉండగా ఒక కాంతి వెల్లువకనిపించింది. ఆ కాంతిలో నుండి ఒక 16 ఏళ్ళ బాలిక పైకి నడచి వచ్చినట్లనిపించింది. ఆ కాంతి, కాంతిలోని బాలిక కనిపించిన చోటనే నేడు హైమవతీ మహాదేవి ప్రతిష్ఠ కావింపబడిన ప్రదేశం.

అనసూయేశ్వరాలయం నిర్మాణం జరిగి ఆలయంపై మూతబండ వేసిన రోజున అమ్మ ఆలయంలోకి వెళ్ళుతుండగా కళ్ళు మిరిమట్లు గొలిపే కాంతి కనిపించింది. ఒక సూర్యుని కాంతినే తేరిపార చూడలేము మనం. సహస్ర సూర్యుల కాంతి కనిపిస్తే కళ్లు భరించలేవు. కళ్ళు మూసుకుంటాము. అలా దేదీప్య మానమైన కాంతి వెల్లువ ప్రసరించింది. అమ్మ ఆలయంలోనికి వెళ్ళి మన వైపు తిరిగి సింహాసనంలో కూర్చున్న తరువాత మాత్రమే అమ్మ మళ్ళీ మనకు కనిపించింది. పూజ చేసుకున్నాం.

చాలామంది గమనించే ఉంటారు. హైమవతీదేవి సిద్ధి పొందిన రోజున అమ్మ హైమను భూదేవి ఒడిలో భద్రపరచి ప్రాణప్రతిష్ఠ చేస్తుండగా ఒక్క క్షణం కరెంటు పోయి మళ్ళీ తిరిగి ఒక దివ్యకాంతి వచ్చినట్లు వచ్చింది. అలాగే నాన్నగారు సిద్ధి పొందినపుడు గూడా అదే సమయానికి కరెంటు పోవటం క్షణమాగి మళ్ళీ రావటం జరిగింది. ఇవన్నీ యాదృచ్ఛికం అని ఎవరన్నా అంటే అది వారి భ్రమ.

జిల్లెళ్ళమూడి ఒక మహాక్షేత్రం, పుణ్యక్షేత్రం. క్షేత్రం అంటే భూమి, క్షేత్రమంటే శరీరం. స్థూల సూక్ష్మ కారణ శరీరాలను తన నుంచి ప్రకాశింప చేసే అమ్మ క్షేత్ర స్వరూప. జిల్లెళ్ళమూడి అంటే సంస్కృతంలో అర్కపురి, అంటే సూర్యనగరం అన్నమాట. సూర్యపురం కాంతివంతంగా ఉండటంలో ఆశ్చర్యమేమున్నది. అమ్మ రెండు కన్నులు ఒకటిసూర్యుడు ఒకటి చంద్రుడు. సకల జీవుల స్వరూపాలు దేవీ స్వరూపాలే - అందువల్లనే క్షేత్రాలపై క్షేత్రజ్ఞుల ఆధిపత్యం వహించింది. కనుక క్షేత్రేశీ, క్షేత్రపాలిని అయి జిల్లెళ్ళమూడిని స్థానం చేసుకొన్నది. భౌతికంగా అమ్మ స్థానం ఏర్పరచుకున్న స్థలం నాగేశ్వరాలయం కాబోతున్నది. కాబోతున్నది అంటే ఇది వరకు కాలేదని కాదు. ఇప్పుడు మన కళ్లకు ఒక ఆలయంగా కనిపిస్తుందన్నమాట. అది కానిది ఏదీ లేదు అన్న అమ్మ మాట సర్వత్రా వర్తిస్తుంది. క్షేత్రము, క్షేత్రజ్ఞుడు అన్నీ అమ్మే. అయితే ఆ ఆలోచన పూర్తిగా నిలవని మనం ఒక రూపాన్ని ఏర్పాటు చేసుకుంటుంటాం.

ఆ క్షేత్రంలో ఆ ప్రదేశంలోనే "హోమశాల" వచ్చింది. ఒకప్పుడు నాన్నగారి పొగాకు బారన్ ఉండేది. కణ కణ మండే ఆ పొగాకు బారన్‌లోని అగ్నిలో అమ్మ మూడు రోజులున్నది. అమ్మ అన్ని తత్వాలను ఇముడ్చుకోగల సహస్రారం.

జిల్లెళ్ళమూడి క్షేత్ర శరీరంలో అమ్మకు మూలాధారమై స్వాధిష్ఠానంలో ఉన్న పృధివీ అగ్ని తత్వాలకు సంకేతమేమో! అనిపిస్తుంది నాగేశ్వరాలయం. నాగేంద్రుడు అగ్నితత్వమే - అందువల్లనే ఇక్కడ నాగేశ్వరాలయం వెలసింది. మనకందరికీ వెన్నుపాముంటుంది. అదే మన శరీరంలోని నరాలన్నింటికీ ఆధారం. మూలాధారం నుండి సహస్రారం దాకా ఉన్న గ్రంథులన్నీ ఆ వెన్నుపామును ఆధారం చేసుకొనే ఉన్నాయి. మణిపూర, అనాహతల స్థానంలో హైమాలయం ఉన్నది. అది వాయుతత్వానికీ సంకేతం. అందువల్లనే యోగనిష్ఠితమై వాయుతత్వాన్ని నియంత్రించి, వయోవస్థా వివర్జితయై నిత్యకన్యగా



కన్యాకుమారిగా సకలాభీష్టాలు తీరుస్తూ భక్తుల కొంగుబంగారంగా ఉన్నది. ఇక్కడ కొలిచిన వారికి, సంతతి కలుగుతుంది. కుజ, రాహు దోష నివారణవుతుంది. సర్వాభీష్టాలు నెరవేరుతవి.

విశుద్ధి, ఆజ్ఞాచక్రాల స్థానంలో అనసూయేశ్వ రాలయం ఉన్నది. ఆకాశతత్వాన్ని నియంత్రించి, మనోతత్వాన్ని ఆక్రమించి ఢాకినీ హాకినీ శక్తిని మిళితం చేసుకొని అర్ధనారీశ్వరంగా అనసూయేశ్వరునిగా దర్శనం ప్రసాదిస్తూ షోడశదళ పద్మంలో నిలచి సిద్ధమాతయై మన మనస్సులను నియంత్రిస్తున్నది.

దక్షిణం నుండి ఉత్తరానికి వరుసగా నాగేశ్వరా లయం, హైమాలయం, అనసూయేశ్వరాలయం. ఈ మూడింటినీ పాలిస్తున్న క్షేత్రపాలిక సహస్రారంలో నిలచిన శుద్ధచైతన్యశక్తి అమ్మ. ఈ మూడు ఆలయాలతో నవావరణలతో విలసిల్లే శ్రీ చక్రం జిల్లెళ్ళమూడి అయితే అందులోని బిందుస్థానం అమ్మ. శాంత స్వరూపిణి యైన విశ్వమాత.

ఇంత తెలిస్తేనే గాని నాగేశ్వరాలయ విశిష్టత తెలియదు. అందువల్లనే నాగేశ్వరాలయం ఒక చారిత్రక ఆధ్యాత్మిక నేపథ్యంతో అమ్మ అనుజ్ఞతోనే సర్వాంగ సుందరంగా ఏర్పాటవుతుంది.

దానికి బీజం - రావూరి ప్రసాద్ భార్యకు నిరంతరం తలనొప్పి తగ్గక అన్యధా శరణం నాస్తి అని అమ్మను ప్రార్థిస్తే నాగేశ్వర ప్రతిష్ఠ చేస్తానని మొక్కుకుంటే తగ్గిపోతుంది అన్నది. అలా మొక్కుకున్న తర్వాత తలనొప్పి తగ్గటం, హైమాలయంలో పూజారి కావటం, రావూరి ప్రసాద్‌ను వివాహమాడటం జరిగింది. వివాహమైన దగ్గర నుండి ప్రతి నాగులచవితికి రెండు మూడు రోజులు ముందు శేషుకే గాక ప్రసాద్‌కు కూడా నాగేంద్రుడు కలలో కనిపించటం జరిగేది. ప్రసాద్ శేషుకు చెప్పటం, తర్వాత చాలాకాలానికి ఈ రూపు దాల్చటం జరిగింది. తనే మొక్కించుకొని తనే ప్రతిష్ఠ చేయించుకున్నది అమ్మ.

ఒకసారి గోపాలన్నయ్య జిల్లెళ్ళమూడి క్రొత్తగా వస్తున్న రోజులలో ఒక రాత్రి మొదటి వరవ వద్ద కాలిబాటలో నక్షత్రాల కాంతిలో ఒక పొడుగాటి లావు పాము కనిపించి యెదురుగా నిలువెత్తునా లేచింది. పడగ విప్పింది. గోపాలన్నయ్యకు భయం కలుగలేదు. కాని ఆ నాగేంద్రుడు ఒక నిమిషం తర్వాత ప్రక్కగా వెళ్ళి పోయిం తర్వాత మాత్రం అమ్మ దగ్గరకు ఒక్క పరుగుతో వెళ్ళాడు. సర్వం తెలిసిన అమ్మ-గోపాలన్నయ్య రాగానే "భయపడ్డావా, నాన్నా!" అన్నది. ఇలా ఎందరికో దర్శనాలు కలుగుతూనే ఉన్నాయి. ఒక రోజు సోదరుడు రాచర్ల లక్ష్మీనారాయణ జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మ వద్ద కూచోగా అమ్మ, "నాన్నగారు కనపడ్డారా?" అన్నది లేదమ్మా! అన్నాడు. "వచ్చేటప్పుడు త్రోవలో ఏమీ చూడలేదా?" అన్నది. లేదమ్మా అన్నాడు. పామును చూడలేదురా అన్నది. చూచానమ్మా! పడగవిప్పిచూచి ప్రక్కగా పోయింది అన్నాడు. "అదే నాగేంద్రుడు. అదే నాన్నగారు, నాన్నా" అని చెప్పింది.

మొన్నటికి మొన్న రెడ్డి సుబ్బయ్య కుమారుడు సుధకు నాగేశ్వరాలయం వద్ద సూర్యోదయ సమయంలో ఒక నాగుపాము పడగవిప్పి నాగేంద్ర ప్రతిమపై కనిపించింది.

సోదరుడు వల్లూరు పాండురంగారావుకు కూడా అమ్మ హైమాలయానికి దగ్గరగా ఏదో ప్రతిష్ఠ చేయమని చెప్పింది. ఏమీ చేయమన్నదీ రంగారావుకు అవగాహన కాలేదు. తర్వాత అమ్మను అడిగితే తర్వాత చేయించు కుంటాలే ఇప్పుడు కాదులే అన్నది. ఆ తర్వాత పిల్లవాడు పుట్టటం నాగేశ్వరుని ప్రతిష్ఠించాలనీ అదీ నాన్నగారి ప్రతిరూపమనే భావనతో ప్రతిష్ఠ చేయటం అమ్మ ఇచ్చిన సంకేతమే.



"నేను గురువును కాదు, మీరు శిష్యులు కాదు. మీరంతా నా శిశువులే" అని చెప్పే అమ్మ సర్వమూ తానే కనుక అప్పుడప్పుడు గురువుగా ఏం చేయాలో చెప్పి చేయించుకుంటుంది. అసలు తల్లే కదా బిడ్డలకు మొదటి గురువు. గురువులలో గూఢుడు, దృఢుడు, ప్రీతుడు, మౌని, సకృత్ కామగతుడు అని అయిదు రకాలు ఉంటారు. ఆత్మ జ్ఞానసంపన్నుడై ఏకాంతంగా, ఎవరికి తెలియబడకుండా తన వద్దకు వచ్చినవారికి మాత్రమే తత్త్వాన్ని బోధించేవాడు గూఢుడు. జ్ఞానియై కూడ తృప్తిపడక సంచరిస్తూ పదిమందికీ తత్త్వబోధ చేసేవాడు ధృడుడు. సర్వసంగపరిత్యాగియై జగత్తంతా మాయాకల్పితమైన నాటకరంగమని భావించి తన నిర్వికల్ప సమాధిలో ఉంటూ మనస్సును పరమాత్మలో లయం చేసి అద్వైతామృతపానం చేస్తూ ధ్యానబలంతో శిష్యులను తరింప చేసేవాడు మౌని. సంకల్పసిద్ధుడై ఆశ్రితులను అఖండ జ్ఞానసంపన్నులను చేసేవాడు సకృత్ కామగతుడు.

ఆ అయిదు లక్షణాలు ఏకకాలంలో కలిగిన గురువులకు గురువు పరబ్రహ్మతత్వము అమ్మ. కొంతకాలం అజ్ఞాతంగా ఉండి తన వద్దకు వచ్చినా రాకపోయినా తన బిడ్డలుగానే భావిస్తూ, జ్ఞానమూర్తియై పరిమిత మమకారం మానవత్వమని, సర్వత్రా మమకారం మాధవత్వమనీ చెప్పి ఏదీ అంటకున్నా అన్నిటినీ అంటుకొని ఉండి, సంకల్ప వికల్పాలు మనస్సువేనని సహజ సమాధి స్థితిలో ఉంటూ, మంచీ చెడులు, పాపపుణ్యాలు అన్నీ ఆ చైతన్యానివేనని చెప్పి అందరికీ సుగతిని ప్రసాదించే మహత్తర మాతృతత్వ దీప్తి అమ్మ. ఆ అమ్మ సంకల్పమే నాగేశ్వరాలయం. ❖❖❖



అనసూయేశ్వరాలయ నిర్మాణదశలో ముఖద్వారంపై అమ్మ నాన్నగారు





# అమ్మ ప్రసాదించిన అనసూయేశ్వరాలయం



శ్రీ కొండముది రామకృష్ణ, అప్పికట్ల

లోకంలో అప్పుడప్పుడు వింతలు జరుగుతుంటాయి. ప్రకృతి వైపరీత్యాలు సంభవిస్తుంటాయి. ప్రళయాలు ప్రభవిస్తుంటాయి.

ఔషధాలు వ్యాధిగ్రస్తం కావచ్చును. అమృతానికి ఆయువు క్షీణించవచ్చును. సూర్యుడు చల్లబడవచ్చును, చంద్రుడు మంటలను విరజిమ్మవచ్చును.

వీటన్నిటికి కారణాలు ఉండవా? అంటే - ఉండి తీరతాయి. కానీ సామాన్య జనానికి పూర్వాపరాలు అవగాహన కాకపోవచ్చును. విధి నిర్ణయమయిన ప్రతిదానిలోనూ వ్యక్తా వ్యక్తమై అంతరార్థముంటుంది.

ఫిబ్రవరి 16వ తేదీన తెల్లవారుజామున షుమారు 3 గంటలకు అటువంటి విచిత్రమయిన దుర్ఘటన జిల్లెళ్ళమూడిలో జరిగింది.

సర్వసృష్టి స్థితి లయకారిణి, నిత్యసుమంగళి, నిత్యసువాసిని, పతివ్రతా శిరోమణి, పాతివ్రత్య స్వరూపిణి అయిన అమ్మకు పతిదేవులు, మనందరకు ప్రియతమమైన నాన్నగారు శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావు గారు అసువులు వీడారు.

మేము గమనించే లోపల, వైద్యులు చికిత్సా ప్రయత్నం చేసేలోపల సర్వం ముగిసింది. ఒక మెరుపు మెరిసినట్లు, ఒక పిడుగు పడ్డట్లు అంతా క్షణాల్లో జరిగిపోయింది. గుండెపోటు రావడమూ, ప్రాణాలను హరించడమూ రెండు క్రియలుగా జరగలేదు - దీపం మలగడమూ, చీకటి వ్యాపించడమూలాగా.

ఇది - నాన్నగారి నివాస భాగంలో జరిగింది. వెంటనే అమ్మ నివాస మందిరానికి పైకి పరుగెత్తాము. సర్వశుభంకరి అయిన అమ్మకు యీ దుర్వార్త నందించడం ఎలా? అందులో యిటీవల అమ్మ ప్రమాదకరమైన అనారోగ్యానికి గురై యింకా పూర్తిగా స్వస్థత పొందలేదు. అమ్మగుండె కూడా చాలా బలహీనంగా ఉందని వైద్యులు చెబుతున్నారు - అయినా అమ్మకు చెప్పకుండా ఎంతకాలం దాచగలం??

గుండెరాయి చేసుకుని, దుఃఖాన్ని దిగమ్రింగి - అమ్మ పాదాలు పట్టుకుని యీ హాలాహలాన్ని అమ్మ చెవులో పోశాము. అమ్మ ఒక్క లిప్తపాటు నిర్విణ్ణయై, నిశ్చేష్టయైనట్లు కనిపించింది. కానీ "వెంటనే నాన్నగారిని పైకి తీసుకుని రండి" అని ఆదేశించింది.

మేము గబగబా నాన్నగారిని పైకి తీసుకువచ్చి - అమ్మ మంచం పక్కనే మంచం వేసి ప్రక్క వేసి పడుకో బెట్టాము. అమ్మ తన మంచాన్ని నాన్నగారి మంచానికి ఆనుకునేటట్లు జరపమన్నది, జరిపాము.

మంచాలు రెండు తూర్పు - పడమరలుగా ఉన్నాయి. అమ్మ మంచం దక్షిణ దిక్కున, నాన్నగారి మంచం ఉత్తరపు దిక్కున ఉన్నాయి. అమ్మ తనమంచంపట్టెమీదకు జరిగి నాన్నగారివైపు తిరిగి తన కుడిచేతిని నాన్నగారి గుండెలపై ఉంచింది. అప్పుడు 11 గంటల వరకు అలాగే పడుకున్నది. చూసినవాళ్ళకు నాన్నగారు నిద్రపోతు న్నట్లున్నది. ముఖం తేజోవంతమై అతి ప్రశాంతంగా ఉంది.

అమ్మా, నాన్నగారలా ఒకరి సరసన ఒకరు పడుకుని ఉంటే అదోచూడ ముచ్చటయిన దృశ్యం అయింది. కానీ - అంతలోనే జరిగిన దారుణ సంఘటన తులుచుకుంటే ప్రతి ఒక్కరికీ గుండెలు బ్రద్దలవుతాయేమో నన్నంత దుఃఖతీవ్రత కలుగుతోంది.



ప్రాణోత్క్రమణం జరిగిందని డాక్టర్ ఇనజకుమారి ప్రకటించినప్పటికీ - మాకు డాక్టర్ మాటపై నమ్మకం లేకపోవడం, ఆమె తెలివి తేటలను శంకించడం కాదు కానీ, ఆప్రకటనను పూర్తిగా నమ్మటానికి మనస్సు అంగీకరించలేదు. అమ్మ శక్తిసామర్థ్యాలపై పరిపూర్ణమయిన విశ్వాసం కలవాళ్ళం కాబట్టి ఆ సంఘటన అలాగే సమాప్తం కాదని ఆశ. అమ్మ-తానెక్కిన కొమ్మను తానే నరుక్కుంటుందా - అని సందేహం. ఏదో క్షణంలో అమ్మ మహిమాతిశయ ప్రభావితులైన నాన్నగారిలో ప్రాణజ్యోతి తిరిగి ప్రభాసమానమవుతుందని నమ్మకం.

అమ్మను చూడడానికే మనసొప్పడం లేదు. ఇంత మందిని ఇన్ని కష్టాలనుండి గట్టెక్కించిన తల్లికే ఇంత కష్టమా? ఎందరి మంగళ సూత్రాలనో కాపాడిన సర్వమంగళకే అమంగళమా? ఆపదుద్ధారిణి ఐదవతనానికే ఆపదా? ఎందరి కన్నీటినో తుడిచిన కన్నతల్లియే కన్నీటి కడలిలో మునిగిపోతున్నదా? పరమేశ్వరి అయిన అమ్మ పసుపు కుంకుమలకే లోపమా?

కాదు - ఇలా జరగడానికి వీల్లేదు. ఈ అగాధం నుండి అమ్మ తన్ను తానే ఉద్ధరించుకోవాలి. ఉద్ధరించు కుంటుంది. అలా అమ్మను ప్రార్థించాలి.

ఈ సందేహ విశ్వాసాల ఉత్తుంగ తరంగాలతో సంక్షుభితమయ్యే కాసారంవలే మనస్సులు కల్లోలితంగా ఉండగానే - తెల్లవారింది.

అమ్మలో కదలిక లేదు. నాన్నగారిలో కదలిక లేదు, సర్వ ప్రకృతీ స్తంభించనట్లు అంతా నిశ్శబ్దంగానూ, నిర్జీవంగానూ ఉంది.

మా ఆశలు అడుగంటాయి. డాక్టరుగారి ప్రకటన నిజమైంది. మేము ఏమి చేయాలి?

ఎవరికీ బుద్ధి పనిచేయడంలేదు. ఎవరిని చూసినా కదలని బొమ్మలవలే కూలబడి పోయారు.

బంధువులకూ భక్తులకూ, అనుబంధం ఉన్న వాళ్ళందరికీ టెలిఫోన్లపై, యీవార్తను అందజేయక తప్పింది కాదు.

మధ్య మధ్యలో అంతరంగంలో ఒకరయితే, బహిరంగంగా మరొకరూ అమ్మను ప్రార్థిస్తూనే ఉన్నాము.

అమ్మలో ఉలుకూ పలుకూ లేదు. అలాగే పడుకున్నది. అంతా చైతన్యమే, జడమే లేదు - అనే అమ్మకు నాన్నగారిలో ప్రాణరాహిత్యమేమీ కనుపించ లేదేమో!

జడానికీ- చైతన్యానికీ భేదం చూసే మాలో క్షణక్షణానికీ అసహనం ప్రబలిపోతున్నది. దుఃఖం రెచ్చిపోతున్నది.

అమ్మను చూస్తే ఒక క్షణంలో జాలి కలుగుతున్నది. మరో క్షణంలో కోపం వస్తున్నది.

ఏమిటి అమ్మతత్వం? తన సంగతే తాను తెలుసుకోలేకుండా ఉన్నదా? మనపై రవ్వంత కరుణ కూడా లేదా? లేక మన మొరవినిపించడం లేదా? మన దుఃఖాగ్ని అమ్మ హృదయాన్ని కరిగించలేక పోతున్నదా?

ఉదయం 10 గంటలయ్యేసరికి - యీవార్త తెలిసిన జనం రావడం మొదలుపెట్టారు. 12 గంటలయ్యేసరికి చాలామంది వచ్చారు. ఆవరణమంతా శోకమగ్నమై పోయింది. మౌన రోదనమే. ప్రతిగుండె దుఃఖాగ్నిగుండమై పోయింది.

ఆ రోజున అక్కడ అమ్మసన్నిధిలో రెండు ఉపనయనాలు, ఒక వివాహం జరగవలసి ఉంది. జిల్లెళ్ళమూడిలో ఏ శుభకార్యం అయినా అమ్మచేతిమీదుగా జరగవలసిందే కదా! మరి,ఆసమయంలో నయినా అమ్మను అడిగితే లేచి వచ్చి ఆ శుభకార్యాన్ని తనచేతిమీదుగా జరిపించి వాళ్ళను హృదయపూర్వకంగానే ఆశీర్వ దించేదేమో! ఏమో,



ఏముందీ - తప్పక ఆశీర్వదించేది. కానీ - ఎవరు సాహసించగలరు?

వాళ్ళు వెనుదిరిగి వెళ్ళిపోయారు.

అయినా ఆవరణంలో ఎందరో క్రొత్తజనం, కళాశాల విద్యార్థినీ విద్యార్థులు, పెద్దలు, పిన్నలు...........

అన్నపూర్ణేశ్వరి అయిన అమ్మ సన్నిధిలో జనానికి పస్తులా? అది అమ్మకు తెలిస్తే సహిస్తుందా? అందువల్లనే అన్నపూర్ణాలయంలో యథావిధిగా గాడిపొయ్యి మండింది. దుఃఖాగ్నితో మరింతగా మండింది.

వంటలయినాయి, గంటలు మ్రోగాయి, అయితే ఎవరికి అన్నం సహిస్తుంది? ఎవరు తింటారు? వేదనాగ్నిని జయించిన జఠరాగ్ని ప్రజ్వరిల్లినవారు అన్నం తిని ఒక మంటయినా చల్లార్చుకొనగలిగారు.

ఒక్కరొక్కరు గ్రామస్తులు వచ్చారు. వారి ప్రియతమ నాయకుని కడసారి చూడడానికి తహతహలాడిపోయారు.

అమ్మ నాన్నగారి ప్రక్కనుండి లేస్తే - తలుపులు తీసి అందరికీ నాన్నగారిని చూసే అవకాశం ఏర్పాటు చేయాలని ఆలోచించాము. కానీ, అమ్మ నాన్నగారిని వదిలితేకదా? అమ్మను ఆ తన్మయస్థితినుండి ఎవరు విడదీస్తారు? ఎవరు విడదీయగలరు?

సాయంకాలం మూడు గంటలయింది. జనం దుఃఖానికి తట్టుకోలేకుండా ఉన్నారు. నాన్నగారిని చూడక నిలవలేకుండా ఉన్నారు. అప్పుడు అమ్మను అలాగే ఉంచి తలుపులు తీశాము.

ఇద్దరూ అలాగే నిశ్చేతనంగా పడుకుని ఉన్నారు, ఎవరిలో ప్రాణముందో - ఎవరిలో లేదో గూడా తెలీడంలేదు. నాన్నగారి ముఖంలో నిర్జీవకళా లేదు. అమ్మ ముఖంలో దుఃఖోద్విగ్నతా లేదు. ఇద్దరి ముఖాలూ తేజోమయమై ప్రశాంతంగా ఉన్నాయి.

దేవాలయానికి వెళ్ళి నమస్కారం చేసుకుని వచ్చినట్లు ఒక్కొక్కరూ నమస్కారం చేసుకుని తిరిగి వచ్చారు. ఎంతగానో శోకం పెల్లుబికి హాహాకారాలతో ఆవరణం ప్రతిధ్వనిస్తుందేమోనని భయపడ్డాం గానీ అలా జరగలేదు. అందరిలోనూ విచిత్రంగా ఒక రకమయిన నిర్లిప్తత ఆవరించింది. నాన్నగారెక్కడకూ పోలేదు, మనతోనే ఉన్నారు - అనే భావం కలిగి బలపడడం మొదలయింది.

నెల్లూరు డాక్టర్ శ్రీ సుబ్బారావుగారు, శ్రీమతి గజేంద్రమ్మ మొదలయిన కొంతమంది అమ్మ చెవి దగ్గరకు చేరి తమ ప్రార్థనలు తీవ్రంగా వినిపించారు. ఒక్కొక్కసారి నిష్ఠురోక్తులతో పోట్లాడారుగూడా. ప్రాణం పోగొట్టుకున్న అనేకులను అమ్మ పునర్జీవులను చేసిన సంగతిని అమ్మకు గుర్తుచేశారు. ఇది ఉపేక్షకు సమయం కాదన్నారు. ఇప్పుడు ఉపయోగపడకపోతే అమ్మ శక్తిసామర్థ్యాలు వ్యర్థమే నన్నారు.

లోగడ హైమవిషయంలోనూ యిలాగే జరిగింది. అప్పుడు మాత్రం అమ్మ జరిగిన దానిని ఏమి మార్చింది? ఏదయినా అమ్మకు తెలియకపోతేగదా - మనం చెప్పి చేయించగలగడం? దీనిని మరొకరు చేస్తేగదా - అమ్మ దీనిని ప్రతిఘటించడం, ప్రతిక్రియ జరపడం?

ఆరాత్రి, మరునాడు తెల్లవారి హైదరాబాద్, మద్రాసు, విశాఖపట్నం, విజయవాడ, మచిలీపట్నం, నెల్లూరు... పలు పట్నాల నుండి పల్లెలనుండి అనేకులు నాన్నగారి అంతిమ సందర్శనం కోసం వచ్చారు.

అమ్మ మాత్రం నాన్నగారిని వదిలిపెట్టలేదు. అమ్మ ఎప్పుడు వదిలిపెట్టింది కనుకా! ఒకసారి అమ్మ అన్నది - వారు నన్ను వదిలి పెట్టినా, నేను వారిని వదిలిపెట్టను - అని.

అమ్మ జీవితాన్ని పరిశీలిస్తే - అమ్మే నాన్నగారిని ఏరి కోరి పెండ్లి చేసుకున్నది. నాన్నగారు అమ్మకు



మేనత్త కొడుకే అయినా ఆ పెండ్లికి అనేక అవాంతరాలు వచ్చాయి. అమ్మ వాటన్నిటినీ అధిగమించి చివరకు 1936 మే 5వ తేదీన నాన్నగారిని పెండ్లి చేసుకున్నది.

పెండ్లి అయిన తర్వాత - అమ్మలో అతిమానవశక్తిని అంతకు పూర్వమే గమనించినవారు, అనేకులు అమ్మను ప్రశ్నించారు "అమ్మా - నీకీ పెండ్లి ఎందుకూ?" అని.

"ఎన్ని వచ్చినా వాటికీ మనసుకీ సంబంధం లేదని చెప్పడం కోసమే యీ పెళ్ళి" అనీ, "పెండ్లి లో పెద్దపులి ఉందని భయపడే వారి భయం పోగొట్టడం కోసమే యీ పెండ్లి" అనీ అమ్మ వివరించింది. "చేసేదంతా దైవసేవ అని భావించ గలిగితే - సంసారం ఆధ్యాత్మిక సాధనకు భంగకరం కా" దని ఉద్ఘాటించింది. "పతిని ఆధారంగా చేసుకుని పంచభూతాలను జయించిందే పతివ్రత", "సర్వాన్నీ స్వాధీనం చేసుకున్నదే సాధ్వి", "స్త్రీకి పతియే దైవం" అని ప్రవచించింది.

అమ్మ తన గళంలోని మంగళసూత్రాలను నాన్నగారి పవిత్ర పాదాలుగానే సంభావన చేసి నిత్యమూ అభిషేకిస్తుంది: ఆరాధిస్తుంది. ఆ మంగళసూత్రాలే తనకు అన్ని సూత్రాలనూ అవగతం చేశాయట. అనుదినము మంగళ సూత్రాలను అభిషేకించిన తీర్థం స్వీకరిస్తుంది. ఆ తీర్థమే అందరికీ తీర్థం చేసే అర్హతను తనకు ప్రసాదించిందట.

నిత్య జీవితంలో కూడా అమ్మ నాన్నగారిని అంటిపెట్టుకునే ఉన్నది, వెన్నంటే ఉన్నది - అని చెప్పడానికి నిదర్శనాలు కోకొల్లలుగా ఉన్నాయి. అటువంటి ఘట్టాలనేకం నాన్నగారే స్వయంగా వెల్లడించారు. నాన్నగారు ఏదయినా పనిమీద గ్రామాంతరం వెళ్ళినా అమ్మ అభౌతికంగా అదృశ్యంగా నాన్నగారి వెంటనే ఉండేదట. కొన్ని సమయాల్లో అమ్మ కంఠం వినిపించడమూ, అమ్మ గోచరించడమూ జరిగేది.

1954లో నాన్నగారు విజయవాడలో ఒక చోట కూర్చుని లేచి వెళ్ళుతూ - కూర్చున్నచోట తన సంచి మరిచిపోయి వెళుతుంటే..... అమ్మగొంతు వినిపించిందట. "సంచి మరచి వెళుతున్నారు, తీసుకోండి" అని. వెంటనే నాన్నగారు ఆ సంచీ తెచ్చుకున్నారు. ఆ సంచీలో అతి ముఖ్యమయిన కాగితాలు ఉన్నాయట.

1863లో నాన్నగారు మొక్కపాటులో చాలీచాలని నులక మంచంపై పడుకుంటే - జిల్లెళ్ళమూడిలో ఉన్న అమ్మ శ్రీమతి వసుంధర వాళ్ళతో ఆ విషయం చెప్పి సరయిన ఏర్పాటు చేయమని ఆదేశించింది.

1972లో నాన్నగారికి గుంటూరులో డాక్టర్ జె.వి.కృష్ణారావు గారి ఆసుపత్రిలో "ఆపరేషన్‌ను తిలకిస్తూ, ఆసమయంలో నీవు జిల్లెళ్ళమూడిలో యుండిననూ, నా చెంతనే ఉండగలవనియె నమ్మిక" అని వ్రాసుకున్నారు. మరి, అంతకు ముందు ఎన్ని సంఘటనలు ఆధారంగా నాన్నగారికి ఆ నమ్మిక ఏర్పడిందో! అమ్మ నాన్నగారిని అనేక ప్రమాదాల నుండీ, ప్రాణాపాయ స్థితులనుండీ కూడా కాపాడింది. ఒకసారి అలాగే ఒక బస్సు ప్రమాదం నుండి తప్పించింది. 1975లో నక్సలైట్లు జిల్లెళ్ళమూడి ఆశ్రమంపై దాడిచేసినప్పుడు - అంతకు కొద్ది నిమిషాలముందే నాన్నగారిని ఆస్థలం నుండి మరోచోటుకు పంపింది. లేనియెడల ఆనాడు నాన్నగారికి ప్రాణసంకటం యేర్పడి ఉండేది.

16వ తేదీ రాత్రి సోదరుడు రవి అమ్మవద్దకు వెళ్ళి కర్తవ్యోపదేశం కోరాడు. అప్పుడు అమ్మ తన సంకల్పాన్ని వివరించింది. 1956లో శంకుస్థాపన జరిగి నిర్మాణం కొంతవరకు అయి ఆగిపోయిన దేవాలయంలో నాన్నగారిని భూస్థాపన చేస్తానన్నది. అందుకు అవసరమయిన ఏర్పాట్లను చేయమని ఆదేశించింది.



"నాన్నగారు ఎక్కడకు వెళ్ళలేదు, వెళ్ళరు, మనతోనే మన మధ్యనే ఉంటా" - రని చెప్పింది. ఆ ప్రకటనతో చాలమందికి దుఃఖోపశమనం కలిగింది. అదీగాక అమ్మ - "సృష్టిలో సహజమయిన పరిణామం జరిగింది. ఎవరూ దుఃఖపడాల్సిన అవసరంలే" -దని ప్రకటించింది. దానితో అందరి కన్నీళ్ళు - ఎడారిలో వానవలె - యింకి పోయాయి.

లోగడ అనేకసార్లు అమ్మ "మరణమంటే పరిణామమే" అనీ "దేవుడు పంపిన మనిషి దేవుడు పిలిస్తే - వెళితే - మధ్యలో ఏడుపు మనకెందుకూ?" అనీ ప్రవచించింది కానీ - కేవలం తన గుండెపైననే పిడుగు పడ్డప్పుడుకూడా అమ్మ అలా నిర్వికారంగా అనుద్విగ్న మానసయై ఉంటుందని ఎవరూహించగలరు?

లోగడనే అమ్మ మరో మాటను కూడా అన్నది. ఎవరికైనా జబ్బుచేసినప్పుడు తనకూ ఆందోళనగా ఉంటుందట. మనిషి చనిపోయిన తర్వాత తనకు నిండుగా, పండగ్గా ఉంటుందట.

నిజమే - ఇతరుల మరణం అయితే, ఎన్ని కబుర్లయినా చెప్పవచ్చును. కేవలం తన భర్త, తాను ప్రాణాధికంగా ప్రేమించిన, తాను దేవుడని ఆరాధించిన పతి, తన జీవిత భాగస్వామి, తన సహచరుడు, తన సర్వస్వం శాశ్వతంగా తనకు దూరమైనప్పుడుకూడా ఎవరు ప్రశాంత చిత్తులై ప్రవర్తించ గలరు?

తాను, నాన్నగారు వేరుకాదన్న భావమే అందుకు కారణమేమో! 17వ తేదీ ఉదయం 11 గంటలకు అమ్మ నాన్నగారి వద్దనుండి లేచింది. స్నానంచేసి వస్తా నన్నది. ఈలోగా నాన్నగారి భూస్థాపనకు అవసరమయిన ఏర్పాట్లను చేయమన్నది. క్రితంరాత్రే అవసరమయిన ఉప్పు, విభూతి తెప్పించాము. దేవాలయ గర్భంలో అమ్మ సూచన ననుసరించి వామభాగంలో భూగృహాన్ని నిర్మించాము.

సరిగ్గా మధ్యాహ్నం 12 గంటలకు అమ్మ హైమాలయవేదికపైకి విచ్చేసింది. ఆప్రదేశమంతా షామియానాలతో, రంగుకాగితాలతో, మామిడి తోరణాలతో శోభాయమానంగా అలంకరించబడి ఉంది. మంగళ వాద్యాలు మ్రోగుతున్నాయి. అమ్మ సర్వాభరణ సంశోభితయై దివ్యదీధితుల వెలార్చుతూ ఉన్నది. విశాఖపట్నం సోదరులు అమ్మను పుష్పమాలాలంకృతను చేసి లలితా సహస్ర నామావళితో పూజించుకుని క్రొత్తగా ప్రచురించిన లలితాసహస్రనామ పుస్తకాలను సమర్పించారు.

తన పాదాలను పూజించే సమయంలో అమ్మ తన మంగళ సూత్రాలను ఎడంచేతిలో పెట్టుకుని కుడిచేత్తో పూజించింది. ఒక గ్లాసుతో నీళ్ళు తెప్పించి మంగళసూత్రాలను ఆనీటిలో కడిగి ఆ తీర్థాన్ని త్రాగింది.

అంతలో నాన్నగారి పార్థివ దేహాన్ని మంచంపైనే పడుకోబెట్టి తీసుకుని వచ్చారు. అమ్మ ఆదేశంతో నాన్నగారిని హైమాలయకుడ్యానికి ఆనించి తూర్పుదిశకు అభిముఖుల్నిచేసి ఆసీనుల్నిచేశాము. ఋత్విక్కులు అభిషేకరుద్రాలు పఠిస్తుండగా - గుమికూడిన జనం కన్ను లింతలు చేసుకుని చూస్తుండగా - అమ్మ నాన్నగారి తలకు నూనె రాచి, సీకాయతో తల రుద్ది, క్షీరాభిషేకం చేసింది. తర్వాత ప్రజలందరూ క్షీరనీరాలతో నాన్నగారిని అభిషేకించారు. పిమ్మట అమ్మ నాన్నగారిని మళ్ళీ పంచామృతాలతో అభిషేకించింది. శుద్ధోదకంతో స్నానం చేయించింది. పరిమళద్రవ్యాలు అలిమింది. నూతన వస్త్రాలు కట్టింది. నాన్నగారి నుదుట శైవ, వైష్ణవ, శాక్తేయ సంప్రదాయాలు ప్రతిఫలించే విధంగా - విభూతితో కుంకుమతో అలంకరించింది. నూతన యజ్ఞోపవీతం వేసింది. తాను కట్టుకునే పీతాంబరం కప్పింది. మెడలో పూలమాలలు వేసి దోసిళ్ళతో రంగురంగుల రకరకాల పూలు నాన్నగారి తలపై



కుమ్మరించింది. ఆ దృశ్యం చూస్తుంటే - అమ్మ పెండ్లి పీటలపై నుండి నాన్నగారికి తలంబ్రాలు పోస్తున్నట్లే ఉన్నది. మరి, ఆ ఉత్సాహమూ, సంరంభమూ అమ్మలో అలా కనిపించాయి.

అమ్మ నాన్నగారికి అభిషేకం చేస్తుండగా నాన్నగారి నాసికారంధ్రాలనుండి ఎఱ్ఱని రక్తం స్రవించింది. ఆ రక్తస్రావం చూసిన మేము అమ్మ నాన్నగారికి పునఃప్రాణ ప్రతిష్ఠచేసినట్లే భావించాము.

గమనార్హమయిన యింకొక విషయం జరిగింది. 16వ తేదీ నుండి17వ తేదీ ఉదయం 11గంటలవరకు అమ్మస్పర్శ ఉన్నంతవరకు నాన్నగారి దేహం పరిశుభ్రంగా ఉంది. అమ్మ స్నానానికి లోపలకు వెళ్ళిన క్షణం మొదలుకొని శిథిలం కావడం ఆరంభమైంది.

మధ్యాహ్నం గం3.00 ని,లకు అమ్మ నాన్నగారి దేహంతో పాటు గర్భాలయప్రవేశం చేసింది - ఋత్విక్కులు శ్రీసూక్త పురుషసూక్తాలూ, పృథ్వీసూక్తమూ, లలితా సహస్రనామావళి పఠించారు.

నాన్నగారి దేహం రబ్బరు బొమ్మవలె వంగగా- పద్మాసనంలో నాన్నగారిని భూగృహంలో ఆసీనులను చేయడం జరిగింది. క్రమేణా లవణ భస్మరాసుల్లో నాన్నగారిని అమ్మ ముంచేసింది. అప్పుడు తన కాలివేలి, చేతివేలి ఉంగరాలు, చేతి బంగారు గాజులు, చెవుల దుద్దులు, ముక్కు బులాకీ తీసి అందులో వేసింది. చివరకు తాను కట్టుకున్న చీరె, రవికెకూడా తీసి అందులో సమర్పించింది.

ఈ కార్యక్రమం జరిగే సరికి గం.3.40ని లయింది. పై విషయం మైకులో చెప్పబడగానే - శ్రోత లందరూ ఒక్క సారిగ భయాందోళిత మనస్కులైనారు - అమ్మను నిరలంకారగా దర్శించడం ఎలాగునా - అని. కానీ మనందరి అదృష్టం కొద్దీ అమ్మ మళ్ళీ సర్వాభరణ భూషిత అయి, పట్టుచీరె కట్టుకుని దరస్మిత వదనయై బయటకు వచ్చి అందరి హృదయాల్లోనూ శాంతి సుధలను వర్షించింది.

అదొక విచిత్రమైన ఆసక్తికరమైన విషయం. తన జన్మనక్షత్రమయిన పునర్వసులో నాన్నగారు మానవదేహాన్ని వదిలి- అమ్మ జన్మనక్షత్రమైన ఆశ్లేషానక్షత్రంలో అనసూయేశ్వరులై ఆవిర్భవించారు. ఆలయానికి అమ్మ అనసూయేశ్వరాలయమని నామకరణం చేసింది.

ఆ మరునాటినుండి 11రోజులు ఆలయంలో ఉదయం 11 మంది ఋత్విక్కులతో మహాన్యాసపూర్వకంగా మహారుద్రాభిషేకమూ, సాయంకాలం, లలితా లక్షనామ పూజ చేయడంకోసం నిర్ణయమైంది.

18వ తేదీ ఉదయం ఆలయంలో నిత్యపూజను అమ్మ స్వయంగా ప్రారంభించింది, అక్కడ అఖండ దీపారాధన చేసింది. అభిషేకాన్ని ప్రారంభించింది. సాయంకాలంకూడా పూజలో స్వయంగా పాల్గొని నివేదన, నివాళి తానే యిచ్చింది.

ఈ విధంగా అమ్మ పూజచేయడం యిదే మొదటిసారి కావచ్చు.

28వ తేదీవరకు ఆలయంలో నిత్యాభిషేకాలు, పూజలు సోదరులు సుబ్బారావు, రవి చేసుకున్నారు. శ్రీ అన్నపర్తి కృష్ణశర్మ ప్రధాన ఋత్విక్కుగా వ్యవహరించి అత్యంత సమర్థంగా క్రతువును నిర్వహించారు. వారికి స్థానిక కళాశాల అధ్యాపకులూ, విద్యార్థులూ పూర్తిగా సహకరించారు.

28వ తేదీన గ్రామంలో నాన్నగారి చిత్రపటానికి వైభవోపేతంగా ఊరేగింపు జరిగింది. ఉదయం 5 గంటలనుండి 9 గంటలవరకు మహారుద్రాభిషేకం జరిగింది. ఉదయం 9 గంటల నుండి సాయంత్రం 7 గంటల వరకు లలితా నామపారాయణ జరిగింది.



అందులో మొత్తం 250మంది పాల్గొన్నారు, మొత్తం 13రోజుల్లోను నాన్నగారి వయస్సు 68 సంవత్సరాలు కాబట్టి 68 లక్షల నామపారాయణం జరగడం విశేషం.

ఆ సాయంకాలం సభ జరిగింది. అందులో ప్రధానవక్త శ్రీ శ్రీ శ్రీ లక్ష్మణ యతీంద్రులవారు. వారు అమ్మనాన్నగార్లు ఒక్క శక్తియే ననీ, ఆశక్తి లోకంలో నష్టమై భ్రష్టమైపోతున్న దాంపత్య ధర్మాన్ని పునరుద్ధరించడంకోసం, భార్యయెడల భర్త, భర్త యెడల భార్య ఎలా నడుచుకోవాలో లోకానికి పాఠం చెప్పడంకోసమే దిగి వచ్చిందనీ వివరించారు.

నిజమే – నాన్నగారంటే అమ్మకు సాక్షాత్తూ దైవమే. ఆ విషయాన్ని అనేకపర్యాయాలు ప్రకటించింది. జీవితంలో ఆచరణలో చూపెట్టింది. నాన్నగారికీ, అమ్మంటే ఎనలేని గౌరవం. నాన్నగారి దృక్పథంలో అమ్మ దేవతయే. నాన్నగారు అమ్మను ధ్యేయంగా పెట్టుకుని జపమూ, ధ్యానమూ కూడా కొన్నాళ్ళు చేసుకున్నారు.

అమ్మ అలౌకిక శక్తులను అనేకం నాన్నగారు స్వయంగా దర్శించారు. అమ్మ పొందిన యోగపరాకాష్ఠ స్థితులయిన భ్రూకుటీ విభేదనం, కపాలభేదనం నాన్నగారు చూశారు. ఒకనాడు అమ్మ నాన్నగారికి అన్నం వడ్డిస్తుండగా భ్రుకుటీ భేదనం జరిగి రక్తం స్రవించిందట. ఆ రక్తం నాన్నగారి విస్తట్లో పడకుండా అమ్మ చెయ్యిపట్టింది. చేతిలో రక్తం భస్మంగా మారింది. ఆ భస్మాన్ని అమ్మ నాన్నగారికి పెట్టింది. నాన్నగారు దానిని తిన్నారు. ఈ విశేషం నాన్నగారు అనేక పర్యాయాలు అతి సంభ్రమాశ్చర్యాలతో చెప్పారు. అమ్మ అతిమానవ సహనశక్తి గురించికూడా నాన్నగారు అనేక సంఘటనలు వివరించేవారు. అవసరమయితే అమ్మ ఎంత బాధనయినా – చొక్కాను చిలక కొయ్యకు తగిలించినట్లు – తీసివేసుకొనగలదని చెప్పేవారు. ఇతరుల ఎంత బాధనయినా అమ్మ కేవలం తన స్పర్శతో నివారించగలదని నాన్నగారికి పూర్ణమయిన విశ్వాసం. అందుకే నాన్నగారికి ఎంత చిన్న జ్వరం వచ్చినా – తన చెయ్యి అమ్మకు అందించి నాడి చూడమనేవారు. అమ్మ ఆశీర్వచనంలో నాన్నగారికి అచంచలమయిన నమ్మిక. నాన్నగారు ఏపని చేస్తున్నా ముందు అమ్మకి చెప్పి అనుమతి పొందేవారు. ఎక్కడకు వెళుతున్నా ముందు అమ్మచేత బొట్టు పెట్టించుకునేవారు.

ఇటీవల నాన్నగారికి నిరంతరం అమ్మధ్యాసయే. అమ్మ ఆరోగ్యాన్ని గురించిన ఆందోళనయే. అమ్మమాటల ప్రకారం – ధ్యాసంటే ధ్యానమూ, ఆందోళనంటే ఆరాధనేగా!.

అమ్మా – నాన్నగార్లు పరస్పర అవగాహనతో, అనురాగంతో, ఆరాధనతో లోకంలో ఆదర్శ దంపతులైనారు. భర్త అంటే శరీరం కాదు, భావన – అన్నది అమ్మ. నాన్నగారి స్మరణ ఎప్పుడూ ఉన్నది అమ్మకు. ఒకసారి ఏదో ఆలోచిస్తున్న అమ్మతో – పరధ్యానంగా ఉన్నావమ్మా – అంటే – “పరధ్యానం కాదు, నాన్నా, పతిధ్యానం” – అన్నది.

భర్తను గురించిన సజీవ భావన, నిరంతరస్మరణ ఉన్న స్త్రీ ఏనాటికీ భర్తృవిహీన – కాదని అమ్మ అభిప్రాయం. అందుకనే అమ్మ సుమంగళీ చిహ్నాలను వేటినీ విసర్జించలేదు.

ఈ విధంగా అమ్మ మహిళాలోకంలో ఒక మహావిప్లవానికి ఒరవడి పెట్టిందేమో – ననిపిస్తుంది.

ఒకప్పుడు స్త్రీకి సహగమనం సంప్రదాయం. ఎలాగో స్త్రీ ఆ అగ్నిగుండం నుండి బయటపడ్డది. స్త్రీకి మరణంకంటే కూడా బాధా కరమయినది– మంగళ చిహ్నాలను విసర్జించడం.

అమ్మ – స్త్రీకి ఆ అవస్థను తప్పించదలచు కున్నదేమో – ఉత్తమమయిన భార్యగా, తల్లిగా ఎలా నడుచుకోవాలో స్త్రీ లోకానికి ఆదర్శమయిన అమ్మ



యీవిధంగా కూడా స్త్రీకి మహోపకారం చేసింది. మహాత్ములు ఏమి చేసినా లోకసంగ్రహార్ధమేగదా! అందుకు వారు విమర్శలకు గురికావచ్చును, హింసలకు గురికావచ్చును.

హైమ విషయంలో "నేనే కన్నాను, నేనే పెంచాను, నేనే చంపాను, నేనే దైవత్వం యిచ్చాను" అని ప్రకటించిన అమ్మ వాక్యాలే నాన్నగారి విషయంలోనూ స్మరణకు వస్తున్నాయి.

నాన్నగారిని ఆధారం చేసుకునే అమ్మ పాతివ్రత్య శిఖరాగ్రం అధిరోహించినప్పటికీ - అమ్మలో మాతృత్వమూ, దైవత్వమూ సాక్షాత్కరింపజేసుకునే నాన్నగారు అమరులై అర్చామూర్తులయినారు.

కన్నీటిధారలనుండి దివ్యవిద్యుత్‌ను సృష్టించి అఖండజ్యోతిని వెలిగించింది. శోక సముద్రంనుండి అమృత కలశాన్ని వెలికితీసింది. వైపరీత్యంనుండి అనంతవైభవానికి శ్రీకారం చుట్టింది. రాలిన పువ్వు నుండి ఒక దివ్యఫలాన్ని రూపొందించింది. ప్రళయంనుంచి నూతన సృష్టిని చేసింది. హాహాకారంనుండి ఓంకారాన్ని వినిపింపజేసింది అమ్మ.

అదే అమ్మ అఖిలలోకానికి అందజేసిన అసాధారణ ప్రసాదమూ, అనితరసాధ్యమయిన ప్రాసాదమూ- అనసూయేశ్వరాలయం.





భాస్కరన్నయ్య కుమారుని పుట్టు వెంట్రుకలను తీసే సందర్భంగా దీవిస్తున్న అమ్మ నాన్నగారు





# నాన్నగారి తీపి జ్ఞాపకాలు



- శ్రీ రావూరి ప్రసాద్, జిల్లెళ్ళమూడి

1959 పూర్వార్థంలో అనుకోని పరిస్థితులలో నా కన్నతల్లి, నా తోబుట్టువులతో నేను మొదటిసారి జిల్లెళ్ళమూడి వచ్చాను. అపుడు నా వయస్సు ఎనిమిదేళ్లు. నాటి నుండి మా కుటుంబ సభ్యులంతా జిల్లెళ్ళమూడి తరచు వస్తూండేవారం. నా తల్లిదండ్రులు సంవత్సరంలో ఎక్కువరోజులు అమ్మ సన్నిధిలో అమ్మసేవలో ఉండేవారు. మా స్వగ్రామము చెరుకూరు. అది జిల్లెళ్ళమూడికి 7, 8 మైళ్ళ దూరాన ఉంది.

ఒకసారి సెలవుల్లో జిల్లెళ్ళమూడి వచ్చాను. Ball Badminton doubles ఆడుతున్నారు. ఆ నలుగురి ఆటగాళ్లలో ఒక పెద్దాయన పంచె బిగించి కట్టుకొని ఉన్నారు. నేను వేడుకగా నిలబడి తదేకంగా చూస్తున్నాను. ఆట మధ్యలో బంతి దూరంగా వెళ్ళి ముళ్ళపొదల్లో చిక్కుకుంది. అంతా చూస్తూ నిలబడి ఉన్నారు. నన్ను పిలిచి ఆ పెద్దాయన 'ఎవరబ్బాయివిరా' అని అడిగారు. 'చెరుకూరు నరసింహమూర్తి గారి అబ్బాయి నండీ' అన్నాను. 'అయితే మనవాడివేగా ! కాస్త ఆ బంతి వెతికి తీయరా!' అన్నారు. బంతి తీసి వారికిచ్చా. మళ్ళీ ఆట మొదలైంది. శింగుపాలెం తాతయ్యగారబ్బాయి సోమశేఖరం నా స్నేహితుడు. వాడు అక్కడ కనబడితే 'ఆ పెద్దాయన ఎవరు ?' అని అడిగా. 'అదేమిటి? నీకు తెలియదా ? అమ్మ భర్త. నాన్నగారు' అని చెప్పాడు. అంతకు ముందు వారిని చూచాను. ఆయన ఎవరూ అనే ఆలోచన చేయలేదు. వారు ఫలానా అని నాకు ఎవరైనా చెప్పే సందర్భంగానీ కలగలేదు ! అమ్మ సాక్షాత్తు దేవతగా అందరిచే పూజలందుకుంటుంటే, ఈయనేమిటి ఇంత సామాన్యంగా ఉన్నారు ? అనిపించింది.

1962 సంవత్సరము అని గుర్తు. అందరింటి నిర్మాణం కోసం లోతుగా పునాదులు తవ్వారు. ఆ రోజుల్లో అందరింటి అక్కయ్యలు అన్నయ్యలతో పాటు నిత్యం అమ్మను దర్శించుకునేందుకు వచ్చిన సోదరీసోదరులు కూడా స్వచ్ఛందంగా శ్రమించేవారు. కూలీల్ని పెట్టలేదు, నేటి పిల్లర్స్ కట్టడాలు నాటికి మొదలుకాలేదు. పెద్దవారంతా పనుల్లో పాల్గొంటే పిల్లలందరం పునాదుల ప్రక్కనే ఆడుకొంటున్నాం. మా ఆటలో పేచీ వచ్చింది. సాగర్ అన్నగారి కుమార్తెలు ఝాన్సీ లేక హైమ కావచ్చు. కోపంతో చేత్తో నెట్టాను. ఆ అమ్మాయి పునాది గోతిలో పడింది. పెద్దగా ఏడ్చింది. నాకు భయం వేసింది. ఇదంతా నాన్నగారు చూస్తున్నారు. ఆయనకి బాగా కోపం వచ్చింది. ఒక బెత్తం తీసుకొని 'ఆడపిల్లని పునాదుల్లోకి నెడతావ్రా! వెధవా !' అంటూ నన్ను దండించటానికి వెంటపడ్డారు. కానీ నేను ఆయనకు చిక్కలా. చివరకు ఆయన ఒక చోట నిలబడి 'ఇంకొకసారి ఆడపిల్ల జోలికి వస్తే నీ ఒళ్ళు చీరేస్తా! వెధవా' అంటూ హెచ్చరించారు.

నాన్నగారికి పౌరాణిక నాటకాలన్నా, పద్యగానం అన్నా ఎంతో ఇష్టం; తరచు ఆ పద్యాలను పాడుకునేవారు. అందు విశేషానుభవం గల శ్రీ బెండపూడి యోగయ్యగార్ని, నా తండ్రి శ్రీ రావూరి నరసింహం గార్ని, హార్మోనియం విద్వాంసుడు రాధ అన్నయ్య ఒకచోట చేర్చి నాన్నగారు పద్యాల కచేరి ఏర్పాటు చేసేవారు. నాన్నగారితో సహా అందరూ పోటీపడి పద్యాలను ఆలపిస్తూండేవారు కొన్ని గంటలు. అమ్మ కూడా వచ్చి విని ఆనందించేది. అమ్మ నాన్నగార్ల చెంత కూర్చుని పాడేవారూ, వినేవారూ అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందేవారు. ఎప్పుడైనా నాన్నగారు ఆరుబయట మంచంపై పడుకొని పెద్దగా పద్యాలు పాడేవారు. వారు



పాడటం విని అమ్మ తన ప్రక్కనున్న వారితో నాన్నగార్కి జ్వరం వచ్చినట్లున్నదని, టెంపరేచర్ చూసి ఫలానా హోమియో మందు వేయమని చెప్పేది. ఆయన హుషారుగా పద్యాలు పాడుకుంటుంటే అమ్మ జ్వరం వచ్చిందని అంటున్నదేమిటని మాకు ఆశ్చర్యం వేసేది. కానీ అది నిజం. జ్వరం చూసి మందు వేసేవాళ్ళం; అది తగ్గేది. చిత్రంగా ఉన్నది కదా !

అమ్మను దర్శించుకునేందుకు వందలు, వేలమంది యాత్రికులు వచ్చేవారు. రాత్రి, పగలు అనక నిర్విరామంగా భోజనాలు చేస్తూండేవారు, అమ్మ దర్శనం చేసుకునేవారు. సంస్థ కార్యక్రమాలు ముమ్మరమైనాయి. ఇన్ని, ఎన్ని జరిగినా నాన్నగారు మాత్రం నిరాడంబరంగా ఉండేవారు. నరసరావుపేట పడక కుర్చీలో కూర్చుని గ్రామకరణంగా, పోస్టుమాస్టరుగా ప్రజల సేవాకార్యక్రమాలను నిర్వహించేవారు, మనలో ఒకరిగా ఆనందించేవారు.

జిల్లెళ్ళమూడి చరిత్రలో నాన్నగారి స్థానం చాల ప్రత్యేకమైనది. ఈ ప్రపంచానికి ఆరాధ్యదేవత అయిన అమ్మ తనకు ఆధారం, ఆరాధ్యదైవం నాన్నగారేనని ప్రకటించింది. తను ఏమి సంకల్పించినా ముందుగా నాన్నగారి పాదాలకు నమస్కరించి వారి అనుమతితోనే ఏ కార్యక్రమానికైనా శ్రీకారం చుట్టేది. నాన్నగారు మాత్రం తనకు ఒక గుర్తింపు, ప్రత్యేకస్థానం కావాలని ఏనాడూ కోరుకోలేదు. అందుకు ఎవరైనా ప్రయత్నించినా సున్నితంగా తిరస్కరించేవారు.

1970 ఆగష్టు నుంచి సంస్థ సేవాకార్యక్రమాల్లో పాల్గొంటూ మా కుటుంబ సభ్యులంతా అమ్మ సన్నిధిలోనే ఉండేవాళ్ళం. మాతృశ్రీ స్పోర్ట్స్ అండ్ కల్చరల్ లీగ్ పేరిట ఆటల పోటీలు నిర్వహించే వాళ్ళు. ఒకనాటి క్రికెట్ మాచ్‌లో స్థానికులు, స్థానికేతరులు ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారు. దానికి అమ్మ స్వయంగా వచ్చి తిలకించింది. ఆ రోజు నాన్నగారు ఖద్దరు లాల్చీ వేసుకుని, పంచె బిగించి యువకునిలా బౌలింగ్, బ్యాటింగ్ చేసి అందరికీ ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని, ఉల్లాసాన్ని కలిగించారు. ఇక అమ్మ ఆనందానికి అవధులు లేవు. ఆటలన్నీ నాన్నగార్కి ఇష్టమే. అయినా బాల్‌బాడ్మింటన్ అంటే అమితమైన ప్రేమ, ఇష్టం. తాను గెలవాలని పట్టుదలగా ఆడేవారు. తాను ఓడిపోవటానికి ప్రత్యర్థికి ఏ పరిస్థితిలోనూ అవకాశం ఇచ్చేవారు కాదు. నా మీద వాత్సల్యంతో 'ఏరా ! వరప్రసాదం' అని పిలిచేవారు. Badminton ఆటలో ఆయన Back ఆడేవారు, వారి partner గా నేను Front ఆడేవాడిని. 'మా వరప్రసాదం కొడితే ఇక తిరుగుండదు' అని మురిసిపోయేవారు. ఎవరు బాగా ఆడినా వారి ఆటను ప్రశంసించేవారు, ప్రోత్సహించేవారు. అదే Sportive Spirit.

నాన్నగార్కి కాంగ్రెస్ పార్టీ అంటే చాల ఇష్టం. గాంధీ, నెహ్రూ కుటుంబాల త్యాగనిరతిని కొనియాడేవారు. ఎవరైనా వాళ్ళని విమర్శిస్తే సహించేవారు కాదు.కాగా 1977 సాధారణ ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ ఘోర పరాజయాన్ని రుచి చూసింది. ఈ ఫలితాలు విని నాన్నగారు తట్టుకోలేరేమో అని అంతా భయపడ్డాం. కానీ ఆయన ఎప్పటిలాగే చిరునవ్వుతో మమ్మల్ని పలకరించారు. ధీరోదాత్తులు వారు. ఆయన ఇష్టా యిష్టాలతో నిమిత్తం లేకుండా 'మీ అభిప్రాయాల్ని మీరు వెలిబుచ్చండి. బిడియపడవద్దు' అంటూ ఎదుటివ్యక్తిని గౌరవిస్తూ ఉండేవారు; కానీ వారి స్వతంత్ర భావాలను విశ్వసించి ఆంతరంగికంగా రాజీపడేవారు కాదు.

ఒకసారి అంధసోదరుడు శిరిగిరి సుబ్బారావు, నేనూ గదిలో తెల్లవారుఝామున 4 గంటలకు శృతి పెట్టె సహాయంతో సరళీస్వరస్థానాలు వివిధ స్థాయిల్లో సాధన చేస్తున్నాం. మనిషి అలికిడి అనిపించి తలుపుతీశాను. ఎదురుగా నాన్నగారు. ఆశ్చర్యంతో



లోపలికి సాదరంగా ఆహ్వానించాను. "మీ గొంతులు విని వచ్చాను. మీ సాధన నన్ను ఇక్కడికి రప్పించింది. ఒరేయ్, వరప్రసాదం! నువ్వు అచ్చు గ్రామఫోను రికార్డులా పాడుతున్నావురా" అంటూ వారి అనురాగభరిత శుభాశీస్సుల్ని అందించారు.

1980 లో అమ్మకి తీవ్ర అనారోగ్యం చేసింది. వైద్యం నిమిత్తం హైదరాబాద్‌లో సో|| శ్రీ టి.రాజగోపాలచారింట్లో ఉంది. ఎందరో సోదరీసోదరులు ఆందోళనతో వందల సంఖ్యలో వస్తుండేవారు. వైద్యులు ఎన్నో పరీక్షలు చేశారు, మందులు వాడారు. ప్రయోజనం లేకపోయింది. దీని ప్రభావం నాన్నగారి మీద చూపింది. ఎప్పుడు ? ఎలా ? ఏమిటో ! అనే ఆందోళనతో నాన్నగారు చిక్కిపోయారు. ఒకసారి అమ్మతో ఆయన ఏకాంతంగా 1,2 సార్లు మాట్లాడారు. మర్నాటి నుంచీ అమ్మ ఆరోగ్యం మెరుగైంది. అకస్మాత్తుగా గణనీయమైన మార్పు చోటుచేసుకుంది. ఈ సంతోష సమాచారం అందరినీ పరమానందభరితుల్ని చేసింది. సంతోషంతో అమ్మ దర్శనార్థం వందలాది సోదరీ సోదరులు హుటాహుటిన వచ్చి చేరారు. అమ్మ, నాన్నగారు హాలులో ఒక మంచం మీద ఆసీనులై ఉన్నారు. హాలులో, ఇంటి ఆవరణలో, రోడ్డుమీద జనం క్రిక్కిరిసి ఉన్నారు.

ఆ సమయంలో ప్రక్కప్రక్కనే కూర్చొని ఉన్న అమ్మ నాన్నగార్లకి నమస్కరించుకోవాలనే కోరిక నాలో ఉప్పెనలా ఉవ్వెత్తున లేచింది. అందుకు ఏ మాత్రం అవకాశం లేదు. ఏం చేయాలో తెలియదు. ఎవరితో చెప్పుకోను ? ఎవరిని ఆశ్రయించను ? అని మథనపడుతున్నాను. ఉన్నట్టుండి నాన్నగారు 'ఒరేయ్ ! ఇటు రారా !' అని పిలిచారు. నేను బిత్తరపోయాను. జనం ప్రక్కకు తొలగి,దారి ఇచ్చారు. 'ఇక దణ్ణం పెట్టుకో' అన్నట్లు నాన్నగారు తన పాదాలు, అమ్మ పాదాల వంక చేత్తో చూపించారు. నా కళ్లలో నీళ్ళు సుళ్ళు తిరుగుతుండగా మనసారా జననీ జనకుల శ్రీ చరణాలకు ప్రణమిల్లాను. నాన్నగారు ప్రేమగా నా వీపు తట్టారు. నా మనస్సులోని కోరిక నాన్నగారికి ఎలా తెలిసింది?

అమ్మ - నాన్నగారు ఒక నాణానికి బొమ్మ బొరుసులా? వ్యక్తావ్యక్త ద్వైతాద్వైత స్వరూపాలా ? మన జ్ఞానానికి మేధకి అందేది కాదు. హైదరాబాద్ నుంచి తిరిగి వచ్చిన తర్వాత అందరింటి వాసులకి అమ్మ ఒక సూచన చేసింది - అందరూ కలిసి అన్నపూర్ణాలయంలోనే భోజనం చేయాలి - అని, వేరుకుంపటి వద్దు అని. మధురమైన అమ్మ కోరికను ముందు నాన్నగారు ఆచరణలో చూపించారు. ఏ నియమాలూ, నిబంధనలూ నాన్నగారికి వర్తించవు. అయినా అన్నపూర్ణాలయం గంట మ్రోగగానే అందరింటి పెద్దగా, ఆదర్శవంతంగా తన కంచం, గ్లాసు తెచ్చుకుని అందరితో పాటు సహపంక్తిభోజనం చేసేవారు. చుట్టూ పడ్డ ఎంగిలి మెతుకులను ఎత్తి, శుభ్రం చేసి వారి కంచాన్ని వారే తీసి వేసేవారు. వారు చూపిన విశిష్టమార్గాన్ని అందరూ అనుసరించారు. సాయంత్రం 4 గంటలకు మామూలుగా Badminton ఆడేవారు ఖుషీగా.

1981, ఫిబ్రవరి 16వ తేదీ రాత్రి జిల్లెళ్ళమూడి చరిత్రలో అంధకారం, హాహాకారం అలుముకున్నది. ఆవేళ వస్తువు లేని నీడ, అర్థం లేని శబ్దం అయింది. నాన్నగారు శరీర త్యాగం చేశారు. నా గుండెల్లో రాయి పడింది, అణువణువూ ఒణికింది, కాళ్ళు చేతులు చల్లబడ్డాయి. అమ్మను తలచుకుంటే దుఃఖం ముంచుకు వస్తోంది. ఎందరికో ప్రాణదానం చేసిన సర్వశక్తి స్వరూపిణి, సౌభాగ్యదేవత అమ్మ. తన ప్రాణనాథుని విషయంలో కాలస్వరూపిణిగా లయకారిణిగా రూపుదాల్చిందే ! ఇక నాబోటి అల్పుడెంత ? కొండంత అమ్మ కోరి అండగ ఉన్నదనే విశ్వాసం దూదిపింజలా ఆ ఘోరవిపత్తు అనే పెనుగాలికి కొట్టుకుపోతున్నట్లు కలవరపడ్డాను. నా గదిలో ట్యూబ్‌లైట్ వైపు చూస్తూ



దారుణమానసిక సంఘర్షణతో సతమతమౌతున్నాను. అకస్మాతుగా ట్యూబ్‌లైట్ వెలుగు మాయం అయింది. నక్షత్రాల కాంతులు, పాలపుంతల వెలుగులు ఆ స్థానంలో నా ముందు ప్రత్యక్షమయ్యాయి. ఆ కాంతి ప్రవాహంలో నల్లని ఆకృతిలో ఐదుతలల నాగేంద్రుడు పడగలు విప్పి చుట్టు చుట్టుకొని భూమి నుండి దిగంతాలవైపు వేగంగా దూసుకు వెళ్ళటం కనిపించింది. నాలుగు దిక్కుల నుండి గంభీరస్వరం మేఘగర్జనవలె 'ప్రతిష్ఠ జరగాలి', 'ప్రతిష్ఠ జరగాలి', 'ప్రతిష్ఠ జరగాలి' అంటూ ముమ్మారు వినిపించింది. ఉలిక్కిపడ్డాను. క్షణంలో వాస్తవలోకంలోకి వచ్చాను. తెరచిన కళ్ళు తెరచినట్లే ఉన్నాయి. కావున అది కలకాదు. అద్భుతదర్శనం. దానిని ఎవరికైనా వివరిస్తే లోలోపల నవ్వుకుంటారేమోనని అప్పట్లో చెప్పలేదు. అసలు అట్లాంటివి నమ్మే వ్యక్తిత్వం కాదు నాది. కనుకనే ఆ అనుభవం నాకు కలిగిందేమో! ఇక నమ్మకపోవటం ప్రశ్నేలేదు.

తెల్లవారింది. 17వ తేదీన అమ్మ స్వయంగా నాన్నగారిని ఆలయప్రవేశం చేయించింది; దానికి శ్రీ అనసూయేశ్వరాలయం అని నామకరణం చేసింది. ఆ వివరాలు మనందరికీ తెలిసినవే. అమ్మ విశ్వకల్యాణం కోసం తన సర్వస్వాన్ని త్యాగం చేసింది. అంతవరకు శోకసముద్రంలా ఉన్న అమ్మ క్షీరసాగరకన్యకలా ప్రశాంత దరహాస భాసురవదనయై దర్శనం ఇచ్చింది. బిడ్డల కోసం గుండెను రాయి చేసుకుని నిలిచింది.

శ్రీ నాన్నగారి మహాభినిష్క్రమణం అనంతరం భయావహంగా నాకు కన్పించిన అపూర్వదృశ్యం తర్వాత కాలంలో కార్యరూపం ధరించింది. వారు సామాన్యులు కారు; అమ్మకే ఆధారభూతులైన అసామాన్యులు. ఎందువల్ల నంటే - నాన్నగారి పేరు నాగేశ్వరుడు. వారి నిష్క్రమణా నంతరం నాగేంద్రుడు స్వస్వరూపంతో భువి నుండి దివికి వెళ్ళిన దృశ్యం గోచరించింది; ఆకాశవాణి గంభీరస్వరం వలె 'ప్రతిష్ఠ జరగాలి' అని ధ్వనించింది; మర్నాడే వారు అనసూయేశ్వరులుగా సుప్రతిష్ఠితులైనారు. నాన్నగారి ప్రతిష్ఠలో ఈవిధంగా ఎంతో అర్థము, అంతరార్థము, పరమార్థము నిబిడీకృతమై ఉన్నాయి. మహిమాన్వితులైన 'నాన్నగారి సోమశేఖరతత్త్వం' అవ్యక్తంగానే ఉన్నది. శ్రీ అనసూయానాగేశ్వరుల, జగన్మాత - జగత్పితల శ్రీ చరణాలకు శతసహస్రాధిక వందనములు. ✤✤✤



మే 5న అనసూయేశ్వరాలయంపై సుబ్బారావన్నయ్య, అమ్మ, నాన్నగారు





# నాన్నగారితో నా అనుబంధం



శ్రీమతి దయామణి, జిల్లెళ్ళమూడి

దైవం మానుషరూపేణ భువిపై అవతరించ సంకల్పించినప్పుడు తమ పరివారంతోనే వస్తారని కదా నానుడి. అమ్మ దివ్య ప్రణాళికలో నాన్నగారూ ఒక భాగమే. ఆ ప్రణాళిక ననుసరించే అన్నీ జరుగుతుంటాయి. ఆ ప్రణాళిక ఏమిటో చూద్దామా !

అమ్మ బాల్యంలోనే 6 సంవత్సరములు నిండకమునుపే తన నిర్ణయాన్ని తెలియపరిచింది.

అమ్మ చినతాతగారైన చిదంబరరావుగారికి, వారి కుటుంబానికి స్నేహితులు, గురుతుల్యులు అయిన లక్ష్మణాచార్యుల వారు నృసింహోపాసకులు. వీరు తఱచుగా వీరింటికి వచ్చి పోతుంటారు. వీరు అమ్మలో బాలా త్రిపురసుందరినీ, నృసింహస్వామినీ దర్శించిన మహాను భావులు.

వారు అమ్మను వారింటికి తీసుకెళ్ళి దేవతార్చనకు ఎదురుగా ఆసీనురాల్ని చేసి మూడు గంటలు అమ్మతో సంభాషణానంతరం ముగ్ధులై తల్లీ ! నీవెవరవో చెప్పమ్మా అంటే అమ్మ మౌనంగానే ఉన్నది. పోనీ నేనెవరినో చెప్పమ్మా పలుకమ్మా పలుకుగల తల్లీ ! పలుకవేమీ అనగా అమ్మ – "నీవు పలికే – పలుకే నేను, నాయనా!" అని అక్షరమే తానయిన అమ్మ జ్ఞాన సరస్వతే తానుగా స్పష్టీకరించింది.

మరొక సందర్భంలో – ఆచార్యులు గారు అమ్మను వారింటికి తీసుకెళ్ళారు. తిరిగి చిదంబరరావు గారింటికి ఇద్దరూ కలిసి వస్తుండగా త్రోవలో ఒక పెద్ద త్రాచు ఇద్దరి మధ్యనా నుంచుని ఉన్నట్లు కనబడుతుంది. ఆచార్యులుగారు ఉలిక్కిపడి "అమ్మా ! దూరంగ వెళ్ళు. అది త్రాచు పాము, విషం" అంటారు. అమ్మ – ఆ కాటులో ఘాటు లేదు లెండి అంటుంది. ఆ పాము ఆచార్లగారి నిలువెత్తునా లేచి సరాసరి వారి వంకనే - చూస్తూంటే ఆయన నిశ్చేష్టుడై చలనం లేని వారై ఒక అరగంట గడిచాక కళ్ళు తెరవగా – పాము అమ్మను చుట్టుకున్నట్లు దర్శించారు. వెంటనే వారు అమ్మ పాదాలపై వ్రాలి నేను పాము అంటే భయంలేని వాడ్ని. నా కెందుకింత భయం. అయినా నిన్ను చుట్టవేసుకున్న దేమిటమ్మా" అనగా

"అది పాము కాదు నాయనా నాగేంద్రుడు. ఆ నాగేంద్రుడే నన్ను చుట్టుకుని ఉన్నాడు. నేను నాగేంద్రుడిని చుట్టించుకున్నాను. ఆ నాగేంద్రుడే నాగేశ్వరుడై వస్తాడు. వాడే నాకాధారం. వాడి ఆకారమే నేను" అని ప్రకటించింది.

పలు విధాల అమ్మను దర్శించిన ఆచార్యులుగారు "ముగురమ్మల మూలపుటమ్మా ! నీకాధారమేమిటమ్మా నీవే ఆధారమయితే" అనగా

"ముగ్గురమ్మల మూలపుటమ్మ అంటే – ఆది అయి అనాది అయి ఈనాటి కిది అయింది. (ఈ అమ్మగా వచ్చానని తెలియ చెప్పటమేగా) ముగ్గురు మూర్తులకు తల్లి మూలపుటమ్మ మూడు భాగాలై అన్ని అవస్థలు మూడుగా చేసి తను త్రిపుటియై... బాలై, బాలాత్రిపుర సుందరై, మూడు గుణాలు, మూడు కాలాలు, మూడు పుటలు, మూడు అవస్థలు, శరీర భాగాలు మూడు, మూడు మూర్తులై, ఆ మూడు మూర్తులకు భార్యలై, ఆ మూడు సత్త్వరజస్తమోగుణాలై ప్రపంచమే ఒక భూతంలో నుంచి అనేకంగా మారి పంచబద్దది. అందుకు నాకాధారం కావల్సి వచ్చింది. అని తనకు అంతా వర్తమానమే" అంటూ అమ్మ విపులీకరించింది.



ఒకరోజు చిదంబరరావు గారి ఇంట్లో అందరూ కూర్చుని ఉండగా ఆచార్యులవారు అమ్మ గురించి కొద్ది కొద్దిగా తెలియచేస్తూ, ఇంతకూ ఈ తల్లి ఎవరి భార్య కావలసి ఉన్నదో ! అయిన సంబంధాలేమైనా వున్నాయా? అని అడుగగా - ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అమ్మే కల్పించుకుని "ఆయనే సంబంధం. అయిన సంబంధాలు ఏమున్నై. సంబంధమే ఆయన - బంధమే ఆయన" అంటుంది. తన అనుభవాన్ని విస్మరించిన ఆచార్యుల వారు ఆయన ఎవరని అడుగుతారు. "మీరు కూడా అడుగుతారేం? మొన్న చెప్పాను కదా" అని జ్ఞప్తి చేసి నిర్ణయం మారదన్న విషయాన్ని రూఢి చేసింది.

అమ్మ - బాల్యంలోనే అమ్మ వాత్సల్యాన్ని చూరగొన్న పుత్రుడు మౌలాలి. ఆ సోదరుడు ఎన్నో అనుభూతుల్ని పొందిన మహాభక్తుడు. వివాహాత్పూర్వమే - అమ్మ, నాన్నగారు మాట్లాడుతుండగా అమ్మ కొరకు వచ్చిన మౌలాలి దూరంగా నుంచుంటే - అది గమనించిన అమ్మ "దగ్గరకు రాలేదేం నాయనా" అని అడిగింది. "నాన్నగారుంటే రాలేనమ్మా. వారితో పరిచయం లేదు కదా ! భయం. ఇక్కడున్నంత చనువు, ప్రేమ అక్కడ వుండదమ్మా. ముఖంలో ఏదో ముడత, కోపం, ఉద్రేకం కనపడతై" అంటే అమ్మ "అది శివుడు సోమశేఖరునిగా ఉన్నప్పుడు అట్లాగే వుంటాడు నాయనా! సోమశేఖరుని లక్షణం" అని అభివర్ణించింది.

వివాహానికి పూర్వము అమ్మ మేనమామ అయిన చంద్రమౌళి సీతారామయ్యగారు, నాన్నగారు అమ్మను వివాహం చేసుకోవటానికి ఇష్టపడుతున్న సందర్భంలో అమ్మను ముద్దుచేస్తూ వాడికి (నాన్నగారికి) జీవకళ తక్కువ అని హాస్యం చేస్తే - అమ్మ "పోన్లెండి. మీ మాదిరి జీవకళ అక్కర్లేదు. జీవంలేని శిలలను చూశారూ. వాటికి జీవం కలవారి నందర్ని చైతన్యం లేని రూపం రక్షిస్తున్నది. అట్లాగే వారు మనందర్ని రక్షిస్తారు. ఏనాటికో ఒకనాటికి మీరు అందరూ వారికి మొక్కేరోజు అంటూ రాకపోదు" అని స్పష్టీకరించింది.

సీతారామయ్యగారు - "ఇంకా నయం వాడికన్నావు నీకే మొక్కుతారనలేదు, బతికించావ"న్నారు.

అమ్మ - "ఏరోజు ఎటువంటి రోజు వస్తుందో మనకేం తెల్సు. ఎవరికి ఎవరు మొక్కవలసి వస్తుందో" అన్నది. అది అక్షరాలా నిజం. కాలక్రమంలో వారు అమ్మను దైవంగా గుర్తించి, ఆరాధించి స్థానికంగా కొంతకాలం అమ్మ సన్నిధిలో ఉండే అదృష్టాన్ని పొందటం కొందరికి విదితమే.

చిత్రాతి చిత్రంగా పలురకాల మలుపులతో మెలికలతో అమ్మ నిర్ణయానుసారం అమ్మ కళ్యాణం నాగేశ్వరునితో (నాన్నగారితో) కడు వైభవంగా భావపురిలోని చిదంబరరావుతాతగారింట్లోనే జరిగింది (1936 - మే - 5న).

పరమేశ్వరులైన నాన్నగారితో ఆత్మీయులు గాను, సన్నితులుగాను, ఒక అనుబంధాన్ని మనకు అమ్మ ఏర్పరిచింది. వారి అనుగ్రహానికి పాత్రతనొసగింది.

మా నాన్నగారి కుటుంబం బాపట్లలో ఉండగా మా నాన్నగారు, అందరి నాన్నగారు స్నేహితులని విన్నాను. కళాప్రియులైన అందరి నాన్నగారు, మా నాన్నగారు కలిసి నాటకాలు వేసే వాళ్ళనీ విన్నాను. ఆ రోజుల్లోనే అమ్మ దృష్టి మా నాన్నగారిపై సారించింది. తత్ఫలితం గానే మా కుటుంబం అమ్మకు చేరువకావటం జరిగిందేమో మరి!

మా నాన్న గారికి అధ్యాపక వృత్తి కారణంగా మేము చీరాల వెళ్ళటం జరిగింది. కొంతకాలం తదుపరి అమ్మను గూర్చి పలురకాల విశేషాలను, విషయాలను వినటం జరిగేది. నాన్నగార్ని నాగులు అంటారు మా నాన్నగారు. నాగులు భార్యకు హిస్టీరియాట అని ఒకరకంగానూ, ఆ రాముడే అమ్మ అని రామ భక్తులైన



రంగన్నబాబుగారి ద్వారాను విన్న మా నాన్నగారు అమ్మను దర్శించి ఆపై జిల్లెళ్ళమూడి మమ్మల్ని తీసుకురావటం జరిగాయి.

నాన్నగార్ని మా నాన్నగారు 'నాన్నగారు' అని పిలిస్తే నువ్వు నాన్నగారని పిలవటమేమిట్రా అనేవారు. అయినా అమ్మ ఇచ్చిన స్థానానికే గౌరవం ఇచ్చేవారు.

నాన్నగారికి కొంతకాలం భోజన సదుపాయాలను చేయగలిగే మహదవకాశాన్నీ భాగ్యాన్ని నాకు కల్పించింది. ఈ రోజుకూ వంట చేసేటప్పుడు వారి రుచులను గుర్తు తెచ్చుకుంటూ చేస్తాను.

నాన్నగారికి నేను వంట చేసిపెట్టే రోజుల్లో వంట అయ్యాక అమ్మకు నివేదన ఇవ్వటం అలవాటు. ఒక రోజు నాన్నగారికి, మరో ఇద్దరికీ త్వరగా భోజనం పెట్టాల్సిన అవసరమేర్పడింది. అమ్మకు నివేదన తీసివుంచి నాన్నగారికి వాళ్ళకి భోజనం పెట్టాను. నాన్నగారు భోంచేసి అమ్మ ఉన్న గదిలోకి వెళ్ళారు. (ప్రస్తుతం అఖండ నామం జరిగే ఆలయం). నేను పనిచూసుకొని అమ్మ దగ్గర అవకాశం చూసుకుని నివేదన తీసుకెళ్ళిన నన్ను చూసిన నాన్నగారు ఏమిటమ్మా! అది తినటానికేమైన తెచ్చావా అన్నారు. అమ్మకు నివేదన తెచ్చాననగా - నేను భోంచేశాక తెచ్చావేమిటి ? పోనీ నేను తినకముందైనా తీసి అవతల పెట్టావా ?" అన్నారు. ఆ ధ్వనిలో తనకంటే ముందే ఇవ్వమన్న ఆదేశమే విన్పించింది. నాన్నగారి దృష్టిలో అమ్మ దేవతయే. అమ్మను ధ్యేయంగా పెట్టుకుని ధ్యానం, జపం కూడా చేశారని విన్నాను.

అమ్మ బామ్మగారు పోయినప్పుడు మూడవ రోజున నిండుకుండలోని అన్నం, పప్పు, కూర తీసుకురమ్మని కబురుచేసింది. అప్పట్లో వంట చేస్తున్న సోదరి తిరుమలమ్మ గారు అన్నీ విస్తట్లో పెట్టుకుని తెస్తే అన్నీ రుచిచూసి పదార్థాలన్ని కలిపి నాన్నగారికి, బాబాయికి పెట్టమ్మా ! ముందు ఇది తిని తర్వాత అన్నం తినమని చెప్పమని కబురు చేస్తే నాన్నగారు వారి తమ్ముడు లోకనాధంగారు అమ్మ ఆదేశాన్ని శిరసావహించారు. మరి నాన్నగారి ఆలోచన ఏమిటో మనకు అవగతంకానిది. అమ్మ తీరు మనకు అంతుపట్టనిది. అమ్మ నాన్నగార్ల సంభాషణలో "ఆ! అట్లా ఆశీర్వదించమ్మా !" అనటం విన్న నేను నాన్నగారి చేత ఇలా పలికించిందేమిటబ్బా అని అచ్చెరువొందటం నా వంతయినది.

నాన్నగారు పనిమీద గ్రామాంతరం వెళ్ళేటప్పుడు అమ్మకు చెప్పి బొట్టు పెట్టించుకుని వెళ్ళేవారు.

1954లో నాన్నగారు విజయవాడలో ఒక చోట కూర్చుని వెళ్తూ తన సంచి మరిచి పోయి వెళ్తుంటే అమ్మ గొంతు విన్పించిందట. "సంచి మరచి వెళ్తున్నారు తీసుకోండి"అని. వెంటనే నాన్నగారు వెనక్కి వెళ్ళి ఆ సంచీ తెచ్చుకున్నారు. ఆ సంచీలో అతి ముఖ్యమైన కాగితాలు ఉన్నైట.

1963లో నాన్నగారు మొక్కపాడు వెళ్ళారు. జిల్లెళ్ళమూడిలో కళ్ళు మూసుకుని పడుకుని వున్న అమ్మ "నులకమంచం, కాళ్ళు ఒత్తుకుంటై దిండు వేసుకోండి" అంటోంది. అమ్మ మంచం పక్కనే కూర్చున్న నేను అమ్మ ఎవరితోనో మాట్లాడుతున్నదే అనుకుంటూ అమ్మనడిగాను ఎవరికమ్మా చెప్తున్నావు అని. అమ్మ ఏం మాట్లాడలేదు. బహుశః నాన్నగారితోనేమో వారు రాగానే అడుగుదా మనిపించి నాన్నగారు రాగానే మీరు ఏ మంచం మీద పడుకున్నారు అని అడిగితే ఎందుకమ్మా నులక మంచం మీద పడుకున్నానన్నారు. కాళ్ళక్రింద దిండు వేసుకున్నారా అంటే లేదన్నారు.

1972లో నాన్నగారికి జె.వి క్రిష్ణారావు గారి ఆసుపత్రిలో ఆపరేషన్ జరగబోతుండగా నాన్నగారు అమ్మకు ఒక ఉత్తరంలో "ఆపరేషన్ తిలకిస్తూ, ఆ



సమయంలో నీవు జిల్లెళ్ళమూడిలో ఉండిననూ, నా చెంతనే ఉండగలవని నమ్మిక" అని వ్రాశారు. అంతకుముందు ఎన్ని సంఘటనల ఆధారంగా ఆ నమ్మిక ఏర్పడిందో ! మరి 1975లో జిల్లెళ్ళమూడిలో అందరింటిపై నక్సలైట్లు దాడిచేసినప్పుడు అంతకు కొద్ది నిముషాల ముందే నాన్నగారిని మాములుగా పడుకుండే స్థలం నుండి మరోచోటుకి పంపింది. లేనియెడల ఆనాడు నాన్నగారికి ప్రాణ సంకటం ఏర్పడి వుండేది. నిత్య జీవితంలో కూడ అమ్మ నాన్నగారిని అంటిపెట్టుకుని వున్నది. వెన్నంటే వున్నది. నాన్నగారు గ్రామాంతరం వెళ్ళినా అమ్మ అదృశ్యంగా నాన్నగారి వెంటనే వుండేదట. కొన్ని సమయాల్లో అమ్మ కంఠం వినిపిస్తూండేదనీ నాన్నగారే స్వయంగా వెల్లడించేవారు.

బామ్మ గురించి కబుర్లు చెప్తూ – మీ అమ్మగారు నడుంబిగించి కోడలిగా, అమ్మగా కూడ అన్నీ చేసింది అని చెప్పి ఆరోగ్యం బాగలేనప్పుడు అవసరమయితే చొక్కాను చిలకకొయ్యకు తగిలించినట్లు తీసి వెయ్యగలదని నా నమ్మకం అనీ, మీ అమ్మగారిది గూఢమంచు ప్రయాణం అనీ కబుర్లు చెప్పేవారు. అమ్మ ఆశీర్వచనంలో అచంచలమైన విశ్వాసం ఉన్నట్లు నాన్నగారి మాటల్లో దృఢంగా అనిపించేది.

1981కి పూర్వం హైమాలయం పక్కన ఒక పూదోట ఉండేది. నేను హైమాలయం నుంచి వస్తుండగా(పెద్దబ్బాయి) సుబ్బారావన్నయ్య కూతురు స్వీటీని ఎత్తుకున్న నాన్నగారు కలిశారు ఆ తోటలో. మంచి సువాసన, అందమైన ఒక పువ్వును కోసి ఎంత బాగుందో చూడవే పువ్వు అంటూనే ఇద్దరం కలిసి వాత్సల్యాలయానికి వచ్చాం. నాన్నగారు అంత మెచ్చుకున్న పువ్వును అమ్మ చేతికివ్వలేదు. వరండాలో పడుకుని వున్న అమ్మ పాదాలపై వుంచారు. (పాదాలపై వుంచాలన్న భావం కలిగింది ఆ మహాత్మునికి). ఆ అపురూపమైన దృశ్యాన్ని ఈ నా చక్షువుల కందించింది అమ్మ. మనసు నిండా ఆనందమే.

జిల్లెళ్ళమూడిలో అందరూ కలిసి ఒకే వంటలో ఒకేచోట భోజనం చేస్తే బాగుంటుందని అమ్మ సంకల్పించింది.

దర్శనార్థం వచ్చే యాత్రికులు, కళాశాల విద్యార్థినీ విద్యార్థులు ఆవరణలో సేవచేసేవారు, విడిగా వంటలు చేసుకునే వారినీ మాన్పించి 1981 జనవరి 16వ తేదీన సామూహిక భోజనాలను ప్రారంభించటం జరిగినది.

అమ్మ సంకల్పించిన ఈ ఏర్పాటుకు నిరాడంబరులైన నాన్నగారు కూడా తానే స్వయంగా కంచం తీసుకుని వచ్చి బంతిలో కూర్చునేవారు. వారిది మహోన్నతమయిన స్థానమయినా అతి సామాన్యులుగా స్నేహశీలిగా, పరామర్శలతో, పలకరింపులుతో కలివిడితో ఆత్మీయులుగా సంచరించే వారు.

వారు వాత్సల్యాలయానికి వచ్చినప్పుడు వంట ఇంట్లో నేను కుర్చీ వేసేదాన్ని. ఆ కుర్చీని తీసివేసి నీవు నాకు మర్యాదలు చెయ్యటమేమిటని చిన్ని వంట గదిలోకి వచ్చి నా పక్కన నుంచుని 'తినటానికేమైనా వున్నయిటే' అంటూ డబ్బాలు వెతుక్కుని కావలసినవి అడిగి చేయించు కునేవారు.

పెద్దబ్బాయి సుబ్బారావు వివాహం అయ్యేటంత వరకు నాన్నగార్ని మూర్తిగా సేవించుకునే అవకాశాన్నిచ్చింది. నేనిలా వుండగలగటానికి నాన్నగారు, అమ్మ ఆశీస్సుల నంతంగా వున్నాయి. నేనంటే ఎంతో ప్రేమగా వుండే నాన్నగారు అమ్మతోసహా నాదగ్గర ఆసీనులై వున్నారు.

అమ్మను 'నీకంటే ముందు నన్ను నీలో కలుపుకోమని అర్థిస్తే', 'నువ్వు నన్ను దాటించటం నీ ధర్మం. నీవు అడగటానికి వీల్లేదు' అని నన్ను శాసించింది



అమ్మ. నాన్నగారు అమ్మకు అనారోగ్యంగా వున్నప్పుడు నీ తదనంతరం నా పరిస్థితేమిటనగా నాన్నగారి కోరికను మన్నించి ఆచరణాత్మక ప్రబోధాన్నందించింది.

నాన్నగారు తన జన్మనక్షత్రమయిన పునర్వసులో - మానవ దేహాన్ని వదిలి అమ్మ జన్మ నక్షత్రమైన ఆశ్లేషానక్షత్రంలో అనసూయేశ్వరులై ఆవిర్భవించారు.

సకల జీవులకు చైతన్యం ఇచ్చే అమ్మ నాన్నగారికి చైతన్యం ప్రసాదించి ఆయనే మనకు రక్ష అని బాల్యంలో చెప్పినట్లుగా మనకు రక్షకునిగా ఏర్పరిచి ఆలయంలో అమ్మే అఖండ జ్యోతిని వెలిగించింది. ఈనాటికీ వెలుగుతున్నదా జ్యోతియే.

మహన్యాస పూర్వక సహిత ఏకాదశ రుద్రాభిషేకాలు, సహస్రనామార్చనలు, లక్షనామార్చనలు ఏర్పరిచి అమ్మ కూడా నిత్య పూజలో పాల్గొని నాలుగు సంవత్సరాల నంతరం అమ్మ కూడా నాన్నగారి సరసన చేరి అర్చనలందుకుంటూ విచక్షణ లేని వీక్షణతో శివశక్తిస్వరూపులిద్దరూ మనలను ఆశీర్వదిస్తున్నారు. ఆ ఆశీస్సులకై రండి - వేగిర పడండి.

నాన్నగారి ఆలయ ప్రవేశానంతరం "అనసూయేశ్వర నమో నమో ! శ్రీ నాగేశ్వర నమో నమో !" అన్న నామాన్ని భ్రమరాంబక్కయ్యకు ప్రేరణ కల్పించగా అమ్మా నాకిలా ప్రేరణ కల్పించావు ఈ నామం జరిగితే బాగుంటుంది అని అమ్మకు విన్నవించింది. ఆ విన్నపాన్ని ఆలకించిన అమ్మ చేయించు అన్నది. కానీ అమ్మ అన్నట్లు దేనికైనా సమయం రావాలి కదా !

నాన్నగారి శతజయంతి ఉత్సవాల్లో ఆ నామానికి సమయం ఆసన్నమైంది. భ్రమరాంబక్కయ్య ఆధ్వర్యంలో గ్రామస్థులు నాన్నగారి నామం చేస్తూ పునీతులవుతున్నారు.







# సోమశేఖరుడు -నాన్నగారు



శ్రీ రాచర్ల లక్ష్మీనారాయణ, బెంగుళూరు

కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతుమే ।
శివాభ్యామస్తోక త్రిభువన శివాభ్యాం హృదిపున
ర్భవాభ్యామానంద స్ఫురదనుభవాభ్యాంనతిరియమ్ ॥

నకల కలాస్వరూపులును, శిఖలో చంద్రశేఖరులను అలంకరించుకున్నవారునూ, తపస్సు చేత ఒకరి నొకరు పొందినవారును, భక్తులకు కోరిన వరములను ప్రసాదించు వారునూ, మంగళమూర్తులును ముల్లోకాలకు శుభాలను ప్రసాదించువారునూ, ధ్యానసమయంలో హృదయమున సాక్షాత్కరించువారునూ వరమానందంతో కూడిన స్వరూప సాక్షాత్కారంగలవారునూ అయిన అనసూయేశ్వరులకు వందనము.

అమ్మనాన్నగార్లు మేనత్త మేనమామ బిడ్డలు. అమ్మ పుట్టినిల్లు మన్నవ, నాన్నగారి పుట్టిన వూరు రేటూరు.

అపుడు అమ్మకు 6 సంవత్సరాలు. బాపట్లలో నరసింహ ఉపాసకులైన శ్రీ నరసింహచార్యులుగారు, రాత్రిపూట వారి ఇంటి నుంచి అమ్మకు తోడుగా వస్తున్నారు. అప్పటికే అమ్మను లలితాస్వరూపంగా భావిస్తూ ఉండేవారు.

దారిలో ఒక పెద్దపాము ఎదురయింది. నరసింహ చార్యులుగారు "అమ్మా ! పాము, పక్కకు తొలగు, కరుస్తుంది" అని అన్నారు. "అది పాము కాదు నాయనా నాగేంద్రుడు !" అన్నది అమ్మ. అంతలో వారికి ఆ పాము అమ్మను చుట్టుకొని కనబడింది.

"నాగేంద్రుడే నన్ను చుట్టుకొని వున్నాడు. నేను నాగేంద్రుడిని చుట్టించుకొని వున్నాను. ఆ నాగేంద్రుడే నాగేశ్వరుడయి వస్తాడు. వాడే నాకాధారం. వాడి ఆకారమే "నేను" అని ప్రకటించింది అమ్మ.

అపుడు అమ్మకు 8,9 సంవత్సరాల వయస్సు. నాన్నగారి నాన్నగారికి (సుబ్బారావు తాతగారికి) సుస్తీ చేసి బాపట్లలో వైద్యం నిమిత్తం చిదంబరరావు గారింట్లో వుంటారు. ఒకరోజు అమ్మను దగ్గరకు పిలిచి "బావను చేసుకుంటావా?" అని అడుగుతారు. "చేసుకుండే యోగ్యత వుంటే" చేసుకుంటా అని అమ్మ అంటుంది.

అమ్మ నిర్ణయించుకొనే వచ్చింది కనుక, అన్నీ తెలుసు కనుక చూచాయగా, నరసింహాచార్లుగారితో, సుబ్బారావు గారితో అంటుంది.

సీతాపతి తాతగారు అమ్మ వివాహం నాన్నగారితో నిర్ణయించి పెళ్ళికార్డులు అచ్చు వేయించి కనకమ్మ బామ్మగారికి తెలియపరిచి, వుద్యోగ ప్రయత్నం మీద నిజామాబాదు వెళ్ళిన నాన్నగారికి కబురు చేయమంటారు. ఆ కబురు నాన్నగారికి అందదు. పెళ్ళి ఆగిపోతుంది. తాతగారికి బామ్మగారికి మనస్పర్థలు వస్తవి. తాతగారు వేరే సంబంధాలు చూస్తారు. ఏదీ కుదరదు. మధ్యవర్తుల వల్ల తగాదాలు పెరుగుతవి. అమ్మ నాన్నగారినే చేసుకుంటా నందని, పుకార్లు పుట్టిస్తారు.

భారతమ్మ గారు (చిదంబరరావు గారి కూతురు) గుంటూరు పురుడు పోసుకోను వెళుతుంది. సహాయంగా వుంటుందని అమ్మను కూడా తీసుకు వెళతారు. నాన్నగారు భారతమ్మగారిని చూడటానికి గుంటూరు వెళతారు. (భారతమ్మగారు నాన్నగారికి పెదతల్లి కూతురు).

తననే చేసుకుంటానని అమ్మ అన్నది. ఎంత వరకు నిజమని తెలుసుకోవటానికి అమ్మను అడుగుతారు నాన్నగారు.



అమ్మ "అనలేదు" అంటుంది.

"అసలు పెళ్ళి చేసుకోవాలని వున్నదా" అని అడిగారు. "ఇంతకుముందు దానిని గురించి నా మనస్సులో ఏ ఆలోచనలేదు. మా నాన్న(తాతగారు) శుభలేఖ కొట్టించిన తరువాత పెళ్ళిఅయిపోయిందేమో అనిపించింది" అన్నది అమ్మ.

"నీకు మనస్ఫూర్తిగా ఇష్టముంటే ఒక పూట మంగళగిరి పోయి పెళ్ళి చేసుకుందాము వస్తావా? తరువాత ఎవరు ఏమి చేస్తారు ?"

"అట్లా రాను. ఎప్పటికయినా నాన్నే యిష్టపడి చేయాలి, అది నా విశ్వాసం" అన్నది అమ్మ. నేను ఏమీ లేనివాడిని. ఏమీ ఆస్థిలేదు. నిన్ను సుఖపెట్టలేను, ఇష్టమేనా? అని అడిగారు నాన్నగారు. అందుకు అమ్మ" చేసుకుండేది ఆస్థిని కాదు. మనస్సును" "నాకు శరీరంతో కూడా సంబంధం లేదు" అన్నది.

తాతగారు అమ్మను తెనాలిలో (అమ్మ అమ్మమ్మ గారి ఇంట్లో) దించి వస్తారు. అమ్మ తాతగారి (అమ్మతాతగారు) కోసం మందు కోసం ఆస్పత్రికి వెళుతుంటుంది. నాన్నగారు కనబడతారు. మాట్లాడుతూ వుండగా సీతారామయ్య గారు (అమ్మ మేనమామ) కలుస్తారు. నాన్నగారు వెళ్ళిపోతారు.

సీతారామయ్యగారు అమ్మను అడుగుతారు "నీవు బావనే చేసుకుంటావన్నమాట."

అమ్మ: చేసుకొనేదేమిటి? చేసుకున్నా.

సీ: వాడికి జీవకళలేదు.

అమ్మ: జీవకళ లేని శిలలకు జీవం కలవారందరూ పోయి మ్రొక్కుతారు. ఆ చైతన్యం లేని శిలారూపం రక్షిస్తున్నది ఈ జీవం కలవారినందరినీ. అట్లాగే వారు మనందరినీ రక్షిస్తారు. వారికి మ్రొక్కేరోజు అంటూ రాకపోదు.

తెనాలిలో మౌలాలి, శ్యామల పార్కులో కలుస్తూ వుంటారు. ఒక రోజు అనుకోకుండా నాన్నగారు అమ్మను పార్కులో కలుస్తారు.

నాన్నగారు అమ్మతో మాట్లాడుతూ "నేను నిన్ను చేసుకోవటానికే నిర్ణయించుకున్నాను" అని చెప్పి "నేను డబ్బులేనివాడిని, అక్కడ సమస్తమయిన పనులూ చేయాల్సి వస్తుంది, పడుకోవటానికి మంచం కూడా లేదు, తినటానికి కంచం కూడా లేదు. ఆరు రూపాయల వుద్యోగం. "నలుగురు మనుషులు బతకాలి" అన్నారు.

అమ్మ "వీటిని అన్నింటినీ చేసుకోవటం లేదు. మిమ్మల్ని చేసుకుంటున్నా"నని మీ కోసం ఇవి అన్నీ ఏర్పడ్డవి. వాటికోసం మీరు ఏర్పడలేదు. మీరు నాకోసం ఏర్పడ్డారు" అన్నది.

మౌలాలి వచ్చి నాన్నగారిని చూచి వెళ్ళపోతాడు, మరుసటి రోజు అమ్మతో చెపుతాడు.

"నాన్నగారు వుంటే రాలేనమ్మా, వారితో పరిచయం లేదు, కాదు భయం."

అమ్మ : నాన్నను చూస్తే భయం ఎందుకు నాయనా?

మౌ: ఇక్కడ వున్న ప్రేమ, చనువు అక్కడ లేదమ్మా! ముఖాలలో ఏదో ముడత, కోపం, ఉద్రేకం కనబడు తుందమ్మా.

అమ్మ: అది శివుడు సోమశేఖరుడుగా వున్నపుడు అట్లాగే వుంటాడు నాయనా! సోమశేఖరుడి లక్షణం అది సరి అయిన పురుష లక్షణం.

పైన చెప్పిన శ్లోకంలో చెప్పినట్లు అమ్మా నాన్నగార్లు నిజ తపస్సు చేత ఒకరినొకరు పొందారు.

పార్వతీదేవి శివుని కోసం తపస్సు చేస్తూంటే శివుడే బ్రహ్మచారి రూపంలో వచ్చి పార్వతితో శివుడిని గురించి చెపుతాడు. స్మశానంలో వుంటాడు, పులిచర్మం ధరిస్తాడని, వంటి నిండా బూడిద పూసుకుంటాడని, పాములు ధరిస్తాడని. నీవు సుఖపడలేవని. తపస్సుమానుకొనమని. అయినా పార్వతి శివుడినే వివాహం చేసుకుంటుంది. ఇక్కడ కూడా నాన్నగారు – నిన్ను సుఖపెట్టలేనని తన



కుటుంబ బాధ్యతలు, ఆర్థిక ఇబ్బందులూ ఇతరత్రా తనకున్న బరువు బాధ్యతలూ అన్ని విడమరచి చెపుతారు. అయినా అమ్మ నాన్నగారినే 1936లో ఎన్నో తగాదాల తరువాత నాన్నగారితో పెళ్ళి అవుతుంది.

ప్రపంచంలో ఏ స్త్రీ అయినా ఇన్ని చెప్పిన తరువాత వివాహం చేసుకోవటానికి ముందుకు వస్తుంది ? కాని అమ్మ నాన్నగార్లు అనసూయేశ్వరులు. వారికే చెల్లింది. అందుకే ఈ పెళ్ళి అమ్మ జరిపించుకుంది. ఎన్ని అడ్డంకులు వచ్చినా !

అమ్మను నేను 1959లో మొదట చూచాను. వెళ్ళినపుడు నాచేతిలో వున్న పేపరు చూచి ఇస్తానని ఒకాయన తీసుకుపోయారు. వారు నాన్నగారని తెలియదు. చాలా సింపుల్‌గా ఉన్నారు. అమ్మ దగ్గరకు చేరాను. అమ్మ అడిగింది. "నాన్నగారు కనబడ్డారా!" అని. ఆయన ఎవరూ చూడలేదమ్మా" అన్నాను. అమ్మ నవ్వి "నీ దగ్గర పేపరు తీసుకున్నది వారే నాన్నా! నాన్నగారు" అని, "నీవు వచ్చినపుడల్లా పేపరు తెచ్చిస్తుండు. చనువు ఏర్పడుతుంది" అన్నది.

ప్రతి ఆదివారం అమ్మ దగ్గరికి వెళుతుండే వాళ్ళం నేను, కమల. అమ్మ అంటూ వుండేది. "ఇద్దరూ కలిసే వస్తుండండి నాన్నా" అని. ఇద్దరు పిల్లలు పుట్టేవరకు కలిసే వెళుతూ ఉండేవాళ్ళం.

ప్రతిసారి ఇంగ్లీషు, తెలుగు పేపరు తీసుకెళ్ళి ఇస్తుండేవాడిని నాన్నగారికి. వారు అంటూ ఉండేవారు, "నీవే నయ్యా గుర్తుపెట్టుకొని నాకు పేపర్లు తెచ్చి ఇస్తూ వుంటావు" అని. ఆ రోజుల్లో జిల్లెళ్ళమూడికి రోడ్డుగాని, కరెంటు గాని, పోస్టాఫీసు గాని లేవు. 1300 జనాభా. అన్నీ పాకలే. కనబడినపుడల్లా ఆప్యాయంగా క్షేమసమాచారాలు అడుగుతుండేవారు.

1962లో సుబ్బారావు (అమ్మ పెద్దకుమారుడు) నాతో అన్నాడు "అమ్మ ఒకరి పెళ్ళికి నరసరావుపేట (అది మా స్వగ్రామము) వస్తున్నది. అమ్మను అడుగు మీ యింటికి కూడా రావచ్చు" అని. అమ్మదగ్గరకు వెళ్ళి అడిగాను "నాన్నగార్ని అడుగు నాన్నా! వారు సరే నంటే వస్తాను" అని. నాన్నగార్ని అడిగాను, "మీ అమ్మగారు ఏమన్నదయ్యా" అన్నారు. "మిమ్మల్ని అడగమంది" అన్నాను చిరునవ్వి నవ్వి "సరే" అన్నారు.

నరసరావుపేటలో మాయింటి ముందు వేదిక ఏర్పాటు చేశాము. రావిపాడు నుండి చాలామంది అమ్మదగ్గరకు వస్తూ వుండేవాళ్ళు. వారంతా నరసరావుపేట వచ్చి మా ఇంటి వద్ద వేసిన వేదికముందు అమ్మనామం చేస్తూ ఆనందిస్తూ వున్నారు.

రాత్రి 10 గంటలకు మన్నవ హరగోపాల్ పెళ్ళి అయింది. అక్కడి నుండి మేళతాళాలతో అమ్మను మా ఇంటికి ఆహ్వానించాము. అమ్మతో పాటు నాన్నగారు, సుబ్బారావు, హైమ, రవి, ఇంకొందరు సోదరులు మా ఇంటికి వచ్చారు. మా మేనత్త బయట చేరింది. అమ్మను చూడలేనేమో అని బాధపడుతూ దూరంగా వుంది. అమ్మ అడిగింది "అత్తయ్య ఏదిరా?" అని. దూరంగా వున్న అత్తయ్యని చూపించా. అమ్మ ఆమె దగ్గరకు వెళ్ళి 'నీకా నాకా ?' అంటూ దగ్గరకు వెళ్ళి కావలించుకున్నది, మేము పెట్టిన గుడ్డలు ధరించింది.

ప్రసాదాల రాసులు రుచి చూచింది. వేదిక మీదకు వచ్చింది. అందరినీ పలకరించింది. అమ్మ నామం వింటూ 3 గంటల దాకా వుండి జిల్లెళ్ళమూడి తిరుగు ప్రయాణం వెళ్ళారు. 1962 లో మా స్వగృహంలో అమ్మకు, నాన్నగారికి, హైమకూ, సుబ్బారావుకు, రవికి ఒకేసారి గుడ్డలు పెట్టుకుండే అదృష్టం దక్కింది.

1964 నవంబరులో (రత్లాము- మధ్యప్రదేశ్) 5 నెలలు ఆఫీసువారు పంపారు. అమ్మ కమలను, పిల్లలను జిల్లెళ్ళమూడిలోనే వుంచి వెళ్ళమంది. అప్పుడు మా పెద్దకుమారుడికి రెండవసంవత్సరము. వాడికి లివర్ జబ్బు వచ్చింది. తను పిల్లలతో క్రిష్ణవేణమ్మగారింట్లో వుండేవారు. వారి పాక నాన్నగారి పాకకు దగ్గరగా



వుండేది. రాత్రిళ్ళు జబ్బుకారణంగా నిద్రపట్టక ఏడుస్తూ వుండేవాడు. నాన్నగారు వారి ఇంటికి ఆరుబయట పడుకున్నారు. వాడి ఏడుపు విని "ఎందుకమ్మా వాడిని ఏడిపిస్తున్నావ"'ని అడిగారు. "లివర్ జబ్బువల్ల ఏడుస్తున్నాడు" అంది. "అయ్యో జాగ్రత్తమ్మా ! మా సుబ్బారావుతో చాలా పడ్డాము" అని తనకు ఇబ్బంది అయినా తన మంచాన్ని తనే మోసుకువెళ్ళి దూరంగా పడుకున్నారు. అంతటి దయామూర్తి.

ఊరివారినందరిని ఎంతో ప్రేమగా చూచేవారు. వారు ఆ వూరి కరణంగారు. కనుక అందరి అవసరాలూ ప్రేమతో చేసిపెట్టేవారు. వారు అందరూ నాన్నగారిని ఎంతో గౌరవంగా చూచేవాళ్ళు. నాన్నగారికి సంగీతమన్నా, ఆటలు అన్నా ఎంతో ఇష్టము.

ఒకరోజు ఒక 'కిలార్‌నెట్' వాద్య పండితుడు అమ్మ దగ్గరికి వచ్చి, అమ్మా ఒకసారి నీ దగ్గర కచేరి చేసి వినిపించాలని వుంది. నీ ఆశీస్సు కావాలి" అని పర్మిషన్ అమ్మ దగ్గర తీసుకొని ఒక రోజు తన వాద్యబృందంతో వచ్చి కచేరి చేసాడు. Dias మీద ఆయన కచేరి. అమ్మ ఎదురుగుండా గేట్ దగ్గర మంచం మీద కూర్చుని వింటూ వున్నది. అక్కడ వున్న సోదర సోదరీమణులు వూరిజనంతో నిండి వుంది. కచేరి జరుగుతూ వున్నది. అమ్మ అతనివైపే చూస్తూ వింటూ వుంది. కచేరి బాగా ఎంతో ఇంపుగా వుంది. అందరూ నిశ్శబ్దంగా వింటున్నారు.

అంతలో ఒక సోదరుడు అమ్మదగ్గరకు వచ్చి ఏదో చెప్పాలని నిలబడ్డాడు, తాను చెప్పలేక అమ్మ మంచం దగ్గర వున్న నన్ను రిక్వెస్టు చేసాడు. అమ్మ ఏకాగ్రతతో వింటున్నది. అమ్మకు ఆ కబురు అందజేసాను. కాని అమ్మ తల నావైపు తిప్పిన్నప్పటి నుండి ఆ సంగీత ఆలాపనలోమార్పు వచ్చింది. కచేరి అయిపోయింది. అందరూ లేచారు. నాన్నగారు నా దగ్గరకు వచ్చి "అమ్మను ఎందుకు మధ్యలో Disturb చేసావు. అమ్మ దృష్టి అతని వైపు వున్నంత సేపూ అతను మనల్ని ఏ లోకాలకు తీసుకెళ్ళాడు. తరువాత మళ్ళీ ఆస్థితి అందుకోలేక పోయాడు. చూచావా?" అన్నారు. 'నిజమే' నన్నాను నాన్నగారికి అమ్మ మీద అంత నమ్మకం. అమ్మ దైవత్వం మీద.

దసరాలలో అమ్మకు పూజలు జరిగేటపుడు నాన్నగారు దూరంగా కుర్చీ వేసుకొని చూస్తూ వుండేవారు.

నేను అచ్యుతుని రామకృష్ణరావుగారు సంకలనం చేసిన అష్టోత్తరశత నామావళిని చదువుతుండేవాడిని. నా మాటకు అనుగుణంగా రాధాకృష్ణరెడ్డి వయోలిన్ మీద రాగాలను అందిస్తూ వుండేవాడు. ఆ వయోలిన్ అనుసరించి రాగయుక్తంగా నామాలు చెపుతూ వుండేవాడిని. నన్ను అనుసరిస్తూ సోదరులు బీజాక్షరాలు చెపుతూ వుండేవారు.

ఒక దసరాలో కొత్త కొత్త రాగాలతో వయోలిన్ మీద నన్ను అనుసరిస్తూ నన్ను గైడ్ చేస్తున్నాడు. నాకు తెలియకుండా నా నోటి వెంట ఆ రాగాలకు అనుగుణంగా నామాలు రాగయుక్తంగా చెప్పటం జరిగింది. పూజ అయింది. సోదరులు మెచ్చుకున్నారు. అంతలో నాన్నగారు నా దగ్గరకు వచ్చి భుజము మీద చేయి వేసి "ఈ రోజు నామాలు అద్భుతంగా చెప్పావయ్యా. అందరిని ఒక వూపు వూపావు'' అని ఎంతోమెచ్చుకున్నారు. అది నా జీవితంలో మరుపురాని రోజు. అంత బాగా మళ్ళీ చెప్పలేకపోయాను. అమ్మ కరుణ వుంటే ఏదయినా సాధించవచ్చు. సహజంగా నాకు రాగాల పేర్లే తెలియవు. అటువంటిది రాధాకృష్ణరెడ్డి వయోలిన్‌తో పాటు ఆ రాగాలకు అనుగుణంగా నామాలు చెప్పటం జరుగుతూ వుండేది. ఆ ఘనత నన్ను గైడ్ చేసిన రాధాకృష్ణరెడ్డిదే.

ఒక సందర్భంలో అమ్మ నాతో అంటుంది. "నాన్నగారి త్యాగాన్ని ఎవరూ గుర్తించలేదు నాన్నా!" అంటూ నన్ను ఒక ప్రశ్న వేసింది. "మీ ఇంట్లోకి



ఎవరయినా వచ్చి నీ భార్యతో కబుర్లు చెపుతూ చేతులు పట్టుకుంటూ పాదాలు రాస్తూ ఒళ్ళూ రాస్తూ గంటలకు గంటలు నీ భార్యతో కబుర్లు చెపుతూ నీ భార్య దగ్గర కూర్చుంటే నీకు ఏమి అనిపిస్తుంది "నీవు వూరుకుంటావా ?" అని ప్రశ్నించింది. "ఎట్లా వూరుకుంటామమ్మా" అనటం నా వంతు అయింది.

"అటువంటపుడు నాన్నగారు మీకు నన్ను త్యాగం చేసినట్లేకదా నాన్నా!" అన్నది.

"అవునమ్మా ! నిజమేగా మరి ఆయన త్యాగం చెయ్యకపోతే మేమంతా నీ దగ్గరకు చేరగలిగేవాళ్ళమా నీ అనుగ్రహాన్ని పొందగలిగేవాళ్ళమా !" అన్నాను.

"అటువంటప్పుడు నాన్నగారు నన్ను బాధపెట్టారు అని కొందరు తెగ బాధ పడిపోతుంటారు. మనసులో వారిని చిన్నచూపు చూస్తుంటారు. ఆయన త్యాగాన్ని గుర్తించ కుండా, అయినా నేను బాధపడాలని నిర్ణయించు కొనివచ్చాను. అవి నాకు ఎపుడూ బాధ అనిపించలేదు. నేను కాదనుకుంటే వారు నన్ను బాధపెట్టగలిగేవారా?" అన్నది అమ్మ. నిజమే, మరి ప్రేరణే తాను అయినపుడు నాన్నగారు కాని ఎవరయినా గాని అమ్మను బాధపెట్టారని ఎవరు అనగలరు? అంటే ఆ అనేవారు అమ్మయొక్క సర్వాంతర్యామిత్వాన్ని, సర్వజ్ఞత్వాన్ని గుర్తించలేరనేగా అందులో భావన.

1973-74వ సంవత్సరంలో శ్రీశైలం పూర్ణానందస్వామి అమ్మ దగ్గరకు వచ్చి దసరా గడిపారు. ఒకసారి నాన్నగారు శ్రీశైలం చూడటానికి వెళ్ళి శ్రీపూర్ణానందస్వామి ఆశ్రమానికి వెళ్ళారు. స్వామీజీ నాన్నగారిని గౌరవంగా ఆహ్వానించి తమ శిష్యులకు కబురు చేసి పిలిపించారు. స్వామివారి శిష్యులు స్వామిజీని శివస్వరూపులుగా పూజిస్తారు.

"జిల్లెళ్ళమూడి నుంచి నాన్నగారు వచ్చారు. అమ్మే నాన్నగారి రూపంలో మన ఆశ్రమానికి వచ్చారు" అని వారి చేత నాన్నగారి పాదాలు కడిగించి పూజలు చేయించారు.

అమ్మ తన 6వ సంవత్సరంలోనే శ్రీ నరసింహా చార్యుల గారితో అంటుంది. "నాగేంద్రుడే నాగేశ్వరుడయి వస్తాడు. వాడే నాకు ఆధారం, వాడి ఆకారమే "నేను" అని. అందుకే అమ్మ, నాన్నగారు రెండు రూపాలుగా వున్నా వారు అనసూయేశ్వరులు, శివశక్తి ఐక్య స్వరూపులు.

నాన్నగారు దయాస్వరూపులు. కృష్ణవేణమ్మగారిని, హరిదాసుగారిని, కొమ్మూరు డాక్టరుగారు సంస్థ నిర్వహణ కోసం జిల్లెళ్ళమూడి 1956లో తీసుకువచ్చారు. దాసుగారు హరిదాసులు. సంక్రాంతి రోజులో హరిదాసుగా వూరికెళ్ళి ధాన్యము, బియ్యం తెచ్చుకుండేవారు. విడిరోజులలో దర్జీగా పనిచేసుకొని బతుకుతుండేవారు. వారు జిల్లెళ్ళమూడి వచ్చి సంస్థ నిర్వహిస్తున్నా వారి వృత్తి మానలేదు. వచ్చిన ధాన్యాన్ని సంస్థకే ఇస్తుండేవారు. 3 సంవత్సరాలు గడచినవి. కృష్ణవేణమ్మగారికి అమ్మదగ్గరకు రాకముందునుంచే అమ్మే దర్శనం ఇస్తూ వుండేది.

అయినా తన వృత్తి మానలేదు. నాన్నగారికి బాధవేసింది. నాన్నగారు కొమ్మూరి డాక్టర్‌గారితో అన్నారు. "వీరు రాత్రింబగళ్ళు సంస్థ కోసం పనిచేస్తూ, సంక్రాంతి నెలరోజులూ తన వృత్తి చేసుకుంటూ, ఆ ధాన్యం తెచ్చి సంస్థలో పోస్తున్నాడు. ఇంతమంది భక్తులకు భోజనం పెడుతున్నారు. ఆయన సంస్థలో పనిచేస్తూ, ఆయన వేరే వండుకు తింటున్నారు. అది ధర్మమా ?" అని చెప్పి దాసుగారిని ఆ సంవత్సరము నుండి పంపకుండా చేశారు. అంత దయామూర్తులు. అన్నపూర్ణాలయం పెట్టేంతవరకూ వచ్చిన భక్తులందరికీ నాన్నగారి ఇంట్లోనే భోజన ఏర్పాట్లు.

ప్రతి సంక్రాంతికీ అమ్మ నాన్నగారి పాదాల మీద సంక్రాంతి పండ్లు పోసి నమస్కారం చేసి అపుడు మా అందరిని వరుసలో కూర్చుండచేసి మా తలల మీద సంక్రాంతి భోగిపండ్లు పోసేది.



ప్రతి మే5న, ఆగష్టు 15న ఆవరణ అంతా తిరిగి కొబ్బరికాయలు కొట్టి పసుపుకుంకుమ నాన్నగారితో కలిసి ఆవరణ అంతా చల్లేది. గుడిమీదికి ఎక్కి వందలలో నాన్నగారితో కొబ్బరికాయలు కొట్టించేది. గుడి మీద అమ్మ నాన్నగారి మెళ్ళో పూలదండలేసి పాదాల మీద పూలు పోసేది. నాన్నగారు అమ్మ మెళ్ళో దండవేసి శిరస్సు మీద పూలు వుంచేవారు. కాని 1980లో నాన్నగారు అమ్మ మెళ్ళో పూలమాల వేసి పాదాల మీద పూలు పోసారు. అది వీడియో పట్టుకున్నది. మళ్ళీ మే 5 రాలేదు. నాన్నగారు 1981 ఫిబ్రవరి 17 దేవాలయంలో ప్రవేశించారు. నాన్నగారు కూడా అమ్మకు బిడ్డే అయినాడు.

1980లో అమ్మకు సుస్తీగా వుంది. డాక్టర్లు వచ్చారు. చూచారు కొందరు. Lungs లో Lung cancer అన్నారు. లేదా ........ అన్నారు. ఎడతెరిపి లేకుండా దగ్గుతుండేది. బాగా కళ్ళెపడుతుండేది.

ఒక ఆదివారం అమ్మ దగ్గరకు చేరాను. అమ్మ అన్నది "నాన్నగారు వైద్యం నిమిత్తం హైద్రాబాద్ వెళదాం అంటున్నారురా ? నీవు ఏమంటావు" అని.

"నేనేమంటానమ్మా ! నీకు హైదరాబాదు వెళితే నయమవుతుందని అనిపిస్తే వెళ్ళటం మందిదే కదమ్మా!"

"నేను వచ్చేదాకా సంస్థకు డబ్బు అవసరమయితే సర్దుతానని మాట ఇస్తే వెళతానురా" అన్నది. "నేనెంతవాడినమ్మా ! నీకు మాట ఇవ్వటానికి. నేను చేయగలనని నీవు మాట ఇస్తే నేను నీకు మాట ఇస్తాను" అన్నాను. అమ్మ నా చేయి తన చేతులలోకి తీసుకొని నవ్వుతూ "నీవు చేయగలుగుతావు నాన్నా" అన్నది. కాని అమ్మ హైద్రాబాద్‌లో వున్నన్నాళ్ళ నేను పెద్దగా సహాయపడింది ఏమీ లేదు. ఏదో కొద్ది మొత్తం తప్ప. అపుడు కామేశ్వరరావు గారు ఆఫీసు ఇన్‌ఛార్జ్. ఎపుడు అడిగినా "అవసరము లేదయ్యా ! అయినా వీలయినంతవరకూ నిన్ను అడగ కుండానే సర్దుబాటు చేసుకుందామని అనుకున్నానయ్యా!" అనేవారు.

అమ్మ హైద్రాబాద్‌లో వున్నరోజుల్లో ఒకరోజు నాన్నగారు అమ్మను అడిగారు. "నీవు శరీరంతో వుండగానే నన్ను ముందు పంపే తరువాత వెళ్ళు అని" అడిగి అమ్మ దగ్గర నాన్నగారు మాట తీసుకున్నారు "సరే" నని.

నాన్నగారికి అమ్మ సర్వసమర్ధత మీద ఎంత నమ్మకమో.

అమ్మ హైద్రాబాద్‌లో వున్నన్నాళ్ళు అమ్మగారి భర్తననే భావన ఏమాత్రం లేకుండా కలిసిపోయేవారు. ఎందరో డాక్టరులు అమ్మను చూచిపోతుండేవారు. ఎందరో పెద్దలు, భక్తులు వస్తూ వుండే వారు అమ్మ దర్శనానికి. అయినా నాన్నగారు చాలా సింపుల్‌గా వుండి అందరితో కలిసిపోయి, తనను గుర్తించాలని తాపత్రయం ఏమాత్రం లేకుండా ఉండేవారు. అదీవారి గొప్పతనం.

అమ్మ జిల్లెళ్ళమూడి వచ్చిన తరువాత ఒకరోజు నాతో అంటుంది "నాన్నగారు తనని ముందు పంపమంటున్నారురా !" అని.

"నిజమే కదమ్మా ! నీవు వుండగా మేము వారిని గౌరవించినట్లు నీవు లేనపుడు అట్లా చూడగలుగుతామని నమ్మకమేమిటి? వారి అభ్యర్థన ధర్మమే కదమ్మా !" అని అన్నాను.

"అంతేనంటావా?" అని మౌనం వహించింది. అందుకే అమ్మ నాన్నగారిని తన కన్నా ముందే అంటే 1981 ఫిబ్రవరి 17న తనలో కలుపుకొని వారి భౌతిక శరీరాన్ని దేవాలయంలో ప్రతిష్ఠచేసి, అనసూయేశ్వరాలయంగా నామకరణం చేసింది. అక్కడ నిత్యమూ జరగవలసిన పూజా కార్యక్రమములు నిర్ణయించి తాను చేసి మనతో చేయించింది. తరువాత 1985 జూన్ 12న తనూ దేవాలయంలో ప్రవేశించి వారి ప్రక్కనే ప్రతిష్ఠ చేయించుకున్నది. అందుకే వారు అనసూయేశ్వరులు. శివశక్తి స్వరూపులు అయినారు. అర్థనారీశ్వరులు అయినారు.





# నాన్నగారితో



శ్రీ వి.భాస్కరశర్మ, శృంగవరపుకోట

"నేను నేనైన నేను" అన్ని తానైన నేను అని ఘంటాపథముగా నొక్కి వక్కాణించి, ఆచరణశీలియై, మార్గదర్శియై, విశ్వజననియై మాతృశ్రీ అవతారమూర్తియై "అమ్మ" అందరికీ అమ్మయై వెలుగొందిన మన ప్రేమావతారమూర్తి దక్షిణ భాగమున సుస్థిరస్థాన మేర్పరచుకున్న మహానుభావుడు నాన్నగారు. "జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ" అనునట్లుగా నాన్నగారితో నేను ఆ నేను అన్న మేను అమ్మ. సాధారణముగా అమ్మతో తొలి స్పర్శ కల్గి అంతా అమ్మే అని జీవనం ప్రారంభించి చనువుగా ఉంటూ ఏమి కావలసి వచ్చినా అమ్మ ద్వారా అన్నీ అడగటం పరిపాటి. కనుక జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను చూచి ఆనందబాష్పములు రాల్చి అమ్మ దివ్యచరణార విందములు స్పృశించి ఏవో ! చెప్పనలవి కాని ఆనందానుభూతిని పొందటం అందరికీ అనుభవైక వేద్యమే.

ప్రస్తుతం అమ్మ అనంతోత్సవములు, నాన్నగారి జయంత్యుత్సవములు కలిసి జరుపుతున్న యీ శుభతరుణములో - నాన్నగారి సాహచర్యంతో నా అనుభవము పొందుపరచదలచి యదార్థ విషయము మీ ముందుంచుతున్నాను.

ఆనాడు అంటే 1978 సంవత్సరంలో జూన్‌లో జిల్లెళ్ళమూడి గ్రామంలో ప్రవేశించాను. అంతకు ముందు విజయనగరం, విశాఖపట్నం జిల్లాల్లో 10వ తరగతి వరకు విద్యాభ్యాసము చేసి, 75, 76 ప్రాంతాలలో రాజమండ్రి గోదావరీతీరంలో వేద, స్మార్త విద్యను కొంచెం పఠించి ఆర్.యస్.యస్.కార్యకర్తగా అజ్ఞాతవాసం, కారాగార సందర్శనం ఇత్యాది కార్యక్రమాలు ముగించి స్నేహితుల వార్త ద్వారా జిల్లెళ్ళమూడి చేరి మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీలో "సాహిత్య విద్యా ప్రవీణ" కోర్సులో జేరి, విద్యాధ్యయనం సాగిస్తున్న రోజులు. ఎన్నో ఆచార, సంప్రదాయ, సమిష్టి కుటుంబాల వారితో, వ్యష్టి కుటుంబ వ్యక్తులతో పరిచయం, చాలప్రాంతాల అలవాట్లు గతంలో చూచిన నేను ఒక్కసారిగా జిల్లెళ్ళమూడి రావటం, అంతా క్రొత్తదనం తొలి అమ్మదర్శనం ఏవో తెలియని ఏడుపు. కళాశాల ప్రవేశం అధ్యాపకుల ఆదరణ, విద్యాబోధన కొంచెం కష్టమనిపించినా క్రమేపి ఆ ఆనందమే ఆనందము. ఆర్.యస్.యస్.శాఖ ముఖ్యశిక్షక్‌గా గ్రామస్థులతో, ఆవరణలో వారితో కళాశాల విద్యార్థినీ బృందంతో అమ్మ ఆశీస్సులతో బ్రహ్మాండంగా సాగుతున్నది జీవితం. బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు కరణంగారు; 1978 నవంబరులో (కార్తీకమాసం) తొలిసారిగా స్పర్శనం, భాషణం అకస్మాత్తుగా ఆనందం జరిగింది. అతఃపూర్వం ఆగష్టు 15 కళాశాల పతాకావిష్కరణలో దర్శనం జరిగింది. క్రొత్త కనుక ఏ అనుభూతి లేదు. ఈశ్వరేచ్ఛ. కార్తీకమాసంలో ఆవరణలో పోస్టుఆఫీసు చివరిగదిలో యుండేది. ఎదురుగా నవారు మంచం, బొంత, దిండు, కల్గి నాన్నగారు కూర్చొన్నారు. సాయంత్రం 5 గంటల సమయం "ఒరేయి! ఇట్లా రారా ! అనే పిలుపు ఎంత ఆనందం కల్గించిందో ఏ లోతుల్లోకి పోయి పదాలు వెతికినా లేవు. నమస్తే అండి- అన్నాను. కనీ కనిపించని మందహాసం, కళ్లలో అరుదుగా కనిపించే నీలిరంగు కళ్లు. ఏవో నమలుతున్నట్లు అన్పించే దవడల కదలిక. చిన్న బొట్టు అదొకరకమైన తేజో విలాసమూర్తి నాకు గోచరించాడు. ఏరా నీవెక్కడి నుండి వచ్చావు? ప్రశ్న :



విశాఖపట్నం జిల్లా అండీ అన్నాను. బాగుందా ? చదువు సాగుతున్నదా? అన్నం సహిస్తున్నదా? అని అడిగే ప్రశ్నలకు బిత్తరపోయాను. ఎందుకంటే అప్పటికి 10, 15 రోజుల నుండి నాలాంటి క్రొత్త విద్యార్థులు ఏవో సాకులు చెప్పి పలాయనం చిత్తగిస్తున్నారు. నన్ను కూడా ప్రిన్సిపాల్ విశాల రామచంద్రమూర్తిగారు, సీనియర్ విద్యార్థులు కొంతమంది ఫరవాలేదు, వెళ్లకు, చదువుకో బాగుంటుంది కొద్ది రోజులలో అంతా అలవాటవుతుంది లే అని చెప్పడం జరుగుతున్నది. మరి అది తెలిసి అడిగారా! లేక వారి సొంత ఆలోచనా? అన్పించింది. వాకబు ప్రారంభించా. అర్థనారీశ్వరుడు గదా యీ నాగేశ్వరుడు అనుకున్నాను. అమ్మ భర్త కదా ! గ్రామం, విశ్వజననీ సంస్థ. కాంగ్రెస్ పార్టీకి పెద్ద దిక్కు. చాల గొప్పవారు. అతనితో మన పరిచయం ఏమంత సమంజసముగా ఉంటుంది? మనతో మాట్లాడటానికి ఇష్టపడతారా ? అనే ఆలోచనల్లో ఉండేవాణ్ని. అట్లాంటి పరిస్థితులలో ఒక్కసారిగా బంధువుల్లో ఒకరిలా, తండ్రివలె ఆ పిలుపుకు చైతన్యదీప్తి కలిగినట్లయింది. సరే ! క్రమేణ నాకిష్టమయిన నాటకరంగము, క్రీడారంగము నాన్నగారికి ఇష్టమగుట ఒక అదృష్టము. సిద్ధాంత రీత్యా మాత్రం వారు నెహ్రూ కుటుంబ అభిమాని. నేను ఆర్.యస్.యస్. కార్యకర్తను అయినా విచిత్రమైన సంఘటన అమ్మ కల్పించింది తెలియపరుస్తాను.

నాకు ఇష్టమైన పనులలో పెద్దవారిని, రాజకీయ, పండితవర్గము వారిని అలా కోన ప్రభాకరరావుగారిని, పరకాలశేషావతారము గారిని, సి.నాగభూషణం గారిని, (నటులు) మరోనటుడు సి. హెచ్. నారాయణరావుగార్ని, క్రీడాకారుడు పిచ్చయ్యగార్ని నాన్నగారే స్వయంగా పరిచయం చేసారు. తలచిన కొద్దీ ఆనందం కల్గించే సన్నివేశము. సుబ్బారావు అన్నయ్య కూడా ఆ విధముగానే క్రొత్తవారిని, పెద్దవారిని ప్రత్యేకముగా పరిచయ చేసేవారు. అమ్మ దయవలన పండితలోక దర్శన జరిగింది. ప్రదసారాయ కులపతి గారు నిర్వహించి సరస్వతీ సామ్రాజ్యవైభవము అంతులేని ఆనంద కల్గించింది. సాయంత్రం పూట గాని, రాత్రి 8 గంట దాటిన తరువాత గాని, ఉదయం గాని తీరికను బ నాన్నగారితో టేబుల్ టెన్నిస్ భోజనాలయ ఆవరణ ఆడుతున్నప్పుడు ఇతడు ముదుసలి కాదు సవ్యసా అన్పించేవారు. కోర్టులో బేడ్‌మెంటెన్ ఆడినా అం స్థాయిలో ఒక్కొక్కసారి కొండముది రామక్రిష్ణగార వాలీబాల్ ఎక్కువగా ఆడినా బ్యాట్ కూడా తీసుకొ నాన్నగార్ని ఉత్సాహపరుస్తూ ఆడుతుంటే నాన్నగారు రెచ్చిపోయి ఆయనకు ఆయనే సాటి మేటి అనిపించారు తరువాత చెప్పారు నేను బ్యాడ్‌మెంటన్ ప్లేయరుని అని.

"ఉత్తమే క్షణకోపస్య" అన్నట్లు తమాషాగా భ కోప్పడేవారు. అర్థరాత్రి 12.30ని.లు సమయంల విజయనగరం జిల్లా టూరిస్టు బస్సులు 2 తిరుప నుండి జిల్లెళ్ళమూడి వచ్చాయి. ఆవరణలో పరీక్షార్థులపై తిరుగుతూ చదువుకుంటున్నాము. నన్ను తెలిసినవారు నాకు తెలిసినవారు యున్నారు. సీతాపతిగారు, నేను వాళ్ళకి కుళాయిలు చూపెడుతున్నాం. భోజనమున ఏర్పాటు చేస్తున్నాము. నాన్నగారు మెలుకువ కల్గి లేచి వచ్చారు. ఏందిరా గోల ఈవిడగారు తయారైంది. ఎక్కడెక్కడి నుండి వస్తారో ఎప్పుడు రావాలో కూడా తెలీదు వీళ్లకి ఏంది భాస్కరా ! వాళ్లు మీ ఊరేనట్రా ! చెప్పు అ శేషయ్య గార్కి రేపు. ఎందుకు జరుగుతున్నదీ యిదంతా వేదాంత వైరాగ్య వాక్యములనుకుంటూ శయ్యాగృహంలోనికి వెళ్లారు. ఇటువంటి ఈ సంఘటనలు చాలా యున్నాయి. క్షణమే కోపం, హైమాలయంలో అర్చకస్వాములు సెలవు పెట్టినా



బాపట్ల నుండి రాకపోయినా అభిషేకం చేయటానికి పాల్గొనేవాడిని, ఒకసారి కాలేజి సమయంలో వడివడిగా హైమాలయానికి పరిగెడుతుంటే, ఏరా ఈ పూజలు అభిషేకాలు చేస్తావురా ? అని అడిగారు. అవునండీ అందుకే వెళ్తున్నాను. చాలామంచిదిరా, పనికొస్తావు అని వూరుకున్నారు.

కరణం పాత్రలో గ్రామస్థులతో మాట్లాడటం, మున్సబుగారి కుటుంబసభ్యులతో చర్చించటం, నాటికలు రిహార్సల్సు చూచి ప్రోత్సహించటం. ఆడుతున్నప్పుడు సునాయాసంగా మాతో ఆడటం, స్లాబులు వేస్తున్నప్పుడు ఆ చేతి పుండ్లు చూచి మందులు యిప్పించుట, గుండిగలతో నీళ్ళు మోస్తున్నప్పుడు శక్తికి తగ్గ బిందె పట్టుకోవాలిరా. సులువు సూత్రం తెలుసుకోవాలి అను సూచనలు యివ్వటం.

"పద్మపత్రమివాంభసా" అన్నట్లుగా సంస్థాగత కార్యక్రమాలు భారీ ఎత్తున జరుగుతున్నా, తనకు పట్టనట్లుగా కన్పించినా, అన్ని, అంతటా ఆలోచిస్తూ కీలకమైన మౌలికమైన సలహా సహకారములు అందజేసే వారు. నాకు బాగా తెలుసు. అమ్మ అనుయాయులందరికీ పెద్దాయిన, నాయన నాన్నగారే. రాఘవరావు మామయ్యను సిగరెట్లు మానమని నయానా, భయానా చెప్పేవారు. లోకనాథం బాబయ్యకు అసలు మాట్లాడటానికే భయం. నాన్నగారే ముందుగా పలుకరించి అభయం యిచ్చేవారు. నిర్భయముగా, నిర్మొహమాటముగా, కుండబద్దలు కొట్టేటట్లుగా గంభీరస్వరము, సంప్రదాయ దుస్తుల ఖద్దరు పంచె, బనియను లాల్చీ నిరాడంబరముగా, హిందూ మతమును ఆరాధిస్తూ మిగిలిన మతములన్నింటినీ ఆదరిస్తూ ఉపకారం చేయటానికి ఉరకలు వేసే మనస్సుతో ఉత్సాహముగా వయస్సును మరచి మరీ ప్రవర్తించేవారు మంచి ఆరోగ్యశాలి.

## విచిత్రమైన సంఘటన

1983 వ సంవత్సరము "రక్షాబంధన్" శ్రావణ పౌర్ణిమ రాఖీ దినోత్సవము ఆర్.యస్.యస్. శాఖలో సంప్రదాయబద్ధముగా జరిపే ప్రక్రియ. రక్షలు కట్టుకోవటము నేను నీకు రక్ష, నీవు నాకు రక్ష, మనం దేశానికి రక్ష, అని ప్రతిజ్ఞ చేస్తారు. నాకు కనిపించిన ఎప్పుడూ ఆస్థాన విద్వాంసులు వలె కాలేజి పంద్రాగస్టు త్రివర్ణ పతాకం నాన్నగారే ఆవిష్కరిస్తున్నారు. అర్హత, నిండుతనం, భేషుగ్గా ఆయనకే చెల్లింది. ఈసారి నుండి "భగవద్ధ్వజం" నాన్నగారి చేత ఎగురవేయిస్తే మంచిది అనిపించింది. ముఖ్యశిక్షక్‌ని, సంఖ్యకు లోటు లేదు, సభ నిండుగా ఉంటుంది. ఫరవాలేదు. కాని కరడు కట్టిన కాంగ్రెస్‌వారు, నెహ్రూ కుటుంబంపై ప్రేమాభిమానం గలవారు, ఒకరకమైన సిద్ధాంతం పుణికిపుచ్చుకున్న పుణ్యజీవి. అవన్నీ ప్రక్కన పెడితే, భాస్కరశర్మ, ఏమో ? ఎందుకిది ? తన మనసుకి నచ్చినవ్యక్తి, అభిమాని. అడిగితే కాదనకూడదు. అనుకున్నారేమో ? నేను మాత్రం కాస్త చనువుగా, కొంచెం భీతితో నాన్నగారు వచ్చి తీరాలన్న ప్రీతితో సాహసం చేసి ఆర్.యస్.యస్. శాఖ రక్షాబంధనంనకు ఆహ్వానించాను. కొంచెం నసిగినా, ఏదో సరదా సణుగుడు ప్రారంభించి ఉత్సాహముగా విచ్చేసారు. ఆవరణ వారు గ్రామస్థులు, ఖగ్గావారు, రెడ్డివారు, కోమట్లు, శ్రీ పన్నాలవారు, విఠాల వారు, బి.ఆర్.కె.గారు, ప్రసన్నాంజనేయశర్మగారు, విద్యార్థులు అందరూ హాజరయినారు. సంఖ్యాబలం ఎక్కువగా ఉన్నందున సంఘస్థాన్ ప్రస్తుతం రాధ అన్నయ్య సమాధి గల్గిన సువిశాల పంట భూములలో ఏర్పాటు చేయుట జరిగినది. నిత్యం హాజరవుతున్న దత్తాత్రేయశర్మ మన్నవ, రావూరి ప్రసాద్ తెనాలి వెల్లారు. అమ్మపై అంతస్థు నుండి సాయంకాల సమయం తెల్లటి చీర భారతమాత వలె



వీక్షించు శుభసమయం బౌద్ధిక్ విఠాలవారు నిర్వహించారు. నాన్నగారిచే ధ్వజావిష్కరణ ప్రణామ్ తీసుకొనుట జరిగినది. వికిర అని సంజ్ఞ రాగానే అందరూ ఒక్కచూపులో నేరుగా అమ్మని, మమ్ములను అమ్మ పరస్పర వీక్షణములతో నాన్నగారితో సహా మేమందరము ప్రణామ్‌ని నమస్కారముగా (అప్రయత్నం) మార్చివేయుట జరిగినది. అమ్మవద్ద రామక్రిష్ణ అన్నయ్య, వసుంధర అక్కయ్య, బ్రహ్మాండం శేషక్కయ్య, బుద్ధిమంతుడు అన్నయ్య వగైరాలున్నారు. నాన్నగారు కాషాయధ్వజం ఎగరేస్తున్నా రేమిట్రా? భాస్కరశర్మ తీసుకెళ్లింటాడు - అని అన్నట్లు తరువాత తెల్సింది.

ఆ తరువాయి నాన్నగారు నాతో - ఓరేయి. క్రమశిక్షణ, వ్యాయామం వీటి వరకు ఫరవాలేదు గాని, మతోన్మాదం, కాంగ్రెస్‌ని దూషించటం యిలా కొన్నింటిలో ఏకీభవించలేనురా. నేను వచ్చేవాణ్ణి కాదసలు. నీవలనే వచ్చాను. నీ గురించే వచ్చాను అని చాలాసార్లు అన్నారు. కొందరు ఆశ్చర్యము వ్యక్తం చేశారు. నాన్నగారి రాకతో సంఘపరివార్ కుటుంబము పెరిగి పెద్దదైనది. ఆ తరువాయి సంఘ పెద్దలు భాగయ్యగారు, కప్పగంతుల కోటేశ్వరశర్మగారు, సోమయ్యగారు, హోల్దేకర్‌జీలు వచ్చి అమ్మ ఆశీస్సులు, నాన్నగారి అభినందనలు వస్త్ర, భోజన సత్కారంలో తీసుకొని ఆనందించారు. గుంటూరుజిల్లాలో సంఘశిబిరములక జిల్లెళ్ళమూడి నంఖ్య 300 తగ్గేది కాదు వజ్రోత్సవమునకు, నాన్నగారే స్వయముగా ఏరా ? మీ వాళ్లు ఎంత మంది సర్వీసుకు రాగలరు అని అడిగి మనవాళ్లు అని అనండి నాన్నగారూ ! అదేలే పో మనవాళ్లు అని చమత్కారంగా అని సంఖ తెలుసుకొనేవారు. అమ్మ కరుణామయి, నాన్నగార కరుణామయుడు ప్రస్తుతంలో మన పాట్రన్ బ్రహ్మాండ రవి అన్నయ్య వద్ద కాసేపు నిల్చొని పరిశీలన చేస్తే అని కోణాలలో నాన్నగారు పూర్తిగా దర్శనమిస్తారు.

రామక్రిష్ణా మఠము వారి త్రిమూర్తి చిత్రాల వివేకానంద, రామక్రిష్ణ, శారదామాత, అర్కపు అందరిల్లు వారి త్రిమూర్తి చిత్రాలు హైమ అమ నాన్నగారలు స్టికర్సుగా యీ యుగళ ఉత్సవము సందర్భముగా ముద్రించినట్లయితే బాగుండును ఆలోచన. అరవైయ్యో పడిలో ఉన్ననూ, ఇరవయ్యే యువకునిగా క్రీడారంగంలో భాసించిన వ్యక్తి. వార్ధక్యం మరచి యౌవనవంతుడై సేవా, సహాయాలందించి మూర్తి, త్రికరణశుద్ధిగా గాంధీ మార్గమును ఆచరించి శక్తిమాన్, ఎందరికో స్ఫూర్తి గల్గించిన నాన్నగార్కి ప్రేమ సవినయ సాదర నమస్కార సుమములతో.

✤✤✤

## నమస్సుమాంజలులు

శ్రీమతి డా॥ఎమ్.బి.డి.శ్యామల, బాపట్ల

జగదీశ్వరి భాగేశ్వరుడవు.
నాగేశ్వరుడవు నీ వీ జగతికి ఆరాధ్యుడవు.
జగన్మాతకు ఆధారుడవు.
చల్లని చూపుల జగత్పితవు.

నీ వప్పుడు ఉన్నది ఒక్క చోట
నేడిప్పుడు నీవు లేని చోటు లేదు.
సర్వం నిండిన నీకు
అర్పిస్తున్నాను నా హృదయ సుమాంజలులు



# తల్లిదండ్రుల వంటి అత్తమామలు

శ్రీమతి బ్రహ్మాండం శేషు, జిల్లెళ్ళమూడి



శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారి (నాన్నగారి) ఇంటి కోడలు కావటం నా అదృష్టం. అమ్మ, నాన్నగారు, హైమ .... కుటుంబసభ్యులంతా ఏకాభిప్రాయంతో కోరి నన్ను సాదరంగా వారింట్లోకి ఆహ్వానించారు. తల్లి లాంటి అత్త, తండ్రి లాంటి మామ, దేవతలాంటి ఆడబిడ్డ లభించటం నాకు గర్వకారణం.

మా నాన్నగారు శ్రీమతుకుమల్లి శ్రీధర్‌రావుగారు. మా స్వస్థలం తెనాలి. అమ్మ (అనసూయమ్మ), మా నాన్న పెదతల్లి పినతల్లి బిడ్డలు. మా నాన్నకంటే 'అమ్మ' పెద్దది. కావున 'అనసూయక్క' - 'నాగులుబావ' అని పిలిచేవాళ్ళు.

మా బామ్మ తాతయ్యగార్లు అప్పికట్ల దగ్గర భర్తిపూడిలో ఉండేవాళ్ళు. వాళ్ళు అమ్మకి పిన్ని, బాబాయి అవుతారు. ఒకసారి అమ్మ వాళ్ళింటికి వెళ్ళింది. అప్పుడు అమ్మ సుబ్బారావు అన్నయ్యని కడుపుతో ఉన్నది. అమ్మ అలిసిపోయి మా నాన్న పడుకునే మంచం మీద పడుకున్నదిట. మా నాన్న 'నా మంచం నాకు ఇవ్వు లేకపోతే పడేస్తా' అన్నాడు. అప్పుడు అమ్మ, "నా కొడుక్కి నీ కూతుర్ని చేసుకుంటారా, శ్రీధరా!" అన్నదిట. మేము ఇద్దరం పుట్టకుండానే అమ్మ నిర్ణయించింది.

1967లో నేను బంధువుగా జిల్లెళ్ళమూడి వచ్చాను. ఏడాది పాటు నాన్నగారింట్లోనే ఉన్నాను. అపుడు నాకు 13 ఏళ్ళు. నన్ను అమ్మ, నాన్నగారు, హైమ ఎంతో ఆప్యాయంగా చూసేవాళ్ళు. హైమక్కతో కలిసి తిరిగేదాన్ని. నాన్నగార్కి చేతనైన సపర్యలు చేసేదాన్ని. అప్పట్లో వసుంధరక్కయ్య నాన్నగార్కి అన్నం వండిపెట్టేది. ఆ రోజుల్లో నేను రజస్వల అయ్యాను. నాన్నగారు మునసబు గారిని బాపట్ల పంపి నాకు రెండు పరికిణీలు, రెండు వోణీలు కుట్టించి పెట్టారు. అప్పుడు ఊళ్ళో వాళ్ళూ ఆవరణలో వాళ్ళూ "అబ్బో ! కోడలికి బట్టలు పెట్టుకున్నారే!" అని అన్నారు.

నా పెళ్ళికి ముందు 'అమ్మాయ్' అనీ, పెళ్ళి అయిన తర్వాత 'శేషమ్మా' అని పిలిచేవారు నాన్నగారు. అమ్మ పంచిన ప్రేమను గురించి చెప్పనవసరం లేదు. రెండు చేతులతో పొదివి పట్టుకుని, నా తలను తన గుండెలపై పడుకోబెట్టుకుని, ముద్దు పెట్టుకుని పసిబిడ్డలా లాలించింది. గారం చేసి కన్నతల్లిని మరిపించింది. ఆవరణలో వాళ్ళూ, ఊళ్ళో వాళ్ళూ 'కోడలిని దగ్గర పెట్టుకున్నారు' అని అంటూండేవాళ్ళు.

విజయవాడ ఒకసారి హైమ ప్రకృతి వైద్యం కోసం వచ్చింది. అప్పుడు మేము విజయవాడలో ఉండేవాళ్ళం. మా నాన్న వెళ్ళి రెండు మూడు సార్లు హైమను మా ఇంటికి తీసుకువచ్చారు. హైమతో రుక్మిణక్కయ్య యోగయ్య గారు ఉండేవాళ్ళు. హైమ రుక్మిణక్కయ్యతో "శేషుని మన సుబ్బారావన్నయ్యకి చేసుకుంటే బాగుంటుంది" అన్నది. అందుకు రుక్మిణక్కయ్య "శేషు, సుబ్బారావు కంటె 14 ఏళ్ళు చిన్నది. ఎలా కుదురుతుంది" అన్నది. ఏమైనా హైమ హృదయంలో నా స్థానం అలాంటిదని నాకు ఆనందం.

1968లో నేను తెనాలి మా ఇంటికి వెళ్ళాను. తర్వాత హైమ శరీరత్యాగం చేసింది.



నా వివాహం 1969లో జరిగింది; పూర్తిగా అమ్మకావాలని చేసుకున్నది. పెళ్ళిముహూర్తం ఐదు రోజులుందనగా మాకు వర్తమానం అందింది. మా నాన్న జిల్లెళ్ళమూడి వెళ్ళి నాన్నగార్ని లాంఛనంగ అడిగారు; తక్షణం తాంబూలాలు తీసుకున్నారు; బాపట్ల ప్రెస్ లోనే శుభలేఖలు ముద్రించి వెంట తీసుకు వచ్చారు.

పెళ్ళి అయిన తర్వాత నాన్నగారి భోజనాది సౌకర్యాలు నేనే చూసేదాన్ని. వంట పూర్తి కాగానే ఒక పళ్ళెంలో పెట్టుకుని వెళ్ళి అమ్మకి నివేదన చేసేదాన్ని. ఆ సందర్భంగా "మీ అత్తగార్కి అన్నం పెట్టావా?" అని నాన్నగారు, "నాన్నగార్కి అన్నం పెట్టావా?" అని అమ్మ అడిగేవారు. నాన్నగార్కి పెరుగు ఇష్టం ఉండేదికాదు; జీర్ణం కాదు అనేవారు. ఆయనకి రక్తపోటు ఉండేది. అసలు ఉప్పు వేయకుండా చప్పిడిగా తినేవారు. కానీ ఉప్పు కాస్త పడిందంటే తినలేకపోయేవారు. ఆయన రోజూ తెల్లవారు ఝామున 4గంటలకే నిద్ర లేచేవారు. వెంటనే కాఫీ త్రాగాల్సిందే. మధ్యాహ్నం 11గంటల ప్రాంతంలో భోజనం. సాయంకాలం 6-30గంటల ప్రాంతంలో రేడియోలో ప్రాంతీయవార్తలు వింటూ భోజనం చేసేవారు. రాత్రి 9 గంటల ప్రాంతంలో పచార్లు చేస్తూ "ఏమమ్మా! మీరు ఇంకా అన్నాలు తినలేదా" అని పలకరించేవారు.

నాన్నగారికి బంధుప్రీతి ఎక్కువ. వారి పినతండ్రులు శ్రీ బ్రహ్మాండం సత్యనారాయణగారు, శ్రీ పులిపాక చలపతిరావుగారు, వారి పినమామగారైన అంబారావు గారు, శ్రీ లోకనాథం బాబయ్య, పాప (శారద) అత్తయ్య, రాఘవరావు మామయ్య, మా బాబయ్యలు మురహరి, తేజోమూర్తి గారు తరచుగా వస్తుండేవాళ్ళు. బంధువులంతా ఇటు అమ్మ వైపు అటు నాన్నగారి వైపు చుట్టరికం కలవాళ్ళే. నాన్నగారిక బంధుత్వ రీత్యా మా నాన్న బావమరిది. 'ఏరా శ్రీధరా' అని ఆప్యాయంగా పిలిచేవారు. ఎవరు వచ్చినా త ప్రక్కనే కూర్చొనబెట్టుకుని భోజనాలు చేసేవారు.

నాన్నగారింట్లో చిన్న కార్యక్రమం చేసినా ఆవరణలో వాళ్ళనీ, ఊళ్ళోవాళ్ళనీ పిలిచి తన సరస భోజనాలు పెట్టేవారు. ఆయన పెద్దవారితో పె మనిషిలా, పసివాళ్ళతో పసివాడుగా కలిసిపోయేవారు రాఘవరావు మామయ్య చనిపోవటం ఆయన మీద చాల ప్రభావం చూపింది; మానసికంగా క్రుంగిపోయారు. ఒకనాటి రాత్రి సమయంలో వచ్చి తన మనవరాలు హైమ పక్కనే పొట్టమీద చేయి వేసుకుని పడుకున్నారు. ఆ క్షణంలో అంత పెద్ద మనిషి 'చిన్నబాబు' అనిపించారు.

పసివాళ్ళంటే ఎంతో ప్రేమగా ఉండేవారు హైమని, స్వీటీని ఎత్తుకుని తిరుగుతూండేవారు. ర వేటపాలెంలో ఉద్యోగం చేసేరోజుల్లో పింకీ చంటిపిల్ల దాని మాటలు వినాలని ఆయన వేటపాలెం వెళుతూండేవారు. అమ్మ దగ్గరికి వెళ్ళినపుడు శరత్ చైతన్యలతో కారమ్స్ ఆడేవారు. అమ్మ నాకు ఏది పెడుతూండేది. ఒకరోజు "అమ్మా! రాజ్యం, భవానీ.. వీళ్ళంతా ఉపవాసాలు చేస్తారు. నీకు పూజలు చేస్తారు నేనేమీ చేయటం లేదు" అన్నాను. అందుకు "నువ్వు నాన్నగార్ని కనిపెట్టుకుని చూసుకుంటున్నావు. చాలు అంతకంటే వ్రతాలు, పూజలూ ఏమీ అక్కర్లేదు" అని చెప్పింది.

నాన్నగార్కి గుంటూరు ఆస్పత్రిలో ఆపరేషన్ చేశారు. మంచం మీద ఉన్నవారికి చెంచాతో అన్నం తినిపించేదాన్ని. ఆ సమయంలో డాక్టర్ గారు వచ్చారు "మా అమ్మాయిని చూడండి. కొడుకులా చూసుకుంటోంది" అన్నారు. ఆయనకి వారబ్బాయి



కంటే వీసం ఎత్తు నాపైనే వాత్సల్యం ఎక్కువ అనిపిస్తుంది. ఆ రోజుల్లో సుబ్బారావు అన్నయ్య ఒంగోలు దగ్గర కొబ్బరినూనె తీసే పరిశ్రమ లాంటిది పెట్టారు. అక్కడ తనకి భోజనానికి ఇబ్బంది అని నన్ను తీసుకుని వెడతానన్నారు. అందుకు నాన్నగారు, "వెడితే వాడిని వెళ్ళమను. అమ్మాయిని ఇబ్బంది పెట్టొద్దు. శేషమ్మను తీసుకు వెళ్ళటానికి వీల్లేదు" అని కోప్పడ్డారు. ఏ తండ్రికైనా కోడలిపై కంటే కొడుకుపైనే మమకారం ఎక్కువ. కానీ అదే నాన్నగారిలో ప్రత్యేకత.

ది.16.1.81 తేదీన - తీవ్ర అనారోగ్యానికి గురై అప్పుడే కోలుకున్న అమ్మ "కళాశాల విద్యార్థినీ విద్యార్థులే కాదు, అందరింటి సభ్యులు, కాలేజి సిబ్బంది.... అందరూ అన్నపూర్ణాలయంలోనే భోజనం చేయాలి" అని అమ్మ కోరింది. అమ్మ అభిమతాన్ని సమ్మతించి నాన్నగారు కూడా తన కంచం, గ్లాసు తెచ్చుకుని అందరి సరసన కూర్చుని భోజనం చేసేవారు. అంతవరకు సంతోషమే.

కానీ అన్నపూర్ణాలయంలో పదార్థాలు ఆరోగ్యవంతులకి అమృత తుల్యం, సరిపడ ఉప్పు, పులుపు, కారం వేసి రుచిగా చేస్తారు. అది నాన్నగారికి పడదు; అందుకు వారి ఆరోగ్యం సహకరించదు. ఒకసారి ఛాతీ నొప్పి వచ్చింది. పాపక్కయ్య వచ్చి ఇ.సి.జి.తీసింది. గుండె నొప్పి అని నిర్థారించింది. నాటి నుంచీ నాన్నగారిని ఎక్కడకూ వెళ్ళవద్దన్నాము.

రవి చిరంజీవులు చైతన్య, శరత్‌ల అక్షరాభ్యాసం కోసం అంతా జిల్లెళ్ళమూడి వచ్చారు. శుభకార్యం జరిగింది. తర్వాత వాళ్ళంతా ఉండిపోయారు.

తర్వాత (మూడవరోజు) అని గుర్తు. ది.16.2.81 తేదీ నాటి రాత్రి నాన్నగార్కి కొంచెం అసౌకర్యం కలిగి 'అమ్మాయిని పిలవండి' అని కబురు చేశారు. విన్నవాళ్ళకి వారి మాట సరిగా అర్థం కాలేదు. నాకు ఆ కబురు అందలేదు. తెల్లవారుఝామున లేచి ఛాతీనొప్పిగా ఉందమ్మా అన్నారు. పాపక్కయ్య అన్ని పరికరాలను, మందులను సిద్ధంచేసికొని అక్కడే ఉన్నది. వెంటనే ఆక్సిజన్ పెట్టడానికి ఏర్పాటు చేసింది. ఈ లోగా నాన్నగారు నా భుజంమీద పసివానిగా వ్రాలిపోయారు. వారికి నాపై ఉన్న పితృవాత్సల్యానికి చిరస్మరణీయమైన సంఘటన.

17.2.81తేదీన నాన్నగారు, 14.2.85తేదీన అమ్మ ఆలయ ప్రవేశం చేశారు. ఆ పుణ్యమూర్తులకు ఎంతో కొంతసేవ చేసుకున్నాననే తృప్తి నాకు మిగిల్చారు.

అమ్మ నాన్నగార్లతో సన్నిహిత సంబంధం గల అన్నయ్యలు, అక్కయ్యలు చాలమందికి మా కుటుంబం మీద అభిమానం ఉంది. అంటే వారిని అమ్మ తన కుటుంబ సభ్యులుగా దగ్గరకు తీసింది. ఉదాహరణ: శ్రీ నాదెండ్ల లక్ష్మణరావు, శ్రీ రాచర్ల లక్ష్మీనారాయణగారల కుటుంబాలు.

ఒకసారి లక్ష్మీనారాయణ అన్నయ్యకి వ్యాపారంలో చాల నష్టం వచ్చింది. నేను అమ్మ ఆలయానికి వెళ్ళి "నాన్నగారూ! మీరే ఆదుకోవాలి" అని ప్రార్థించాను. నాటి రాత్రి కలలో నాన్నగారు కనిపించి, "మీ అమ్మ గార్కి చెప్పవమ్మా" అన్నారు.

మరొకసారి ఉగాది పండుగనాడు ఆలయానికి వెళ్ళి "నాన్నగారూ! మమ్మల్ని ఆశీర్వదించండి" అని ప్రార్థించాను. నాటి రాత్రి కలలో "నువ్వు నన్ను ఆశీర్వదించమని అడగాలా, అమ్మా! మా ఆశీస్సులు నీకు ఎప్పుడూ ఉంటాయి" అన్నారు.

'అమ్మ' - 'నాన్నగారు' నాకు తల్లిదండ్రులవంటి అత్తమామలు.







# తమసోమా జ్యోతిర్గమయ

శ్రీ కొండముది హనుమంతరావు, హైదరాబాద్



నాన్నగారు బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు, మా నాయన కొండముది సుబ్బారావుగారు వరుసకు అన్నదమ్ములు. అదెలాగూ అంటే కనకమ్మ బామ్మ (నాన్నగారి కన్నతల్లి) మా నాయనమ్మ లక్ష్మీనరసమ్మ వరుసకు అక్కాచెల్లెళ్ళు - వారిద్దరూ మన్నవవారి ఆడపడుచులు; (జిల్లెళ్ళమూడి) అమ్మ కూడా మన్నవవారి ఆడపడుచే. అంతేకాదు - అమ్మకు సమవయస్కురాలు, బాల్యంలో సహచరి అయిన మా అత్తగారు(బాలాత్రిపుర సుందరి) కూడా మన్నవవారి ఆడపడుచే ! చిత్రమేమిటంటే - వీరందరి పుట్టిళ్ళూ మన్నవ గ్రామమే. అమ్మజననంతో ఆ గ్రామం పునీతమైంది.

నాన్నగారికీ మా నాయనకూ మధ్య ఉన్న ఈ బాంధవ్యం కంటే స్నేహబంధం మరింత గాఢమైనది. మా నాయన వయసులో నాన్నగారికంటే అయిదారేళ్లు పెద్ద అయినప్పటికీ వాళ్ళిద్దరూ ఒక కంచంలో తినకపోయినా, ఒక మంచంలో పడుకునేవారు, ఒకరి భుజాల మీద మరొకరు చేతులేసుకుని తిరిగేవారు. ఒకరిని విడిచి మరొకరు ఉండేవారు కాదు. నాన్నగారి - అమ్మల కళ్యాణం జరగాలని కోరుకున్నవాళ్ళలో మా నాయన ప్రధముడు అనేది ఆ రోజుల్లో మన్నవగ్రామస్థులందరికీ తెలుసును; ఈ లోకకళ్యాణకార్యానికి ప్రధానసూత్రధారి అమ్మయే అయినా, మానాయన పాత్ర ఎంతో కొంత ఉన్నది అనేది బంధుజనమెరిగిన నిజం.

నాన్నగారికీ, మా నాయనకూ మధ్య ఉన్న సాన్నిహిత్యం, సాంగత్యం ఎంత బలమైనదీ అంటే మా నాయన గుంటూరు ప్రభుత్వాసుపత్రిలో సర్జరీ చేయించుకుని, మూడురోజులు మంచంలో ఉంటే ఆయన్ని కంటికి రెప్పలా కాపాడిందీ, ఆఖరు శ్వాసవిడిచి పెట్టినప్పుడు మంచం పక్కనే ఉన్నది నాన్నగారే ! అప్పు మానాయన వయస్సు మూడుపదులు మాత్రమే ! నా నిండా మూడేళ్ళయినా లేవు. ఈ విషయాలు నీకె తెలుసునూ అంటే మా నాయనమ్మ లక్ష్మీనరసమ్మ చెపు ఉండేది.

ఈ ప్రస్తావన ఎందుకంటే నాన్నగారు ఎం స్నేహశీలియో, మరెంత సౌజన్యమూర్తియో తెలియజే టానికి, ప్రాణస్నేహితుడు ఎలా ఉండాలి అం నాన్నగారిలా ఉండాలి అనీ చెప్పటానికి.

ఎన్నిమాటలు ఎన్నిగంటలు చెప్పినా తీపి అం ఏమిటో తెలియని పసివాడికి చిటికెడు పంచదా అరచేతిలో వేసి తినిపిస్తే, తీపి ఎలా ఉంటుందో క్షణం తెలిసినట్లుగా - స్నేహమాధుర్యం ఇసుమంతైనా ఎరగ మనసులేని మనిషిని నాన్నగారి సన్నిధిలో కూర్చోపె నాలుగు నిమిషాలు నాన్నగారితో మాట్లాడించినా లే ఏడడుగులు నాన్నగారితో నడిపించినా స్నేహం ఇం మధురమా అని అబ్బురపడిపోతాడు; స్నేహం కం తీయనిది మరొకటి లేదని చాటి చెప్తాడు. బంధువుల ఇచ్చేవాడు భగవంతుడయితే, స్నేహితులనేవారు మన మనం సంపాదించుకొనవలసిన గొప్పనిధి అ తెలుసుకోవటమే కాక పదిమందికి తెలియజెప్తాడు.

నాన్నగారు స్నేహానికి నిలువెత్తురూపం.

నాన్నగారి స్నేహతత్వం అందరికీ ఆదర్శప్రాయ

## తొలిదర్శనం

ఇప్పటిమాట కాదు, దాదాపు అరవై ఏళ్ళనా మాట. అది మే నెల, ఎండలు బాగా కాస్తున్నాయి ఒకరోజున మా నాయనమ్మ నాతో, మా అన్నయ (రామకృష్ణ అన్నయ్య) తోనూ అన్నది - "జిల్లెళ్ళమూడి



అనసూయతల్లి నేలమీది మట్టి కాస్త తీసి, మన చేతిలో పెట్టే మంచి వాసన వస్తున్నది. ఆమె మనవంటి మనిషిగా కనిపిస్తున్నా, దైవాంశ ఏదో ఆమెలో ఉన్నదని చెప్పుకుంటున్నారు. అటువంటి మహనీయురాలి దర్శనం చేసుకుంటే చాలును – కాశీ వెళ్ళినంత పుణ్యం వస్తుంది. మీరిద్దరూ జిల్లెళ్ళమూడి వెళ్ళి ఆ తల్లి ఆశీర్వచనం తీసుకోండి – మీకు శుభం కలుగుతుంది."

ఆ మాటప్రకారం మా ఊరు అప్పికట్ల నుంచి మర్రిపూడి, పూళ్ళగ్రామాల మీదుగా మేమిద్దరం నడిచి వెళ్ళాం. అప్పుడు అమ్మ నివాసం ఇప్పుడు హైమాలయం, ఆ వెనుక ఉన్న ప్రదేశం. అక్కడ అమ్మ దర్శనం చేసుకున్నాం.మంచి పరిమళాలు వెదజల్లే మట్టి (ప్రసాదం) ఏదీ అమ్మ మాకుపెట్టలేదు కాని, అంతకు మించిన – కలకాలం గుర్తుండే మాతృవాత్సల్యం – మా ఇద్దరిమీద కురిపించింది. దగ్గర కూర్చోపెట్టుకుని తలనిమిరింది. అప్పికట్ల నుంచి జిల్లెళ్ళమూడికి ఏదారిన వచ్చిందీ అడిగి తెలుసుకున్నది. ఆ రోజుల్లో ఏడోమైలు నుంచి సరైన దారి లేదు. కాలవగట్టుమీదుగా నడిచిరావాలి.

ఇంతలో నాన్నగారు అక్కడికి విచ్చేశారు. అంతకు ముందు రామకృష్ణ అన్నయ్యను నాన్నగారు ఒకసారి చూసి ఉన్నారు కాబట్టి మా ఇద్దర్నీ గుర్తుపట్టారు. తన దగ్గరకు పిలిచి కుశలప్రశ్నలు వేశారు. అప్పికట్లలో ఉన్న మా అమ్మ, మా నాయనమ్మల క్షేమసమాచారాలు అడిగి తెలుసు కున్నారు. అప్పటికే రామకృష్ణ అన్నయ్య అప్పికట్ల కరిణీకం చేస్తున్నాడు, కాని కొత్త. ఆ విషయాలన్నీ వివరంగా అడిగి తెలుసుకున్నాడు.

మా నాయన అప్పికట్ల కరణంగా మా ఊళ్ళోనే కాక బాపట్ల తాలూకాలోనే మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించుకున్నాడని చెప్పారు. ఊళ్ళోవారికి ఏ పని కావలసి వచ్చినా క్షణాలమీద చేసిపెట్టేవాడు, ఆపదలో ఉన్నవారిని ఆదుకోవటంలో ముందు వరుసలో ఉండేవాడు అని చెప్పారు. ఆ విషయాలు ప్రస్తావించేటప్పుడు నాన్నగారి కళ్ళలో ప్రతిఫలించిన సంతృప్తి, సంతోషం ప్రాణస్నేహితుని పట్ల వారికి గల ప్రేమాభిమానాలను, మానవీయ విలువలయందు వారికి గల గౌరవభావాలను బొమ్మ కట్టించాయి. అవి నాన్నగారి సహృదయతకూ, సౌజన్యానికి, సుసంస్కారానికి, సౌశీల్యానికి తార్కాణాలు.

'జిల్లెళ్ళమూడి వెళ్ళిరండి, కాశీ వెళ్ళి వచ్చినంత పుణ్యం వస్తుంది' అని మా నాయనమ్మ ఎందుకు అన్నదో నాకర్థమయింది. నాగేశ్వరునిలో (నాన్నగారిలో) కాశీ విశ్వేశ్వరుడు, అనసూయలో (అమ్మలో) కాశీ అన్నపూర్ణ ప్రసన్నవదనాలతో నాకు దర్శనం ఇచ్చారు. వారిద్దరూ పక్క పక్కనే నిల్చుని నన్నూ, అన్నయ్యనూ ఆశీర్వదిస్తున్న దృశ్యం కళ్ళముందు కదలాడగా, ఒక భక్తి భావం మదిని కుదిపేసింది; కన్నీటిపొర ఆ మధురదృశ్యానికి తెర దింపింది.

ఆ తరువాత నేను ఎప్పుడు జిల్లెళ్ళమూడి వెళ్ళినా ముందు అమ్మదర్శనం చేసుకుంటే నాన్నగారిని చూసివచ్చావా అని అడిగేది అమ్మ; లేదా ముందు నాన్నగారి దర్శనం చేసుకుంటే "మీ అమ్మగారిని చూసివచ్చావా" అని అడిగేవారు. అది తల్లిదండ్రులకు బిడ్డల మీదగల వాత్సల్యానికి, వారి పరస్పర ప్రేమాభిమానాలకు నిదర్శనాలు.

అమ్మను నేను "అమ్మా!" అనే సంబోధించేవాడిని కాని నాన్నగారిని మాత్రం బంధుత్వరీత్యా "బాబాయి" అనే పిలిచేవాడిని. అలా పిలిపించుకోవటమే ఆయనకు తృప్తి, ఆనందం అనే విషయం నోటితో చెప్పకపోయినా ఆయన ముఖంలో నాకు ద్యోతకమయ్యేది. దీనికి నాకు కన్పించిన ఆధారం –

"హనుమంతూ! నిన్ను చూస్తుంటే మీ నాన్న గుర్తుకు వస్తున్నాడురా ! మీ నాన్నా, నేనూ మంచి స్నేహితులం. మృత్యుదేవత మమ్మల్ని విడదీసిందిరా –

బహుశా మా స్నేహాన్ని చూడలేకపోయిందేమో!" నన్ను చూసినప్పుడు వెనుకటిరోజులు గుర్తుకు తెచ్చుకునేవారు.

నాన్నగారికి పాటలంటే ఇష్టం. ఆటలంటే ఇంకా ఇష్టం, నాటకాలంటే, అందునా పౌరాణిక నాటకాలంటే మరీ ఇష్టం. దేశరాజకీయాలను సునిశితంగా పరిశీలించే వారు. గ్రామస్వరాజ్యం మీద వారికి మక్కువ ఎక్కువ.

అమ్మ దర్శనానికి పూలు, పండ్లతో వెళ్ళినట్లే నాన్నగారి దర్శనానికి ఆ రోజు వార్తాపత్రిక తీసుకుని వెళ్లేవాడిని. అది చదివి, అందులోని వార్తలమీద నిష్పక్షపాతంగా వ్యాఖ్యలు చేసేవారు. అలా వినటం ఒక రాజకీయపాఠం, విజ్ఞానదాయకం. తత్త్వదర్శనం.

అమ్మ-నాన్నగార్లను మూడు దశాబ్దాల కాలంలో పలుసార్లు సందర్శించటం వలన వారి తత్వం నేనెలా అర్థం చేసుకున్నానో నాన్నగారి శతజయంతి సందర్భంలో ప్రస్తావించటం అప్రస్తుతం కాదనుకుంటాను.

అమ్మ - ఉన్నదంతా అదే (బ్రహ్మమే) అని పదే పదే చెప్పటమే కాక, అన్నివేళలా ఆచరణలో పెట్టిన సర్వజ్ఞ. ఇక నాన్నగారు - సర్వమూ శక్తిమయమే అని విశ్వసించి త్రికరణశుద్ధిగా అనుభవంలోకి తెచ్చుకున్న కర్మయోగి.

బాధలనే పూజాద్రవ్యాలుగా చేసుకున్న సహనదేవత అమ్మ అయితే, నాన్నగారు తనకు ఎదురైన కష్టసుఖాలను భగవత్ప్రసాదాలుగా, సమభావంతో స్వీకరించిన స్థిత ప్రజ్ఞుడు.

అమ్మ అందరికీ సుగతే అని కుండబద్దలుకొట్టి చెప్పిన మహాధీర కాగా, నాన్నగారు తన వృత్తిలో, ప్రవృత్తిలో అంతా మంచే చూసిన, చూపిన మహీధరుడు.

అమ్మ విద్య, అవిద్యా స్వరూపిణి అయితే నాన్నగారు వ్యక్తమూ, అవ్యక్తము రెండూ పరబ్రహ్మమే అని రూఢిగా ఎరిగిన పురుషేశ్వరుడు.

అమ్మ ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి స్వరూపిణి; నాన్నగారు సర్వసృష్టికి కరణం, కారణం, కర్త.

అమ్మ సర్వాభరణభూషిత; నాన్నగారు సత్ సత్వగుణశోభితుడు.

సర్వాన్నీ స్వాధీనం చేసుకున్న సాధ్వి అమ్మ అయి నాన్నగారు సత్యధర్మపరాక్రముడు.

అమ్మ తన గళంలోని మంగళసూత్రాలన నాన్నగారి పాదాలుగా భావనచేసి, ప్రతిరోజ మంగళసూత్రాలను అభిషేకించిన తీర్థం స్వీకరిస్తుం ఆ తీర్థమే అందరికీ తీర్థం వేసే అర్హతను తన ప్రసాదించిందని అమ్మ కొన్ని సందర్భాలలో పేర్కొన్న మరొక కోణంలో నుంచి చూస్తే - పంచభూతాలన జయించిన పతివ్రతగా అమ్మ తన బిడ్డల చే కొలవబడటానికి ఆధారం తన పతి అయిన నాన్నగార

మనం చెప్పుకునే కష్టసుఖాలు అమ్మ వినట లేదన్న అనుమానంతో "అమ్మా! పరధ్యాసలో ఉన్నావ అంటే "పరధ్యాస కాదు, పతిధ్యాస" అని సవరిం అమ్మకుధ్యానం, ధ్యేయం ఎల్లవేళలా నాన్నగారే.

అమ్మ నాన్నగారి మాటను జవదాటిన సందర్భ ఎక్కడా మనకు కనిపించదు. నాన్నగారంటే అమ్మక అంత భక్తి గౌరవాలు.

డాక్టరు తనకు ఆపరేషను చేయాలన్నప్పుడ నాన్నగారు అమ్మకి ఒక ఉత్తరంలో ఇలా వ్రాస్తారు "ఆపరేషన్ తిలకిస్తూ, ఆ సమయంలో నీవ జిల్లెళ్ళమూడిలో ఉండిననూ నా చెంతనే ఉండగలవనిద నా నమ్మిక".

ఇది అమ్మ పట్ల నాన్నగారి కున్న విశ్వాసానికి అద్దంపడుతున్నది.

కాశీలోని విశ్వేశ్వరుని అర్ధాంగి అన్నపూర్ణేశ్వర తరతరాలుగా అన్నార్తులకు నిరతాన్నదానం చేస్తున్నది అలాగే జిల్లెళ్ళమూడిలో నాగేశ్వరుని సతీమణి మాతృశ్రీ అనసూయాదేవి అయిదారు దశాబ్దాలుగా అన్నపూర్ణాలయంలో ప్రసూ, అప్రసూతో నిమిత్తం



లేకుండా, ఆకలే అర్హతగా బిడ్డలకు అన్నప్రసాదం పెట్టున్నది.

కాగా, ప్రతి మగవాని విజయం వెనుక ఒక స్త్రీ మూర్తి ఉంటుందన్న నానుడికి తోడుగా ప్రతి స్త్రీ మూర్తి వెనుక ఒక పురుషుడు ఉంటాడని ఎందుకు భావించ కూడదు? భార్యకు భర్త దేవుడు అయినప్పుడు, భర్తకు భార్య దేవతే- అని అమ్మ అన్నది కదా! అన్నపూర్ణాలయం నిర్విఘ్నంగా, నిరంతరాయంగా నడపబడటానికి అమ్మ సంకల్పబలంతో పాటు నాన్నగారు అందించే సహాయ సహకారాలు భావనకు తప్ప భాషకందవు.

అందుకే-

రామకృష్ణ అన్నయ్య "మాతృశ్రీ" సంపాదకీయ వ్యాసంలో ప్రస్తుతించినట్లుగా అమ్మ మనకు దేవుడు,కాని అమ్మకు నాన్నగారు దేవుడు. అంటే నాన్నగారు మనకు దేవదేవుడు, మహాదేవుడు.

అమ్మ - నాన్నగారు పరస్పరం అవగాహనతో, అనురాగముతో, ఆరాధనతో పార్వతీపరమేశ్వరులవలె, లక్ష్మీనారాయణులవలె, సీతారాములవలె ఆదర్శ దంపతులైనారు.

**జ్యోతిదర్శనం**

1981, ఫిబ్రవరి 16వ తేదీన నాన్నగారు పార్థివ శరీరాన్ని పరిత్యజించారు. ఆ సందర్భంలో శ్రీ లక్ష్మణయతీంద్రులు ప్రవచించినట్లుగా - అమ్మ నాన్న గారలు ఒకే ప్రమిదలోని రెండు జ్యోతులు; వాటిలో ఒక జ్యోతి మరొకజ్యోతిలో సంలీనమయింది.

పరిమిత రూపంలో అవనీస్థలిపై అవతరించిన అమ్మ 1985 జూన్ 12వ తేదీన తన అవతారం ఉపసంహరించు కుంది. పర్యవసానంగా అనసూయేశ్వరాలయంలో అమ్మ-నాన్నగారల పాంచభౌతికదేహాలు భూగర్భాన ప్రతిష్ఠితమయినాయి.

కాగా, ఇప్పుడు అక్కడ మనకు దర్శనం ఇచ్చేవి ఏమిటి? రెండు పార్థివ దేహాలను ప్రతిష్ఠితం చేసిన స్మృతి చిహ్నాలా? కాదు - రెండు ఒకటి అయిన అపూర్వ దృశ్యం, అద్వైతానికి, అర్ధనారీశ్వరతత్వానికి నిలువెత్తు ప్రతీక, శివశక్త్యైక్యరూపం, శ్రీ అనసూయానాగేశ్వరుల ఏకాకృతి! అనసూయేశ్వరాలయ మూలవిరాట్టు ! సకలచరాచరసృష్టికి మూలకారణమైన పరాశక్తి.

ప్రసన్నవదనంతో, ప్రశాంతదృక్కులతో బిడ్డలను ఆశీర్వదిస్తున్న అవ్యాజకరుణామూర్తి.

జ్యోతులు రెండు సంలీనం కాగా ఉజ్వలకాంతు లీనుతూ ప్రకాశిస్తున్న ఏకజ్యోతి, అంతు, అడ్డులేని (అంఆ) అఖండజ్యోతి.

ఆ అనంతజ్యోతికి భక్తిశ్రద్ధలతో ప్రణమిల్లి ప్రార్థిద్దాం.

అసతో మా సద్గమయ !
తమసో మా జ్యోతిర్గమయ !
మృత్యోర్మా అమృతం గమయ !









# పితృదేవోభవ



శ్రీ ఎ.వి.ఆర్.సుబ్రహ్మణ్యం, హైదరాబాదు

'మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ' – అని శాసించింది శీక్షావల్లి. ముందుగా కన్నతల్లి, తర్వాత కన్నతండ్రి, ఆచార్యులు, అతిథులను దైవస్వరూపులుగా తెలుసుకోవాలనేది ఆప్తవాక్య ఆదేశం.

'మాతాచ పితాచ పితరౌ' అనీ అన్నారు; పితృ శబ్దంలో తల్లి, తండ్రి ఇరువురూ ఉన్నారు. ఒక సందర్భంలో అమ్మ, "మాతృత్వం వేరు, మాతృతత్వం వేరు. మగవాడిలోనూ తల్లి ప్రేమ ఉన్నది"-అని అన్నది. మాతృత్వం అంటే నవమాసాలూ మోసి బిడ్డల్ని కనడం. మాతృతత్వం అంటే తల్లిలాలన, పాలన, పోషణ, రక్షణ, శిక్షణ. ప్రేమలక్షణం ఎక్కడ ఉన్నా అది తల్లి ప్రేమే. ప్రేమకి సాకారరూపం అమ్మ.

శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు అమ్మకు పతి దేవులు, మన నాన్నగారు. అమ్మ వివాహం బాపట్లలో 1936 మే 5వ తేదీన శ్రీ చిదంబరరావు తాతగారింట్లో జరిగింది. కానీ అమ్మ ఐదు సంవత్సరాల పిన్నవయసులోనే శ్రీ లక్ష్మణాచార్యులు గారితో "నాగేంద్రుడే నన్ను చుట్టుకొని ఉన్నాడు. నేను నాగేంద్రుని చుట్టించుకున్నాను. ఆ నాగేంద్రుడే నాగేశ్వరుడై వస్తాడు. వాడే నాకు ఆధారం. వాడి ఆకారమే నేను" అని స్పష్టం చేసింది.

అమ్మ తాను 'తొలి' అని స్పష్టపరచినా, మనం అలా అమ్మని దర్శించలేదు. అలాగే నాన్నగారిని 'నాగేంద్రుడు' అని చెప్పినా మన దృష్టికి అలా కనిపించలేదు. అది మన అల్పత్వం.

నాన్నగారు అందరింటి యజమాని. అమ్మ నాన్నగారి అర్ధాంగి; ఆస్తి. అమ్మ మీద సంపూర్ణాధికారం నాన్నగారిదే. నాన్నగారి అనుమతి దయతోనే మనంద[రం] అమ్మ శ్రీ చరణాలకు ప్రణమిల్లాం; దర్శన స్పర్శ[న] సంభాషణలు చేశాం. ఆ మధుర మమకారాక[ృతి] కరకమలాల మీదుగా అమృతతుల్య అన్నప్రసాదా[న్ని] గోరు ముద్దలుగా, జ్ఞాన భిక్షగా పొందాం. అందు[కు] నాన్నగారికి సర్వదా కృతజ్ఞులం. నాన్నగారు జిల్లెళ్ళమూ[డి] గ్రామకరణం గారు. అది ఒక కుగ్రామం. దానికి అప్ప[ట్లో] దారీ డొంకా లేదు; సౌకర్యాలేవీ లేవు. 1985 వర[కు] అమ్మను దర్శించు కోవటానికి వచ్చే సోద[రీ] సోదరులందరికీ నాన్నగారే తమ యింట్లో భోజ[న] భాజనాది సౌకర్యాల్ని కలిగించారు నిండు మనస్సుతో.

15.8.1958లో అన్నపూర్ణాలయాన్ని స్థాపిం[చ] టానికి నాన్నగారు ఇష్టపడలేదు. తన యింటికి వచ్చి[న] వారికి ఉన్నంతలో, కలో గంజో, తానే పెట్టుకోవాల[ని] సర్వాత్మనా భావించారు. వాస్తవానికి, నేటికీ అందరిం[టి] బాధ్యత - ముఖ్యంగా అన్నపూర్ణాలయ నిర్వహ[ణ] భారాన్ని నాన్నగారే స్వయంగా వహిస్తున్నారు. ప్ర[తి] ఏటా ఫిబ్రవరి 17వ తేదీన నాన్నగారి ఆరాధనోత్సవా[ల] సందర్భంగా ధాన్యాభిషేకం రూపేణా అందే విరాళాలతో అన్నపూర్ణాలయం నిర్వహింపబడుతోంది; అది ఆయ[న] అనుగ్రహానికి సంకేతం.

2012-2013 సంవత్సరాన్ని శ్రీ నాన్నగా[రి] శతజయంత్యుత్సవ సంవత్సరంగా మనం జరుప[ు] కుంటున్నాం. ఈ సందర్భంగా అనేకానేక శుభకార్యాల్ని భక్తిశ్రద్ధలతో నిర్వహించబోతున్నాం. ఈ నేపథ్యంలో నాన్నగారి శజయంత్యుత్సవ ప్రత్యేక సంచికను వెల[ు] వరించటం ఎంతైనా సమంజసం. ఆ లక్ష్యసాధనకై మన



అనుబంధాన్ని, మధురస్మృతుల్ని వ్యాసరూపంగా, సాహిత్యరూపాలుగా, సమర్పిస్తే వాటిని తోడబుట్టిన వారందరితో పంచుకున్నట్లు అవుతుంది.

ముందుగా నాన్నగారితో నా అనుబంధాన్ని వివరించే కొన్ని సన్నివేశాలను వివరిస్తాను.

రెండవసారి నేను జిల్లెళ్ళమూడి వచ్చినపుడు వేసవి సెలవులని కొన్నాళ్ళు ఉండిపోయాను. ఆ రోజు శ్రీ నరసింహారావు మామయ్యగారి వివాహం అయింది. నాటి రాత్రి అమ్మ శ్రీ పన్నాల రాధాకృష్ణశర్మగారింట్లో బస చేసింది. అమ్మ తప్ప ఎవరూ నన్ను ఎరుగరు. వైకుంఠ ద్వారాల్ని తెరిచింది అమ్మ. ఇరవై ముప్పై ఏళ్ళ నుంచి పరిచయమైన వ్యక్తిలా వెళ్ళి అమ్మ పాదాల చెంత కూర్చున్నాను. అమ్మకి జ్వరం. అమ్మ పాదాలు రాస్తున్నాను; నాకు దుఃఖం వస్తోంది. అమ్మ కళ్ళు తెరచి నా తలను తన పొట్టకు ఆన్చి "తగ్గిపోతుంది, నాన్నా ! ఏడవకు" అంటూ నా కన్నీళ్ళు తుడిచింది. కొంతసేపటికి నాన్నగారు వచ్చారు. 'ఎవరీ అబ్బాయి ?' అని అమ్మను ప్రశ్నించారు. "నరసాపురం డాక్టర్ కేశవరావుగారి మేనల్లుడు" అని అమ్మ నన్ను నాన్నగారికి పరిచయం చేసింది. గర్భస్థ శిశువు భూమి మీద పడగానే స్నానం చేయించి పొత్తిళ్ళలో పొదివి పట్టుకుని భర్తకు చూపించి 'ఇదిగో. మీ ప్రతిబింబం' అని బిడ్డని తండ్రికి పరిచయం చేసే తల్లి నా మనసులో మెదిలింది ఆ క్షణాల్లో.

కొద్ది రోజుల్లోనే నాన్నగారికి బాగా దగ్గరయ్యాను. ఒకసారి జమాబందీ లెక్కల్లో సాయపడ్డాను. ఆ పనికి సబ్-కలెక్టరు సంతృప్తి చెంది 'జిల్లెళ్ళమూడి కరణం గారిని చూసి నేర్చుకోండి' అని ప్రశంసించారు. అందుకు నాన్నగారు చాల సంతోషించారు. అమ్మ "నువ్వు చేసిన పని అంటేనే నాన్నగారికి నమ్మకం" అనేది.

నాన్నగారు కరిణీకం పనులు, పోస్టాఫీసు పనులు చూసుకుంటూ వీధిగదిలో నరసరావుపేట పడక కుర్చీలో కూర్చుని వచ్చిన వాళ్ళని నవ్వుతూ పలకరిస్తుండేవారు. రోజంతా ఆయన కళ్ళ ముందరే ఇటు నుంచి అటూ – అటు నుంచి ఇటూ ఏదో పని మీద తిరుగుతూండేవాడిని. కానీ ఆయన, "ఏమోయ్ ! ప్రొద్దుటి నుంచీ కనిపించలేదు" అనే వారు. విషయం ఏమంటే ఆయన దగ్గర కాసేపు కూర్చోవాలి. అది ఆయనకి తృప్తి. బిడ్డ కళ్ళముందే ఉండాలని తపించడం తల్లిదండ్రులకు సహజం. అమ్మ ప్రేమ సుస్పష్టం; నాన్నగారి ప్రేమ అవ్యక్తం – అవ్యక్త మధురం.

నాన్నగారికి నేనంటే ఎంతో ఇష్టం. ఎవరికైనా తనను కన్న వారి మీద కంటె తాను కన్న వారి మీద ప్రేమ ఎక్కువ. ఇక్కడ ఒక్క క్షణం ఆగాలి. అమ్మ స్వపర భేదం లేక అందరినీ అన్నింటినీ ప్రేమిస్తుంది. ఆ పావన ప్రేమాంబుధిలో అందరూ పుష్కరస్నానం చేసినవారే. కాగా బ్రహ్మాండం శేషు, భ్రమరాంబక్కయ్య వంటి సోదరీమణులపై నాన్నగారు పితృవాత్సల్యాన్ని వర్షించారు. కానీ అది అందరికీ లభించలేదు. అంటే అమ్మ – నాన్నగారల పరిపూర్ణ ప్రేమకు పాత్రులైన వారు కొద్దిమందే. ఆ జాబితాలో నేనూ ఉన్నాను.

నాన్నగారు ఒకసారి నాతో, "నాయనా ! నెలకి రు. 100లు వెనకేసుకో. పిల్లలు పెరిగి పెద్దవాళ్ళవుతారు. ముందు ముందు పెళ్ళిళ్లు, చదువులు ... ఖర్చు ఎక్కువ. రవికి కూడా ఈ మాటే చెప్పాను" అన్నారు. 'రవికి కూడా ఈ 'మాటే చెప్పాను' అనటంలో నన్ను, రవి అన్నయ్యను ఒకే దృష్టితో చూసి పొదుపు చేయాలని, జీతం సొమ్ము దుబారాగా ఖర్చు చేయవద్దని, భావి బాధ్యతల్ని గుర్తుంచుకోవాలని కుటుంబ పెద్దగా ఒక సలహా, ఆలోచన చేశారు,

ఒకసారి అమ్మ సుబ్బారావు అన్నయ్య ఇంట్లో బస చేసింది. ఆనాడు, "నాన్నా ! నువ్వు ఇక్కడ భోజనం చెయ్యి" అన్నది. అన్నపూర్ణాలయంలో చేస్తాను కదా –



అని అనుకుంటున్నాను.... లోలోపల. "నేను ఇక్కడ ఉన్నాను కదా!" అని తన ఉద్దేశాన్ని విడమర్చింది. నన్ను అమ్మ తన కుటుంబ సభ్యులలో ఒకనిగా భావిస్తోంది. ఇదే ఆత్మీయతని నాన్నగారూ వ్యక్తం చేశారు మరొక సందర్భంలో.

ఒకరోజు నాన్నగారు నన్నుపిలిచి, "ఇవాళ బామ్మగారి ఆబ్దీకం. నువ్వు మనింట్లోనే భోజనం చేయాలి" అని కోరారు. భోక్తల భోజనానంతరం నాన్నగారి సరసన ఒక వైపు నేను, ఒక వైపు రామకృష్ణ అన్నయ్య కూర్చొని ఒకే పంక్తిలో బామ్మగారి ప్రసాదం తీసుకున్నాం. అది నా అదృష్టం. 'ఇవాళ బామ్మగారి ఆబ్దీకం' అనటం ద్వారా వారి మాతృమూర్తితో కూడా నా బంధాన్ని గుర్తింప చేశారు; 'అమ్మ - నాన్నగారు' అనే పిలుపులు కేవలం నామమాత్రంగా మాటల వరకే పరిమితం కాదు అనే సత్యాన్ని తేటతెల్లం చేశారు; ఆయన హృదయంలో నా స్థానాన్ని స్పష్టం చేశారు; ఈ అల్పునికి అంత ఉన్నత స్థానాన్ని అనుగ్రహించారు.

'సేవే శ్రీ గిరి మల్లిఖార్జున మహాలింగం శివాలింగితం' (పార్వతీ మాత ఆలింగనం చేసికొన్న పరమేశ్వరునికి నమస్కారము) అని అన్నారు శంకర భగవత్పాదులు. అలాగే శ్రీ అనసూయేశ్వరుల శ్రీ చరణాలకు శతసహస్రాధిక వందనములు.

తల్లిదండ్రుల ఋణం ఎప్పటికీ ఏ విధంగానూ తీర్చుకోలేనిది. నేను నాన్నగారికి చేసిందేమీ లేదు. ఏ తల్లిదండ్రులైనా తమ చిన్నారుల్ని ప్రాణాధికంగా పెంచుకుంటారు. నాన్నగారి హృదయంలో నాకు ఎంత ఉన్నతమైన స్థానం ఉన్నదో ఒక సంఘటన ద్వారా ఋజువయింది.

జిల్లెళ్ళమూడిలో అందరింట్లో నేనూ, సో॥గరుడాద్రి ఒకే గదిలో ఉండేవాళ్ళం. గరుడాద్రి అమ్మ దినచర్య వ్రాస్తూండేవాడు. నేను అన్నపూర్ణాలయంలో వడ్డన,
హైమాలయం వద్ద నామం, రాత్రిళ్ళు అమ్మ
వడుకోవటం... వంటి రకరకాల వ
చేస్తూండేవాడిని. తరచు నా రాకపోకలు గరుడ
ఇబ్బంది కలిగించేవి. ఒక రోజున నేను హైమాలయ
వెడుతున్నాను. దారిలో శ్రీరామరాజు కృష్ణమూర్తి
సంస్థ యజమాని ఎదురయ్యారు. వారికి నా స
వివరించి నాకు వేరే చోట వసతి కావాలని అడి
అందుకు వారు "నువ్వు ఎవరు? ఇ
ఎందుకుంటున్నావు? ఏ ఊరు? "అంటూ నిలదీశ
నాకు ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు. ఇం
నాన్నగారు అటుగా వస్తున్నారు. 'నేను ఎవరు? ఇ
ఎందుకు ఉంటున్నాను?' అని ఈయన అడుగుతున్నా
నాన్నగారితో మొరపెట్టుకున్నాను. అందుకు ఆ
'ఇతనా'! అన్నారు. రామరాజు కృష్ణమూర్తిగారు ఖి
పోయారు. పాపం! మారుమాట లేక తలవంచు
వెళ్ళిపోయారు. నేను నిశ్చేష్ఠుడనైనాను.

నిజమే. నాన్నగారి దృష్టిలో నేను గొప్పవా
వారికి నామీద మమకారం అలాంటిది. 'బంగారు కొ
కంటివెలుగు' అనే పెంచుకుంటారు పిల్లల్ని తల్లిదండ్ర
వాస్తవానికి పసివాళ్ళు అడుగులు వేసేది నేలమీద కా
తల్లిదండ్రుల అరచేతుల మీద. సేదతీరేది ఊయల
కాదు - వారి గుండెలలో.

ఇంకా చాలాసంగతులు చెప్పాలి. ప్రస్తు
కొందరు సోదరీ సోదరులతో నాన్నగారి ఆత్మీయత
బంధాన్ని వివరిస్తాను.

**1. శ్రీ టి.టి. అప్పారావు గారు:** అప్పా
అన్నయ్య తనజ్యేష్ఠకుమార్తె వివాహ సందర్భంగా శుభ
తీసుకొని కళ్యాణ కారిణి అమ్మకు ప్రప్రథమ
సమర్పించాలని వెళ్ళారు. కానీ అమ్మ "నాన్నా! ముం
నాన్నగారికి ఇచ్చావా?" అని అడిగింది. ఆయన వెం
లేచి రెండు అంతస్థుల మెట్లుదిగి వచ్చి నాన్నగా



నమస్కరించి శుభలేఖ వారిచేతిలో ఉంచారు. నాన్నగారు పరమానంద భరితులైనారు. ఆ తర్వాత యథోచితంగా అమ్మకరకమల్లాలో శుభలేఖను ఉంచారు. అమ్మనిండుగా నవ్వింది. తండ్రిని గౌరవిస్తేనే తల్లికి ఆనందం – అనే సత్యం, రహస్యం అన్నయ్యకి అవగతమైంది. తల్లి– తండ్రి –బిడ్డ బంధ విలువల్ని ఔన్నత్యాన్ని వివరిస్తూ అమ్మ, "తల్లి తొలిసారి కొడుకు పుట్టాలని కోరుకుంటుంది– వాడు ఎదిగి రెక్కలు అలిసిపోయిన తన తండ్రికి ఆసరా అవుతాడని" అని అన్నది. తదాదిగ అన్నయ్య జిల్లెళ్ళమూడి రాగానే పుష్పమూ, ఫలమూ ముందు నాన్నగారికి నమస్కరించి నమర్పించి పిదప అమ్మను దర్శించుకునేవారు.

ఇష్టాగోష్ఠిగా ఒకసారి నాన్నగారు అమ్మతో "నీకేకాదు – నాకూ ఉన్నారు శిష్యులు" అన్నారు. అందుకు అమ్మ "ఎవరండీ మీశిష్యులు?" అని అడిగింది. "అప్పారావు" అని నిర్దుష్టంగా పలికారు నాన్నగారు.

వాత్సల్యయాత్రలో భాగంగా అమ్మ ఏలూరు, పాలకొల్లు, నరసాపురం. నెల్లూరు, హైదరాబాద్..... వంటి అనేక పట్టణాల్ని, నగరాల్ని సందర్శించింది. ప॥గోదావరి జిల్లా యాత్రలో తిరుగు ప్రయాణంలో పెదపాడు నుంచి ఏలూరు రాగానే నాన్నగారు అప్పారావు అన్నయ్య ఇంటికి వెళ్ళారు. అన్నయ్య ఆ రోజుల్లో చిన్నపెంకుటింట్లో అద్దెకు ఉండేవారు! అందులో సౌకర్యాలు అంతంత మాత్రమే. నాన్నగారు వచ్చింది ఆయన మనస్సు చూచి; ఇంటిని కాదు. నాన్నగారికి సాదరంగా స్వాగతం పలికి, వారికి అభ్యంగనస్నానం చేయించి, నూతన వస్త్రాలతో సత్కరించి ఆనందించారు అన్నయ్య. నాడు నాన్నగారు అమ్మతో "అప్పారావు నాకు గుడ్డలు పెట్టాడు" – అంటూ ఆ చిరుకానుకకి పెద్దగా సంబరపడ్డారు. అదే వాస్తవానికి ఎదిగొచ్చిన పుత్రగాత్ర పరిష్వంగ సుఖము. నాన్నగారు ఆశీర్వదించిన ఫలం; అనతికాలంలో అన్నయ్య లక్షల పెట్టుబడులతో వ్యాపారం చేశారు. అన్నిరంగాల్లో అభివృద్ధిలోకివచ్చారు. తరచుగా అమ్మ అప్పారావు అన్నయ్యతో, "నీకేం నాన్నా! నీకు నాన్నగారి సిఫార్సు (రికమెండేషన్) ఉన్నది" అనేది.

ఇందు రహస్యమేమంటే – ఇష్టకామ్యార్థ సిద్ధికి మనం అమ్మను నేరుగా ప్రార్థిస్తాం. మన దరఖాస్తు అప్లికేషన్ నాన్నగారి సిఫార్సుతో అమ్మను చేరితే అమ్మ 'కాదు' అని అనలేదు. వెంటనే అమోదముద్ర వేస్తుంది. నాన్నగారి మాట అమ్మకి అనుల్లంఘనీయం, అవశ్యం కర్తవ్యం– ఇది ఒక మధురోషః.

నాన్నగారిని గౌరవిస్తే అమ్మ సంతోషిస్తుంది. అమ్మను గౌరవిస్తే నాన్నగారు సంతోషిస్తారు. ఆ పరిస్థితుల్లో బిడ్డల కర్తవ్యం ఏమిటి? ఈ సందిగ్ధస్థితి మనసోదరీ సోదరు లందరికీ అనుభవమే. వాత్సల్యయాత్రలో భాగంగా తమ ప్రాంతానికి అమ్మను ఆహ్వానించేందుకు బలీయమైన విన్నపంతో వస్తే – 'సాలెవాని మగ్గం మీద నాడిలాగ' – ఇటునుంచి అటు– అటునుంచి ఇటు, పైనించి క్రిందికి – క్రింది నుంచి పైకి పరుగులు తీసేవారు. "నాన్నగారి అనుమతి తీసుకోవాలని అమ్మ", "మీ అమ్మగారి అనుమతి తీసుకున్నారా?" అని నాన్నగారు – మొత్తం మీద ఫైల్ని ప్రక్కకు నెట్టేసే వారు. అది ఒక చిద్విలాసం.

"నాన్నగారి రూపమే నేను" అని అమ్మ స్పష్టం చేసింది. దరఖాస్తు ఎవరికి సమర్పించినా ఒకటే. అమ్మలో నాన్నగారు, నాన్నగారిలో అమ్మ అవిభాజ్యంగా ఉన్నారు. అర్ధనారీశ్వరతత్త్వానికి యథార్థ సాకారరూపం అమ్మ – నాన్నగారు.

నలభై ఏళ్ళక్రితం – ఒకసారి నాన్నగారికి అనారోగ్యం చేసింది. వైద్యం కోసం బాపట్ల వెడుతున్నారని తెలిసింది. అమ్మదగ్గరకి వెళ్ళి 'నాన్నగారికి సహాయంగా నేను వెడతాను' అని అభ్యర్థించాను. 'అలాగే, నాన్నా!"



అని అనుమతి నిచ్చింది.

బాపట్లలో వారం రోజులు ఉండి చికిత్స పొందారు. వారికి స్వస్థత చేకూరింది. 'వారికి రోజూ fruit juice ఇవ్వాలి' అన్నారు డాక్టర్ గారు. సరిపడ మందులు కొన్నారు. 'జిల్లెళ్ళమూడి వెడదాం' అని అన్నాను. ' చీరాల వెళ్ళి శ్రీధరరావుగారికి x-ray, మందుల చీటి చూపించి వెడదాం' అన్నారు నాన్నగారు. వెంటనే చీరాలవెళ్ళాం. డా॥ నారపరాజు శ్రీధరరావుగారు x-ray, అన్నీ చూసి వైద్యం సవ్యంగానే జరిగింది అని ధ్రువీకరించారు. కారులో జిల్లెళ్ళమూడి బయలుదేరాం. బాపట్లవచ్చాం. రైల్వేగేట్ వేసి ఉండటంతో కారు కొంత సేపు నిలిచిపోయింది. ప్రక్కనే పళ్ళదుకాణాలు ఉన్నాయి. డజను బత్తాయిలు తీసుకు వెడితే రోజూ నాన్నగారికి పళ్ళరసం ఇవ్వచ్చు - అను కున్నాను. వెంటనే 'అమ్మ దగ్గరకి ఎన్నోపళ్ళు వస్తాయి. రోజుకి రెండు పళ్ళు తీసుకోవచ్చు' అని ఊరుకున్నాను. కారు జిల్లెళ్ళమూడి చేరుకుంది. నాన్నగారు అమ్మకు అన్ని విషయాలు వివరించారు.

నేను సావధానంగా అమ్మ దగ్గరకి వెళ్ళాను. పాలకడలిపై శేషశాయిని తలపిస్తూ అమ్మ మంచంమీద పడుకున్నది. పాలపిట్టరంగు పట్టు చీరె కట్టుకున్నది. నన్ను చూసి చిరునవ్వు నవ్వింది. అపుడు-

అమ్మ : నాన్నా ! మద్రాసు వెళ్ళినపుడు యస్. జానకి పెట్టింది రా ఈచీర. ఎలాఉంది?

నేను: చాకులా ఉందమ్మా (చాల బాగుంది అనటానికి)

అమ్మ: (నవ్వుతూ) నువ్వూ చాకులాంటి కుర్రాడివే (క్షణం ఆగి) నాన్నా! డాక్టర్‌గారు ఏమన్నారు!

నేను: fruit juice రోజూ ఇమ్మన్నారు.

అమ్మ: (క్షణం ఆగి) బాపట్ల నుంచి వచ్చావు కదా! డజను పళ్ళు తీసుకురావాల్సింది.

నేను: (దొంగవానికి తేలు కుట్టినట్లుగా).....

అమ్మ: (మరొక క్షణం ఆగి) నాన్నా! వాళ్ళ వీళ్ళూ ఇక్కడికి పళ్ళు తెస్తారు. వాటిని ప్రసాదంగా వాళ్ళ తిరిగి ఇవ్వాలి. మనం వాడుకుంటే బాగుండదుకదా

నేను: నీకు అన్నీ తెలుసు. నామనస్సులో మా తెలిసే అంటున్నావు. నీదంతా నాటకం.

అమ్మ : ఇదేమీ ఏకపాత్రాభినయం కాదు. మీర పాత్రధారులే.

అలా సంతోషంగా గడిచాయి ఆక్షణాలు. మర్నా ఉదయం అమ్మ మంచంమీద కూర్చున్నది. నేను ప్రక్కగా క్రింద కూర్చున్నాను. శాయమ్మగారు వచ్చి అమ్మకి ఎదురుగానిలిచి "నాన్నగారిని ఆస్పత్రినుం అష్టమినాడు తీసుకువచ్చారేమిటి? అని అంటున్నారమ్మా - అన్నది. ఆ విమర్శ వినగానే నేను గతుక్కుమన్నాను వారిని తీసుకు వచ్చింది నేను కనుక. నాడు అష్టమిఅనీ తీసుకురాకూడదనీ తెలియదు. తెలియక చేసిన తప్పుకి తలదించుకున్నాను. అమ్మ దృష్టిలో అది తప్పుకాదు తప్పు అని తెలిసీ తప్పించుకోలేక తప్పనిసరిగా చేసే తప్పు. కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. నా మనోవ్యథ అమ్మ గమనించి ఉంటుంది.

అమ్మ వదనమండలం కుంకుమ ప్రభవలె ఎరుపెక్కింది. "అలా అని ఎవరన్నారు? నా ఎదురుగావచ్చి అనమను. చెంపలు పగులగొడతా" అన్నది. అమ్మ దృష్టిలో అన్నితిథులూ శుభతిథులే. అదే సత్యదర్శనం. నిత్యం పూజామందిరంలో 'శుభతిథౌ' అనే సంకల్పం చెపుతాం, కానీ ఆ భావం రక్తంలో జీర్ణంకాదు. కాలస్వరూపిణి అమ్మకి త్రికరణశుద్ధిగా ఉంటుంది. మానవులు దంత వేదాంతులు, దైవం సత్యస్వరూపం.

వారం, పది రోజులు గడిచాయి. నాన్నగారు మందులు వాడుతున్నారు. ఆయనకి injection



చేయించుకోవాలంటే భయం, tablet వేసుకోవాలంటే బాధ. "నాన్నగారూ! tablet వేసుకోండి" - అని పోట్లాడేవాడిని. ఆయన tablet వేసుకుని 'ఏమిటో నీక్షోభ!' అంటూ నవ్వేవారు. ఎవరికైనా తనను కన్నవాళ్ళమీద కన్నా తాను కన్నవాళ్ళ మీద ప్రేమ ఎక్కువ కదా! అదే అనురాగ రక్తసంబంధం.

నాకు ఉపాధ్యాయునిగా ప్రభుత్వోద్యోగం వచ్చింది అని తెలిసింది. అన్నపూర్ణాలయంలో పాయసం చేయించుకుని తీసుకు వెళ్ళి అమ్మకి నివేదన చేశాను. దానిని నాతోపాటు చుట్టూ ఉన్నవారందరికీ అమ్మ పంచింది. "దీని అర్థం - నీ సంతోషాన్ని అందరికీ పంచటం" అన్నది. హడావిడిగా 'బొట్టుపెట్టు అమ్మా! వెళ్ళొస్తాను' అన్నాను. నెమ్మదిగా అమ్మ, "నాన్నా! ఇవాళ నాన్నగారికి టెంపరేచర్ చూశావా"? అని అడిగింది. నేను నిర్ఘాంతపోయాను, ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు. "లేదమ్మా! వారం రోజుల నుంచి జ్వరం రావటంలేదు. కులాసాగానే ఉన్నారు" - అన్నాను, నీళ్ళునములుతూ.

అమ్మ పరంగా మనం ఏమరుపాటుగా ఉన్నా, నిర్లక్ష్యంగాఉన్నా - అది అపచారం అని అనుకోదు. ఆగ్రహించదు, తల్లికనుక. నాన్నగారి విషయమై పొరపాటు దొర్లితే అమితంగా బాధపడుతుంది. దీనికి రెండవవైపు కూడా సత్యమే. అంటే నాన్నగార్కి మనస్ఫూర్తిగా కించిత్‌సేవ చేసినా అమ్మ హృదయం ఆనందతరంగాల్లో తేలియాడు తుంది.

ఇక అమ్మ వద్ద క్షణకాలంకూడ ఉండలేక అమ్మవైపు చూడలేక గబగబా రెండు అంతస్థులు దిగి నాన్నగారి దగ్గరికి వెళ్ళాను. ఆశ్చర్యం. 100 డిగ్రీలు జ్వరం ఉన్నది. అమ్మ ఎక్కడో రెండవ అంతస్థులో ఉన్నది. అయినా జ్వరంగా ఉన్నది అని తెలిసింది. ఎదురుగా ఉన్నవాళ్ళకి తెలియలేదు. తనకి పరధ్యానం ఉంటే కదా!. మనమధ్య నవ్వుతూ మాట్లాడుతున్నా, పూజలందుకుంటున్నా సమస్యలకి పరిష్కారాలని అందిస్తున్నా అమ్మకి ఏమరుపాటులేదు- అక్షరాలా నాన్నగారి అర్థాంగి. పురాణాల్లో చదివాం, పతివ్రతని రెండు కళ్ళతోచూశాం, మనఅదృష్టం, భాగ్యం.

తర్వాత కాలంలో నాన్నగారికి గుంటూరు ఆస్పత్రిలో శస్త్రచికిత్స చేశారు. ఆసమయంలో వారికి కించిత్‌సేవ చేసుకున్నాను. అది జననీజనకుల అనుగ్రహవిశేషం.

నాన్నగారు ఆలయప్రవేశం చేసిన తర్వాత జిల్లెళ్ళమూడి వచ్చాను. అమ్మదర్శనం చేసుకుందామని వెళ్ళాను. అమ్మగది అంతా చీకటి. zero candle bed bullb మాత్రమే మినుకు మినుకు మంటోంది. అమ్మ మంచంమీద కూర్చొని ఉన్నది. అమ్మ పాదాల చెంత రామకృష్ణఅన్నయ్య కూర్చొని ఉన్నాడు. ఆరాధన, ఉపాసన, దీక్ష, తపస్సు, త్యాగం వంటి పదాలకి నిలువెత్తురూపంగా దుర్నిరీక్ష్యంగా ఉన్నది. నా బోటి అల్పునికి ఆ ధర్మ స్వరూపాన్ని దర్శించగలగటం అసాధ్యం. అమ్మ దగ్గరకి వెళ్ళి నా శిరస్సును అమ్మ పాదాలకు ఆనించి లేచి, ఏమీ మాట్లాడలేక వెనుతిరుగుతున్నాను. "నాన్నగారు ఆస్పత్రిలో ఉండటం, వీడు సేవచేయటం" అని హీనస్వరంతో అన్నయ్యకి గుర్తుచేసింది. తనకి మహోపకారం చేసినందుకు సీతాసాధ్వి ఆంజనేయస్వామిని 'వసుధాస్థలి వర్థిలు బ్రహ్మకల్పముల్' అని ఆశీర్వదించింది -లంకలో. కానీ అమ్మతత్త్వంవేరు. అమ్మ అనుగ్రహం అనవరతం అందరికీ ఉంటుంది. 'ఆశీర్వదించమ్మా' అని ఒక సోదరుడు ప్రార్థిస్తే, అమ్మ "అది ఎప్పుడూ ఉన్నది" అన్నది. కాగా మనం అమ్మకి చేసేసేవ కనిపిస్తుంది. అమ్మ మనకి అందించే ఆపన్నహస్తం, రక్షాకవచం సర్వదా మన కంటికి కనిపించవు.



నాన్నగారిని ఆలయప్రవేశం చేయించి దానికి శ్రీఅనసూయేశ్వరాలయం అని నామకరణం చేసింది అమ్మ. తన మంగళసూత్రాలనే జగత్కళ్యాణ సూత్రాలుగా ఆవిష్కరించింది. అక్కడ నిత్యం జరుగవలసిన కార్యక్రమాన్ని స్వయంగా పర్యవేక్షించింది. అందులోభాగంగా శ్రీఅంబికా సహస్ర నామస్తోత్రపూర్వక అర్చనను నిర్దేశించింది. తన చిన్నారులను సహస్రబాహువులతో నిర్దిష్టమైన దారిలో నడిపించింది. తన కన్నీళ్ళను తానే తుడుచుకున్నది.

'పుణ్యస్త్రీ' అనేపదానికి విలక్షణమైన విప్లవాత్మకమైన చారిత్రాత్మకమైన నిర్వచనాన్ని నిరుపమానంగా అనుగ్రహించింది, చివరివరకు భర్తయోగక్షేమాల్ని, వేయి కళ్ళతోచూసి సదాశివునిగా సుప్రతిష్ఠితం చేసింది. "త్యాగేనైకే అమృతత్వమానశ అనే వేదార్ధానికి ప్రతీక అమ్మ.

తన పిల్లలు తమ కాళ్ళమీద నిలబడగలరు అ నిర్ధారించుకొన్న తర్వాత తన ఒడిలోని అశేషసంతానా ఎత్తుకుని ఒక్కసారి కడసారి ముద్దుపెట్టుకొని నిర్దాక్షిణ్యం దించి ప్రక్కన పెట్టి తాను సంతోషంగా సరాసరి వె నాన్నగారి సరసన సుప్రతిష్ఠిత అయ్యింది. 'నిర్దాక్షిణ్యంగ అనటానికి కారణం - ప్రేమకంటె ధర్మంగొప్పది. అమ్మ రెండు ప్రధానధర్మాలు ఉన్నాయి- మొదటిది సతీధర్మం రెండవది మాతృధర్మం. సదాశివులైన నాన్నగారి సాంబశివుని చేసింది. ఇది చరిత్ర, తరాలు, యుగాల అర్థం చేసికోలేని అంతు చిక్కని మహోన్నత పారమార్థి సత్యం.

✤✤✤

హైదరాబాద్‌లో మాతృశ్రీ ఇంజనీరింగ్ కాలేజి వ్యవస్థాపకులతో అమ్మ నాన్నగారు



# బ్రహ్మాండ వంశాబ్ధి తిలకా!



- మన్నవ బుచ్చిరాజశర్మ హైదరాబాదు

నాన్నగారి మీద ఒక పాట వ్రాయాలని సంకల్పించాను. అమ్మ నాన్నగారి అర్ధాంగి; అవిభాజ్యం - అర్ధనారీశ్వరతత్వం.

ఎంతోమంది అమ్మ దగ్గరికి వెడుతున్నాం. అందరికీ ఆదరణగా అమ్మ అన్నం వండి పెడుతోంది. అది నాన్నగారి ఔదార్యం. అప్పటి కింకా అన్నపూర్ణాలయాన్ని ఏర్పరచుకోలేదు. నాన్నగారే వచ్చిన వారందరికీ భోజన, వసతి సదుపాయాల్ని కలిగించారు. ఆయన ఔదార్యం ముందు తక్కిన విషయాలు దిగదుడుపే.

అమ్మ మమకారాన్ని ఆదరణని పంచి ఒక ఆదర్శ సమాజానికి ఆకృతి కల్పిస్తూంటే నాన్నగారు అమ్మకి తోడుగా ఆధారంగా ఉంటూ ఒక మహోన్నత పాత్రధారి అయ్యారు. ఆయన యోగ్యత, పాత్రత, హృదయ సాంద్రతలకు ముగ్ధుడనై వారిపై ఒక పాట వ్రాయాలని సంకల్పించాను. 'బ్రహ్మాండ వంశాబ్ధితిలకా!' అనే నా **24వ** పాటను ది.**26.9.57, 27.9,57** తేదీలలో వ్రాశాను.

'భువిలోని బంగారు మొలకా రావయ్య
బ్రహ్మాండ వంశాబ్ధి తిలకా' - అనేది పల్లవి. ఈ పాట 'రావోయి బంగారు మామా!' అనే ఒక ప్రైవేటు పాటను అనుకరించి వ్రాసినది. మొదట్లో నాన్నగారిని నేను 'మామయ్యా!' అని పిలిచేవాడిని. మా ఇంటిపేరు 'మన్నవ'. అమ్మ పుట్టింటివారు 'మన్నవ'; అమ్మకు మేనల్లుడనవుతాను. కాగా ఆయన అమ్మకి భర్త; కాబట్టి 'నాన్నగారే' అని నిర్ధారించుకున్న తర్వాత కాలంలో 'నాన్నగారూ !' అనే పిలిచేవాడిని.

'ఆద్యంతములు లేని - తన్నుతానెరుగని
అజ్ఞానులకు గూడ విజ్ఞాన మొసగంగ
అనురాగ మొలుకుచు - చిరునవ్వు చిలుకుచు
మా అమ్మ తియ్యగా పలుకా రావయ్య
అమ్మకాధారమౌ చిలుకా ॥భువిలోన బంగారు మొలకా॥" అనేది ప్రథమ చరణం. "తనని తాను తెలుసుకున్ననాడు సర్వాన్నీ తెలుసుకుంటాడు" అని స్పష్టపరిచింది అమ్మ.

"ప్రతి వస్తువుకి నువ్వు ఒక వైపు మాత్రమే చూస్తున్నావు, నాన్నా! ప్రతి వస్తువుకి రెండవవైపు కూడా ఉంది. అది ఏమిటి? ఆ రెండో వైపు నువ్వే. అన్నింటినీ చూసే నువ్వు నిన్ను చూసుకోలేవు" - అని ఒక వినూత్న సత్యాన్ని ప్రప్రథమంగా ఆవిష్కరించింది. నిండు పున్నమి - అమావాస్య చీకటి; పండుగలు - ప్రకృతి వైపరీత్యాలు, ఆగర్భ శ్రీమంతులు - గర్భదరిద్రులు ... ఇలా ఎందరినో ఎన్నింటినో మనం చూస్తున్నాము. ఆయా సందర్భాల్లో నవ్వు, దుఃఖం మనల్ని ముంచెత్తుతుంది. కానీ వాటన్నింటికీ రెండవ వైపు ఆ ద్రష్టే - ఇన్నింటినీ చూచేవాడే నని అమ్మ వివరిస్తోంది. అది అద్వైత స్థితికి పరాకాష్ఠ; అన్నీ ఒకే శక్తి తత్త్వరూపాంతరములేనని.

ఈ విధంగా నిత్య సత్య వస్తు తత్త్వ జ్ఞానము లేని అజ్ఞానులకు గోరుముద్దల రూపంగా జ్ఞానభిక్షను ప్రసాదిస్తోంది. "కనిపించేదంతా నిజస్వరూపమే; మిధ్య ఏమీ లేదు, నాన్నా ! అంతా సత్యమే" అంటుంది జ్ఞాన ప్రసూనాంబ అమ్మ. అట్టి చక్కని చక్కెర పలుకుల చదువుల తల్లి అమ్మకి ఆధారం నాన్నగారు (శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు). అమ్మ - నాన్నగార్ల జంట చిలుకా గోరింకల వలె చూడ ముచ్చటైనది అని నా భావం - కనుకనే 'చిలుకా' అని సంబోధించాను.



'పంజరమ్ములు లేక - బంధమ్ములును లేక
నవనవోన్మేషమై - నిత్యసంతోషమై
పొంగారు ప్రాణులకు - బంగారు వసుధపై
మా అమ్మ ముత్యాలు ఒలుకా రావయ్య
బ్రహ్మవై పన్నీరు చిలుకా ॥భువిలోన బంగారు
మొలకా॥' అనేది రెండవ చరణం.

కొన్ని పరిధులు, పరిమితులను నిర్దేశించి విధి నిషేధాల ఇనుపచట్రాన్న బిగించి, 'వీళ్ళు రావాలి, వీళ్ళే రావాలి'. వీళ్ళు ఉంటున్నారు, నీ దగ్గర ఇలా ఉండాలి' అని నాన్నగారు ఏనాడూ అమ్మకి గానీ మనకి గానీ షరతులు విధించలేదు; అవరోధాలు కల్గించలేదు. వారి దయవలననే జగన్మాత దర్శన స్పర్శ సంభాషణల మహద్భాగ్యానికి ఎల్లరూ నోచుకున్నారు. ఆజన్మాంతం వారి శ్రీ చరణాలకు శతసహస్రాధిక వందములు, కృతజ్ఞతలను సమర్పిస్తున్నాను.

కనుకనే 'పంజరమ్ములు లేక బంధమ్ములును లేక' అని ప్రస్తుతించాను నాటి స్థితిగతుల్ని. అవి సాలోక్యము, సారూప్యము, సాయుజ్యమును ప్రసాదించాయి. 'స్వరాజ్యము నా జన్మహక్కు' అని తిలక్ మహనీయుడు అన్నట్లు 'అమ్మ నాది' అనుకుంటూ సరాసరి అమ్మ వద్దకు వెళ్ళటమే తెలుసు అందరికీ.

ఇక్కడ 'పొంగారు ప్రాణులు' అంటే బిడ్డలు; అమ్మ అశేష సంతానము. 'నవనవోన్మేషమై, నిత్య సంతోషమై' అన్నాను. సృష్టిలో అహరహం అనుక్షణం సృష్టి స్థితి లయాలు సంభవిస్తూనే ఉన్నాయి. బాల్యయౌవన కౌమార వార్ధక్య దశలూ, జనన మరణాలూ జీవులకే కాదు నిర్జీవులబడే మట్టి, మాణిక్యం, రాయి, రప్ప అన్నింటి ఉన్నాయి. ఈ విశేష గుణ ఔన్నత్యాన్ని వేదాలు 'సద్యోజాతం ప్రపద్యామి సద్యో జాతాయ వై నమో నమః' అని శ్లాఘిస్తున్నాయి.

ఈ పాటలో 'ముత్యాలు' అంటే ఆణిముత్యాలు మురిసిపోయే అమ్మ అశేష సంతానం. 'బంగారు వసుధ' అంటే అమ్మ గర్భవాసం. అమ్మ తన మహత్సంకల్పం నుంచే ఆణిముత్యాల్లాంటి బిడ్డల్ని భూమికి చిలుకుతున్నది. అమ్మ చిలుకరించిన ఆ విత్తనాలు మొలకెత్తి స్వయంపోషకాలు కావాలంటే వాటిపై నీరు చల్లాలి. అది నాన్నగారి కర్తవ్యం. నారు పోసిన వాడు నీరు పోస్తాడు. 'బ్రహ్మవై పన్నీరు చిలుక రావయ్య' అన్నాను.

'నాన్నగారూ ! బ్రహ్మవై నీరు పోయటానికి రండి' అని స్వాగతిస్తున్నాను. మరి ఆయన భువిలోన 'బంగారు మొలక' బంగారు తండ్రికదా ! కాగా ఆ పాట నేను పాడినపుడు 'బంగారు మొలక' అనటానికి 'బంగారు గిలక' అన్నాను. అందుకు నాన్నగారు నవ్వుకుంటూ వెళ్లారు. అమ్మ ముసి ముసి నవ్వులు విరజిమ్ముతోంది. అది సహజం. పసిబిడ్డ గుండెలమీద గంతులేసినపుడు తల్లిదండ్రులు మురిసిపోతారు గాని కన్నెర్ర చేయరు కదా !



## రాగేశ్వరులు

శ్రీ కాసు రాధాకృష్ణరెడ్డి, జిల్లెళ్ళమూడి

నాన్నగారూ - మీరు నాగేశ్వరులు కాదు, రాగేశ్వరులు. రాగం మీ సొమ్ము. లయ మీ లక్షణం. రాగలయలు మీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. ఈ అనంతకోటి రాగాలకూ, లయలకు సర్వసృష్టికీ ఆదీ ఆధారమూ ప్రణవం. ఆ ప్రణవమూర్తి మీరు. అందుకే మా ప్రణామాలు. అందుకో మా హృదయ ప్రసూనాలు.





# నాకు తెలిసినంతలో నాన్నగారి గురించి...



శ్రీ తంగిరాల సింహాద్రి శాస్త్రి, హైదరాబాద్

నేను తొలిసారిగా జిల్లెళ్ళమూడి 1961లో వెళ్లడం జరిగింది. అప్పట్లో మేము పర్చూరు డాక్టరు గారి పిల్లలుగా వెళ్లి అక్కడ వాళ్లకు పరిచయమైనాము. మా నాన్నగారు తంగిరాల సత్యనారాయణగారు గుంటూరుజిల్లా అప్పికట్లలో డాక్టరుగా పనిచేస్తూండగా 1950-51 సంవత్సరంలో బ్రహ్మాండం సుబ్బారావు అక్కడ స్కూల్లో చదువుతూ మాతో రోజూ ఆడుకోవడానికి రావడంతో బాగా స్నేహమైంది. అప్పుడు వాడి బాబయ్యగారైన లోకనాథం గారు మాకు టీచరుగా వుండేవారు. మేము వాడిని తిరిగి 1961లో జిల్లెళ్ళమూడిలో కలిసినపుడు వాడు జిల్లెళ్ళమూడి అమ్మగారి పెద్దబ్బాయేనని, వాడి నాన్నగారు జిల్లెళ్ళమూడి కరణం గారైన బ్రహ్మాండం నాగేశ్వరరావుగారని తెలిసింది. ఆరోజే సుబ్బారావు చెల్లెలు హైమను, తమ్ముడు రవిని నాకు పరిచయం చేశారు. ఆ రోజునే నాకు తెలిసింది. అమ్మ దర్శనార్థం అక్కడకు వచ్చేవాళ్లందరూ సుబ్బారావు వాళ్ళ నాన్నగారిని తాము కూడా 'నాన్నగారు' అని సంబోధిస్తారని. ఆ రోజు మేమంతా నాన్నగారింట్లోనే భోజనం చేశాము.

1961 ఆగష్టు 15వ తేదీనాడు మా కుటుంబ సభ్యులంతా మా అమ్మ తన దగ్గర వున్న వెండి అంతటితో చేయించిన శంఖం, చక్రం, త్రిశూలంతో అమ్మకు పూజ చేసుకున్నాము. ఈ మధ్యకాలంలో మేము తరచూ జిల్లెళ్ళమూడి వెళ్లి వస్తూ వుండేవాళ్లము. ఆ విధంగా క్రమంగా నాన్నగారి కుటుంబంతో మా అందరికీ అనుబంధం పెరుగుతూ వచ్చింది. అంటే జిల్లెళ్ళమూడి వెళ్లినప్పుడల్లా ఏదో సందర్భంలో నాన్నగారితో మాట్లాడు తుండటం జరిగేది. నాన్నగారికి కూడ మా కుటుంబం పట్ల అభిమానముండేది. ఆ కారణంగా మా ఆగష్టు 15 పూజ మరునాడు పర్చూరుకు తిరిగి ప్రయాణ మవుతూ మా అమ్మగారు హైమను మాతో తీసుకుని వెళ్లటానికి అమ్మ అనుమతి కోరటం, అమ్మ నాన్నగారు ఒప్పుకుంటే తీసుకువెళ్లమని అమ్మ చెప్పటం, ఆ మీదట నాన్నగారు అంగీకరించటం, హైమ మాతో పర్చూరు రావటం జరిగింది. అప్పటి నుంచి 6 నెలలు మా ఇంట్లో మాతో పాటు వున్న హైమ, తాను కూడా మా కుటుంబ సభ్యురాలైంది.

నాన్నగారికి మాపట్ల వున్న ప్రేమాభిమానాల కారణంగా మా అమ్మగారు 1963లో కొల్లూరులో కేన్సర్‌తో మరణించినపుడు నాన్నగారు ప్రత్యేకంగా మమ్మల్నందరినీ పరామర్శించటానికి కొల్లూరు వచ్చారు. నాన్నగారికి ప్రేమాభిమానాలు అందరిపట్ల ఇదే విధంగా వుంటాయని తరువాత కాలంలో తెలిసింది.

నాన్నగారికి కాంగ్రెస్ పట్ల, నెహ్రూగారు, వారి కుటుంబం పట్ల ఎనలేని గౌరవం వుండేది. ఆ రోజుల్లో మావయస్సు కుర్రవాళ్ళు ఎప్పుడైనా నాన్నగారితో దేశరాజకీయాలు మాట్లాడుతూ నెహ్రూగారి గురించి గాని, వారి కుటుంబాన్ని గురించి గాని వ్యతిరేకంగానో, నిందా పూర్వకంగానో మాట్లాడితే సహించేవారు కాదు. "మీరు కుర్రవాళ్ళయ్యా ! మీకు నెహ్రూగారి గురించి ఏమి తెలుసు?"అని గట్టిగా వాదించేవారు. కాని మా అందరితోనూ చాలా సరదాగా మాట్లాడేవారు. నాన్నగారికి వార్తాపత్రిక (Indian Express గాని, ఆంధ్రప్రభగాని ఇత్యాది) చదవటం అలవాటు.

ఆ రోజుల్లో అక్కడకి వార్తాపత్రిక వచ్చేదికాదు. కనుక బయటి నుంచి జిల్లెళ్ళమూడి వచ్చేవారు ఏదో



ఒక వార్తాపత్రిక తీసుకువస్తూ మొదటిగా నాన్నగారికి ఇచ్చేవారు.

నాన్నగారికి నాటకాల పట్ల అత్యంత అభిరుచే కాకుండా పౌరాణిక నాటకాలలో వేషాలు వేసి పద్యాలు కూడా బాగా పాడేవారని తెలిసింది. ఆ తరువాత జిల్లెళ్ళమూడిలో భోజనాల పంక్తిలో మన పూర్వ సంప్రదాయ పద్ధతిలో శ్రీరావూరి నరసింహమూర్తి గారు (రావూరి ప్రసాద్ తండ్రిగారు) పౌరాణిక నాటకాలలోని పద్యాలు పాడుతుండగా నాన్నగారు కూడా అమితో త్సాహంతో పద్యాలు పాడేవారు. అందరితోనూ సరదాగా అక్కడ జరిగే అన్ని కార్యక్రమాలలోనూ పాల్గొనేవారు. ముఖ్యంగా క్రీడలంటే మహా ఇష్టం కావడంతో అప్పట్లో వున్న పిల్లలందరితోనూ వాళ్లతో సమానంగా పాల్గొనేవారు. రవి, మహాదేవశాస్త్రి ఇత్యాది వాళ్ల చొరవతో 'మాతృశ్రీ స్పోర్ట్స్ అండ్ కల్చర్ లీగ్'ను ప్రారంభించినపుడు బ్యాడ్మింటన్ కోర్టు, టేబుల్ టెన్నిస్‌బోర్డు, టెన్నికాయిట్ (రింగ్ టెన్నిస్) కోర్టు మొదలైన వాటి యేర్పాట్లతో పాటు క్రికెట్ ఆడటానికి తగిన యేర్పాటు కూడా చేయబడింది. నాన్నగారు బ్యాడ్మింటనే కాకుండా క్రికెట్ కూడా పిల్లలతో ఉత్సాహంగా ఆడేవారు. ఈ స్పోర్ట్స్ అండ్ కల్చరల్ లీగ్ తరఫున నాన్నగారి కిష్టమని నాటకాల ప్రదర్శన కూడా అప్పుడప్పుడు యేర్పాటు చేసేవారు.

ఇంకొక విశేషమేమిటంటే అమ్మదర్శనార్థం వచ్చేవారి భోజనాలపట్ల శ్రద్ధ చూపించేవారు నాన్నగారు. అందరికీ భోజనాలు అందుతున్నాయెూలేదో తెలుసుకొంటూ వుండేవారు.

అమ్మ 1980లో అనారోగ్య కారణంగా హైదరాబాదులో నెలరోజులున్నప్పుడు నిరంతరం అమ్మ ఆరోగ్యాన్ని గురించి ఆందోళనపడుతూ అమ్మకు జరుపుతున్న పరీక్షల గురించి వాటి ఫలితాలను గురించి ఎప్పటికప్పుడు తెలుసుకునేవారు. చివరలో అమ్మకు అందరూ ఆందోళన పడుతున్న వ్యాధికాదని నిర్ధారణ అయిన తరువాత గట్టిగా వూపిరి పీల్చుకుని ప్రశాంతి పొందారు నాన్నగారు.

ఈ సమయంలో నేను ఎక్కువగా అమ్మ నివాసముంటున్న బంజారాహిల్స్‌లోనే వుండేవాణ్ణి. బంజా రాహిల్స్ నుంచి నేను నివాసముండే నా క్వార్టర్స్‌కు 15 కి.మీ. దూరముంటుంది. అమ్మ ఆరోగ్యం గురించి ఆందోళన సర్దుకున్న తరువాత నాన్నగారు మా ఇంట్లో భోజనం చేస్తే బాగుంటుందని కోరికతో ఆ విషయం నాన్నగారితో ప్రస్తావిస్తే అంగీకరించారు. ఆరోజు సాయంకాలం అప్పటికప్పుడు బయలుదేరి మా ఇంటికి తీసుకుని వెళ్లాను. అయితే నాన్నగారు ఆ వయసులో అంతదూరం నాతో పాటు స్కూటరు మీద కూర్చుని రావటం విశేషం. నాన్నగారికి యేమి ఇబ్బంది కలిగిందో తెలుసుకోలేదు. ఆరోజుల్లో మా ఇంట్లో టెలిఫోన్ సౌకర్యం లేకపోవటం వల్ల నా భార్యకు నాన్నగారి రాక గురించి ముందుగా తెలియపరిచే అవకాశం లేకపోయింది. అందువల్ల నాన్నగారి కోసం ప్రత్యేకంగా పదార్థాలు తయారుచేసే అవకాశం లేక అప్పుడు ఇంట్లో రెడిగా వండి వున్న పదార్థాలతో నాన్నగారికి భోజనం యేర్పాటు చేయటం జరిగింది. తిరిగి మళ్లీ నాన్నగారిని బంజా రాహిల్స్ తీసుకుని వెళ్ళి దింపాను (నాన్నగారు తిరిగి వెళ్లిపోవాలని పట్టు పట్టటంవల్ల). నాన్నగారికి ఆతిథ్యమిచ్చే ఆ ఒక్క అవకాశాన్ని మాత్రం సక్రమంగా వినియోగించుకోలేక పోయానన్న బాధమాత్రం జీవితాంతం మిగిలిపోయింది.

ఆ తరువాత అమ్మకు పూర్తిగా నయమైన మేమందరమూ తిరిగి అమ్మతో రైలులో నవంబరు 13వ తేదీన ప్రయాణం చేసి మరునాడు బాపట్ల, జిల్లెళ్ళమూడి చేరుకోవటం, తరువాత కొద్దినెలలలోనే (ఫిబ్రవరి 1981) నాన్నగారు దేహం చాలించటం జరిగింది.



ఈలోగా జిల్లెళ్లమూడిలో మరొక విచిత్ర సంఘటన జరిగింది. ఎవరో (సరిగా గుర్తులేదు) అమ్మతో సంభాషిస్తూ ఇక్కడ (సంస్థలో) డిసిప్లిన్ అసలు లేదని ఒక నిర్దిష్టమైన క్రమశిక్షణ అవసరమని తన అభిప్రాయాన్ని వ్యక్తపరచటంతో అమ్మ "నిజమే నాన్నా! నీవు కొన్నాళ్లు ఇక్కడ వుండి ఆ క్రమశిక్షణ అమలు జరిగేలా, అందరూ పాటించేలా చూడు" అని చెప్పటంతో పాపం అతను మరునాటి నుంచి ఆవరణలోని వారందరూ మినహాయింపు లేకుండా భోజన సమయంలో పంక్తిలో కూర్చోవాలని నియమం విధిగా పాటించాలని అందరూ సహకరించాలని ప్రకటించాడు. దానికి అమ్మ ఆమోదముద్ర వుండడంతో ఆప్రకారం అందరూ భోజన పంక్తిలో కూర్చోవటం మొదలు పెట్టారు. నాన్నగారు కూడా తన కంచం తానే తెచ్చుకుని అందరితో బాటు కూర్చుని భోజనం చేయటం మొదలుపెట్టారు. అట్లా మూడు నాలుగు రోజులు జరిగిందేమో, ఆ తరువాత నాన్నగారికి ఫిబ్రవరి 16వ తేదీన ఆకస్మికంగా అస్వస్థత కలిగి అమ్మ భాగేశ్వరుడు, అనసూయేశ్వరుడైన నాన్నగారి నిష్క్రమణ జరిగింది. ❖❖❖



# నివాపాంజలి



డా॥నారపరాజు శ్రీధరరావు, చీరాల

రౌద్రివత్సరపు దుర్మాద దుష్క్రియ మేమొ:
బ్రహ్మవిజ్ఞత్వ విపర్యయమ్మొ?
వైష్ణవ మాయాతివక్రిమ మార్గమ్మొ?
పశుపతి నిర్దయాపరత ఫలమొ ?
కాలచక్రమ్ము దుష్కర్మానుభూతియొ ?
దేవకార్య విధాన భావితమ్మొ ?
పాంచభౌతిక దేహ పర్యవసానమ్మొ ?
కర్మవిముక్తి సంక్రాంత దశయొ?
తెలివిడికి రాదు, మనకుఁ దత్ఫలితముగను
'అందరింట'ను గనుపించ రకట ! దివ్య
హాస పరిహాస భాషా వికాసియైన
'నాన్న' గారి కొరత జెప్ప నాకు నగునె? 1

కలము పట్టినఁగన్నీరు కాఱుచుండు
వ్రాయఁ బోయిన భావాలు మాయ మగును
దేహమంతయు నిస్సారగేహ మగును
'నాన్న' గారిని దలఁచినంతటనె నాకు. 2

పుణ్యరాశివి నినుఁబోల్ప భూమిమీఁద
నన్యులెవ్వరు సరితూఁగ రన్న నిజము;
సకల భువనైక మాతతో సహచరించి
సకల భువనైక పితగాఁ బ్రశస్తిఁ గంటి. 3

భూమియున్నంత కాలమ్ము పుణ్యచరిత !
నీదుకీర్తికి విధుఁడు హసాదు చెప్పు;
అప్సరోగీయమాన మైనట్టి యశము
భువనములలోన నంకూరములను వేయు. 4

ఈ యాంధ్రావని వారె కాదు భువిపై నెవ్వారలైనన్ సరే
నీ యాత్మీయత నీదు ప్రేమరసమున్ నీయాతిథేయమ్ము నీ
భూయస్స్వాదరణమ్ము నీగడపపైఁ బూర్ణమ్ముగాఁ గాంచరే?
వ్రాయన్ బల్కఁగ నవ్వి వాణి కగునా? బ్రహ్మాండవంశోద్భవా! 5

నీకున్ మృత్యువు లేదు, నీవు త్రిదశానీకంబుతోఁ బ్రొద్దులన్
వీఁకన్ బుచ్చుచుఁ గీర్తి క్రొమ్ములకలన్ దివ్యావనిన్ నాటుచున్
తేకుల్ విచ్చిన నీ కృపాసుమములన్ రేపాడి కప్పించు మా
పైకిన్ జల్లగదే ! కృపాజలనిధీ ! బ్రహ్మాండవంశాగ్రణీ ! 6

నీ సమ్యక్స్థితిఁ జూచి, నేత్రయుగళీనిష్యంది బాష్పాంబు ధా
రా సేకంబుఁ బొనర్చి, యంజలిపుటీరాజన్నమోవాక వి
న్యాసంబున్ ఘటియించి, నీ బహువిధ వ్యాసంగముల్ జ్ఞప్తికిన్
రా సమ్మానముతోడ నీ కిడుదు నార్యా! మన్నివాపాంజలిన్. 7





# చందమామ

- శ్రీ శేషు



ఆదియైన శక్తి తాను - చందమామ
అవనిపైకి రాదలంచె - చందమామ
అమ్మ తలపుననుసరించి - చందమామ
ఈశు డవనికి అవతరించె - చందమామ
వేటగాడై కానదిరుగుచు - చందమామ
అంతులేని అందమంత - చందమామ
పోతబోసిన బొమ్మరీతి - చందమామ
మెరసిపోయెడు లలన జూచె - చందమామ
పట్టబోయిన దొరకబోక - చందమామ
పెనుత్రాచై లేచె లేమ - చందమామ
శిలతానై రూపుదాల్చె - చందమామ
శూలమ్మున రుధిరమాయె - చందమామ
బెదిరినట్టు అయ్య మూర్ఛిల - చందమామ
అభయమంచు పలికె అమ్మ - చందమామ
పాముగెల్వగ పంతమునె - చందమామ
తోక తొక్కి నిల్వ దలచె - చందమామ
జంటనాగ స్వరము లూది - చందమామ
పాముతో ఆటాడసాగె - చందమామ
నాగులను తామించి గెలిచి - చందమామ
నాగేశ్వరుడాయె అవని - చందమామ
సాధించిన కోర్కె దీర్ప - చందమామ
అమ్మ అందెను అయ్య చేయి - చందమామ
తామసంపు గుణము చాయ - చందమామ
అయ్య అమ్మను జులుము జేసె - చందమామ
ఓర్పు తానై క్షమయె తానై - చందమామ
మార్పు తెచ్చె అయ్యలోపల - చందమామ
ఆశదీరగ ఏడుగడయని - చందమామ
ఇహ పరముల నాటి అభయమె - చందమామ
వేకువనె గ్రోలె సూత్రోదకము - చందమామ
సుతుల కిడెను తీర్థజలముగ - చందమామ
రూపు దాల్చిన కరుణతానని - చందమామ
గేస్తు తానై జనుల చూచె - చందమామ
తండ్రి తానై నిలుచుకొలది - చందమామ
ఎరుక పడె లోతైన అమ్మ - చందమామ
తనకు పూజలు సేయు తల్లికి - చందమామ
తానె పద పూజలు నొనర్చె - చందమామ
ముందుగా తన తనువు నంపి - చందమామ
తాను కదలగ ఆననిచ్చె - చందమామ
నాగేశు దారీతి ఆయెను - చందమామ
అనసూయకు ఈశ్వరుండై - చందమామ
తాను గుడిలో విభుని నిలపె - చందమామ
తానై ఆ గుడిలోన చేరె - చందమామ
ఒకటి రెండై ఆటలాడి - చందమామ
రెండు ఒకటై నిలచెనచట - చందమామ
అవని జనులను బ్రోవ వెలసె- చందమామ
ప్రకృతి పురుషులు కలసి నిలచి - చందమామ
అనసూయేశ్వరులు గాగ - చందమామ
అర్కపురిలో రాణ నిలచిరి - చందమామ

**నోట్ :** ఆదిశక్తి అవనిపై అవతరించి, శిలారూపము నొంది, వేటగాని రూపమున గల శివుని శూలముతాక రుధిరము స్రవించి, అభయ మొసంగి, నాగేశ్వరుని పత్నియై, క్షమకు ప్రతిరూపమై తన ఆధారమై, ఆరాధించిన పతికి ఆరాధ్యయై, దేవాలయమున ప్రకృతి పరమేశ్వరు లొకే రూపమై, అనసూయేశ్వరులుగా నిల్చిన దివ్యచరిత్ర.

మా తండ్రిగారు కీ.శే.రాజుపాలెం రామచంద్రరావు గారి డైరీలలోని కొంత సమాచారం ఆధారంగా - రచయిత





# ఎక్కడకు వెళ్ళారు నాన్నారూ?



శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి, ఏలూరు

జిల్లెళ్ళమూడికి రాగానే ఎక్కడినుంచి వస్తున్నామో మర్చిపోతున్నాం నాన్నగారూ ! ఎన్నో ఏళ్లుగా ప్రయాణం చేసి చేసి, ఎన్నో మైళ్ళు నడచి నడచి, అలసి సొలసి, ఇక్కడకు చేరుకున్న భావన; వెనక్కి తిరిగి చూసుకుంటే అంతా చీకటిగా వుంది. నడిచి వచ్చిన దారి మూసుకుపోయింది. ఇహ వెనక్కు వెళ్ళలేం నాన్నగారూ! ఇక్కడ మీరూ, అమ్మా వున్నారు. ఆకలేస్తే అమ్మ అన్నం పెడుతుంది. ఆ మాటా ఈ మాటా చెప్పి, ధైర్యంయిచ్చి బుజ్జగించి, “ఎందుకూ అట్లా భయపడతారూ ? అమ్మ దగ్గర భయం వద్దు. ఏం కావాలో అడిగేసేయండి. అడిగి కావలసినవన్నీ తీసేసుకోండి” అంటూ అమ్మదగ్గరకు ఆప్యాయంగా పంపించడానికి మీరున్నారు. అందుకే ఇక్కడికి వచ్చేసింతర్వాత, ఏదో ఎత్తయిన కొండ ఎక్కి కిందకు దిగినంత వూరట మాకు. పల్లేరు కాయలున్న దారిలో నడిచి కాళ్ళు తడబడి చివరకు పువ్వులు చల్లిన రాచమార్గంలోకి అడుగు పెట్టినంత సంతోషం మాకు. వత్తులు వేసుకుని వెతికి వెతికి అలిసి పోయిన కళ్ళకు ఇక్కడ కావలసింది కనిపించి విశ్రాంతి దొరికినట్లనిపిస్తుంది. నాన్నగారూ ! ఈ ఊరికి మీరు కరణం గదా, మీకు ఈ రహస్యం తెలిసే వుంటుంది, మాకు చెప్పరూ ? ఊరూ పేరూ లేకుండా వుండవలసిన వూరు ఏం పుణ్యం చేసుకుని ఈ చరితార్థతను సాధించుకుంది ? నేను పుట్టిన గడ్డమీద పదిమందిలో ఒకరుగా వుండే సామాన్యత్వాన్ని విదల్చుకుని, రేటూరును కాదని జిల్లెళ్ళమూడి చేరడానికి ఇక్కడ ఏం విశేషం కనిపించింది మీకు ? ఈ గాలిలో వేదవాక్కు ధ్వనించిందా? ఈ పుడమితల్లి పురుటినొప్పుల్లో అమ్మతనం ప్రతిఫలించిందా ? వెనుకబడిన బడుగు ప్రజల్లో దాగిన దరిద్రనారాయణుడే మిమ్ము ఆకర్షించాడా? “పుణ్యక్షేత్రాలేవైనా చూశారా నాన్నారూ?” అంటూ అడిగితే “ఇదే నా కాశీ” అన్నారు. కాంగ్రెస్ అన్నా, గాంధీజీ అన్నా వల్లమాలిన ఆరాధన మీకు. “సబర్మతీకి వెళ్ళకపోయినారా?” అంటే “ఇదే నా సబర్మతీ” అన్నారు. అందరింటి వంక అరమోడ్పు కన్నుల్తో చూస్తూ ఎవరో ముస్లిం సోదరుడు “అమ్మకు మొక్కితే ఇంకా మెక్కా ఎందుకో?” అంటే “కాశీ రామేశ్వరాలు, మెక్కా బెథెల్‌హామ్‌లు అందరికీ ఇప్పుడిదే!” అన్నారు విశాలంగా నవ్వుతూ. అప్పుడు అర్థమైంది - మీరూ, అమ్మా చేయి చేయి కలిపి ఇక్కడకు ఎందుకు వచ్చారో. అయితే మీరిక్కడకు వచ్చింతర్వాత ఇది కైలాసమయిందా? లేక జిల్లెళ్ళమూడి కైలాసమే గనుక అందరికీ సుగతి నందించడం కోసం మీరిక్కడకు తరలివచ్చారా? ఏమో.... అన్నీ అనుమానాలే. అన్నీ ప్రశ్నలే. మీ దగ్గర మాత్రం అవన్నీ హుష్ కాకీ ! మీరున్న చోటంతా వెలుగే. అంతా హడావిడే. అంతా ఆప్యాయతే. అంతా అద్వైతమే. అంతా తెలిసినతనమే.

గేటు తీసుకుని విశాలంగా వున్న మండపంలోకి రాగానే ముందుగా, కుడివేపున వున్న వరండా చివరిగదిలో మాక్కనిపించేది మీరే కదా నాన్నారూ ! ఉత్తరాలు చదువుకుంటూనే, వచ్చిన వారెవరా అని తల ఎత్తి కళ్ళ చివర్ల నుండి ఆర్ద్రంగా చూస్తారు. తెలిసినట్టుగా కొంచెంగా అయినా అనిపిస్తే చాలు - నిర్మలంగా నవ్వుతూ, “ఇప్పుడేనా రావటం?” అంటూ పలకరిస్తారు. ఆమాట పెదవులపైన అంటించుకున్నదా... అబ్బెబ్బే ... గుండెలోతుల్లో నుండి బయట పడినటువంటిది. మనసులో దాగిన పితృత్వమంతా అలలు అలలుగా బయటకు జాలువారేటటు వంటిది. ఒక్కొక్కసారి పసిపిల్లవాడిలా అమాయకంగా మీరు మాట్లాడేవారు



కాదూ... మరోసారి జగద్రహస్య సిద్ధాంతాలన్నీ వడగట్టి అందించేవారు. నిజానికి మీదేమంత భారీ విగ్రహమా? అయినా మీ కంఠానికి అంతటి భారీతనం ఎట్లా వచ్చిందీ? అది మీ కడుపున దాగిన భారీతనం కాదూ? కాదనకండి, అవునని మాకు తెలుసు!!

ఇదేమిటి నాన్నారూ, ఇంతసేపైంది మేము వచ్చి, ఎన్నో మాటలు మాట్లాడుతున్నాం, ఇంకా మాకు కనిపించరేం? ఎక్కడకు వెళ్ళారూ నాన్నారూ.... ? 'అమ్మా - అమ్మవాక్యాలూ'లో అమ్మ అన్నది. "వారు నన్ను వదలి పెడతానన్నా నేను వారిని వదలిపెట్టను" అని. మీరమ్మ దగ్గరకేవన్నా వెళ్ళలేదు కదా? అసలు అమ్మే మాకు సరిగా కనిపించదు. పిలిచి పిలిచి గొంతు ఆర్చుకుపోయి, గుండె లెండిపోతేగాని ఈ మధ్య అమ్మ కనబట్టంలేదు. ఆ అమ్మ దగ్గరకు మీరు వెళ్ళి ఆమె దగ్గర దాక్కుంటే, మిమ్మల్ని మేం అసలు చూడనే చూడలేము. మిమ్మల్ని కనుక్కోవటం మా తరం కాదు. "భర్త అంటే శరీరం కాదు. భావన" అంటుంది అమ్మ. భావనకు ఆకారం ఏముందీ ? మిమ్మల్ని నిరాకారుల్ని చేసి మా నుండి దూరం చేసినా చెయ్యగలదు అమ్మ. మీ పేరు చెప్పమని ఒకసారి అమ్మను కొందరాడ పిల్లలు అడ్డగించారు.

"చెప్పేదేముంది ? అది ఎప్పుడూ వున్నది. ఆ స్మరణ ఎప్పుడూ ఉన్నది.... అన్ని నామాలూ ఆ నామం అనుకుంటే ఆ నామం లోవేగా ఇవన్నీ ? 'నా' సరే. 'గే' అన్నప్పుడు దేహం కూడా వున్నది. నాదేహం అయినప్పుడు ఇంకా పేరు చెప్పటమేముంది?" అన్నది అమ్మ.

అన్ని నామాలూ మీ నామమే అనుకొన్న రాజరాజేశ్వరి "మొగుడని ఎవరనుకుంటున్నారూ? దేవుడనుకుంటున్నానుగా" అని మిమ్మల్ని ఆధారం చేసుకుని పంచభూతాలనూ జయించింది. పంచభూతాలనూ తనవి చేసుకున్న అమ్మ, కొంపతీసి తన దేవుణ్ణి, మిమ్మల్ని పంచభూతాల్లోనూ కలిపేయ లేదుగదా. ఆమెకేం, ఏమైనా చేస్తుంది. ఆమే మీరు, మీరే ఆమె. ఆమే పంచభూతాలు - పంచభూతాలే ఆమె.

అమ్మే అన్నదిగదా ఒకసారి - "అమ్మలో నుం ప్రకోపింపబడ్డవాడే నాన్న. ప్రకోపింప చేస్తుంది గా ప్రకోపించదు అమ్మ." సంసారం కోసం బాహిరం మీరు పురుషుడు, ఆమె ప్రకృతీ. కానీ నిజానికి ఆ రూపమూ, శక్తీ కూడా కాదూ ! ఆమెకు పరిణామ కాని, నాశనం - లేదు అని ఆమె చెప్పింది. ఆమె అంతర్భాగమైన మీకూ అంతేగా !! మీకు రూపాంతర కాని రూపనాశనము లేదు. అయితే మాకు మ రూపంలో అయినా కనిపించవచ్చు కదా నాన్నారూ?.. ఏమో అమ్మ నిర్ణయం ఏమిటో ! ... ఏ గుళ్ళో మిమ్మల్ని ప్రతిష్ఠిస్తుందో, ఏ గూట్లో వెలిగే దీపశక్తిగా మిమ్మల్ని మారుస్తుందో ... ఏం నిర్ణయంచేసినా, "నిర్ణయాని నిర్ణయించినవాడు కూడా బద్ధుడే" అంటుంది అమ్మ ఏమో, అంతా అగమ్యంగా వుంది. ఎదుట దీపాల వెలుగుతున్నా, అంతా చీకటిగా వుంది. అమ్మ దగ్గరక మీరు వెళ్ళారంటే, అమ్మ మీలో కలవకపోతే అది జరగదు అమ్మకు మీరు పెనిమిటి, పెన్నిధి, దైవసన్నిధి లక్ష్యం ఎంత అదృష్టవంతులు మీరు నాన్నారూ...! మీ రెండు పాదాలు అమ్మ మెళ్ళో వున్న ఆ రెండు మంగళసూత్రాలు అయినాయి. మీ భావనను అమ్మ మంత్రంగా విన్నది. అహో ! ఎంతటి పాతివ్రత్యం అది!! పాతివ్రత్యానికి చరమదశగా భర్తకూడా భార్యను అమ్మా అని పిలవడం మా కంటికి కనిపించని అర్ధనారీశ్వరతత్వం మీ ఇద్దరిదీ. ఆమెకు మీరు మాతృత్వాన్నిచ్చారు. మీకు పితృత్వాన్ని వరంగా ప్రసాదించింది అమ్మ. ఇక్కడ వున్న చెట్టూ చేమా ఈ అర్ధనారీశ్వరతత్వాన్నే పాడుకుంటున్నాయి. చేనూ, గట్టూ మాతాపితృత్వాన్నే గానం చేస్తున్నాయి. గాలీ నీరూ జ్ఞానయోగాన్ని సాధన చేస్తున్నాయి. మీరు మాకు కనిపించకుండా అమ్మ దగ్గర దాక్కున్నా, ఈ పాటలు, ఈ గానం మాకు వినిపిస్తూనే వుంటాయి. ఈ యోగం మాకు త్రిపుటీ రహస్యాన్ని తెల్పుతూనే వుంటుంది. అయినా ఒక్కసారి చెప్పరూ, ఎక్కడకు వెళ్ళారు నాన్నారూ! ✤✤✤





# శ్రీ నాగేశ్వరాష్టకమ్



శ్రీ శిష్ట్లా ప్రభాకర్, జిల్లెళ్ళమూడి

సుజాతాఽనసూయేశ్వరం ప్రాణనాథమ్ - ఉత్తమజన్మ కలిగిన అనసూయాదేవి భర్తని, ప్రాణేశుని
గభీరాననం చన్ద్రమౌళి స్వరూపమ్ । - గంభీరమైన మోముతో, శైవరూపము కలిగినవానిని
జగన్మాతృ సచ్చిత్త వల్మీక వాసం - అమ్మ యొక్క మనస్సనెడి పుట్టయందు నివసించువానిని
భజేఽహం మహేశాంశ నాగేశమీశమ్ ॥ - శివాంశమైన నాగేశ్వరుని భజించుచుంటిని.

శ్రితానాం మనోకేతకీ గుల్మవాసం - ఆశ్రయించిన భక్తుల మనస్సనెడి మొగలిపొదను నివసించువానిని
సదా మాతృ శీర్షాగ్ర ఛత్రాభిరామమ్ । - ఎల్లప్పుడు అమ్మ తలపై చక్కని గొడుగైనవానిని
మనోభీష్ట సంతాన దానే ప్రసిద్ధం - మనస్సుకు ఇష్టమైన సంతానమునిచ్చుటలో ప్రసిద్ధుని
భజేఽహం మహేశాంశ నాగేశమీశమ్ ॥ - శివాంశమైన నాగేశ్వరుని భజించుచుంటిని.

చతుర్థీ తిథీన్దు ప్రతీకాశ దంష్ట్రం - చతుర్థీ తిథి నాటి చంద్రవంకవంటి కోరలున్న వానిని
గవాం క్షీరధారాఽభిషేక ప్రసన్నమ్ ! - ఆవుపాలధారాభిషేకంతో ప్రసన్నమగువానిని
కళాసుప్రవీణం సుఖేలా విలోలం - కళలయందు ప్రావీణ్యం కలిగిన వానిని, కేళీలోలుని
భజేఽహం మహేశాంశ నాగేశమీశమ్ ॥ - శివాంశమైన నాగేశ్వరుని భజించుచుంటిని.

మహానాగ దోషాన్తకం నిష్కళంకం - నాగదోషమును తొలగించువాడు, కళంకములేనివానిని
విరూపాక్ష భక్తస్య హృల్లింగ దాసమ్ ! - శివభక్తుల హృదయమనెడి శివలింగమునకు దాసుని
శ్రితస్యారిషడ్వర్గ మండూక మారం - భక్తుని యొక్క అరిషడ్వర్గములనెడి కప్పలను సంహరించువానిని
భజేఽహం మహేశాంశ నాగేశమీశమ్ ॥ - శివాంశమైన నాగేశ్వరుని భజించుచుంటిని.

జగన్మాతృ చిత్తే విలీనం కులీనం - అమ్మ మనస్సు నందు లీనమైన గొప్ప వంశస్థుని
ఫణా మండలేషు స్ఫురద్రత్న భూషమ్ । - విశాలమైన పడగలయందు ప్రకాశించు రత్నాభరణముకలవానిని
మహాపాతకాంతం ప్రచణ్డం ప్రశాన్తం - మహాపాపమును తొలగించు భయంకరుడు, ప్రశాంతమైనవానిని
భజేఽహం మహేశాంశ నాగేశమీశమ్ ॥ - శివాంశమైన నాగేశ్వరుని భజించుచుంటిని.

భవాంభోది నిర్మగ్న భక్తౌఘ పోతం - సంసార సాగరమున మునిగిపోవు భక్తులకు నావవంటివానిని
అనాథాప్తమిత్రం శ్రితానంద పాత్రమ్ । - అనాథలకు ఆత్మీయమిత్రుని, భక్తులకుసంతోషముకలిగించువానిని
మరుద్వేగ యాతం వినమ్రాయ శాంతం - వినమ్రునియెడల శాంతుడు, వాయువేగముతో వెడలువాడు
భజేఽహం మహేశాంశ నాగేశమీశమ్ ॥ - శివాంశమైన నాగేశ్వరుని భజించుచుంటిని.



సురైర్వన్ద్య నాగేంద్రమీశాన రూపం – దేవతలచే నమస్కరింపబడునాగేంద్రుని, శివరూపమైన వాని
ప్రవాళారుణాక్షం శిఖాసామ్య జిహ్వామ్ । – పగడరాగము వంటి నేత్రములు, అగ్గిచీలికవంటి నాలుక కలవాని
రుజాం భేషజం మృత్యు నిర్వాపదక్షం వ్యాధులకు వైద్యుడై, మృత్యువును తొలగించు దక్షత కలవాని
భజేఽహం మహేశాంశ నాగేశమీశమ్ ॥ – శివాంశమైన నాగేశ్వరుని భజించుచుంటిని.

త్రినేత్రాశ్రితం భస్మలిప్తాంగ రాగం – శివుని ఆశ్రయించిన వానిని, విభూతి లేపనముతో ప్రకాశించువాని
ప్రఫుల్లారవిన్దస్ఫటా నాళవాలమ్ । – విచ్చినపద్మమువంటి పడగయు తామరతూడువంటి తోక కలిగియ
చిదానందమూర్తిం సదా నిర్విచారం – చిదానంద స్వరూపుని, ఎల్లప్పుడు విచారం లేనివానిని
భజేఽహం మహేశాంశ నాగేశమీశమ్ ॥ – శివాంశమైన నాగేశ్వరుని భజించుచుంటిని.



## శ్రీ నాగేశ్వర అష్టోత్తర శతనామావళి

- శ్రీ పి.యస్.ఆర్.ఆంజనేయప్రసాద్



**శ్లో॥ అర్కమండల సంవాసే బ్రహ్మాండాంతర వ్యాపినే; నాగేశ్వరాయ దేవాయ అనసూయాపతే నమః॥**
**ప్రతి నామమునకు ముందు "ఓం ఐం క్లీం హ్రీం శ్రీం ఓం" అని బీజాక్షరములు ఉచ్చరించవలెను.**

శ్రీ నాగేశ్వర స్వామినే నమః
జగదీశ్వరీ సమారాధ్యాయ నమః
దివ్య చారిత్రాయ నమః
హైమవతీదేవీ జనకాయ నమః
జగత్పిత్రే నమః
విశ్వంభరారాధ్యాయ నమః
సతీధ్యాన సంపన్నాయ నమః
అన్న వితరణ మానసాయ నమః
గౌరాంగ వర్ణాయ నమః
సౌవర్ణవరవర్ణిన్యర్థభాగాయ నమః
విశ్వజననీవిలాసాయ నమః
దృఢ ప్రజ్ఞాయ నమః
దేవదేవాయ నమః
ప్రసన్న గంభీరాయ నమః
పరమోత్కృష్ట విజ్ఞానాయ నమః
దృఢవ్రతాయ నమః
కనకాంబాగర్భశుక్తిముక్తాఫలాయ నమః
సుబ్రహ్మణ్య సుతాయ నమః

జగత్క్రీడాప్రహృష్టాయ నమః
జగన్నాటక సూత్రధారాయ నమః
సర్వదేవతా శ్రేష్ఠాయ నమః
మహా యోగేంద్రాయ నమః
బ్రహ్మాండ వంశాబ్ధి రాకాశశినే నమః
పత్నీ ఆత్మీయభావనాత్మకాయ నమః
అర్కపురీశాసకాయ నమః
ఆదర్శపురుషాయ నమః
కుండలిన్యుద్దీపిత శక్త్యాత్మనే నమః
అన్నపూర్ణాలయాయ నమః
మధుసూదనపూజితాయ నమః
లోక కళ్యాణకాంక్షిణే నమః
సుబ్రహ్మణ్య రవీంద్ర జనకాయ నమః
జగజ్జనకాయ నమః
విశాలహృదయాయ నమః
సర్వేశాయ నమః
భగవతీ భాగేశ్వరాయ నమః
స్నేహమాధుర్య మహోన్నతాయ నమః

అనంతవాత్సల్యాయ నమః
భక్తప్రియాయ నమః
నాగేంద్రాయ నమః
పక్షపాతరహితాయ నమః
దయాకరాయ నమః
సర్వసహపంక్తిభోజనప్రియాయ నమ
అభిషేక ప్రియాయ నమః
అర్కపురీక్షేత్ర నిలయాయ నమః
దరస్మేర ముఖాంబుజాయ నమః
సౌజన్యమూర్తయే నమః
పటాటోపరహితాయ నమః
తేజోమయాయ నమః
సదాచారాయ నమః
వినీలలోచనాయ నమః
సాధుజన సుఖరూయ నమః
సంసార దుఃఖనాశకాయ నమః
అమృతమయచైతన్య స్వరూపాయనమ
ఓంకార నదీతీర నివాసాయ నమః



దీనజన సంరక్షకాయ నమః
జ్ఞానమార్గ నిరూపకాయ నమః
పురాతనాయ నమః
ధర్మాసక్త చిత్తాయ నమః
స్వాంత స్సుఖాయ నమః
లోకాలోకా సంభావ్యాయ నమః
అజాతశత్రవే నమః
అధునాఽపి సనాతనాయ నమః
సర్వజ్ఞాయ నమః
భూదేవాయ నమః
పుణ్యస్వరూపాయ నమః
సులక్షణ సంపన్నాయ నమః
మంగళకరాయ నమః
పరమోత్తమాయ నమః
పరిపూర్ణాయ నమః
సుస్థిరతేజస్కాయ నమః
సత్కీర్తి ప్రదాయ నమః
మాత్రానందహాస్యచతురోక్తయే నమః
సమస్త ధర్మస్వరూపాయ నమః
సంకల్ప సాధనాయ నమః
పవిత్రాంతః కరణాయ నమః
సర్వసులభాయ నమః
అధ్యాత్మయోగ నిలయాయ నమః
అనసూయామాంగళ్య సూత్రపాదాయ నమః
అనసూయా హృదయశోభితాయ నమః
నవనవోన్మేషోత్సాహాయ నమః
సాధుజన సులభగమ్యాయ నమః
సంకల్ప మాత్ర సర్వసిద్ధయే నమః
శాశ్వతాయ నమః
అచ్యుతాయ నమః
మంగళప్రదాయ నమః
సులభ సంతృప్తాయ నమః
సంసారవిముక్తాశ్రయాయ నమః
శాంతిసౌఖ్యప్రదాయ నమః
ప్రేమాతిశయ ప్రకాశాయ నమః
త్రిగుణస్వరూపిణే నమః
సత్యసత్పురుషాయ నమః
ఆనంద స్వరూపాయ నమః
శుభకర స్వరూపాయ నమః
సంసార సాగరతారకాయ నమః
ప్రజ్ఞాన విభవాయ నమః
రాగద్వేషాది వర్జితాయ నమః
దూరశ్రవణవిద్యా విజ్ఞానాయ నమః
దేదీప్యమాన ప్రకాశాయ నమః
సంతుష్ట హృదయాయ నమః
కాలకాలస్వరూపాయ నమః
పరిశుద్ధవివేక సంపన్నాయ నమః
మాతృభక్తి పరాయణాయ నమః
భూతదయాశాలినే నమః
సర్వగురుస్థానీయాయ నమః
మహాపతివ్రతాకవచరూపాయ నమః
అనసూయాద్వితీయాయ నమః
సోమశేఖరరూపిణే నమః
శ్రీ అనసూయేశ్వరాయ నమో నమః

(నాన్నగారి శతజయంతి సంవత్సరోత్సవాలలో సమర్పింపబడిన నామప్రసూనాలు)



అమ్మనాన్నగార్లతో రామకృష్ణన్నయ్య





# కారణజన్ములు



శ్రీ చెరుకుమల్లి సత్యనారాయణ, విజయవాడ

బ్రహ్మాండ వంశసాగరుడు, అర్కపురి సుధాకరుడు, సుకృతుడు మన నాన్నగారు.

నవనీత హృదయుడు మన నాన్నగారు.

నిరాడంబరుడు మన నాన్నగారు.

నిర్లిప్తమైన జీవితం నాన్నగారిది.

అర్కపురిలో వారికి అన్ని అధికారాలూ వున్నాయి. అయినా వారు ఏ అధికారమూ కోరలేదు.

లక్ష్యశుద్ధితో ప్రతిపని చేయాలనే తపనా, ఏ పనిలోనూ అజాగ్రత్త కూడదనే ధోరణి వారి మాటల్లో ద్యోతకమౌతుంది. 1969లో AGAMANI అనే పేరుతో అర్కపురిలో వున్న NAGAMANI కి T.M.O.వస్తే, అర్కపురి పోస్టుమాస్టరుగిరి చూస్తున్న నాన్నగారు – ఆ T.M.O. యివ్వడానికి నిరాకరించారు. ఈ T.M.O. మాదేనండి. నా భార్యకు హైదరాబాదు నుండి మా అన్నగారు పంపారు. టెలిగ్రాంలో 'N' అనే అక్షరం పొరపాటున పోయి వుంటుంది. అని యెంత మొత్తుకున్నా– ససేమిరా అని AGAMANI అనే పేరుతో అర్కపురిలో ఎవరూ లేరని రూఢిచేసుకొని – ఆ తర్వాత సాక్షుల సంతకాలు వగైరాలు తీసికొని – ఆ T.M.O. బట్వాడా చేశారు – నాన్నగారు. విధినిర్వహణలో మొగమాటములకు తావులేదు నాన్నగారి దగ్గర.

పరమాత్మ "అమ్మ"కు రాచపుండు యేర్పడినప్పుడు, నెల్లూరులో నాన్నగారు గడిపిన ఆ రోజుల్ని – అమ్మ ఆరోగ్య విషయంలో నాన్నగారి సున్నిత హృదయం పొందిన ఆవేదనను – నాతో వెళ్ళగ్రక్కుకుంటూ, మా సాన్నిహిత్యాన్ని – ఆత్మీయతగా మలచారు నాన్నగారు.

"అమ్మ" రాచపుండును 'అమ్మ' వ్యక్తపరచే బాధ నాన్నగారు వర్ణిస్తూ ఉంటే, చెమ్మగిల్లిన నా కళ్ళను చ వారి హృదయం ద్రవించేది.

ఏ వూరు వెళ్ళినా, ఎవరితో మాట్లాడిన నిరాడంబరంగా – తాను కేవలం జిల్లెళ్ళమూ కరణంగానే చెప్పుకునేవారు. ఎవరైనా తెలుసుకొని " మీరు నాన్నగారు కదూ!" అని అంటే – చిరున నవ్వేవారు. ఆ నవ్వులో ఎంత అమాయకత్వం !!

"సత్యనారాయణగారూ – మీ అమ్మగారి చూశారా? ఆమె ఆరోగ్యం ఎలా వుందో అడిగారా? అని గుచ్చి, గుచ్చి మరీ అమ్మ ఆరోగ్యం గురించి ప్రతిక్షణ అడిగి తెలుసుకునేవారు – హైద్రాబాదులోనూ అర్కపురిలోనూ.

డాక్టర్లు, "ఫర్వాలేదు – అమ్మ ఆరోగ్యంలో చాల ప్రోగ్రెస్ వుంది అంటున్నారు" – అని నేనంటే.

"డాక్టర్ల విషయం కాదండీ – మీ అమ్మగార ఏమంటున్నారు?" అని మళ్ళీ ప్రశ్నించేవారు.

అమ్మ తనకు కులాసాగా వున్నది – అ చెప్పాలనీ, అమ్మ నోటివెంట ఆమాట వచ్చినట్లు వినాల – నాన్నగారు ఎంత తపించేవారో !

విశ్వకుటుంబిని మన 'అమ్మ'ను కళ్యాణమాడి జగత్తులోని సర్వప్రాణికోటి నుండీ "నాన్నగారూ" అ పిలిపించుకున్న మన నాన్నగారు కారణజన్ములు మహామనీషి.







# మన నాన్నగారు



శ్రీ గరుడాద్రి, కర్నూలు

అందరిలో మంచితనాన్నే అవలోకించే అమ్మకు - నాన్నగారిలో మరింత మంచితనంకాక వేరే ఏమి కనపడుతుంది? మంచితనానికి మారు పేరు మన నాన్నగారు. క్షమాగుణ సంపన్నులు మన నాన్నగారు. దయానిధి మన నాన్నగారు. పేదలపట్ల, పతితులపట్ల వారికి గల సానుభూతి, అనురాగం అపారమైనవి. నాన్నగారు ఎంతో నిండైన మనిషి. అందరిలో తానొకరుగా మెలిగేవారు. వాత్సల్యంతో, సత్యసంధతతో, ధర్మప్రవర్తనతో అందరి మనసులనూ ఆకట్టుకొనేవారు. అందరినీ ప్రేమించటం, అందరిచేతా ప్రేమించబడటం సామాన్యమైన విషయం కాదు గదా! ప్రేమను, ఆదరణనూ, మనం మరచిపోలేనంతగా ప్రకటించేవారు. నిరాడంబరంగా వుండేవారు. కల్లాకపటం లేకుండా వర్తించేవారు. పిల్లలలో పిన్నగా - పెద్దలలో పెద్దగా వ్యవహరించేవారు. ఆవరణలో వుండేవారినే కాదు, నిత్యం అమ్మదర్శనార్థం అరుదెంచే బిడ్డలనే కాదు, గ్రామీణులను కూడా అంత వాత్సల్యంతోనే చూచినారు. స్నేహానికి అమిత విలువనిచ్చేవారు. విచక్షణ లేకుండా ఎవరినైనా నమ్మేవారు.

నాన్నగారు చాలా చురుకైన మనిషి. చాలా ఉత్సాహవంతులు కూడా. వారికి మంచి జ్ఞాపకశక్తి వుండేది. స్వాతంత్ర్య సమరంలోని సందర్భాలెన్నో వారికి కరతలామలకం. రాజకీయనాయకుల జీవితాలు వారి ప్రసంగాలు ఏదైనా అవకాశం సంభవించినపుడు చెబుతూ వుండేవారు. నాటకరంగ మంటే ఎనలేని ఇష్టం. సంగీతమన్నా, క్రీడలన్నా చాలా మక్కువ. నాన్నగారు బాగా పద్యాలు పాడేవారు. విద్యార్థిదశలోనే నాన్నగారు నాటకాలలో పాల్గొన్నారు. గంటలు గంటలు నామం వినేవారు. ప్రత్యేకించి రాధ చేసే నామం చాలా శ్రద్ధగా వినేవారు.

చారిత్రక ప్రదేశాలు చూడాలని ఉంది. నువ్వు నా వెంటవస్తావా ? అని నన్ను అడిగారు నాన్నగారు. నేను సరే అన్నాను. వారితో కలసి మన్నవ వెళ్లే భాగ్యమే కలిగింది. ఒక సందర్భంలో నాన్నగారు నాకు స్వాములవారు కావాలని వుంది అన్నారు నాతో. ఇప్పుడు మీకేం తక్కువయ్యింది? అన్నాను. నాన్నగారు చిరునవ్వు నవ్వి వూరుకున్నారు. ఈనాడు జగత్తుకే స్వామి అయి, అర్చనలను, ఆరాధనలను అందుకుంటున్నారు.





నాన్నగారితో రవి అన్నయ్య తదితరులు





# అత్యంత స్నేహశీలి - మధురభాషి



శ్రీ ఎమ్.యస్.యన్.మూర్తి, మద్రాసు

"అమ్మ" మనందరికీ దైవం.

అలాంటి దైవానికే దైవం మన "నాన్నగారు". ఇన్నాళ్లుగా నాన్నగారితో నాకున్న అనుభవంతో - ఇంతమందికీ ఆరాధ్యురాలయినా "అమ్మ నా భార్యగదా! నన్ను శాసించగలవారెవ్వరు?" అనే అహంభావం ఆయనలో ఏనాడూ చూడలేదు. ఏనాడు జగన్మాత అయిన అమ్మ కరగ్రహణం చేశారో ఆనాడే ఆయన "జగత్పిత" అయినారు. ప్రతిరోజు అమ్మ తన బిడ్డలకు దర్శనం యివ్వటంలోనో, వారిని ఆదరించి లాలించి పాలించటం లోనో ఎక్కువ కాలం గడుపవలసి వస్తుంది. అలాంటప్పుడు వ్యక్తిగతంగా భార్యగా నాన్నగారికి సేవచెయ్యటానికి గాని, వారి అవసరాలను గమనించి చూడటానికి గాని అమ్మకు అవకాశం చాలా తక్కువగా వుంటుంది. అయినా నాన్నగారు అందువల్ల తను యిబ్బంది పడుతున్నట్లు ఏనాడూ కనిపించేవారు కాదు.

ఇక్కడి ఓరియంటల్ కళాశాలలో షుమారు 150 మంది విద్యార్థులు ఉన్నారు. వాళ్ళంతా ఎక్కడెక్కడనుండో ఎంతో దూరం నుంచి వాళ్ళ తల్లిదండ్రులనూ, ఆప్తులనూ వదలి యిక్కడికి వచ్చి చదువుకుంటున్నారు. 'వాళ్ళకి తల్లీ తండ్రీ మనమే అయి వాళ్ళను చూడాలి, మన పిల్లలలాగానే వాళ్లూ పిల్లలే కదా, వాళ్లలోనూ కొందరు కొంటెవాళ్ళు ఉండవచ్చు. వాళ్ళను మంచితనంతో లాలించి వాళ్ళలో పరివర్తన తీసుకురావాలి గాని దండించరాదు' అనేవారు. వాళ్ళకు సెలవలు యిచ్చినప్పుడు వాళ్ళ ఊళ్ళు వెళ్ళటానికి కొంతమందికి రైలు చార్జీలు డబ్బులు లేకపోతే తానే యిచ్చి పంపేవారు. వాళ్ళు తిరిగి యిస్తే తీసుకునేవారు, లేకపోతే అడిగేవారు కాదు.

నాన్నగారికి క్రీడలన్నా, నాటకాలన్నా ఎంతో ఇష్టం. 68 ఏళ్ళ వయసులో కూడా దాదాపు యింకా రెండు మూడు రోజులకు స్వర్గస్థులవుతారనగా కూడా ఆయన మాతో బాల్‌బ్యాడ్‌మింటన్ ఆడారు. బాగా ఆడేవాళ్ళంటే ఎంతో ముచ్చటపడేవారు. రిపబ్లిక్‌డేకి జరిగిన ఆటల పోటీలలో అత్యుత్తమ క్రీడాకారునికి ఒక కప్పు, అత్యుత్తమ సత్ప్రవర్తన గల విద్యార్థికి ఒక కప్పు తన స్వంతఖర్చుతో తన పేర యిప్పించారు.

ఆవరణలో ఏదైనా పాటకచేరీగానీ, హరికథగానీ జరిగేటప్పుడు అందరితోపాటు తనుకూడా క్రిందనే కూర్చుని వినేవారు. అమ్మగారి భర్తగా తనకు ఏదైనా ప్రత్యేకత చూపించటం ఆయనకు యిష్టం ఉండేదిగాదు. సామూహిక భోజనాలు ఆవరణలో జరగటం ప్రారంభమయిన తరువాత 2వ గంట వినబడగానే తన కంచం, గ్లాసు తీసుకుని వచ్చి విద్యార్థుల మధ్యన బంతిలో కూర్చునేవారు. ఎంత నిరాడంబరంగా వుండేవారో! ఆయన ఆ ఊరి కరణంగారు కనుక ఎప్పుడైనా తన పై అధికారులు వస్తే, వాళ్ళు వయస్సులో తన కంటె ఎంత చిన్నవాళ్ళయినా, ప్రభుత్వోద్యోగిగా వారి ముందు ఎంతో వినయంగా వుండేవారు. దర్శనం చేసుకుంటామని కోరితే వారిని అమ్మ వద్దకు దర్శనం నిమిత్తం పంపించే ఏర్పాటు చేసేవారు. ఆ అధికారులు అమ్మదర్శనం చేసుకుని, అమ్మను అర్చించుకుని, అమ్మకు పాదనమస్కారం చేసుకుని అమ్మ యిచ్చిన ప్రసాదం తీసుకుని క్రిందకు



వచ్చేవారు. అటువంటి అమ్మకు భర్త అయినా, తనపై అధికారులు తన భార్యకే నమస్కరించి పూజించినా, తాను మాత్రం తన పై అధికారుల యెడల ఉద్యోగవిధి నిర్వహణలో సంప్రదాయాన్ని, వినయశీలాన్ని నిస్సంకోచంగా పాటించేవారు. ఏ విధమైన దర్పమూ, భేషజమూ వారిలో కనిపించేవి కాదు.

అత్యంత స్నేహశీలీ, మధురభాషీ, ప్రీతిపాత్రుడూ అయిన నాన్నగారు మాతో ఆడుతూపాడుతూనే హఠాత్తుగా నిష్క్రమించడం నిజమేనని నా మనసును నమ్మించు కుందామని ఎంత ప్రయత్నించినా ఏమూలనో - నేను నమ్మను, నమ్మజాలకున్నాను - అని నా మనస్సు తిరుగుబాటును ప్రకటిస్తోంది.

ఇప్పటికీ సాయంత్రం 4-4 1/2 గంటల వేళ యింట్లో కూర్చుని ఏదైనా పేపరో, పుస్తకమో చదువుకుంటూ వుంటే "మూర్తిగారూ ! వెళ్దామా!" అని నాన్నగారి గొంతు వినిపించి ఉలిక్కిపడి లేస్తుంటాను. ఇకముందు మూర్తిగారూ, వార్తలు విన్నారా? ఏమిటి విశేషాలు ? అని నన్ను రోజూ ఎవరడుగుతారు? పైకి ఏడ్చేవాళ్ళు కొందరుంటే లోలోపలే కుళ్ళి కుమిలేవాళ్ళు కొందరుంటారు. ఏ మాత్రం లౌకిక జ్ఞానం లేని రెండో కోవకు చెందినవాణ్ణి నేను.

నా మనస్సు మీద శాశ్వతంగా మరచిపోలేని ముద్రవేసిన అత్యంత ప్రీతి పాత్రులయిన మిత్రులు శ్రీ నాన్నగారు. నా కంటె 15 సంవత్సరాలు పెద్దవారైనా నన్ను ఆప్తమిత్రుడిగానే చూచారు గాని నన్నెన్నడూ శాసించి ఎరుగరు.

ఇకమీదట శ్రీనాన్నగారు అనసూయేశ్వరుడుగా మనల్నందరినీ కాపాడుతూ తన కరుణనూ, వాత్సల్యాన్నీ మనందరిపై వర్షిస్తూ మనల్ని కనిపెట్టి చూస్తూ వుంటారు.



కొమ్మూరు డాక్టర్ అనంత సీతాచలం దంపతులతో అమ్మ నాన్నగారు





# నాగేశ్వరస్వామీ!



శ్రీ శిష్ట్లా సత్యనారాయణరాజశేఖరం, బాపట్ల

ఒకచో నిర్మల కర్మయోగ నిరతుం
దున్నాడు బ్రహ్మాండనా
యకు ! డావేశము లేశమేని యెఱుగం
దంతర్ముఖుం ! డమ్మ పే
ర్మికి బైచేయనవచ్చు నమ్మహితు నో
ర్మిన్; నాన్నగా రెవ్వరిం
తకు ? నా పాలిటి బాల్యమిత్రుడటె మా
నాగేశ్వరుం డంటవే !

కీర్తన : వరాళిరాగం –మిశ్ర చాపు

ప॥ పున్నెమిది నీ పుట్టుచనవు సుమీ ! నాగేశ్వరస్వామీ!

అ॥ వన్నెగల వంశమున కీ దైవాంశయొక్కడు
కలసివచ్చెను ॥పున్నెమిది॥

చ॥ ఎన్ని యెుఱిపిడు లోర్చుకొంటివొ –
నాన్నగారని పించుకొంటివి
నిన్ను తండ్రిగ నెంచుకోనిది –
నెలవు గలదటె, ఏరికే నిట?
తైర్థికుల దనిపి నీయర్థము
– సార్థకమ్మాయె ననసూయా
సార్థదేహుడ వగుట జన్మమె –
సార్థకత జెందినదిరా ప్రభు! ॥పున్నెమిది॥
ఎల్లరకు నాదర్శమవు – జిల్లెళ్ళమూడి గృహస్థమౌ
చల్లగా సంసారయోగము
– సలుపరా వెయ్యేళ్లకాలము ॥పున్నెమిది॥

("సమదర్శన" గేయ కావ్యము నుండి) ❖❖❖



# మిమ్మల్ని మరవడం ఎట్లా ?



శ్రీ యార్లగడ్డ రాఘవయ్య, సింగుపాలెం

నాన్నగారూ – మాపై మీరెందుకు సీత కన్ను వేశారు?

మీరు ఎప్పుడూ మా అందరితో అన్యోన్యంగా మెలుగుతూ మాపై నిరంతరం అనురాగం కురిపించేవారు గదా! మా అందరి యోగక్షేమాలు సదా విచారిస్తూ ఉండేవారు గదా!

ఒకసారి నేను అమ్మవద్దకు వెళుతుండగా నా తలపై మంచంపడి గాయమైంది. బాధతో నేను అమ్మా – అని కేకవేశాను. అమ్మ పరుగెత్తుకు వచ్చి తన చీరె చెంగు చించి నా రక్తమును తుడిచింది. ఈ విషయం మీకు తెలిసి రివ్వున వచ్చి ఆ దుర్ఘటనకు కారణులయిన వారిని మందలించి నన్ను ఎంతగానో పరామర్శించారు. ఆ దయార్ద్రపూర్ణ వాక్కులు నా శ్రవణేంద్రియాల్లో నేటికీ మారు మ్రోగుతూనే ఉన్నాయి.

ఒకసారి నేను హరికథ చెప్పగా విని మీరెంతో ఆనందపడి పద్యాలు చదివారు. ఆ పద్యాలు ఎంత బాగున్నాయి! మీకంఠం ఎంత బాగుంది ! మీ సంగీత జ్ఞానం అనన్యసామాన్యమయింది.

మిమ్మల్ని ఎలా మరవడం?





# నాన్నగారి జాతక విశేషాలు

శ్రీ అన్నపర్తి కృష్ణశర్మసిద్ధాంతి, పంచాంగకర్త
హైదరాబాదు - సెల్ - 9885442568



భూమిపై జన్మించిన ప్రతిప్రాణికిని జాతక ముండును. జననకాలమున కేర్పడిన లగ్నాది గ్రహకుండలిని బట్టి సకలజీవులకును జ్యోతిశ్శాస్త్రము ననుసరించి, శుభాశుభ ఫలనిర్ణయము చేయుటకు వీలగును. అందువలన, మనుష్యజాతకములకు, వియోని జాతకములకును శాస్త్రగ్రంథములలో ప్రత్యేక ఫలితాంశములు చెప్పబడినవి. వియోని జన్మలనగా మానవజన్మకంటె తక్కువ స్థాయి గలవి, అర్థాత్తు పశు, మృగ, పక్షి, సర్ప, తరుగుల్మ లతాదులు.

అందరికి వలెనే, నాన్నగారికి కూడ జాతకమున్నది. నాన్నగారంటే బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు, శ్రీ వత్సస గోత్రము, అందరి అమ్మకు, ఎల్లమ్మకు (ఎల్లవారికి, ఎల్ల జీవులకు, పశుపక్ష్యాదులకును అమ్మయైన) అనసూయమ్మకు పతిదేవులు, జిల్లెళ్ళమూడి గ్రామములోని ప్రధానాలయంలో ప్రతిష్ఠులైనారు. అమ్మ కూడా అదే ఆలయములో నాన్నగారి పార్థివదేహము ప్రక్కనే దక్షిణ భాగమున ప్రతిష్ఠిత అయినది. శరీరములు వేరైనా ఆత్మ ఒక్కటే అన్నట్లు, పార్వతీపరమేశ్వరుల వలె ఏకాత్మగా, పరమాత్మగా ఒకే నాణెమునకు బొమ్మ, బొరుసు వలె ప్రతిష్ఠుతులైనారు. అంటే, అర్చావిధానములో అమ్మ, నాన్నగారు "అనసూయా నాగేశ్వరాభ్యాం నమః" అని చెప్పుకొనవలసియున్నది. ఇక ప్రకృతి మనుసరింతము.

మన అమ్మ "జిల్లెళ్ళమూడి అమ్మ"గా ప్రసిద్ధి చెందినది. చిన్నప్పటి నుండియేగాక, జననమునకు పూర్వము గూడా అనేకులకు దర్శనమిచ్చి, చిన్మయిగా ప్రకటితమైనది. కాని, నాన్నగారు సామాన్యులుగా జన్మించి, అనసూయాదేవిని పరిణయమాడి "త్వత్పాణి గ్రహణ పరిపాటీ ఫలమిదమ్మ"ను నట్లు మానవత్వము నుండి దివ్యత్వమును పొంది అనసూయేశ్వరులై, జగదారాధ్యులైనారు. వారి జన్మకుండలి యందలి గ్రహస్థితి, యిట్టి పరిణామమును తెలియజేయునని, జ్యోతిశ్శాస్త్రము ఆధారముగా నిరూపణము గావింపబడుచున్నది.

స్వస్తిశ్రీ ప్రమాది(న్) నామ సంవత్సరం, ఆశ్వయుజ బహుళ సప్తమీ 21-10-1913 తేదీ మంగళవారము, పునర్వసూ నక్షత్రము ప్రథమ పాదము, సిద్ధయోగము, భద్రకరణము ఈ శుభదినమందు తెల్లవారుజామున గం. 4-30 ని.లకు శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారి శుభజననమ్.

జననతేది : 22-10-1913, బుధవారము, సూర్యోదయాత్పూర్వము గం. 4-30 ని.లకు జననము. కల్యాది గతాబ్దములు : 5014, శాలివాహనశక శతాబ్దములు : 1835. 21-10-1913 తేదీన మన్నవ గ్రామము (జన్మస్థలము) లో.

సూర్యోదయము గం. 5-53ని. (స్థానిక మధ్యమ కాలము LMT)

సూర్యాస్తమయము గం. 5-36 ని. (స్థానిక మధ్యమ కాలము LMT)

మన్నవ గ్రామమునకు అక్షాంశ $16^0$-06' ఉ॥ రేఖాంశ $80^0$-30' తూ॥

---

భద్రకరణమునకే విష్టి కరణమని పేరు. శివారాత్రి భేదముచే, ఆయా తిథులందు, భద్రకరణమే విష్టికరణముగా పేర్కొనబడును.



| | | | |
|---|---|---|---|
| రా.0-55 | | శ.25-08 (వ) | చ.22-52<br>కు.24-31 |
| | జన్మకుండలి<br>(రాశి చక్రము) | | |
| | | | |
| గు.18-44 | | ర.5-18<br>బు.26-29 | కేం-55<br>శు.8-14<br>ల12-28 |

**జననకాల గ్రహస్థితిః**

చిత్రా ౪ రవిః
పున ౧ చంద్రః
పున ౨ కుజః
విశా ౨ బుధః
పూ.షా. ౨ గురుః
ఉ.ఫ. ౪ శుక్రః
మృగ ౧ శనిః (వ)
పూ.భా. ౪ రాహుః
ఉ.ఫ. ౨ కేతుః

**గ్రహస్థితి వివరణము :** వృషభరాశిలో శనైశ్చరుడు వక్రించి యున్నాడు. మిథునరాశిలో చంద్ర, కుజులు, కన్యారాశిలో కేతువు, శుక్రుడును, తులారాశిలో రవి, బుధులును, ధనురాశిలో గురువు, మీనరాశిలో రాహువును ఉన్నారు. ఛాయా గ్రహములైన రాహు, కేతువులు మినహా మిగిలిన సప్తగ్రహమును ఐదురాసులలో నున్నవి. దీనికి పాశయోగమని పేరు.

ఈ జాతకునిది కన్యాలగ్నము, మిథునరాశి జ నక్షత్రము పునర్వసు 1వ పాదము. ఈ జాతకము గురువు స్వక్షేత్రములో (బలవంతుడై) యున్నాడు. ర శుక్రులు నీచరాసులలో (బలహీనులై) యున్నార జ్యోతిశ్శాస్త్ర పరిభాషలో సూర్యునకే 'రవి' అని పేరు

**జాతక ఫలితాంశములు**

**1. జనన సంవత్సర ఫలము :** ప్రభవాది 47 ప్రమాది నామ సంవత్సరములో జన్మించుటచే సాంగత్య దోషము గలవాడు, వ్యసనపరుడును అగు చెప్పబడినది. "దుర్మిత్రః వ్యసనప్రీతః..." దీనిని బ కొందరు మిత్రులు, లేదా వ్యక్తుల వల్ల యీ జాతకు నష్టపడునని తెలియవలెను.

**2. అయన ఫలము :** దక్షిణాయనము జన్మించుట చేత, పనులయందు నేర్పుగలవాడు, తేజశ్శా యగునని చెప్పబడినది. "ప్రగల్భస్తేజస్వీదక్షిణాయ సంభవః".

**3. ఋతుఫలము :** శరదృతువులో (ఆశ్వయు మాసమున) జన్మించుటచేత;

**శ్లో॥ సుముఖో నిష్కళంకశ్చ, పుణ్యాత్మా దైన్యవర్జిత**
**భోగవాన్ దానశీలశ్చ, శరత్కాలసముద్భవః ॥**

అనునట్లు ప్రసన్నమైనవాడు, పుణ్యాత్ము దైన్యము లేనివాడు, భోగవంతుడు, దానశీలుడు అగునని చెప్పబడినది.

**4. మాసఫలము :** ఆశ్వయుజ మాసము జన్మించి నందున లజ్జావంతుడు, ధనమును మితము ఖర్చుచేయువాడు, కళల నెఱింగినవాడును అగును.

**శ్లో॥ లజ్జాళుః కృపణోభీరుః, గంధమాల్యప్రియస్స**
**గుప్తమార్గ కళాభిజ్ఞో, ఆశ్వయున్మాసిసంభవః ॥**

నాన్నగారు రంగస్థలనటకులై శ్రీకృష్ణరాయబార మొదలగు నాటకములలో పాత్రలు ధరించి యథోచితముగా పద్యపఠన మొనర్చి పేరు గడించినా

**5. విద్యాధిఫలము :** బహుళ సప్తమీ తిథి యంద జన్మించుటచేత, జాతకుడు జ్ఞాని, గుణజ్ఞుడు, ధనమ



పుత్రసంపదగలవాడు, దేవతలందు భక్తికలవాడనియు చెప్పబడినది.

**శ్లో॥జ్ఞానీ గుణజ్ఞో విశాలనేత్రః, సత్పాత్ర దేవార్చన చిత్తవృత్తిః ।'** ఇత్యాది.

6. మంగళవారము రాత్రికాలమున జన్మించుటచే భూవసతి (పొలము) గలవాడు, సత్తువగలవాడు, కోప స్వభావము గలవాడు మొదలగు ఫలములు చెప్పబడినది. "...నరేంద్రమంత్రీ చ ధరోపజీవీ । సత్వాన్విత స్త్రీవ్రతర స్వభావః, దినేభవే చ్ఛావని నందనస్య ॥" 'నరేంద్రమంత్రీ' అనుటచే ప్రభుత్వ సంబంధమగు ఉద్యోగము (కరిణీకము) గలవాడని గ్రహింపవలెను.

**7. పునర్వసూ నక్షత్ర జనన ఫలము :**

**శ్లో॥ప్రభూత మిత్రః కృతశాస్త్రయత్నః**
**సద్రత్న చామీకర భూషణాఢ్యః ।**
**దాతా ప్రతాపీ వసుధా వసుశ్చ**
**పునర్వసు ర్యస్య భవేత్ ప్రసూతౌ ॥**

ఈ జాతకుడు అనేక మిత్రులు గలవాడు, విద్యావంతుడు, రత్న భూషణాది సంపదలు గలవాడు, దాత, ప్రతాపశాలి,భూమి ధనము గలవాడగునని చెప్పబడినది.

**8. జనన కాల లగ్న రాశ్యాది ఫలములు:** వేకువ జామున జన్మించుటచేత దైవభక్తి, దేవబ్రాహ్మణులందు గౌరవము, ఆత్మవిశ్వాసము గలవాడగును. కన్యాలగ్నము, మిథునరాశియందును జన్మించుటచేత, "భోగీవదాన్యో బహుపుత్ర మిత్రః" అనునట్లు భోగియు, దాత, అనేక మిత్రులు, పుత్రులును గలవాడగును. ఇద్దరు పుత్రులు, ఒక పుత్రికయును జన్మింతురు. ఇందులకు పునర్వసు నక్షత్రములో పుట్టుటయే కారణమని యూహింపవచ్చును.

**9. జన్మలగ్న విశేష ఫలము:** కన్యాలగ్నములో జన్మించినందున క్రీడల యందు (స్పోర్ట్సు) ఆసక్తికల వాడగును. శుక్రస్థితిచే సంగీతజ్ఞానము, ప్రవేశబు గల వాడగును. శుక్ర కేతు యోగముచే పిత్రార్జితము పూర్తిగా ఉపయోగపడదు. అంతేగాక, స్త్రీ సాంగత్యదోషము చెప్పబడినది.

**10. లగ్నమునకు వర్గబలము :** లగ్నము కన్యారాశి, చంద్రహోర, శనిద్రేక్కాణము, కుజ నవాంశ, శని ద్వాదశాంశ, బుధ షోడశాంశ, గురు చతుర్థాశ, శుక్ర సప్తాంశ, బుధ త్రింశాంశలలో నున్నది. ఈ తొమ్మిది వర్గలలో (అంశలలో) ఆఱు శుభగ్రహవర్గలైనందున, ఈ జాతకుడు పుణ్యపురుషడని తెలియవలెను. అందువల్లనే కాబోలు రాజుబావ (మన్నవ బుచ్చిరాజుశర్మగారు) "భువి లోని బంగారు మొలకా రావయ్య ! బ్రహ్మాండవంశాబ్ధి తిలకా!" అని కీర్తించినారు.

**11. విద్యా, ధనయోగములు :** విద్యాస్థానములగు 2, 4, 9 భావములలో బుధ రవి - గురు శనులున్నందున మాతృభాషయేగాక, ఇంగ్లీషు భాషను అభ్యసించి విద్యావంతుడగునని తెలియుచున్నది. శని హూణ విద్యా (ఇంగ్లీషు) కారకుడు. ఉన్నత విద్యాస్థానమందు (తొమ్మిదిలో) శని వక్రించి యున్నందునను, చతుర్థ కేంద్రములో బృహస్పతియున్నందునను గ్యాడ్యుయేషన్ లోపలే విద్యాయోగమున్నదని చెప్పవలెను.

భాగ్యరాజ్యాధిపతులగు శుక్ర, బుధులకు లగ్న ద్వితీయములందు పరివర్తన యోగముండుట చేత, జాతకుడు ధనార్జనపరుడై, కుటుంబ భారమును వహించు వాడగును.

**12. మాతా పితృ విచారము:*** పితృస్థానములో శని వక్రించి యున్నందునను, పితృకారకుడు నీచస్థానములో నున్నందునను పితృభాగ్యము, పితృసుఖమును ఈ జాతకునకు తక్కువగా నుండునని చెప్పవలెను. అనగా విన్ననాటనే పితృవియోగ సూచనలున్నవి.

13. లగ్నాత్తు మాతృస్థానములో స్వక్షేత్రమందు

* విచారమనగా విమర్శ, చర్చ, వివరణబు మొదలగు అర్థములు చెప్పుకొనవలెను.



గురువున్నందున జాతకుని తల్లి దీర్ఘాయుష్మంతు రాలగును.

**14. కళత్ర విచారము, సంతానము :** జ్యోతిశ్శాస్త్ర పరిభాషలో 'కళత్ర'మనగా భార్య లేదా భర్త అని అర్థము. జాతకములో ఏడవరాశి (సప్తమ స్థానము) కళత్రస్థానము. నాన్నగారి జాతకములో లగ్నాత్తు సప్తమస్థానములో రాహువును, చంద్రాత్తు సప్తస్థానములో గురువును నున్నారు. "శిశిర కర సమాగమేక్షణానాం సదృశఫలం ప్రవదన్తి లగ్న జాతమ్" (వరాహమిహిరుడు) అని చెప్పుటవలన, జన్మలగ్నము నుండియు, చంద్రలగ్నము (జన్మరాశి) నుండియు ఫలవిచారము చేయవలెను. లగ్నాత్ సప్తమములో రాహువున్నందున, కళత్రమునకు రాహు లక్షణములు సుదీర్ఘకేశపాశములు, దంష్ట్రలు (బయటకు కనబడునట్టి ముందుపళ్ళు) ఉండునని చెప్పవలెను. చంద్రలగ్నాత్ (అనగా మిథునరాశి నుండి) సప్తమములో గురువున్నందున, "దారే జీవే ధర్మవీలా పతివ్రతా" (జైమిని సూత్రములు) అనియున్నందున, జాతకుని భార్య ఉత్తమ యిల్లాలని స్పష్టమగుచున్నది. రాహుస్థితి చేత కొంతకాలము కళత్ర సుఖము, అనేక కారణములచే స్వల్పముగ నుండును. సంతానము విషయమై వెనుక చెప్పియుంటిమి.

**15. ఆరోగ్యము, ఆయుస్సు మొదలగు విషయములు :** ఆరోగ్య విషయమై లగ్న చతుర్థ కేంద్రములలో శుక్ర, గురువు లున్నందున, జాతకుడు (నాన్నగారు) ఆరోగ్యవంతులని చెప్పవలసి యున్నది. ఐనను, లగ్నములో నీచయందు శుక్రుడు, కేతువును ఉన్నందున, శరీరము సుకుమారమని చెప్పవచ్చును. జలదోషమువల్లను, వైరల్ సంబంధముగ అనారోగ్యము గలుగుచుండును. శశి మంగళ యోగము వల్ల, అధికశ్రమ చేసినచో ఆరోగ్యము దెబ్బతినును.

**16. ఆయుర్విషయమై** నాన్నగారి జాతకమున సుమారు ఆరు పుష్కరముల ఆయుస్సు సూచితమగుచున్నది. పుష్కరమనగా పండ్రెండు సంవత్సరములు. సాధారణముగా నైదు పుష్కరముల తర్వాత (60 సంవత్సరాల తర్వాత) శరీరము బలహీనమగుచుండును. అందుచే, 60 సంవత్సరము నిండగనే షష్ట్యబ్దపూర్తి (షష్టిపూర్తి) ఉత్సవము, అ శాంతి పూజాదికము చేయుదురు. మరొక విధము 32 సంవత్సరాల వరకు అల్పాయుర్దాయమనియు, సంవత్సరముల వరకు మధ్యమాయుర్యామనియు, సంవత్సరముల నుండి 96 సం॥వర పూర్ణాయుర్దాయమనియు జ్యోతిశ్శాస్త్రము చెప్పబడినది. ఏ విధముగ చూచినను, నాన్నగారు సం॥ జీవించుటచే పూర్ణాయుష్కులని చెప్పవలెను.

జాతకములోని (వింశోత్తరీ) దశాంతర్ద ననుసరించి, శుక్రమహాదశలో కేంద్రాధిపతి య గురుభుక్తిలో మారకము జరిగినది. శుక్రు మారకస్థానాధిపతియగుటయే గాక, నీచస్థ (కన్యారాశిలో) వ్యయాధిపతి నక్షత్రములో (ఉ.ఫ.4 పాదము) ఉన్నాడు. ఆ నక్షత్రాధిపతియగు రవి కూ నీచరాశిలో (పూర్తి బలహీనుడై) ఉన్నాడు. వ్యాఖ్యానము అనవసరము గదా!

**17. నాన్నగారు సిద్ధిపొందిన గ్రహకుండలి**

1981 సం॥ ఫిబ్రవరి 17వ తేదీ, మంగళవార

ప్రదేశము : జిల్లెళ్ళమూడికి

అక్షాంశ : 15° - 59' ఉ. రేఖాంశ : 80°-2 తూ.

| | | | |
|---|---|---|---|
| | | | |
| కు 14-42<br>బు5-12(వ)<br>ర 5-05 | రాశి<br>17-2-1981<br>గం. 15-40 ని॥ | | ల 1-07<br>చ 16-50<br>రా 17-2 |
| శు 22-53<br>కే 17-20 | | | |
| | | | శ 15-26<br>గు15-56 |

పై కుండలి యందలి గ్రహస్థితి సిద్ధపురుషుని అవిర్భావమును సూచించుచున్నది.

**18. నాన్నగారి జన్మకుండలి యందలి శుభయోగములు**

**i) పాశయోగము :** సూర్యాది సప్తగ్రహములును నైదురాసులలో నుండుటచేత 'పాశయోగము' యేర్పడినది. దీని ఫలము "పాశే ధనార్జన సుశీల సభృత్యబంధుః" (బృహజ్జాతకము, అధ్యా 12, శ్లో. 18). పాశయోగమున జన్మించినవాడు సన్మార్గముచే ధనము సంపాదించువాడు, సౌశీల్యము గలవాడు, సేవకులు, బంధుమిత్రులు గలవాడును అగును. ఈ యోగమున జనించువారు సాధారణముగా మధ్యతరగతి కుటుంబములకు చెందినవారుగ నుందురు.

**ii) శశిమంగళయోగమున** జన్మించుటచేత, యీ జాతకుడు అభిమానవంతుడు, ఎట్టిపరిస్థితులలోను ధైర్యమును వీడనివాడగును.

**iii) భృగు శిఖియోగము :** ఈ యోగము వల్ల జాతకుని భార్య అనారోగ్యవంతురాలగును. (భృగువనగా శుక్రుడు, శిఖి అనగా కేతువు).

**iv) కార్ముక యోగము :** చంద్రదృష్టి గల గురువు లగ్నాత్తు చతుర్ధ కేంద్రములో (స్వక్షేత్రములో) నున్నందున, ఈ యోగజాతకుడు సుఖవంతుడగును.

**శ్లో॥ తనౌ ధనే గురౌ శుక్రే, బుధే వా చంద్రవీక్షితే।**
**సృగృహే వాథమిత్రస్థే, హిబుకే కార్ముకే సుఖీ॥**

**v) అనఫాయోగము :**

**శ్లో॥ ప్రభురగుదశరీర, శ్శీలవాన్ ఖ్యాత కీర్తిః ।**
**విషయసుఖసువేషో, నిర్వృత శ్చానఫాయామ్॥**
**(వరాహమిహిరః)**

ఈ యోగమున పుట్టుటచే, జాతకుడు వ్యాధి లేని శరీరము గలవాడు (ఆరోగ్యవంతుడు), అప్రతిహతమగు ఆజ్ఞకలవాడు, శాంతి వినయాది గుణములు గలవాడు, శబ్దస్పర్శాది విషయసుఖములు గలవాడు, ప్రక్చందనాద్య లంకారములు గల వాడును; యీ యోగమునకు శని కర్తయైనందున "రవి తనయే బహుకార్యకృత్ గణేశః" అనునట్లు అనేక కార్యములు చేయువాడు, స్వజనమునకు (స్వకులమునందు) అధికుడును అగునని చెప్పబడినది.

అయితే, శని నవమస్థానములో (వృషభరాశి) వక్రించి యున్నందున, దూరప్రాంతములో చేసిన వ్యవసాయము వల్ల ప్రయోజనముండదు. నాన్నగారు 'మొక్కపాడు' (గ్రామము)లో వేసిన (పొగాకు) పంటవల్ల నష్టపడిన విషయము మనమెఱిగినదే.

**చతుష్కోణయోగము :** ఈ యోగము, నే నెఱిగినంత వరకు ఏ (జ్యోతిష) గ్రంథములోను చెప్పబడియుండలేదు. సమచతుష్కోణాకారముగ నుండు జన్మకుండలియందు, ఆగ్నేయాది నాలుగు కోణములందును లగ్నముతో సహా గ్రహములున్నవి. ఇట్లుండుటచే, నాన్నగారి కీర్తి, నేల నలుగడల (నాలుగు మూలల) వ్యాపింపగలదు.

**19. నాన్నగారి జన్మకుండలియందలి గ్రహసంపత్తు**

నాన్నగారి జాతకములో కేంద్రములందు అధిక గ్రహములు (ఆఱుగ్రహములు) ఉండుటవల్ల, జాతకము బలవత్తరమైనది. అంతేగాక, దుస్థానములందు, అనగా లగ్నాత్తు 3, 6, 8, 11, 12 స్థానములందు గ్రహములు లేకుండుట, యీ జాతకములోని ప్రత్యేకత; జాతకుని కృతార్థతను తెలియజేయుచున్నది.

**20. నాన్నగారు – నాగఛత్రము :** నాన్నగారిని గుఱించి, ఒకసారి అమ్మ "నాన్నగారు నా గొడుగురా" అన్నారు. యేర్లగడ్డ రాఘవయ్యగారు "నాన్నగారు బలరాములని, అమ్మ శ్రీకృష్ణుడనియు" అన్నారు. బలరాముడు శేషుని అంశయనునది జగత్ప్రసిద్ధమే. నాన్నగారి జాతకమును పరిశీలించినచో, లగ్నము

మేషనవాంశ, చంద్రుడు కూడ మేషనవాంశ - తదధిపతి యైన కుజుడు బలాధిక గ్రహము (షడ్బల యుక్తుడు). నవగ్రహములకు దేవతాధిపత్యములను పరిశీలించినచో,

కుజునకు కుమారస్వామి అనగా సుబ్రహ్మణ్యుదధిపతి కావున, నాన్నగారు నాగేంద్రుని అంశయని స్పష్టమగుచున్నది.

**21. లగ్నము - చంద్రుడు - సూర్యుడు :** ఈ మూడు స్థానములను జాతకములో ప్రధానమైనవి. "లగ్నం ప్రాణ మయం, శశిస్థభవనం దేహః" అనునట్లు జన్మలగ్నము ప్రాణము, చంద్రుడు అనగా జన్మరాశి శరీరము. ఇక సూర్యుడు ఆత్మ (సూర్యఆత్మా జగతః' ఇత్యాది శ్రుతి వాక్యములు).

నాన్నగారు దేహము చాలించినపుడు, ఆలయములో 'సహస్రదీపాలంకరణము' జరిగినది. అపుడు అమ్మ అన్నారు. నాన్నగారు దీప కళానాథుడని. అమ్మమాటలలో దీని అర్థము: 'దీపము కాంతి కూడా నీవే'. నాన్నగారు అంగారకుని (కుజుని) అంశయని వెనుక చెప్పియుంటిమి. అంగారకుడనగా అగ్ని, అగ్ని స్వరూపుడని యర్థము.

'దేవీ ఖడ్గమాల' దీపకళానాథమయి అనునది 34వ నామము. 'ముక్తకేశిని' అను యోగినిచే అనుగ్రహింపబడిన వాడు దీపకళానాథుడు. వీరు సిద్ధౌఘములోని వారు. శ్రీ విద్యా గురుపరంపరలో, 24వ పరమేశ్వర పరమేశ్వరి నుండి అగస్త్యమయి వరకు గల ఏడుగురు 'దివ్యౌఘగురు సమూహము'. ఆ తర్వాత నలుగురు 31వ కాలతాపన మయి నుండి దీపకళానాథుని వరకు 'సిద్ధౌఘము'. 35వ విష్ణుదేవమయి నుండి 42వ శ్రీరామనందమయి వరకు గల యెనిమిదిగురువులు 'మానవౌఘము'లోని వారు.

"శ్రీ విద్యావతార గురువులు ప్రత్యేకముగా దివ్య - సిద్ధ - మాన వౌఘభేదములలో మూడు విధములు. దిక్పాలకాది దేవతలు సిద్ధౌఘము; సనక నారద యోగులు సిద్ధౌఘము; బ్రహ్మర్షులైన విశ్వామిత్రాదు మానవౌఘము" (ఖడ్గమాలా వివృతి). ఇంతవర చాలును.

పైన వివరించినట్లు, అమ్మ పరంజ్యోతికా నాన్నగారు (సూర్యుడు సూర్యుని కాంతివలె) అ కాంతిపుంజమై, దీపకళానాథులై భాసించుచున్నా నాన్నగారు సిద్ధిపొందిన గ్రహకుండలిని పరిశీలించిన అపుడు (17-2-1981 తేదీన) లగ్నము, చంద్రుడు రెండును కర్కాటరాశిలో నున్నవి. అపుడు అ జన్మనక్షత్రమైన ఆశ్లేషయే అయినది. అట్టి జీవబ్రహ్మై స్థితిలో నాన్నగారు అనసూయేశ్వరులైనారు.

ఓం నమో భగవతేఽనసూయేశ్వరాయ నాగేశ్వరాయ, సదాశివాయ, శ్రీమన్మహా దేవా నమః.

**శుభం భూయాత్**





# అనసూయేశ్వరుడు



శ్రీమతి కుసుమాచక్రవర్తి, విశాఖ

"జయహోమాతా శ్రీ అనసూయా

అనసూయేశ్వర శ్రీనాగేశ్వర॥

మన దృష్టిలో అమ్మకు అత్యున్నతస్థానం వున్నది. అమ్మ తన మాటలవల్ల, క్రియలవల్ల, దృష్టివల్ల మన గుండెల్లో గుడికట్టుకున్నది. మన హృదయసీమల్లో అమ్మకు గల ఆసనం అత్యున్నతమమైన, అద్వితీయమైన, అనుపమానమైనట్టిది. అట్టి అమ్మ గుండెలోతుల్లో గుడికట్టుకున్న శ్రీ నాన్నగారు బ్రహ్మాండం నాగేశ్వరరావు గారి గురించి ఎంత చెప్పినా తక్కువేననిపిస్తుంది.

శ్రీ కావ్యకంఠగణపతిముని రమణమహర్షి ఆశ్రమంలో 'నాయనా' అని పిలువబడేవారు. ఆయన రచించిన 'విద్యాధిసూత్రావళి'లోని సీతావ్యాఖ్యానంలో

"యజ్ఞమయస్య అవతారస్య అనుభూత్యై

కిమపి స్రష్టవ్యం శ్యాత్ నియతః"

యజ్ఞమయుడైన అవతార పురుషుని యొక్క అనుభవం కొరకు పుట్టుటకు ఏది నియమింపబడునో అది సత్తునుండి మాత్రమే జనించును. అసత్తు నుండి పుట్టజాలదు. "రామస్య అనుభూతయే పర్యాప్తం ఫలం సీతా" మర్యాదపురుషోత్తముడైన రాముని కొరకు ఫలించినదే సీత" అని వ్రాశారు. అమ్మ పరిపూర్ణ అవతారం. సత్యవస్తువు నుంచీ వచ్చిన అమ్మ యొక్క అనుభవం కొరకు శ్రీ నాన్నగారు బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు కూడా సత్తు నుంచే జనించుటకు నియమింపబడినారు. అందుకే మన భావాల్ని, మన అవసరాల్నీ, ఆలోచించి అనసూయేశ్వరాలయాన్ని సంకల్పం చేసింది 'అమ్మ'. అది మహత్తర సంకల్పం. మానవ మాత్రులం ఊహించడానికి కూడా శక్యం కానిది.

ఈ అనసూయేశ్వరాలయ రూపకల్పనలో ఎన్నెన్నో అపూర్వ విషయాలు ఇమిడి ఉన్నాయి. అమ్మ నాన్నగార్లంటే శ్రీశ్రీశ్రీ లక్షణయతీంద్రులవారు ప్రకటించినట్లు "ఒకే ప్రమిదలోని రెండు జ్యోతులు, ఒకే వస్తువు యొక్క ఇరుపార్శ్వాలు. ఆ అఖండజ్యోతిని జిల్లెళ్ళమూడిలోని ఒక దేవాలయంలో సుప్రతిష్ఠతం చేసి సర్వలోకాలకు, ఆ వెలుగును, వెన్నెలను పంచాలన్నదే అమ్మ ఆకాంక్ష".

"స్త్రీకి పతియే ప్రత్యక్ష దైవం" అని ఆర్యోక్తి. దానికి నిదర్శనంగానే తన జీవితాన్ని మలచుకొని పతివ్రతగా లోకానికి ఆదర్శమూర్తిగా, ఆరాధ్యదైవంగా నాన్నగారిని మనకు అందించింది అమ్మ. "నేను దేవతను అవునో కాదో నాకు తెలియదు. మీరు కానిది నేనేదీ కాదు. కానీ నాకు దైవం నాన్నగారే" అన్నది. ఉదయమే తన మంగళ సూత్రాలను అభిషేకించుకొని కుంకుమ అద్ది పూజ చేసేది. ఆ తీర్థమే తనకు శక్తినిస్తుందని" అమ్మ తెలియ జేసింది.

అమ్మకు ఎవరైనా శుభలేఖ తెచ్చి ఇస్తే ముందుగా నాన్నగారికి ఇవ్వమని చెప్పేది. భోగిపండుగకు నాన్నగారి నుదుట కుంకుమదిద్ది, ఆయన పాదాల మీద భోగిపళ్ళు పోసి నమస్కరించేది. ఆ తరువాత బిడ్డల నెత్తిన భోగిపళ్ళు పోసి ఆశీర్వదించేది. మా అమ్మాయి అనురాధ పెళ్ళికి నాన్నగారికి బట్టలు పెట్టుకోవాలని వుందంటే, వెంటనే నాన్నగారికి కబురంపి ఆయన వచ్చేలోగా కుర్చీ వేయించి మా దంపతులకు అమ్మకు, నాన్నగారికి కలిపి బట్టలు



పెట్టుకుని వారి ఆశీర్వాదాన్ని పొందే అదృష్టాన్ని కలుగ చేసింది అమ్మ.

శ్రీ నాన్నగారు నిగర్వి. నిష్కల్మష హృదయులు. అందరూ అమ్మను కొలుస్తున్నా తమకేమీ పట్టనట్లే వుండేవారు. ఎందరెందరో అమ్మ కంటె పెద్దవారు, చిన్నవారు, స్త్రీలు, పురుషులు అమ్మను అర్చించుకుంటున్నా తాము మాత్రం మామూలుగా వుండటం భగవత్స్వరూపులకే సాధ్యమౌతుంది. పక్కవాడు భార్యను చూస్తేనే సహించలేని ఈ సమాజంలో వారిని 'అమ్మ' అక్కున చేర్చుకున్నా ఒళ్ళు నిమిరినా ఎటువంటి భావము ఆయనలో వ్యక్తమయ్యేది కాదు. అమ్మ దగ్గరకు వచ్చేవారు నాన్నగారిని చూచి వారు కూడా ఎంతో మార్పుకు లోనయ్యేవారు. పైగా అమ్మ గురించి ఎంతో గొప్పగా చెప్తుండేవారు. అమ్మ ఆరోగ్యం సరిగా లేనప్పుడు దర్శనం ఎలా అని మధనపడ్తుంటే "మీ అమ్మగారు బాధలను చిలక్కొయ్యకు తగిలించి ఏమీ జరగనట్లు, మామూలుగా దర్శనం ఇవ్వగలదని "భరోసా" ఇచ్చేవారు.

శ్రీ నాన్నగారికి క్రీడలయందు మక్కువ ఎక్కువ. విద్యార్థులతో బాడ్‌మెంటన్, వాలీబాల్ ఆడేవారు. విద్యార్థులు తల్లిదండ్రులను వదిలి చదువుకోవటానికి ఇంత దూరం వచ్చారు కాబట్టి వారి ఆహారారోగ్యాల పట్ల ఎంతో శ్రద్ధ కనబరిచేవారు. వారి దగ్గర శెలవులకు తిరిగి వారి వూళ్ళు వెళ్ళటానికి డబ్బులు లేకపోతే స్వయంగా ఆయనే ఇచ్చి పంపించేవారు.

శ్రీ నాన్నగారికి రాజకీయాలందు ఆసక్తి మెండు. ఆయన కాంగ్రెస్ వాది. ఖద్దరు బట్టలే ధరించేవారు. మా నాన్నగారు శ్రీ అన్నంరాజు మాధవరావుగారితో ఆనాటి రాజకీయాల గురించి అనేక విషయాల మీద చర్చిస్తుండేవారు. అలాగే విశాఖపట్టణం I.O.C.లో పనిచేసే ఎ.వి.యల్.నరసింహారావు గారితో తన అభిప్రాయాలను పంచుకునేవారు. జిల్లెళ్ళమూడి వచ్చిన వారందరినీ ఎంతో ప్రేమగా, ఆదరంగా పలకరించేవారు. కొత్త వారెవరైనా వచ్చి "అమ్మగారు ఎక్కడ వుంటారని" అడిగితే ఫలానా చోట వున్నారని తెలియచేసేవారు. తీరా ఆయనే నాన్నగారని తెలిసిన తరువాత ఆ అడిగినవారు ఎంతగానో నొచ్చుకునే వారు.

కొండముది రామకృష్ణ అన్నయ్యకు అమ్మ నాన్నగార్ల గురించిన అభిప్రాయం.

**"అమ్మంటే నాన్నకు ప్రాణం - నాన్నంటే అమ్మకు ప్రాణం. పిల్లలు అంటే ఇద్దరికీ ఎల్లలు దాటిన వాత్సల్యం॥"**

అనసూయేశ్వరాలయంలో అమ్మనాన్నలు కొలువై ఆర్తుల ఆదరించుచూ, ఈప్సితార్థముల తీర్చుచూ బిడ్డలకు కొంగుబంగారమై వెలుగొందుచున్నారు. అట్టి ఆది దంపతులైన అమ్మా నాన్నల నర్చించుకుంటూ మన జీవితాలను సుఖమయం చేసుకుందాము. అమ్మానాన్నలకు శత సహస్రాధిక వందములు సల్పుచున్నాను. ✤✤✤



కనకమ్మబామ్మ గారితో అమ్మ నాన్నగారు





# నాన్నగారి ఆరాధన - ధాన్యాభిషేకము



శ్రీ పి.యస్.ఆర్., గుంటూరు

ప్రధానంగా మనం అమ్మనాన్నలకు ధాన్యాభిషేకం ఎందుకు చేస్తున్నాము? ఆ విధానం ఏలా వచ్చింది అనేది ఇక్కడ ముఖ్యంగా తెలుసుకోవాలి. అసలు అభిషేకం 'అభి అంటే సామీప్యం అంతట - అత్యంతము' అని అర్థము. అభిషేకము అంటే స్నానం - అంటే సామీప్యంలో నుండి అత్యంత నిష్ఠతో అంతట తడుపుట. దేనితో ? ధాన్యముతో తడుపుతున్నాము. లేక ధాన్యముతో స్నానం చేయిస్తున్నాము. ధాన్యంతో ఎవరైనా స్నానం చేయిస్తారా? నీళ్ళతోనో, పాలతోనో చేయిస్తారు కదా ? మరి ఇదేమిటి? అంటే ఇదే ఇక్కడ ప్రత్యేకత.

అమ్మ అన్నది "తడి గుడ్డలోని తడిలాగా నేను మిమ్మల్ని అంటి పెట్టుకొనే ఉన్నాను" అని. అంటే ఆత్మస్వరూపిణియై సర్వజీవులలోనూ అమ్మ ఉన్నది అన్నది అమ్మ మాటలతో మనకర్థమౌతున్నది.

అమ్మకు నాన్నగారికి ఇష్టమైన అన్నపూర్ణాలయాన్ని పరిపూర్ణంగా ఉంచాలంటే ధాన్యం అవసరం కదా ? సర్వకాల సర్వావస్థల్లో అది జగన్నాథ రథచక్రాల్లా ఆగకుండా నడవాలని అమ్మ ఆకాంక్ష. అందుకే ధాన్యానికి ప్రాధాన్యం ఏర్పడింది అక్కడ. అమ్మను అందుకే ధాన్యంతో అభిషేకించటం. ఇది ఇక్కడి ప్రత్యేకత.

ధాన్యాభిషేకం కార్యక్రమం జరిగే రోజు నాన్నగారి ఆరాధనాదినోత్సవం కావడం కూడా యాదృచ్ఛికం కాదు. ఎందుకంటే అన్నపూర్ణాలయం రాక ముందు నాన్నగారే అమ్మను దర్శించడానికి వచ్చే బిడ్డలందరికి భోజన భాజనాదులు చూచేవారు. అమ్మ కొరకు వచ్చే వారి సంఖ్య పెరుగుతుండటంతో బిడ్డలు బాధ్యతను మోస్తామంటున్నారు కాదనటం ఎందుకు అని అమ్మ నచ్చచెప్పింతర్వాతనే నాన్నగారు అంగీకరించారు. వారి అంగీకారంతోనే అమ్మ 1958 ఆగష్టు 15న అన్నపూర్ణాలయానికి శంకుస్థాపన చేసింది. నాన్నగారి కుటుంబపు త్యాగఫలితం గానే మనం అమ్మ ఒడిలో ఆడుకున్నాం, పాడుకున్నాం, ఆరాధించుకున్నాం. నాన్నగారు ఈ గడప త్రొక్కవద్దు మీరు అని ఉన్నా, వారి పిల్లలు మా అమ్మ వద్ద గడిపే అవకాశం మాకు లేకుండా చేస్తున్నారు ప్రక్కన ఉండండి మీరు అని అని ఉన్నా మనకు ఈ రోజు ఈ అనంత వాత్సల్యమూర్తి అనురాగాన్ని గ్రోలే అవకాశం ఉండేదికాదు. అందుకనే అమ్మ కుటుంబ సభ్యులు అందరూ అమ్మ అవతారం చుట్టూ పెనవేసుకొని ఉన్న మాతృలోక పరిజనమే. అమ్మ సేవకులు కూడా ఆ లోకము నుండి వచ్చి యుండవచ్చును. కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని సీతారాములను గూర్చి చెప్పుతూ "యజ్ఞమయమైన అవతారమూర్తులు అనుభవానికి కారణభూతులైన వ్యక్తులు కూడా సత్తునుండే కాని అసత్తు నుండి పుట్టరు" అన్నమాటలు నిత్య సత్యాలు. అమ్మ, నాన్నగారు చిరంతన చైతన్యమూర్తులు - వారి కుటుంబము అంతే - అమ్మ అవతారమూర్తి, అని నమ్మితే నాన్నగారు కూడా నిత్యుడు, దివ్యుడు, నిరంజనుడే - వారి ఆరాధనోత్సవం నాడు ధాన్యాభిషేకం ఏర్పాటు కావటం కూడా అమ్మ నిర్ణయంలో భాగమే.

అమ్మ కొందరు సోదరులకు ఒక ఆలోచన ఇచ్చింది. అమ్మకు అత్యంత ప్రీతిపాత్రమయిన ఈ అన్నపూర్ణాలయం (భోజనం) ప్రసాదం తీసుకున్న వారి రోగాలు నయమైనట్లు తార్కాణాలున్నాయి. అటువంటి అన్నపూర్ణాలయంలో ఉపయోగించే ధాన్యం అమ్మకు



నాన్నగారికి అభిషేకం - చేసినవైతే వాటికి పవిత్రత, తేజస్సు,శక్తి, అమృతత్వము ఇబ్బడి ముబ్బడిగా చేకూరుతుందని భావించారు. అది సర్వజనామోదమై ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. మేము మేమంటూ ముందుకు వచ్చారు. ఒక్కొక్క కుటుంబం అమ్మను నాన్నగారిని బస్తాబియ్యంతో అభిషేకించుకున్నారు. ఆ బియ్యపురాశి ధాన్యపురాశులలో నుండి అమ్మ నాన్నగారు తొంగి తొంగి చూస్తుంటే ఆ కరుణామయ ఆనందరస ప్రపూర్ణ దృక్కులతో మనలను ఆశీర్వదిస్తుంటే నిజంగా ఆ అనుభూతి అనుభవించిన వారికే అవగతం. ఇది ప్రతిసంవత్సరం ఇలా జరిగితే బాగుంటుందని అందరూ తమ ఇష్టాన్నీ అభీష్టాన్నీ పలికారు. ఆ రకంగా అమ్మ నాన్నగారూ మనకు ధాన్యాభిషేకం చేసుకొనే అవకాశాన్ని ఇంకా ఏ దేవాలయంలోనూ జరుగని విశిష్టమూ, వినూత్నమూ, విశ్వజనోపయోగకరము అయిన ఒక అవకాశాన్ని మనకు ప్రసాదించారు. మరి దానిలో పాల్గొనటానికి మనం ముందుకు దూకుదాం - అమ్మకు నాన్నగారికి ఆనందం కలిగించే ఆ పవిత్ర కార్యక్రమంలో భాగస్వాములవుదాం - అమ్మనాన్నగార్ల ఆశీర్వాదాన్ని పొందుదాం.



అనసూయేశ్వరాలయ నిర్మాణదశలో అమ్మ నాన్నగారు





# అమ్మ - నాన్నగారు



డాక్టర్ ప్రేమకుమార్ భార్గవ, గుంటూరు

అమ్మను చూచినవాళ్ళు "అమ్మ ఎవరు" అని తమ తమ తపశ్శక్తి ద్వారా తమ అంచనాకు అందినట్లు తాము చెప్పారు. సర్వశ్రీ వాసుదాసస్వామివారు గానీ, కల్యాణానందభారతీస్వామివారు గాని, కాంతయ్యయోగి గారుగాని, కృష్ణభిక్షుగారు గాని, కాశీ కృష్ణాచార్యులు గారు గాని, ప్రసాదరాయకులపతిగారు గానీ, పూర్ణానంద స్వామి వారు గానీ ఇహలోకంలో ఎందరిచేతనో గౌరవించ బడుతూ, ఆరాధింపబడుతూ ఆధ్యాత్మికమార్గంలో ఒక చక్కని మార్గదర్శనం చేయగలవారు తమ తమ దర్శనాలను వివరించారు. అయితే అమ్మ దగ్గరకు వచ్చినవారు, అమ్మను చూచినవారు లక్షల కోట్ల మంది అమ్మలో తమ తమ ఆరాధ్యదైవాన్ని ఒక వాత్సల్యమూర్తిని చూచి ముగ్ధులై ఆకర్షితులై ఆరాధించారు. వదలి పోలేకపోయేవారు.

మనలాగనే ఒక సామాన్య కుటుంబిని అయిన ఒక స్త్రీని దేవత అనో అమ్మ అనో ఆమె కంటే పిన్నలే కాక పెద్దలు సైతం భావించటం సామాన్యముగా సాధ్యంకాని పని. ఒకవేళ బయటవారెవరైనా ఆమె శక్తికి ఆశ్చర్యపడి భావించినా ఆమెతో ఆడుకొన్నవాళ్ళు ఆమెలోని లోకజ్ఞతనే చూడగలరు గాని, అలౌకికశక్తిని చూడటం కష్టం. దీపం దగ్గరగా ఉన్నవాళ్ళు దాని క్రింద ఉన్న చీకటిని చూస్తారుగాని, అది ప్రసరిస్తున్న వెలుతురును కాంచలేరు. అలాగే దేవతల దగ్గరగా ఉన్న వాళ్ళు వాళ్ళ నిత్యజీవితంలోని సామాన్య లౌకిక వ్యవహారంలోని అలౌకికశక్తిని, ఆధ్యాత్మిక సమున్నతిని గ్రహించటం కష్టం.

దగ్గరలో ఉన్న భక్తులు, బంధువుల సంగతే ఇలా ఉంటే ఇక దైవదూరుల సంగతి వేరే చెప్పాలా ? కాని అమ్మ విషయంలో అలా జరగలేదు. అమ్మను కన్నతండ్రి సీతాపతితాతగారు, అన్న రాఘవరావు మామయ్యగారు తదితర బంధువులు, అమ్మ చిన్నతనంలో చీదరించు కొన్నవారు కూడా అమ్మను దేవతగా ఆరాధించారు. ఆనందాన్ని, తృప్తిని పొందారు. వాళ్ళందరకు అమ్మ ముక్తిని ప్రసాదించింది.

వీటన్నింటికీ భిన్నంగా తనను భార్యగా స్వీకరించిన భర్త భార్యను దేవతగా భావించటం ఆరాధించటం, సృష్టిలో జరగని పని. కాని ఇక్కడ జరిగింది. పతివ్రత అంటే పతిని ఆధారం చేసికొని పంచభూతాలను జయించేది. పతివ్రతకు పరాకాష్ట భర్త చేత సైతం తల్లిగా ఆరాధించ బడటం అని అమ్మ చెప్పిన పలుకులు నిజాలై జగతికి వేదవాక్యాలైనాయి. "నా అనుభవం లేనిది నేనేమీ చెప్పను. నా అనుభవమే నా కాధారం" అని అమ్మ చెప్పడంలోని సత్యం సర్వులకూ విదితమే.

నాన్నగారు కూడా అమ్మను చాలా పరిశీలించారు. "మీ అమ్మగారు నడుంబిగించి కోడలిగా, అమ్మగారుగా అన్నీ చేసింది. నాకేం జ్ఞాపకం ఉండవండీ! మీ అమ్మగారే అన్నీ జ్ఞాపకం పెట్టుకొని చెపుతుంది" అంటూ అమ్మలోని సామర్థ్యాన్ని జ్ఞాపకశక్తిని ప్రసంగవశాన ప్రశంసించేవారు.

పూజ మొదలు పెట్టినప్పుడల్లా మీ అమ్మగారికి కళ్ళు మూసుకుపోయేవి. శరీరమంతా కూడా క్రమంగా బిగుసుకుపోయినట్లుండేది. రకరకాల ముద్రలు వాటంతట అవే వస్తుండేవి, రకరకాల కాంప్లెక్షన్సు వచ్చేవి. ఒకసారి ఎర్రగా ఒకసారి తెల్లగా, ఒకసారి గంధపురంగులో ఇన్ని రకాల రంగుల్లో వస్తుండేవి. అనేక ముద్రలు వస్తుండేవి. చేతులు ఆటోమాటిక్‌గా ఉండేవి. మీ అమ్మగారు ముద్రలతో ఉన్నప్పుడు మనం ప్రయత్నం



చేసి గట్టిగా లాగినా, అవి చెదిరేవి కావు. క్రమంగా సామాన్యస్థితికి వాటంతటఅవే వచ్చేవి. పూజ అయిన అర్ధగంటకు గాని అత్రిశ్రమమీద కళ్ళు తెరవడం జరిగేది కాదు."

"ఆరోజు ముక్కోటి ఏకాదశి. డాక్టరు గారు (శీతాచలం) తదితరులు అందరి పూజ అయిన తరువాత ఎవరో పళ్ళు చేతిలో పెట్టబోయారు. ఇంతలో, దజను ముద్రలు ఒక్కుమ్మడిగా ఒక దాని వెంట ఒకటి వచ్చాయి. మురళీకృష్ణుడు లాంటి ముద్రలు తదితరమైనవి ఎన్నో బహుశా ఆ రోజు తీసిన ఫోటోలు కూడా ఉండాలను కుంటాను."

"గడ్డవలుగు ఒకసారి గుచ్చుకొంది మీ అమ్మగారికి బహుశా రెడ్డి సుబ్బయ్య వల్లనేమో ? మోత మోగింది వేలు పగిలినట్లు. అప్పుడవన్నీ లెక్కలోవి కావు. ఏ దాలిగుంటలోనో చేయిపెడితే రోజూ తేళ్ళు కుట్టేవి. ఒకసారి భృకుటి నుండి రక్తం చిమ్మింది. దానంతట అదే భస్మమయింది. సువాసనగా ఉంది. క్రిందపడి తెల్లగా అయింది. తలను రాస్తూ ఉంటే చేతికయ్యేది రక్తం.ఆగేది కాదు. బాధపడుతున్నట్టు నాకెప్పుడూ కనిపించలేదు."

"మీ అమ్మగారి నడక చాలా వేగంగా ఉండేది. తొలినాటి రోజుల్లో ఈవిడ ఏం చెబుతుంది అని భయపడుతుండేవాడిని. వేయి మందికి ఉపదేశం చేసి రాత్రి మూడు గంటలకు బయల్దేరి ఆరుగంటలలోపే తిరిగి వచ్చారు. ఒకసారి మీ అమ్మగారు రామాయణంలో విశేషాలు చెబుతుంటే రాఘవరావు, లోకనాథం నమ్మితే నాకు తృప్తి అన్నాను. మా Brother communist. వాడి మాటలు విని మా బావమరిది కమ్యూనిస్టుగా మారాడు. ఆ టైములో 1958 మన్నవలో ఆలయంలో లలితా సహస్రనామాలతో పూజ చేస్తే మైకు లేకుండా ఊరంతా వినపడింది. ఆనాటి మీ అమ్మగారి శరీరపు రంగుకు (complexion) ఈ వేళ రంగుకు పోలిక కనపడదు. అమ్మగా జనానికి తెలిసింతర్వాతే వీరంతా (బంధువులు) రాసాగింది."

"మీ అమ్మగారు నయం చేసుకోవాలంటే తీసేస్తుంది, అది చిలకకొయ్యకు చొక్కా తీసి తగిలించినట్టు. మీ అమ్మగారి విషయం కనపడుతుంది కదా ! ఏమీ బాధలేనట్టుగా, క్రొత్తవారికి ఏమీ తెలియని స్థితిలో as usual గా కనబడుతుంది గదా ! అనేక సందర్భాలలో బాధతో ఉన్నప్పుడు ఎవరైనా వస్తే ఆ బాధ కాసేపు ... వంకెన తగిలించి మామూలు కార్యక్రమం పూర్తి చేస్తుంది.

ఓర్పు అనవచ్చు జ్వరం తగ్గించుకోవడం ... ఎక్కించుకోవడం - ఇన్ని సమస్యలు లేవక్కడ. జ్వరానికి జ్వరమూ ఉంటుంది. మనిషి హాయిగా కనబడుతుంది. జ్వరం ఉన్నా కూడా బాగానే ఉంటుంది. పి.యస్.ఆర్. వాళ్ళన్నయ్య కులపతి అంబికాసాహస్రి ఆవిష్కరణ సందర్భంలో మీ అమ్మగారికి ఆరోజు విపరీతమైన విరేచనాలు, టెంపరేచర్, వాంతులు కూడా ఉన్నాయేమో ! ఈ స్థితిలో వాళ్ళొస్తున్నారు ఎట్లా కూర్చుంటుంది అనే తహతహ. దత్తుగారు ముందువచ్చారు. ఆ క్షణం వరకు పడుకుని ఉండటమే. లేవలేదు. మీ అమ్మగారు స్నానం చేసి వచ్చి షుమారు మూడు నాలుగు గంటల కాలం కూర్చుంది. ఇట్లా అనేక సంఘటనలు."

"నాకెట్లా ఉన్నా నేనే స్థితిలో ఉన్నా ఏదైనా నాకు ఈ శరీరం నిలవదని తోచినప్పుడు ముందుగా మీకు చెపుతానని నాకు చెప్పింది. ఆమెకు తెలుస్తుందనే ధైర్యముంది నాకు. ఫరవాలేదనే విశ్వాసం నాకు. మీ అమ్మగారి శరీరం మీద ఇది వరకు రంగులు మారేవి. మా హైమ మాదిరిగా ఉండేది. చిన్నప్పుడు రోజా రంగు చీర కట్టుకుంటే, ఆ చీరరంగులో ఆమె శరీరం కలిసిపోయేది. నేను ప్రయాణం అయినప్పుడు వెళ్ళిరానా



అంటాను. నా భయం నాకుంటుంది. దానితో పాటు ఏదో ధైర్యం ఉంటుంది. ఆదుర్దా కూడా ఉంటుంది నాకు. ధైర్యమూ కలుగుతుంది. కొద్ది క్షణాల తేడాలోనే మార్పువచ్చేది."

"మీ అమ్మగారు తనను తాను చూచుకోగలదు. మన చక్షువులకు బయట ఎట్లా కనబడుతుందో లోపల మీ అమ్మగారికి అట్లా కనబడుతుంది. ఇట్లాంటివి చిన్న చిన్నవి ఎన్నెన్నో. రాముడమ్మ, కృష్ణవేణమ్మగారు మీ అమ్మగారిని చూస్తూ ఎంతసేపు చూస్తూ కూర్చొనేవారో! వారికి గంటలు కాలం తెలిసేది కాదు. పిల్లి పాలు, కుక్క తాగిన సందర్భాలున్నాయి. మీ అమ్మగారు గంటల తరబడి కూర్చొనేది. చాలా హాయిగా ఉండేది. ఒకసారి మా గురువు గారు మోతడక రామచంద్రయ్య గారి రెండో అబ్బాయి ప్రశ్నలు వేసు కొచ్చాడు, రాగానే ఏదో అడగాలని. ఇప్పుడు హైమాలయం ఉన్న స్థలంలో ఆనాడు పాక ఉండేది. ఆ రోజుల్లో ఓరుగంటి నరసింహయోగిగారు వస్తుండేవారు, కాసేపు ఏమీ లేదని - కాసేపు ఏదో వుందని కొంతమందికీ అనిపించేది. అన్నీ ఉన్నాయందులో. మీ అమ్మగారిలో నేను స్వయంగా చూచినవే చెప్పాను. 1954-56 ప్రాంతాల నుండే గుర్తించటం. ముందు ముందు వచ్చే జనం ఏడవమైలు రాయి దగ్గర నుండే చూచి పోవాల్సి వస్తుందేమో అనేది. వర్షం వచ్చినట్లుగా కలవస్తే మరునాడు కుంభవర్షం వచ్చేది. అటువంటి దృష్టాంతాలు ఎన్నో ఉన్నాయి. మీ అమ్మగారిలో తెచ్చి పెట్టుకున్నదంటూ ఏదీ లేదు. సహజంగా ఉన్నది."

"ఇంకా ఎన్నాళ్ళు ? చాలాకాలం నడిచి నట్టనిపిస్తుంది'' అని అప్పుడప్పుడంటుంది. ఎందుకంటుందో తెలియదు. మనకోసం ఉన్నట్టుగా కనపడుతున్నది."

నాన్నగారు అమ్మకు గొడుగు పట్టే ఉమతో 'సరిగా పట్టాలమ్మా. ఎండ తగలకుండా పట్టమ్మా?' అన్నారు.

నాన్నగారు ఈ రకంగా అమ్మను కంటికి రెప్పలా చూస్తూ కాపాడే ప్రయత్నం చేసేవారు. అమ్మ సినిమాలో మనకు ప్రత్యక్షంగా అమ్మ పాదాలపై నాన్నగారు పూలు పోయడం కనిపిస్తుంది. ఇక ఊరికి వెళ్ళే ముందు అమ్మపాదాలపై పూలు ఉంచి అమ్మచేత కుంకుమబొట్టు పెట్టించుకొని గాని బయటకు వెళ్ళేవారు కాదు నాన్నగారు. వారికి అమ్మపై అంత విశ్వాసం. 20 రోజులు ఎదురుగా అమ్మను కూర్చోపెట్టుకొని జపం చేశారు.

ఇక నాన్నగారి విషయంలో అమ్మ వద్దకు వస్తే భర్తంటే భావన. "మంగళసూత్రాల రూపంలో ఆయన రెండు పాదాలు నా వద్దనే ఉన్నాయి. ఆ మంగళసూత్రాలు కడిగిన తీర్థం తీసుకుంటేనే ఇతరులకు తీర్థం వేసే అర్హత నాకుండేది" - అంటుంది. "వారు నన్ను వదిలి పెట్టినా నేను వారిని వదలిపెట్టను" - అంటుంది.

"అమ్మ కూడా సంక్రాంతినాడు నాన్నగారి పాదాలపై భోగిపండ్లు పోసి, ఉగాది నాడు ఉగాది పచ్చడి పెట్టి నమస్కరించి వేదిక పైకి వచ్చేవారు. నాన్నగారు అన్నం తిన్నారో లేదో ఏం కావాలో అహర్నిశలూ కనుక్కుం టూంటారు. గజేంద్రమ్మ కాఫీ కలిపితెస్తే "ముందుగా నాన్నగారికిచ్చిరా!'' అని చెప్పేవారు. శుభలేఖ ఇస్తే "ఇది ముందు నాన్నగారు చూచింతర్వాత నేను చూడాలి" అనేవారు. ఎవరైనా దినపత్రిక తెస్తే "నాన్నగారికిచ్చి రండి" అనేవారు. క్రొత్త టేపు రికార్డర్ తెచ్చి "నీవేదన్నా మాట్లాడితే రికార్డు చేస్తామమ్మా!'' అంటే ''నాన్నగారు పద్యాలు చదువుతారేమో కనుక్కోండి" అనేవారు. మెట్లమీద నుండి నాన్నగారు వస్తుంటే "నాన్నగారు వచ్చారేమో గది తలుపులు తీయండి" అని అమ్మ అంటే, మరునిమిషంలోనే నాన్నగారు అక్కడకు వచ్చేవారు. వారి పాదాల శబ్దం ఓంకారం లాగా నిరంతరం ధ్వనిస్తుండేది అమ్మకు. -



"మేనత్త కొడుకూ ఒక మొగుడేనా ?" అని ఎవరో అంటే, "మొగుడని ఎవరను కుంటున్నారు? దేవుడను కుంటున్నానుగా!" అన్నారు అమ్మ. ఈ విధంగా నాన్నగారితో అద్వైత స్థితిని భావించింది.

నాన్నగారి పేరు చెప్పమని ఆడపిల్లలు గోలచేస్తే "చెప్పేదేముంది అది ఎప్పుడూ ఉన్నది. అన్ని నామాలు ఆనామం అనుకుంటే ఆ నామంలోవేగా ఇవన్నీ ! నా సరే 'గే' అన్నప్పుడు దేహం కూడా ఉన్నది. నా దేహం అయినప్పుడు ఇంకా పేరు చెప్పటం ఏమున్నది?" అన్నారు.

మంగళసూత్రాలరూపేణా భర్త పాదాలు భార్య కంఠాన ఎట్లా బంధింపబడి ఉంటాయో యజ్ఞోపవీతం రూపేణానో, కంకణాల రూపేణానో భార్య భర్తతోటే సదా ఉంటుంది అని తన అభేదతత్వాన్ని తెలిపేది.

నాన్న క్రింద మెట్ల నుండి వస్తుంటే "నాన్నగారు వస్తున్నారు తలుపులు తీయండి" అంటే "లేదమ్మా ఎవరూ లేరు" అని అక్కడి పరిచారికలంటే, 'కాదు చూడండి' ఆయన పాదాల శబ్దం వినిపిస్తున్నది అని అమ్మ అంటుండగానే నాన్నగారు గదిలోకి వచ్చేవారు.

ఈ రకంగా అమ్మ నాన్నలు అద్వైత స్థితిలో ఉన్నారు. సర్వాన్నీ స్వాధీనం చేసుకొన్న సాధ్విగా అమ్మ, జగత్పితగా నాన్నగారు లోకానికి ఆదర్శ దంపతులై, దేవతలై దేవతలను కన్నారు.



యార్లగడ్డ రాఘవయ్యగారి కుటుంబ సభ్యులతో అమ్మ నాన్నగారు





# నాన్నగారు



శ్రీ యస్.ఆర్. పోతరాజు, జిల్లెళ్ళమూడి

అమ్మ జగదారాధ్య అయితే అమ్మకు ఆరాధ్యదైవం నాన్నగారు. "స్త్రీకి పతియే ప్రత్యక్ష దైవం" అన్న సూక్తికి నిదర్శనంగా తన జీవితాన్ని తీర్చిదిద్దుకొన్న ఒక పతివ్రతగా లోకానికి ఆదర్శమూర్తిగా ఆరాధ్యమూర్తిగా చూపటానికి అమ్మ తన పతిదేవునిగా ఎన్నుకొన్న మహనీయుడు నాన్నగారు. 1936 మే 5న తన మేనత్త కుమారుడైన బ్రహ్మాండం నాగేశ్వరరావుని పెళ్లాడింది అమ్మ. ఆధ్యాత్మిక సాధనకు సంసారం ప్రతిబంధకం కాదని, పెళ్ళిలో పెద్దపులి ఉందని భయపడేవారి భయం పోగొట్టడానికి తనకీ వివాహమని అమ్మ చెప్పింది. చేసేదంతా దైవసేవే అనే భావన ఉంటే ఏదీ దేనికీ అడ్డంకాదు. మంగళసూత్రాలు రెండూ భర్తపాదాలనీ, ఆపాద తీర్థమే లోకంలో అందరికీ తీర్థం వేసే అధికారాన్ని తనకు ఇచ్చిందని చెప్పింది. పతిని ఆధారం చేసుకొని పంచభూతాలను జయించింది పతివ్రత అని ప్రకటించిన అమ్మ పతివ్రత కావటానికి ఆధారం నాన్నగారు. మాధవి మానవిగా అమ్మై అవిర్భవిస్తే మానవత్వం నుండి మాధవత్వాన్ని అందుకొన్న గృహస్థు నాన్నగారు.

"రామయ్యా! నీవు దేవుడవయ్యా!" అనగా 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం', అని శ్రీరామచంద్రు డన్నాడు. అమ్మ "నేను దేవతను అవునో కాదో నాకు తెలియదు. మీరు కానిది నేనేదీ కాదు. కాని నాకు దైవం నాన్నగారే" అన్నది. ఆవిధంగా అమ్మకు సహచరుడు, భాగస్వామి, ఆధారుడు – ఆరాధ్యుడు నాన్నగారు. అమ్మను పూజించే వారందరికీ పూజ్యులైనారు.

నాన్నగారిది అత్యంత నిరాడంబర జీవితం. నిష్కల్మష హృదయం. ఆయనకు వాత్సల్యభావం ఎక్కువ. ప్రధానంగా తల్లి దండ్రులను వదలి చదువుకోవటానికి వచ్చిన విద్యార్థులంటే ఎనలేని ప్రేమ. వారి ఆహారం ఆరోగ్యాదుల పట్ల ఎంతో శ్రద్ధ కనబరచేవారు. వాళ్ళ వాళ్ళ ఊళ్ళకు వెళ్ళటానికి డబ్బులు లేకపోతే ఇచ్చి పంపేవారు. విద్యార్థుల తప్పులకు శిక్ష వేస్తే నాన్నగారి మనస్సు చలించిపోయేది.

నాన్నగారు గ్రామాంతరం వెళ్ళవలసి వెళ్ళినా, వారు నన్ను వదలినా నేను వారిని వదలను అన్నది అమ్మ. దేవత అయిన అమ్మ కరగ్రహణం వల్ల నాన్నగారు దివ్యుడైనాడు. అమ్మను విడిచి నాన్నగారు – నాన్నగారిని విడిచి అమ్మ లేరు. దీనికి ఎన్నో సంఘటనలున్నాయి. నాన్నగారు ఎక్కడకు వెళ్ళినా అమ్మ కంఠం వినిపిస్తుండేది. అవసరమైతే అమ్మ కనిపించేది. నాన్నగారొకసారి విజయవాడలో ఒకరింట్లో నిద్రించి సంచీ అక్కడే మరచిపోయి వెళుతుండగా "సంచీ మరచిపోయి వెళుతున్నారు. తీసుకోండి" అని వినిపించింది. అలాగే 1963లో మొక్కపాడు లో నులక మంచం పైన పడుకొని ఇబ్బందిపడుతుంటే ప్రక్కనున్న వారితో చెప్పి సరియైన ఏర్పాట్లు చేయించింది. 1972లో గుంటూరు లో నాన్నగారికి జె.వి.కృష్ణారావు హాస్పటల్ లో ఆపరేషన్ జరిగింది. ఆపరేషన్ చేయించుకోబోతూ నాన్నగారు అమ్మకు ఒక ఉత్తరంలో "నీవు జిల్లెళ్ళమూడిలో ఉన్ననూ, ఆపరేషన్ తిలకిస్తూ నా చెంతనే ఉండగలవనియే నమ్మిక" అని వ్రాశారు. అంతకు ముందు ఎన్ని సంఘటనలు ఆధారం లేకపోతే వారికి ఆ విశ్వాసం ఏర్పడి ఉంటుంది?

అమ్మలోని అలౌకిక యౌగిక స్థితులను నాన్నగారు



స్వయంగా చుశారు. ఒకసారి నాన్నగారికి అన్నం వడ్డిస్తుండగా అమ్మకు భృకుటీ భేదనం జరిగింది. ఆ రక్తం నాన్నగారి విస్తర్లో పడకుండా చెయ్యి అడ్డం పెట్టుకుంది అమ్మ. ఆ రక్తం భస్మంగా మారగా ఆ భస్మాన్ని నాన్నగారికి పెట్టింది. అది ఎంతో సువాసనగా ఉన్నది. ఈ విశేషం ఎన్నో సార్లు ఎంతో మందికి చెప్పారు నాన్నగారు. అమ్మలోని సహనశక్తిని వివరిస్తూ "ఎంత బాధనయినా చిలక కొయ్యకు తగిలించి మళ్ళీ తీసుకొనగలదు. ప్రసాదరాయకులపతి అంబికాసాహస్రి వ్రాసి ఆవిష్కరణకు జిల్లెళ్ళమూడి వచ్చే సమయానికి మీ అమ్మకు ఆరోగ్యం బాగోలేదు. వాళ్ళు చాలమంది కవులు వచ్చారు. అయినా అమ్మగారు స్నానం చేసి వేదికపైకి వచ్చి కొన్ని గంటలు అలాగే ఆ కార్యక్రమాన్ని జరిపింది" అని చెప్పారు.

"నాకెట్లా ఉన్నా - నేనేస్థితిలో ఉన్నా ఏదైనా ఈ శరీరం నిలువదని తోచినప్పుడు ముందుగా మీకు చెపుతాను అని నాకు చెప్పింది. ఆమెకు తెలుస్తుందని చెబుతుందనే ధైర్యం ఉన్నది నాకు ఫరవాలేదనే విశ్వాసం నాకు" అన్నారు నాన్నగారు. "మీ అమ్మగారు తనను తాను చూచుకోగలదు. మన కళ్ళకు బయట ఎట్లాకనబడుతుందో లోపల మీ అమ్మగారికి అట్లాకనబడుతుంది. రాముడమ్మ - కృష్ణవేణమ్మగారు మీ అమ్మగారిని చూస్తూ గంటలు గంటలు గడిపేవారు - వాళ్ళకు కాలం తెలిసేది కాదు" అని చెప్పారు.

నాన్నగారు ఏ పనికి బయలుదేరినా అమ్మకు చెప్పి అమ్మ చేత బొట్టు పెట్టించుకొని బయలుదేరేవారు. ఎంత చిన్న జబ్బు చేసినా జ్వరం తగిలినా అమ్మకు తన చేయి ఇచ్చి నాడి చూపించుకొనేవారు. అమ్మకు ఏ మాత్రం అనారోగ్యం చేసినా కాలు కాలిన పిల్లిలా అమ్మ గదిచుట్టూ తిరుగుతుండేవారు, "మీ అమ్మ కెట్లా ఉందయ్యా?" అని ప్రశ్నలు వేస్తూ. "నాకేం జ్ఞాపకం ఉండదు. మీ అమ్మగారే అన్నీ జ్ఞాపకం పెట్టుకొని చెపుతుంది. మీ అమ్మగారు నడుంబిగించి కోడలుగా అమ్మగారుగా అన్నీ చేసింది కదా! మీ అమ్మగారి శీర్షం మధ్యన చిట్లిరక్తం వచ్చింది. ఒకటి రెండు సార్లు చూచాను" అన్నారు నాన్నగారు.

ఒకసారి ఒక శుక్రవారంనాడు అష్టోత్తర శతనామాలతో అమ్మకు 108 బిందెలతో అభిషేకం మొదలు పెట్టారు. ఉళ్ళోవాళ్ళు కూడా మేమూ అభిషేకించుకుంటాం అని నీళ్ళు తెచ్చి పొయ్యటం మొదలుపెట్టారు. నాన్నగారు కేకలు వేయగానే అమ్మ లోపలకు వచ్చారు. ఎండలో ఉన్న అమ్మకు గొడుగుపట్టేవారితో "సరిగా పట్టమ్మా"! ఎండ తగలకుండా"అని హెచ్చరించేవారు. "నీవు రోజూ కాసేపు నడిస్తే ఆరోగ్యంగా ఉంటుందేమో" అని నాన్నగారనగానే అమ్మ రోజూ మేడపై నడవడం మొదలు పెట్టారు. ఈ రకంగా అమ్మ ఆరోగ్యంపట్ల నాన్నగారు అత్యంత శ్రద్ధ వహించేవారు.

ఇతరుల బాధలను స్పర్శ మాత్రం చేతనే అమ్మ పోగొట్టగలదని నాన్నగారి విశ్వాసం. నాన్నగారిలో మంచి క్రీడాస్ఫూర్తి ఉంది. పిల్లలతో కలసి టేబుల్ టెన్నిసు, బాడ్మింటన్ ఆడేవారు. నాన్నగారిలో ఎక్కడా అహంకారం చోటుచేసుకోలేదు. ఎందరెందరో పెద్దపెద్ద అధికారులు జిల్లెళ్ళమూడి వచ్చేవారు. తాను అమ్మగారి భర్తగా ఎన్నడూ అధికారం చలాయించలేదు. ఒక సామాన్య మధ్య తరగతి జీవిగా, ఒక గ్రామకరణంగా మాత్రమే ఏ పటాటోపమూ లేకుండా ఉండేవారు. కొంతకాలం నాటకాలలో పాత్రలు ధరించారు.

అమ్మ "భర్తంటే భావనే," అన్నది. శరీరం లేకపోయినా నిరంతరస్మరణ ఉన్నవారు భర్తృహీనులు



కారన్నది. పతివ్రతకు పరాకాష్ఠ భర్తచేత కూడా తల్లిగా భావింపబడటమే అన్నది అమ్మ. నాన్నగారు అమ్మచేత బొట్టుపెట్టించు కోకుండా బయటకు పోయేవారు కాదు. చివరలో అమ్మ పాదాలపైన పూలు వేసేవారు. అలా భార్యను తల్లిగా భావించిన తర్వాత ఎక్కువ కాలం వారి శరీరం నిలువలేదు.

అమ్మ ఎటో దీర్ఘంగా చూస్తుండగా అక్కడ ఉన్నవారు "ఏంటమ్మా! పరధ్యాసగా ఉన్నావంటే - పరధ్యాస కాదు నాన్నా! పతి ధ్యాసలో ఉన్నాను" అన్నారు అమ్మ - అమ్మ ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో నాన్నగారు నిరంతరం జీవించారు.

అమ్మ నాన్నగారిని ఆధారం చేసుకొని దేవతగా ఆరాధ్యయితే, నాన్నగారు అమ్మను తల్లిగా, దేవతగా భావించారు. అమ్మ అన్నట్లు భార్యకు భర్తదేవుడైతే - భర్తకు భార్య దేవతే అన్న వాక్యాన్ని నిజం చేశారు.

కావ్యకంఠ గణపతిముని సీతారాములను గూర్చి చెపుతూ "యజ్ఞమయమైన అవతారమూర్తుల అనుభవానికి కారణభూతులైన వ్యక్తులు కూడా సత్తునుండే కాని అసత్తునుండి పుట్టరు" అన్న మాటలు నిత్య సత్యాలు - అమ్మా నాన్నగారు చిరంతన చైతన్యమూర్తులు - నాన్నగారు నిత్యుడు - నిరంజనుడు - దివ్యుడు.



నాన్నగారి కుటుంబం





# వివాహం కాకముందే నాన్నగారి కుటుంబంతో నాన్నగారితో అమ్మ అనుబంధం



శ్రీ భార్గవ, గుంటూరు

అమ్మ పుట్టిం తర్వాత పురిటిస్నానం చేయించిన గొల్ల నాగమ్మ అమ్మను తెచ్చి అమ్మ మేనత్త గారైన కనకమ్మగారి చేతిలో పెట్టింది. కనకమ్మ బామ్మ సీతాపతి తాతగారితో అన్నయ్యా తెల్లగా ఏకులా వుంది పిల్ల, వొళ్ళు తుడవాలంటే భయంగా ఉంది. చేతులు కాళ్ళు ఎక్కడ ఊడివస్తవో అని అన్నది. బిడ్డకు ఇంతవరకు పాలు ఇవ్వలేదు అంటూ అమ్మకు బామ్మే మొదటిసారి పాలిచ్చింది. పాలిస్తుండగా ఈ పిల్ల తన పిల్లే అనిపించింది. అందుకు అమ్మ అవును అన్నట్లు తల ఊపింది. అమ్మ నామకరణం రోజున 10 సంవత్సరాలున్న నాన్నగారు కూడా అమ్మ శిరస్సు మీద అక్షతలు వేశారు. ఈ రకంగా పుట్టినరోజు నుండి నాన్నగారి కుటుంబంతో అనుబంధం ఉన్నది.

నాన్నగారి ఉపనయనానికి సీతాపతి తాతగారితో పాటు అమ్మ కూడా రేటూరు వెళ్ళింది. ఉపనయనం అయిన తర్వాత అమ్మను నాలుగు రోజులు రేటూరులో ఉంచుకున్నారు. కనకమ్మబామ్మ, బ్రహ్మాండం వెంకట సుబ్బారావుగారు, కోడలిని ఉంచుకున్నారే అని నలుగురూ అన్నారు. లోకనాథం బాబాయితో అమ్మ ఆడుకుంటూ ఉన్నది. అక్కడున్న రోజుల్లో బామ్మ, తాతగారు అమ్మను చాల ప్రేమతో చూసారు. బాపట్లకు నాన్నగారు వెంకట సుబ్బారావు తాతగారితో కలసి వెళ్ళింది అమ్మ. వెంకట సుబ్బారావుగారు అమ్మకు క్రొత్త గుడ్డలను కుట్టించడానికి బజారు వెళ్తూ అమ్మను చిదంబరరావు గారింటికి తీసుకెళ్ళమని నాన్నగారికి చెపుతారు. అమ్మ, నాన్నగారు చిదంబరరావు గారింటికి వెళ్ళగానే భారతత్తయ్య (చిదంబరరావు గారి కూతురు) దంపతి సమేతంగా వచ్చారే అని నవ్వుతుంది. బంధువులందరూ కూడా దంపతు లొచ్చారని అంటారు. నాన్నగారి కుటుంబంతో అమ్మ కలసి మెలసి ఉంటుంది చిన్నతనం నుండి.

నాన్నగారి తండ్రి సుబ్బారావు గారికి ఆరోగ్యం చెడి నిజామాబాద్‌లో ఉద్యోగం మానుకొని బాపట్ల వచ్చారు కుటుంబం అంతా. సుబ్బారావుగారు అమ్మను ప్రేమతో దగ్గరికి తీసుకొని తన కోసం తెచ్చిన పండ్లు చేతిలో పెట్టేవారు. తల్లి లేని పిల్ల ఎవరు పెడతారు అనుకుంటూ, తన చిన్న కొడుకు లోకనాథానికి కొనుక్కొని తినటానికి డబ్బులిస్తూ, "అనసూయకు కూడా కొనిపెట్టు. నీ ఒక్కడివే తినబోకు. ఆ అమ్మాయి మన ఇంటి అమ్మాయే" అని చెప్పేవారు. లోకనాథం బాబాయి "మన యింటి అమ్మాయి ఏంటి? మన అమ్మాయి అనవేం, నాన్నా !" అనగా, కారణం ఉందిలే అట్లా అనటానికి. ఇప్పుడు మేనమామ కూతురు వదిన, జరిగితే అన్న భార్య వదిన అవుతుంది. అంటే తల్లితో సమానమన్నమాట" అంటూ అమ్మతో "ఏమమ్మా ! బావను చేసుకుంటావా?" అని అడిగారు. అమ్మ నవ్వుతూ ఊరుకుంటుంది. మళ్ళీ మళ్ళీ అడుగగా "చేసుకొనే యోగ్యత ఉంటే తప్పకుండా చేసుకుంటా" అన్నది. సుబ్బారావు తాతగారికి కాళ్ళు లేని కుంటిపిల్లవాడు నరసింహారావు ఉండేవాడు. చాల అందమైనవాడు. తెలివిగలవాడు. అమ్మ అంటే చాల ప్రేమ. సుబ్బారావుగారి పక్కలోనే పడుకొని ఉండేవాడు. "అనసూయ మంచిది, నాన్నా ! అన్నయ్యకు తప్పక చేసుకుందాం" అన్నాడు. పెళ్ళి సంగతి తర్వాత ఈ పిల్లలను అలవాటు చేసుకోమ్మా ! దిగులుపడకుండా" అని నరసింహారావును లోకనాథాన్ని చూపిస్తారు. ఇంతలో



నాన్నగారు, భారతత్తయ్య బడినించి రాగానే సుబ్బారావు తాతగారు నాన్నగారితో "నాన్నా ! ఈ అమ్మాయి చాల తెలివిగలదిరా! మంచిపిల్ల. మన్నవ వారి తెలివి అన్ని పాళ్ళూ మిగల్చకుండా లాక్కున్నది" అన్నారు. అమ్మ, "ఇతరులవి లాక్కునే స్థితి నాకు ఉంటే మీ జబ్బే లాక్కునే దాన్నిగా" అంటుంది. సుబ్బారావుగారు ఆశ్చర్యపోతారు ఆ మాటలకు. ఎక్కడకూ వెళ్ళకుండా తన దగ్గరే ఉండమ్మా! అంటారు. ఆయనకు అవసానకాలం సమీపించిందని తెలుసుకొని చిదంబరరావు తాతగారితో "నేను పోతున్నా! మీ యిష్టం" అని అమ్మ వైపు నాన్నగారి వైపు చేయి చూపించారు. చిదంబరరావు గారు ఏం మాట్లాడలేదు. మరిడమ్మ తాతమ్మ మాత్రం "సరేలే నాయనా !'' అంటుంది. అమ్మవైపు చూస్తూ సుబ్బారావుగారు ప్రాణం వదులుతారు.

అమ్మ లోకనాధం బాబాయిని, నరసింహారావును ఓదారుస్తుంది. వాళ్ళను కనిపెట్టుకొని ఉంటానని మాట ఇస్తుంది. వాళ్ళకు తండ్రి లేని లోటు తీరుస్తానని చెపుతుంది. "చిన్నపిల్లవు నీవెట్టా తీరుస్తా"వనసూయా? అంటే "కూలీ నాలీ చేసో, లేకపోతే అడుక్కొచ్చయినా తీరుస్తా"నంటుంది అమ్మ.

అప్పటికి కడుపుతో ఉన్న బామ్మ మన్నవ వచ్చి పాపత్తయ్యను కంటుంది. పాపను పెంచే బాధ్యత అమ్మే తీసుకుంటుంది. ఆవుపాలు తెచ్చి తనేపడుతుంది. నరసింహారావుతోనూ, లోకనాధంతోనూ ఆడుకుంటూ దిగులుపడకుండా చూస్తుంది. సీతాపతి తాతగారు నాన్నగారి కుటుంబాన్ని పోషించలేనని బాధపడుతుండగా బామ్మ విని విజయవాడ వెడుతుంది. ఏదైనా పనిచేసి డబ్బులు సంపాదిద్దామని. నాన్నగారు బాపట్ల నుండి వచ్చి వెతుకుదామని బయలుదేరుతుండగా అమ్మ వచ్చి తన చేతి బంగారు గాజు ఒకటి ఇచ్చి "అత్తయ్య విజయవాడ వెళుతూ ఒక గాజు తీసుకెళ్ళింది. ఒక గాజు నీ కిమ్మన్నది. నిజామాబాదు నుండి ఉత్తరం వస్తే వెళ్ళి సామాను తెమ్మన్నది" అని చెప్పింది. 'అవి నరసింహారావు మురుగులే? అనుకున్నారు నాన్నగారు. కాని అవి అమ్మవే. అమ్మ వాళ్ళను ఆదుకున్నది. నాన్నగారు స్కూలు ఫైనల్ పాసై ఇంటర్‌లో చేరటానికి కూడా అమ్మ తన మెడలోని నానుతాడు తీసి ఇచ్చింది. ఎవరికీ ఈ విషయం చెప్పద్దని చెప్పి భారతత్తయ్యతో "నాకు ఇల్లరికం రమ్మని మంచి ఆస్తిపరులు అడిగారు. కాని అమ్మ మాత్రం ఈ పిల్లనే చేసుకోమంటున్నది. తప్పేటట్టు లేదు" అన్నారు. భారతత్తయ్య కూడా అమ్మను "నెమ్మదితనం గలది, ఓర్పు గలది, మీ కుటుంబం అంటే చాలా ఇష్టం, చేసుకో" మంటుంది. అమ్మ ఇవేవీ పట్టించుకోకుండా లోకనాధం బాబాయికి, నరసింహారావుకి శ్రద్ధతో అవసరాలు తీరుస్తూ ఉండేది. నాన్నగారు ఒకసారి గుంటూరులో ఇంటర్ రెండవ సంవత్సరం చదువుతూ తిండికి లేక బాధపడుతూ మన్నవ వచ్చారు. సీతాపతి తాతగారిని డబ్బులడుగగా ఆయన విసుక్కున్నారు. అపుడు అమ్మ తన బంగారు వస్తువులు ఇచ్చి వాడుకోమని బాధపడవద్దని చెపుతుంది. అప్పుడే అమ్మతో వివాహం సంగతి అడిగారు తాతగారిని. ఆయన తన వద్ద డబ్బు లేదని ఇప్పుడే తనేమీ చెప్పలేనని చెప్పారు.

తర్వాత కొంతకాలానికి డబ్బు సమకూడి తాతగారు ముహూర్తాలు పెట్టుకోవటానికి కనకమ్మ బామ్మ దగ్గరకు వెళ్ళగా మాట మాటా వచ్చి వెనక్కు వచ్చేసారు. తర్వాత కొంతకాలం నలిగి వివాహానికి ముహూర్తము శుభలేఖలు కూడా కొట్టించారు. కానీ మళ్ళీ పెళ్ళి కొంతకాలం వాయిదా పడింది. ఆ తర్వాత సీతాపతితాతగారు అమ్మను నాన్నగారికి ఇవ్వటానికి ఇష్టపడలేదు. నాన్నగారు ఒకసారి అమ్మతో నీకిష్టమైతే మంగళగిరి వెళ్ళి గుళ్ళో పెళ్ళి చేసుకొని వద్దామన్నారు. అమ్మ తాతగారి చేతుల మీదుగానే వివాహం జరగాలన్నది. "నేను వేరే పిల్లను చేసుకొంటే



ఏం చేస్తావు?" అన్నారు అమ్మతో. అమ్మ "పెళ్ళి అంటే మానసికమయింది. మానసికంగా ఎప్పుడో అయిపోయింది పెళ్ళి. లగ్నాలు పెట్టి శుభలేఖలు కొట్టించిం తర్వాత పెళ్ళి అయిపోయిందేమో అనిపించింది" అన్నది. నాన్నగారు "నాకు ఆస్తి లేదు బీదవాణ్ని నిన్ను సుఖపెట్టలేను" అంటే "నేను ఆస్తిని గాదు చేసుకుండేది మనస్సును" అని చెప్పింది అమ్మ.

ఆ తర్వాత నాన్నగారు తన దగ్గర డబ్బు లేదు. ఏదన్నా నగ ఇమ్మంటే తలలోని నాగరం ఇచ్చి పంపింది అమ్మ. నాన్నగారితో సంభాషణలలో "పెనిమిటి అంటే పెన్నిధి అనీ, ఆ అండన చేరటమే పెళ్ళి" అని చెప్పింది. బామ్మగారు బయట చేరితే అమ్మ వెళ్ళి నాన్నగారింట్లో వంట చేసి అన్ని పనులు చేసి వస్తుండేది. తర్వాత అమ్మ పధ్నాలుగో యేట 5-5 -1936న అమ్మకు నాన్నగారికి వివాహం జరిగింది.

ఈ విధంగా అమ్మ, నాన్నగారు మేనమామ మేనత్త బిడ్డలయినా నాన్నగారి కుటుంబం అందరితోటి సన్నిహిత సంబంధం కలిగి వారికి సేవచేస్తూ, వారి క్షేమ సమాచారాలు చూస్తూ, లోకానికి బంధుత్వంతో సేవ చేస్తుందనిపించుతూ అమ్మే అందరినీ ఆదరించుతూ రక్షించింది ఉద్ధరించింది.

నాన్నగారిని దేవుణ్ణి చేసి అనసూయేశ్వరాలయంలో ప్రతిష్ఠింపచేసి తనకు తన దేవునకూ అభేదస్థితిని నిరూపించింది.



సామూహిక ఉపనయనాలలో అమ్మ నాన్నగారు





# శ్రీ నాగేశ్వర ప్రతిష్ఠ



శ్రీమతి పి.వి.జె.యస్.జి. ప్రసాద్, గుంటూరు

సర్వ సృష్టికి మూలమైన శక్తి, సర్వత్రా వ్యాపించి, సర్వం తానై ఉన్న శక్తి ప్రేమమూర్తిగా, ప్రేమదీప్తిగా, వాత్సాల్యామృత వర్షం కురుస్తూ అమ్మగా అవతరించింది. అమ్మకు ఆధారం నాన్నగారు. "ఆధారానికి ఆధారమయితే అంతా సహస్రారమే" నంటుంది అమ్మ. అలాంటి అమ్మకు ఆధారం నాన్నగారు నాగేశ్వరుడు. చిన్నప్పుడు నాన్నగారిని 'నాగేంద్రా' అని పిలిచేవారు; నాగూ, నాగులు అని పిలిచేవారు. చీరాల వారు వచ్చే తొలిరోజులలో అంటే 1953, 54 సంవత్సరాలలో వారు రాగానే త్రోవలో నాన్నగారు కనిపించారా అని అడిగేదట అమ్మ. వారికి మొదట్లో అర్థం కాకపోయినా తరువాత అర్థమయింది. నాన్నగారు నాగేశ్వరరావు కనుక తమకు కనిపించిన పాము నాన్నగారేనని, అమ్మ, నాన్నల అనుబంధం ఈ నాటిది కాదు. అది అనాదిది. ప్రకృతి పురుషులకున్న సంబంధం. చిదంబరరావు తాతగారితో తన బాల్యంలో బాపట్లలో నాగులచవితినాడు రైలుపేటలో అద్దంకివారి తోటలో నాగేంద్రుడు ఉన్న పుట్ట వద్దకు వెళ్ళింది. అమ్మను చూచి నాగేంద్రుడు పుట్టలో నుండి బయటకు వచ్చాడు. అందరూ భయపడి వెళ్ళిపోయారు. అప్పుడు వర్షం పడుతున్నది. అమ్మ నాగేంద్రుని దగ్గరకు వెళ్ళి ముఖంలో ముఖం పెట్టి చిదంబరరావు తాతగారితో "వానకు తడుస్తున్నారు. ఈ పడగ నీడన చేరుదామా!" అన్నది. అప్పుడు తాతగారు అమ్మతో "నీకేమమ్మా! అగ్నిగుండంలో ఆడుకోనూగలవు - పాము పడగ నీడన కాపురమూ చేయగలవు" అన్నారు. "తాతగారు! హాస్యం చేస్తున్నారా, జోస్యం చెబుతున్నారా?", అన్న అమ్మ పాము పడగనీడనే తర్వాత కాపురం చేసింది. తాతగారిచేత నాగేంద్రుని పై చేయివేయించి తన భుజంపై నాగేంద్రుని ఎక్కించుకొని పోరా! అనగానే వెంటనే భుజం మీద నుండి పాదాల మీద వ్రాలి ఒక్కక్షణం ఉండి జరజరా పుట్టలోకి వెళ్ళింది.

"ఆ పుట్టలోనే గాదు. అందరి పొట్టలలోనూ అరేసి పాములున్నాయి. అవి బుస్సు బుస్సు మంటుంటాయి" అన్నది అమ్మ.

మన్నవలో గ్రామం ముందు సత్రం దగ్గర పెద్ద త్రాచుపాము పడగ విప్పి ఆడుతున్నది. అమ్మ తలవంచుకొని దానిమీదగా నడిచింది. రాఘవరావు మావయ్య 'ఏయ్ మొద్దు! చూచి నడువ్!' అంటూ అమ్మను మందలించారు. కాని ఆ పాము అమ్మ పాదాలకు అభివందనం చేస్తున్నట్లుగా పడగదించుకొని వెళ్ళిపోయింది. తర్వాత రాఘవరావు మామయ్య అమావాస్య రాత్రిపూట చీకటిలో నడుస్తుంటే త్రోవచూపిస్తూ ఆయన ముందరగా ఒక నాగుపాము పోవటం, దాని తల మీది మణి వెలుగులో వారు నడవటం జరిగింది.

మన్నవ శివాలయంలో ధ్వజస్తంభానికి ఉత్తరంగా ఒక పెద్ద పుట్ట ఉన్నది, అందులో ఒక నాగుపాము ఉన్నది. సంతానం కోసమో, ఆరోగ్యంకోసమో అక్కడ నిత్యమూ అనేకులు ప్రదక్షిణలు చేసేవారు. పాలుపోసేవారు. మన్నవ గోపాలకృష్ణయ్యగారి కూతురు చాలా కాలం నుండి కడుపు నొప్పితో బాధపడుతూ ఆ పుట్టకు ప్రదక్షిణలు చేసింది. ఆమెకు కడుపునొప్పి తగ్గింది.

ఆమెకు స్వప్నంలో అమ్మ కనిపించి, అమ్మ పొట్టలోకి పాము దూరినట్లుగా కనిపించింది. "నాగేంద్రుడంటే పాము అనేకాదు, నాగేంద్రుడంటే



మనవెన్నంటి కాపాడేదే" అని వినిపించింది. నెలరోజుల తర్వాత కనిపించగానే తాను నిత్యమూ ఆరాధించే నాగేంద్రుడే ఈమె అని నిశ్చయించుకొని, 'నాగేంద్రా! ఇక్కడకే వచ్చావా! నాయందు నీకెంత దయ, నా కోసం వచ్చావా! ఈ అనాధను కాపాడేందుకు వచ్చావా' అంటూ అమ్మను భుజం మీదకు ఎత్తుకొని ఆనందంతో పొంగిపోయి అమ్మను నాగేంద్రునిగా దర్శించి తరించిందా ధన్యురాలు.

వెన్ను పాము శరీరంలోని నాడీ శక్తిని క్రమబద్ధం చేసి జీవులను నిలబెట్టుతున్నది. ఇడా పింగళ నాడుల ద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసాలనే రెండు పాములను సమన్వయంచేసి సుషుమ్న ఆధారంగా మూలధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా చక్రాల ద్వారా కుండలినిని ప్రజ్వలింపచేసుకొని సహస్రారం లోని అమ్మను అందుకోవటమే నాగేశ్వర ప్రతిష్ఠలోని ముఖ్యోద్దేశం. అంటే నాగేశ్వరుడైన నాన్నగారిని హృదయ ప్రతిష్ఠ చేసుకొని ఆ ఆధారంతో సహస్రారంలోని అమ్మను గుర్తించటం, దానికి బహిరంగంగాచేసే క్రియాకలాపమే శ్రీనాగేశ్వర ప్రతిష్ఠ.

అమ్మ, నాన్నగారు 1960కి పూర్వం ఇప్పుడు పూల తోటలు ఉన్నచోట రావి చెట్టును ఆనుకొని ఒక పాకలో ఉండేవారు. ఆ రావి చెట్టు వద్ద ఒక పాము పుట్ట ఉండేది. దానిలో నుండి పాము అమ్మ వద్దకు వచ్చి వెళుతుండేది, ఆ రోజుల్లోనే ఒక పొట్ల పాదు పాము ఆకారంలో ఉండే కాయలు కాసేది.

ఒక రోజు రెడ్డి సుబ్బయ్య కొడుకు 'సుధ'ను ఒక పాము కాటేసింది. నేలపై బడి నురుగులు కక్కుతున్నాడతడు. ఏవేవో మందులు మంత్రాలు వేశారు. కానీ లేవలేదు. అప్పుడు సుబ్బయ్య వాడిని అమ్మ పాదాలపై పడేసి వీడ్ని నీవే రక్షించాలి అన్నాడు. "అన్యధాశరణంనాస్తి త్వమేవ శరణంమమ" అన్న వాడ్ని రక్షించకుండా ఉంటుందా భగవతి. విషం విరిగింది, సుధ బ్రతికాడు. అమ్మ దయతో ఇప్పటికీ హాయిగా తిరుగుతున్నాడు.

సోదరులు కొమరవోలు గోపాలరావుగారి రెండవ కుమార్తె చిన్నతనంలో చాలా అనారోగ్యంతో బాధపడుతుండేది. ఎప్పుడూ తలనొప్పి, భరించలేనంత తలనొప్పి. కలల్లో పాము కనిపిస్తుండేది, భయపడేది. ఒకసారి గోపాలరావుగారు ఒక నాగేంద్రుడి క్యాలెండరు ఇంటికి తెచ్చారు. ఆ అమ్మాయి వాళ్ళమ్మతో తన బాధ చెప్పి ఆ క్యాలెండరు ఎందుకు తెచ్చారు? అసలే నాకు కలలో పాము కనిపిస్తున్నది అన్నది. ఆమె అమ్మ దగ్గరకు వచ్చి తన కూతురు బాధ అమ్మకు చెప్పింది. అమ్మ మామూలుగా అందరితో చెప్పినట్లుగానే మందు లిప్పించమ్మా? నయమవుతుంది - అని చెప్పింది. కాని ఆమె నివారణ ఉపాయాలు అన్నీ అయింతర్వాతే నీ వద్దకు వచ్చానమ్మా; అని అమ్మను వదలలేదు. అప్పుడు అమ్మ దాని డబ్బుతో నాగేశ్వర ప్రతిష్ఠ చేస్తానని మ్రొక్కుకోమను తగ్గిపోతుంది అన్నదట. అలాగేనని శేషుచేత అలా మ్రొక్కించింది ఆమె. ఆ తర్వాతనే శేషు హైమాలయంలో పూజారిణి కావటం, ఆమెకు ఆరోగ్యం కుదరటం, సోదరుడు రావూరి ప్రసాద్‌తో వివాహం కావటం అన్నీ అమ్మ అనుగ్రహంతో జరిగినవి. వివాహం జరిగినప్పటి నుండి ప్రసాద్‌కు కూడా నాగులచవితి ఇంకా రెండు మూడు రోజులుండనగా నాగేంద్రుడు కలలో కనిపించటం జరుగుతున్నది.

ప్రాస్తావికంగా తన కల విషయం భార్య శేషుతో అనటం ఆమె తన మ్రొక్కుబడి సంగతి చెప్పటం జరిగింది. అప్పటి నుండి వారికి నాగేశ్వర ప్రతిష్ఠ చేయాలనే ఆలోచన ఉన్నది, ఇన్నాళ్ళకు కార్యరూపం ధరించబోతున్నది.



అమ్మ తన కళ్యాణదినం నాడు అన్ని శుభకార్యాలకు ప్రారంభం అన్ని కట్టడాలకు శంకుస్థాపన చేసేది. అలా మే 5 వ తేది జగజ్జనని కళ్యాణం జగత్తుకే కళ్యాణంగా రూపు దిద్దుకున్నది. ఆ కళ్యాణదినోత్సవ సందర్భంలోనే శ్రీనాగేశ్వర ప్రతిష్ఠ జరుపాలని శేషు, ప్రసాద్‌ల కోర్కె.

చాలా సంవత్సరాలు అమ్మ నాన్నగార్ల పావన పాద స్పర్శతో పునీతమైనచోటు, అద్యతన భావిలో తపో మందిరాలు నిర్మింపబడి ఒక మహత్తర తపోవనం కాబోతున్న పవిత్రస్థలంలో పూర్వం అమ్మ వద్దకు తరచుగా వచ్చిపోయిన నాగేంద్రుడున్న చోటున ఆ రావి చెట్టు వద్దే శ్రీ నాగేశ్వర ప్రతిష్ఠ జరపటం సముచితంగా ఉంటుందని శ్రీ విశ్వజననీ పరిషత్ నిర్ణయించటం దివ్యమైన ఆలోచన.

"తనను గుర్తించటానికయినా తన కరుణ ప్రసరిస్తే గాని సాధ్యపడదు" అని అమ్మ చెప్పింది. అలాగే తనే మ్రొక్కు కోమన్నది. తనే ప్రతిష్ఠ చేయించుకుంటున్నది. అంతా తానైన శక్తి తన పిల్లలతో ఆడుకుంటున్నది. ఆ ఆటలో మనమూ పాలుపంచుకొనే బొమ్మలమే కదా! మరి.

సీతాపతి తాతగారు, నాన్నగారు, నరసింహారావుమామయ్య, అమ్మ, కామేశ్వరమ్మమ్మ, రాజ్యం పిన్ని





# నాన్నగారికి నమస్సుమాంజలి



ఈ ఆంధ్రావనివారె కాదు భువిపై ఎవ్వారలైనన్ సరే
నీ ఆత్మీయత నీదు ప్రేమరసమున్ నీ ఆతిధేయమ్ము నీ
భూయస్స్వాదరణమ్ము నీ గడపపై పూర్ణమ్ముగా కాంచరే!
వ్రాయన్ పల్కగ అవ్వి వాణి కగునా? బ్రహ్మాండ వంశోద్భవా!

డాక్టర్ నారపరాజు శ్రీధరరావు

భువిలోని బంగారు మొలకా,
రావయ్య బ్రహ్మాండ వంశాబ్ధి తిలకా!
ఆద్యంతములు లేని తన్ను తానెరుగని-
అజ్ఞానులకు గూడ విజ్ఞాన మొసగంగ
అనురాగమొలకుచు చిరునవ్వు చిలుకుచు
మా అమ్మ తియ్యగా పలుక
రావయ్య అమ్మ కాధారమౌ చిలుకా !
బ్రహ్మవై పన్నీరు చిలుక

శ్రీ మన్నవ బుచ్చిరాజు శర్మ (రాజుబావ)

విమల నాగేశ్వరాఖ్యచే వినుతి కెక్కి
ధరణిజగదీశ్వరిని పొంది ధన్యుడైన
శాశ్వతుం డుజ్వలు డనసూయేశ్వరుండు
విశ్వశాంతికి కాంతిని పిదుకుగాక

శ్రీ పురుషోత్తమపుత్రభార్గవ

అమ్మంటే నాన్నకు ప్రాణం - నాన్నంటే అమ్మకు ప్రాణం
పిల్లలు అంటే ఇద్దరికీ ఎల్లలు దాటిన వాత్సల్యం

శ్రీ కొండముది రామకృష్ణ

ఒకచో నిర్మల కర్మయోగ నిరతుం డున్నాడు బ్రహ్మాండనా
యకుడావేశము లేశమేని ఎరుగం డంతర్ముఖుం డమ్మ పే
ర్మికిపై చేయనవచ్చు అమ్మహితునోర్మిన్ నాన్నగా రెవ్వరిం
తకు? నా పాలిటి బాల్యమిత్రుడటె మా నాగేశ్వరుండంటనే

శ్రీ శిష్ట్లా సత్యనారాయణరాజశేఖరం

జగదీశ్వరి భాగేశ్వరుడవు-జగన్మాతకు ఆధారుడవు
చల్లనిచూపుల జగత్పితవు - జగతికి ఆరాధ్యుడవు
అప్పుడు ఉన్నతి ఒక చోట - ఇప్పుడు సర్వం ఉన్నావన్నమాట
నాగేశ్వరా ! నమస్సుమాంజలి.

శ్రీమతి మద్దూరి శ్యామల

నాన్నగారు! మీరు నాగేశ్వరులు కాదు రాగేశ్వరులు
రాగలయలు మీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు
సర్వసృష్టికీ ఆధారమైన ప్రణవమూర్తులు మీరు.

శ్రీ రాధాకృష్ణరెడ్డి



హైమక్కను ఎత్తుకున్న నాన్నగారు,
రవి అన్నయ్యనుఎత్తుకున్న అమ్మ,
నిల్చున్న సుబ్బారావన్నయ్య





# నమస్కారం నాన్నగారూ!



శ్రీ పురుషోత్తమపుత్రభార్గవ



నమస్కారం నాన్నగారూ !
నాకున్న చనువుతో - మిమ్మల్ని
నాలుగు ప్రశ్నలు వేయాలని ఉన్నది.
శరీరానికి ఏ మాత్రం అనారోగ్యమన్నా హడలిపోయే మీరు
అకస్మాత్తుగా ఈ శరీరాన్నే ఎలా వదలిపెట్టారు?
మీ అమ్మగారు రియలైజ్డ్ సోల్ అయ్యా -అని అన్నారు సరే అది మనసులోనే ఉంచుకోక-
మీరు కూడా కోరికలు కోరుకున్నారే ?

కడకు ఆమె దగ్గినా మూల్గినా తపనపడి అటూ ఇటూ కాళ్ళూ చేతులూ ఆడక తిరిగేవారే మీరు
ఆమెకే ఆరని మంట రగిల్చే కోరిక కోరారే; అదెక్కడిధీమ?
కోరిన కోర్కెలు తీర్చే దేవత కదా ఆమె ?
ఆమె పుట్టేం మునిగింది మీ కోరిక తీర్చింది.
అవును - ఆమె పుట్టే మునిగింది.
అయినా మీ కోరిక తీర్చింది.
మీరన్నది ఆమెప్పుడు కాదన్నది?
ఆమెకు అంత జబ్బు చేసినప్పుడు కూడా
ఆరోగ్యంగా ఉండాలన్నారు - ఉన్నది
అంత తేలిగ్గానూ
ఆమె కన్నా ముందు మీరు దాటిపోవాలన్నారు-సరేనన్నది
మీలో సగమైన ఆమెలో మీరు నిండుకున్నారు
మీరే నిండుగా ఉన్నారు
అయినా నా పిచ్చిగాని ఆమె మిమ్ము వదిలిందెప్పుడు?
ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలే మీరైనప్పుడు
ఆమెను శాసించే మీరు భౌతికంగా లేరు
ఆమె సర్వశాసనయై కూచుంది
మీ ముందు కన్నబిడ్డను పాతిపెట్టింది
కన్నబిడ్డలముందు మిమ్మల్ని ఆవలి ఒడ్డుకు నెట్టింది
కఠోర దంష్ట్రా కరాళవీచీ కార్కశ్యాకృతి కల్గిన కాళిక
ప్రళయ భయంకర మృత్యువు నృత్యము రూపము కట్టిన
కాళిక నాలిక - నాన్నగారూ!



మీ ప్రాణేశ్వరీ, ప్రాణదాత్రీ అయిన మా అమ్మ
మీ ప్రాణాలు తీసిందండీ !
తన జీవనాడిని క్షణక్షణము కృంగదీసుకుంటున్న దండీ!
అయినా నాన్నగారూ!
మీకేం తొందరొచ్చిందండీ?
మా అమ్మను మీరు కూడా అమ్మలాగా భావించాలా?
దేవతగా ఆరాధించాలా?

"భర్తచేత కూడా తల్లిగా భావింపబడటమే పతివ్రతకు పరాకాష్ఠ" అన్నది కదా అమ్మ!
"భార్యకు భర్త దైవమైతే భర్తకు భార్య దైవమెందుకు కాదు?" అని కూడా అన్నది.

ఆమెతో భుజం కలిపి ఆమె మాట నిజం చేశారు.
పతివ్రతలై తరించిన వాళ్ళే కాదు
లోకంలో సతీవ్రతులై తరించిన వారు కూడా ఉంటారని ఋజువు చేశారు.
ఈ యుగధర్మాన్ని మార్చి ఒక విచిత్రమైన రివల్యూషన్‌కు త్రోవవేశారు.
మిమ్మల్ని మంచి స్పోర్ట్స్‌మన్‌గా మేమంతా భావిస్తుంటాం.
మృత్యువు యొక్క ఆహ్వానాన్ని కూడా
అంత స్పోర్టివ్‌గానే ఆహ్వానించారనుకుంటాం.

మీకు ఆటలంటే ఎంతో మక్కువ.
పాటల పద్యాలంటే ఇంకా ఎక్కువ మక్కువ.
రాజకీయాలంటే మీకెంతో ఇష్టం
అయితే రాజకీయం మీ వల్ల కాదు - సర్వులకూ స్పష్టం

మీరు కరణంగా ఉన్నారు
అయినా కరిణీకం మీ చేతకాదు
మీ కన్నా అమ్మ కరిణీకమే బాగుంటుంది

మీకు ఆధారంగా ఉన్న ఆమెకు మీరే ఆధారమంటుంది
మీమధ్య సున్నితంగా ఉన్న ఆ దారాన్ని ఆవలకు లాగేసింది
ఆమెలో వెలుగులో జిలుగు పరదా పరిచింది మీ కోసం
అమ్మలోనే ఉన్నారు గనుక ఇంకెప్పుడూ
ఎదురు చూడకండి ఆమె కోసం

అందరికి నాన్నగారైన మీరు
మా అమ్మను అమ్మగా చేసుకొని
నాన్నగారైన మీరు నా అన్నగారైనారు

మమ్మల్నందరినీ తల్లి లేనివాళ్ళను చెయ్యొద్దని
మీ సోదరులం కాని అమ్మ పిల్లలం ప్రార్థిస్తున్నాం.





# విశ్వకుటుంబానికి బీజాలు వేసిన మన నాన్నగారు



డాక్టర్ పి. ఝాన్సీలక్ష్మీబాయి, బెంగుళూరు

మాతృశ్రీ జీవిత భాగేశ్వరులయిన మన నాన్నగార్ని అనసూయేశ్వరాలయంలో జగజ్జనని అమ్మ విగ్రహప్రతిష్ఠా సమయంలో సంస్మరించటం సముచితం. శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు సర్వేశ్వరి అయిన అమ్మకు సర్వేశ్వరుడు కాతగినంత సౌభాగ్యం పొందిన ధన్యజీవి. ఇంత సౌభాగ్యశాలి అయిన నాన్నగారు మనవలె అంటే ఒక సామాన్యుని వలె మసలటం ఆయనలోని మహత్వాన్ని తెలియచేస్తుంది. ఆయనలోని అల్పసంతోషం, నిత్యతృప్తి, దయ, కర్మణ్యత మొదలైన గుణాలు జిల్లెళ్ళమూడి వచ్చిన ప్రతివారు చవిచూసే ఉంటారు. అసంఖ్యాకమయిన సోదరీ సోదర బృందం అమ్మ దగ్గరకు రావటం, అమ్మవద్దనే ఉండటం, అమ్మ ప్రేమను పొందటం ఆయన చలవ వల్లనే.

అమ్మ స్నానాది కార్యక్రమముల వలన అమ్మ దర్శనానికి కొంచెం ఆలస్యమైతే ఆగంతుకులయిన సోదరులకు అసంతృప్తి కల్గకుండేట్లుగా "అందరింటి" క్రింది అంతస్తులో మొదటిభాగంలో మంచం మీద కూర్చుని మనసారా సోదర బృందం యొక్క యోగక్షేమాలను పరామర్శించే మందహాస సుందరవదనారవిందం గల ఒక మూర్తి మనకు దర్శనమిస్తుంది. ఆయనే, నిత్యం ప్రాతఃస్మరణీయులు పూజ్యులు శ్రీనాన్నగారు. ఇలా మనం అమ్మకు పూజ్యులయిన నాన్నగారిని ముందు దర్శించి తర్వాత అమ్మను చూస్తున్నా మన్నమాట. సంప్రదాయంగా ఏటేటా కొండకు నడిచి తిరుపతికి వచ్చే యాత్రిక సోదరులు కూడ ముందు స్వామివారిని చూచి తర్వాత దయాతరంగితాంతరంగ అయిన అలివేలు మంగమ్మను చూస్తారు.

ఆయనకు విసుగులేదు. కసురుకోరు. ఛలోక్తులు విసురుతూ ఉంటారు. ఎప్పుడయినా ఏదయినా ప్రబలమయిన సంఘటన వల్ల కోపం వచ్చినా అది ఆయన మనస్సులో ఒక క్షణం కంటే ఉండదు. కనీసం ముఖంలో వ్యక్తమయ్యేదాకా కూడా ఉండదు. ఆయన పిల్లలకు పిల్లవాడు. పెద్దలకు పెద్దవాడు. నాట్యకళాభిరుచికలవాడు. మా నాన్నగారు, మన నాన్నగారయిన శ్రీ నాగేశ్వరరావు గారు ఒకే తరగతిలో చదివారట. ఇద్దరూ చిన్నప్పటి నుండి బాగా నాటకాల్లో పాల్గొనేవారట. ఎక్కడ ప్రదర్శన జరుగుతున్నా డైరెక్టరు నకుల-సహదేవ పాత్రలు వీళ్ళిద్దరికీ ఇచ్చేవాడట. మన కాలేజీ విద్యార్థుల్లో ఏ కొద్దిపాటి కళ కనిపించినా ఆయన వారిని ఎక్కువ ప్రోత్సాహపరిచేవారు. కొందరు బీద విద్యార్థులకు వాళ్ళకు తెలియకుండానే వాళ్ళ ఫీజులు ఆయన కట్టేసేవారు. ఈ విషయం విద్యార్థులు చెప్తే మనకు తెలిసేది.

ఆయన జగజ్జనని అమ్మకు భర్త గనుక వారి పుట్టు పూర్వోత్తరాలు వారి ప్రత్యేకత గూర్చి తెలిసికోవాలి. యజ్ఞమయమయిన పరోపకార పరాయణంగా ఉండే అమ్మ తను భూమి మీదకు రావటానికి సంకల్పించి తన జీవిత సర్వేశ్వరునిగా నాన్నగారిని తలుచుకుంది. ఆ దివ్యమయిన తలంపులో మెదిలిన నాన్నగారెంత ధన్యులో! మన కెంత పూజ్యులో ! భగవద్విభూతి భువిపైకి ఒకసారి స్త్రీరూపంలో రావచ్చు. మరొకసారి పురుషస్వరూపంలో రావచ్చు. అవతరించిన వ్యక్తి స్త్రీ అయితే పురుషుడు ఆమెకు తోడుగా దిగివస్తాడు. అవతరించిన వ్యక్తి పురుషుడయితే ఒక స్త్రీ వానితో పాటు సహజీవనం కొరకు వస్తుంది.



రమణమహర్షి యొక్క దివ్యసన్నిధి ననుభవించిన కావ్యకంఠవాశిష్ఠ గణపతిముని రామావతారంలో రామునితో అవతరించిన జానికిని వర్ణిస్తూ ఇలా అంటాడు-

"యజ్ఞమయస్య అవతారస్య అనుభూత్యై కిమపిద్రష్టవ్యం స్యాత్ నియత్యా" "యధా రామస్యాను భూతయే పర్యాప్తం ఫలం సీతా" అని. అంటే "యజ్ఞమయ మైన జీవితం గడిపే ఒక అవతార వ్యక్తితో పాటు మరొకవ్యక్తి కూడ అవతరించటం సహజం. రాముని అనుభూతి కొరకు - అంటే రామతత్త్వం ప్రపంచంలో ప్రచారం కావటానికి సీత వచ్చినట్లు" అని. అమ్మ స్త్రీగా ఒక మాతృమూర్తిగా వచ్చింది కనుక తండ్రిగా నాన్నగారు అమ్మతో సహజీవనం చేస్తూ అమ్మ చెప్పదలచిన సత్యాన్ని, సందేశాన్ని మనం తెలుసుకొనే వీలుగా ఉంటూ, మనకు హితులుగా సన్నిహితులుగా ఉంటూ వచ్చారు.

ఆయన నిరంతరం మనకు అమ్మ సన్నిధిని కల్పిస్తూ ఉండేవారు. ఎందరు రానీ ఎప్పుడు కానీ ముందుగా నిరతాన్నదానం జరిగే అన్నపూర్ణాలయానికి నాన్నగారి చేతులతోనే, చేతలతోటే అన్నప్రాసన చేయబడినది. అంటే యాత్రికుల సంఖ్య వేలల్లో పెరగకముందు వందల సంఖ్యలో ఉన్నప్పుడు నాన్నగారే వచ్చే పోయే వారందరికీ అన్న - పాన - వసతి సౌకర్యాలు స్వయంగా కలిగిస్తూండేవారు. వచ్చే సోదరులు కూరగాయలు గాని మరేమయినా గాని తెస్తే నొచ్చుకొనేవారుట. అవ్యాజంగా ఇంతమందినీ తన ఇంటి సభ్యులుగా భావించేవారట.

అసలు అవతారమంటే ఎక్కడో లేదు. అది ఒక అందని తత్త్వము కాదు. కోర్కెతో ప్రతి పనీ చేస్తే సంసారం, ఏ కోర్కె లేకుండా పరోపకారపరాయణంగా జీవితం గడిపితే అది అవతారం. ఎవ్వరిలో ఈ పరోపకార చింతన ఎప్పుడెప్పుడు కనిపిస్తుందో ఆ క్షణంలో వారు దైవాంశే. ఆ చింతనే నిరంతరంగా ఉంటే అది అవతారం. వాశిష్ఠ గణపతి ముని అవతారానికి సంసారికి ఉండే తేడాని గూర్చి ఇలా చెప్తారు.

"యధా సకామవ్యష్టి కర్మరాశిః సంసారీ ఏవం నిష్కామ సమిష్టి కర్మరాశిః అవతార ఉచ్యతే" అని (కోర్కెతోనే ప్రతి పని చేసేవాడు సంసారి అయినట్లు కోర్కె లేకుండా ఎప్పుడు అన్ని పనులు చేసేవాడు అవతారం అవుతాడు.)

"ఒక పరిమిత కుటుంబం విశ్వకుటుంబం అవటం సంభవమే" అనే విషయాల్ని సోదాహరణంగా చూపించదలచిన అమ్మ ప్రయోగంలో నాన్నగారు చక్కగా సహకరిస్తూ సహజీవనం చేశారు.

అమ్మ వేదాంత వాక్సుధను మనం వినేట్లు, వినిన దానిననుభవించేట్లు మనకు అవకాశం కల్పించారు. అనుభవసారం అనే గ్రంధంలో "రాజా" నాన్నగారి స్వభావంలోని వైభవాన్ని ఇలా స్తుతిస్తారు.

**భువిలోని బంగారు మొలకా రావయ్య**
**బ్రహ్మాండ వంశాబ్ధి తిలకా ॥భువిలోన॥**
**పంజరమ్ములు లేక బంధమ్ములును లేక**
**నవనవోన్మేషమై నిత్యసంతోషమై**
**పొంగారు ప్రాణులకు బంగారు వసుధపై**
**మా అమ్మ ముత్యాలు ఒలుకా**
**రావయ్య**
**బ్రహ్మవై పన్నీరు చిలుకా ॥ ॥భువిలోన॥**

మరి అమ్మ నోటి నుండి ఒలికి శ్రోతల చెవుల్లో పడిన సూక్తి బీజాలు నాన్నగారి ఉదాత్తత తోనే అంకురించి పుష్పించి ఫలించి మహావృక్షాలయ్యేది.

"నదీరా" నాన్నగారిలోని నిరాడంబరత్వాన్ని ఉదారతని వర్ణిస్తూ-



"చక్కని ఒకపల్లెలో ఎంచక్కని తల్లి
ఎంచక్కని తల్లీ ఎంతో చక్కని తండ్రి
శ్రీనాగేశ్వరుడు మాతృశ్రీ భాగేశ్వరుడు
కోడెత్రాచు పేరేగాని కోపమసలు లేనే లేని
బువ్వపెట్టుటే గానీ బుసలు కొట్టుటేరాని
చల్లగాలికేగానీ ఎవరి జోలికి పోనీ
భేషజాలు పనికిరాని భేషయిన తండ్రి
శహభాషైన తండ్రి" అని ఈ పాటలోని అక్షరాలన్నీ ప్రత్యక్షర సత్యాలు; పరమ సత్యాలు.

సామాన్యంగా ఒక గృహస్థు కాని ఒక గృహిణి కానీ తన ఇంటి కెవరయినా వస్తే, వచ్చింది తన పని మీదయినా ఒక గంట కంటే ఎక్కువ సేపు ఉంటే విసుగు పడటం సహజం. అంటే స్త్రీ పురుషులు వారి అన్యోన్యతకు భంగం కలగకూడదు అని అనుకోవటం సహజం. అమ్మ వద్దకు ఎన్నో కుటుంబాలు వస్తూ పోతూ ఉంటాయి. మరెన్నో కుటుంబాలు జిల్లెళ్ళమూడిలో స్థిర నివాసంగా ఉండిపోతూ ఉంటాయి.

నాన్నగారు నిరంతరం వీళ్ళందరితో సహజమైన ఆప్యాయతతో వ్యవహరిస్తూ ఉండేవారు.

ఒక పరిమిత కుటుంబాన్ని విశ్వకుటుంబంగా తీర్చిదిద్ద దలచిన విశ్వజనని యొక్క విశ్వజనీన భావనాన్ని అమలు జరపడంలో అమ్మతో నిరంతరం సహకరిస్తున్న శ్రీ నాన్నగారు తన స్వార్థాన్ని సర్వథా సర్వదా సర్వాత్మనా సన్యసించిన సర్వోత్తమ వ్యక్తి.



నాన్నగారి పాదాలపై భోగిపండ్లు పోస్తున్న అమ్మ





# అడుగుతా అమ్మ నో మాట



డాక్టర్ పోతుకూచి ఝాన్సీలక్ష్మీభాయి, బాపట్ల

ప్రేమ, మంచితనం లాంటి పదాలు అర్థం లేనివై నిఘంటువు ల్లోంచి తొలగించబడే పరిస్థితిని పొంది కూడా నిన్నాశ్రయించటం చేత తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకున్నాయి. కానీ నీ ప్రేమలో యింత ప్రమాదం ఉందనుకోలేదు. పతి సుఖం కోసం సర్వాన్ని సన్యసించిన సతీమణుల్ని కథల్లో గాథల్లో చూచాం గానీ పతిసుఖం కోసం పతినే ఎడబాసిన సతీమతల్లిని యింతవరకు చూడలేదు. ఈ రీతిగ నీవొక నూతన అధ్యాయాన్ని సృష్టిస్తావని అనుకోలేదు.

15.2.81 ఆదివారం సెలవు కదా. అని నేను గుంటూరు వెళ్ళాను. నేను యిక్కడ నుండి వెళ్ళే రోజు నాన్నగారు కుప్పకొట్టించి ధాన్యము గోతాల కెత్తించటం నేను చూచాను. అందుకని గుంటూరులో ఈ వార్త నాకు ఆశనిపాతంలా అనిపించింది. నాన్నగార్ని ముందురోజు ఆరోగ్యంగా చూచినందువలన చాలసేపు అసత్యమే అని అనుకున్నాను. అసత్యం కావాలని నిన్ను హైమమ్మను మనసారా ప్రార్థించాను. ఏం సుఖం? మా ప్రార్థన అరణ్యరోదనమయింది. నేనే కాదు, నా లాగా ఎందరో నిన్ను ఇలా ప్రార్థించి ఉంటారు. వాళ్ళ ఆక్రందన ఆందోళన నిన్ను కదిలించలేదా అమ్మా?

ఇప్పుడు అనసూయేశ్వరాలయము అని పిలువబడుతున్న పెద్దగుడి శంకుస్థాపన జరిగిన తరువాత పునాదులు వేసేటప్పుడు అమ్మమ్మ (మన్నవ కామేశ్వరమ్మ గారు) నిన్ను "ఎందుకీ గుడి? నీ కెందుకు అంత తాపత్రయం?" అని అడిగితే అమ్మమ్మను నీవు "నీకెందుకీ అధిక ప్రసంగ"మని వారించావు. ఎవరిని ప్రతిష్ఠ చేస్తావమ్మా? అని మరల ఆమె అడిగితే లేని కోపాన్ని ప్రకటిస్తూ "ఎవరో ఒకరు ముష్టివాడుంటాడులే" అన్నావు. అమ్మా! నిజంగా మా నాన్నని పరమేశ్వరుడని దాచటానికి, అమ్మమ్మ కర్థం కాకుండా ఉండాలన్నా ముష్టివాడన్నావు. భిక్షతో జీవించేవాడు, దిగంబరుడు పరమేశ్వరుడే కదమ్మా! మరుగే నీ స్వభావమని మరొకసారి ఋజువు చేశావా అమ్మా! మా నాన్న గారు ముక్కంటి కూడానమ్మా. నీ సాన్నిధ్యమువలన ఆయనకు తృతీయ జ్ఞాననేత్రం లభించింది తల్లీ!

అయినా నీ వీ విషయంలో చాల తొందరపడి మా మనస్సుల్ని చిందరవందర చేశావు. నీవు "నేను నేనైన నేను"ని కనుక అన్ని నేనులతో పాటు నాన్నగారి నేను, మేను నీలోనే ఉంటాయి. ఏటిలోని కెరటాలు ఏరు విడిచిపోవు. ఆయన నిన్ను విడచిపోరు. మధ్యబాధ మాదే.

అమ్మా! సమిష్టి భోజనం ప్రారంభమయిన కొద్దిరోజుల తరువాత నాన్నగారు ఇంట్లోంచి కంచం తెచ్చుకుంటుంటే, తన కంచం తాను ఇంటికి తీసుకెళ్తుంటే నేను తెస్తానని అడిగాను. నాన్నగారు "తండ్రి చెప్పినట్లు చేయరే పిల్లలు తండ్రి చేసినట్లు చేస్తా"రని అంటూ ఆయనే తన కంచాన్ని తీసికెళ్ళారు. మమ్మల్నెవరినీ తాకనీయలేదు. ఒకవేళ ఎవరయినా కంచం తెచ్చుకోవటం అలవాటు లేక మొగమాటం పడుతుంటే వాళ్ళ మొగమాటం తీర్చటానికేమో అలా అన్నారు. నీలాగే నాన్నగారు కూడ "చెప్పుట ఆపు; చేసి చూపు" అన్న సిద్ధాంతాన్నే అవలంబిస్తారు. నీవు సమిష్టి భోజనానికి



సంకల్పం చేస్తుంటే మొదటిసభ్యుడుగా తానుంటానని హామీ యిచ్చి "ఒక నెల చూద్దాం కుదరకపోతే తరువాత ఆలోచిద్దాం" అని అన్నారు. 16.1.1981 సమిష్టి భోజనం ప్రారంభమయితే ఆయనన్న ప్రకారం 16.2.1981 వరకు ఒక నెలరోజులు మాత్రమే తానుండి తన మాట నిలబెట్టుకున్నారు. ఆయన ఈ రకంగా తన జీవిత కాలావధిని సూచించారేమో!

నీవు చేసే నీ కళ్యాణమహోత్సవం మే 5న జరిగే ఉత్సవం ఏటేట చూస్తూనే ఉన్నాను. కాని ప్రతిసారి నీవు నాన్నగారికి పూలివ్వటం అవి నాన్నగారు నీ శిరస్సుపై ఉంచటం, నీవు పూవులను ఆయన పాదాలపై ఉంచటం గమనిస్తున్నాము. కాని ఈ సారి ఒక వింతయిన దృశ్యం చూచాము. నీవు నాన్నగారి - హస్తాల్లో నిన్నాశీర్వదించమని పువ్వులు పోస్తే నాన్నగారు ఒక చేతిలో పూవులను నీ శిరస్సుపై, మరో చేతిలో పూలు నీ పాదాలపై ఉంచటం చాల ఆశ్చర్యమనిపించింది. ప్రక్కన ఉన్న మేం చెవులు కొరుక్కున్నాం కూడ. ఏమిటి నాన్నగారు అలా అపూర్వంగా పాదాలపై పూలుంచుతున్నారని ! నిజంగా ఆయన నిన్ను ఎన్నాళ్ళనుండో ఆరాధిస్తూ ఉండి మొన్న 'మే' 5న వ్యక్తమయినారేమో ననిపిస్తుంది. నిజంగా ఆ విధంగా ఆలోచిస్తూ ఉంటే నాన్నగారు అమ్మలో లయమై అమ్మ మయమయినారనిపిస్తుంది. ఆయన అమ్మమయం (బ్రహ్మ మయం) అయినారు గాబట్టి ఆయన లేని లోటు, ఆయన లేని చోటు కూడా ఉండదనిపిస్తుంది.

❖❖❖



## దేవుని పెళ్లి



శ్రీ నదీరా, హైదరాబాద్

"మధురం మధురం మహదానందం !
మాతృశ్రీ కళ్యాణం ! మాతృశ్రీ కళ్యాణం !"
కాలకన్య దరహాసము ! చాలధన్య 'మే' మాసము!
ఘనవరమైదవదినము ! కాంతలకైదవతనము;
ధన్యమైన ఆ సుదినం ! తరుగనిధనమెల్లరికీ !
పుణ్యమాత పెళ్ళికీ ! భూదివాలె పల్లకీ ! ॥మధురం॥
అసలే చక్కని చుక్క ! ఆపై బుగ్గన చుక్క !
అమ్మ నిలచె వరుని ప్రక్క ! అవనిపైన వేగుచుక్క!
ఆ సిగ్గులు ! ఆ బుగ్గలు ! అందచందముల మొగ్గలు!
ఆ దినమున అక్షణములు! ఆనందపు రససిద్ధులు!
॥మధురం॥
మధువులూరు పెదవులతో వధూవరులు ప్రేమలతో
మధుపర్కములను ధరించి మమతల మధురోహలతో
పెళ్ళిపీటనధివసించి ప్రేమకే నిబద్ధులైరి !
బుల్లి బుల్లి పిల్లలంత పెళ్ళిచేయు పెద్దలైరి !
॥మధురం॥
'అమ్మానాన్న'ల పెండ్లిని బ్రహ్మయె ఆరంభించెను!
అందరిలో ఆనందం అంబరమును చుంబించెను!
రెండు జతల కళ్ళు కలసి నిండుపున్నమే విరిసెను!
రెండు యెదలు, మదులు కలసి పండువెన్నెలే కురిసెను!
॥మధురం॥
నలువరాణి వీణమీటె నవ్యోత్సాహమ్ము పుట్టె
నటరాజే గజ్జకట్టి నాట్యమాడ మొదలుపెట్టె!
జనకుడంత తాళిగట్టె జగజ్జనని కేలుబట్టె!
జగములె జేజేలు కొట్టె! యుగములె హారతులు బట్టె!
॥మధురం॥





# నాన్నగారికి ధాన్యాభిషేకాలు



శ్రీ ఉత్తర, ఏల్చూరు

నాన్నగారూ!
అమ్మ జగదారాధ్య అయితే
అమ్మకే ఆరాధ్య దైవంకదా మీరు.
అమ్మ అన్నపూర్ణగా లోకంచేత
ఆరాధింపబడుతున్నది.
అసలు అన్నానికి కారణమైన ధాన్యం
మీ ఆరాధన నుండే వస్తున్నది.
నిజానికి మీరు అనసూయేశ్వరులేకాదు.
అన్నపూర్ణేశ్వరులు కూడా.
అమ్మ అన్న మాట అక్షరాల నిజం.
మిమ్మల్ని విడిచి అమ్మ ఎప్పుడూ లేదు
మీలో సగమైన అమ్మ -
మీ హృదయమంతా నిండిపోయి ఉంది.
మీ మీద అమ్మకు అమ్మ మీద మీకు ఎంత
నమ్మకమండీ!
మీ అడుగుల చప్పుళ్ళు అమ్మ గుండె చప్పుళ్ళు
మీ మాట అమ్మకు శిరోధార్యం.
మీరు నడవమంటే నడుస్తుంది - ఆగమంటే
ఆగుతుంది.
మీరు గీచిన గీత దాటి ఎరుగదు.
ఏ పనైనా మీరు ఏలా చెప్పితే అలా చేసేది.
అమ్మ అనని మాట కూడా
'మీ అమ్మగారు ఇలా అన్నారయ్యా' అంటే
'అనే ఉంటాను. నాన్నగారు చెప్పితే కాదని ఎలా
అంటాను?' అంటుంది అమ్మ.
మీ మాటలంటే అమ్మకు సుగ్రీవాజ్ఞ, కాదు
నాగేశ్వరాజ్ఞ.

మీరు కూడా అమ్మ పట్ల అలాగే ఉండేవారు.
అమ్మకు చెప్పకుండా ఏ పనీ చేసేవారు కాదు.
ఊరికెళ్ళినా-పొలం పనులుచేసినా-పొగాకు
పనులుచేసినా
ఆఖరికి ఆపరేషను చేయించుకుంటున్నా
"నీవు జిల్లెళ్ళమూడిలో ఉన్ననూ ఆపరేషన్ తిలకిస్తూ
నా చెంతనే ఉండగలవని నా నమ్మిక" అని
ఉత్తరంవ్రాశారు.
ఎంత విశ్వాసమండీ అమ్మపైన మీకు.
భర్తే ప్రత్యక్షదైవం స్త్రీలకు. పతిని ఆధారం చేసుకొని
పంచభూతాలను జయించవచ్చు స్త్రీ.
కాని భార్యను దేవతగా భావించే వారెంతమంది?
ఈ లోకంలో.
మేం బిడ్డలం. మేం మిమ్మల్ని ఆరాధించడం సహజం.
మీరు మీ భార్యను ఆరాధించి పత్నీవ్రతులైనారు.
అమ్మ అన్నట్లు భర్త భార్యకు దేవుడైతే
భార్య కూడా భర్తకు దేవతే.
భార్య భర్త చేత సైతం తల్లిగా భావింపబడటం
పతివ్రతకు పరాకాష్ఠ
కాని మీరు అమ్మ చేత తండ్రిగా భావింపబడితే;
భావింపబడక పోవడమేముంది?
మేనమామ కొడుకూ ఒక మొగుడేనా?
అని ఎవరో అంటే
మొగుడని ఎవరనుకుంటున్నారు ?
దేవుడనుకుంటున్నానుగా అని
అమ్మ మిమ్మల్ని సర్వస్వంగా సర్వేశ్వరునిగానే
భావించింది.



ఈనాడు అన్నపూర్ణాలయం మూడుపూవులూ ఆరు కాయలుగా విరాజిల్లుతున్నదంటే అది మీ చలవే.
మీరు వేసిన పునాదుల మీదే ఈ సౌధం నిర్మింపబడింది.
మీ చిన్న పూరిపాక - మీ హృదయంలాగే
విశాలమై విశ్వవ్యాప్తమై
అందరికీ అందుబాటులో వుండే అందరిల్లైపోయింది.
అందువల్లనే
ఆప్యాయతతో అనురాగంతో ఆదరంతో వాత్సల్యంతో
అమ్మ అందరమ్మైతే
మీరు మీ గుప్పెడు గుండెను- పిడికెడు హృదయాన్ని విశాలం చేసి
మీ పిల్లలతో పాటు మాకూ నాన్నగారైనారు.
మీ దయవల్ల అడ్డాలలో బిడ్డలై గడ్డాలు నెరసిన వాళ్ళైనా
అమ్మ ఒడిలో ఆడుకోగల్గుతున్నాం
ఎంత త్యాగమూర్తులండీ !మీరు
"మీ అమ్మగారు రియలైజ్డ్ సోలయ్యా!" అన్నారు.
మీ అమ్మగారికి బయటెట్టా కనిపిస్తుందో
లోపలట్టా కనిపిస్తుంది.
మీ అమ్మగారు బాధను చిలకకొయ్యకు తగిలించి
మళ్ళీ తీసుకోగలదు"
మీరెంత నిశిత పరిశీలన చేశారండీ! అమ్మను

అమ్మ రియలైజ్డ్‌సోల్ అయితే
ఆ రియలైజ్డ్‌సోల్‌ను ప్రపంచానికి రిలీజ్ చేసినవారుమీరు.
గ్రామానికి అధికారి - అమ్మకు ఆధారం అయి ఉండీ.
అందరితో సమానంగా పంక్తిలో ప్రసాదం
స్వీకరించిన నిరాడంబర చక్రవర్తి !
మిమ్మల్ని మీలోన మహోన్నత వ్యక్తిత్వాన్ని
గుర్తించిన వారెంతమంది?
బంధుత్వంతో కొంతమంది -
అవకాశం ఉన్నా అతిసామాన్యంగా ఉన్న మిమ్మల్ని
అలుసుగా తీసుకున్నవాళ్ళు కొంతమంది
మాతృత్వ హిమాలయోత్తుంగ శిఖరంపై నిలచిన
పితృదేవులు
మీరు అర్కపురీ కైలాసంలో
ఆనంద నృత్యం చేసే నాగేశ్వరులు,
మీరు మాతృశ్రీ భాగేశ్వరులు - మీరు యోగేశ్వరులు,
మీరు-అనసూయేశ్వరులు,
మీరు ద్వైతాద్వైతమూర్తులు మీకివే
అభినందన చందనాలు- ఆనందనందనాలు
జగదారాధ్యులైన మాతాపితరులకు శతశతానేక నమో వాకాలు
అనన్యమాన్య ధాన్యాభిషేకాలు.





మే5న వివాహవార్షికోత్సవం సందర్భంగా
అమ్మ నాన్నగారు





# వంద వందనములు



శ్రీ రాధావిశ్వనాధ్

మీ పాదయుగ్మమ్ము శ్రీపూజ కావించి
పూజనీయగ కీర్తిపొందె నమ్మ
మీ పాదతీర్థమ్ము మించి తాసేవించి
తీర్థమిచ్చెడి శక్తి తెలిసె నమ్మ
మీ పాదములు రెండు మెడలోని తాళిగా
అద్వైతదీప్తితో అలరునమ్మ
మీ పాదముల శబ్దమే గుండె చప్పుడై
నిరత (నిత్య) జాగృతిలోన నిలచునమ్మ
భర్తయన భావమంచును పరగి మీరు
తనువు విడిచిన మిమ్ము భద్రముగ నుంచి
తాను కూడను మిము చేరి దైవ నిలయ
మందున అనసూయేశ్వరమ్మయ్యె తండ్రి!

విశ్వజనీనమౌ విమల మాతృప్రేమ
విశ్వజనకుడౌచు వెలిగినావు
కల్పవృక్షమ్మగు కన్నకూతురి చేత
దేవత పితవయినావు నీవు
జగతి కాధారమౌ జనయిత్రి కాధార
మౌటచే జగదీశుడైతినీవు
అన్నపూర్ణాలయమ్మగు చిన్న ఇంటిని
అందరిల్లుగ జేసి అలరినావు
మువురు బిడ్డల తండ్రివై మురియు టేన
ముగ్గురమ్మల తండ్రివై మురిసినావు
అమ్మ అనసూయతాలింపు కమ్మదనము
ప్రియత్రిమూర్తులకు రుచి చూపించినావు

పూజా పుష్పములెన్నొ తెచ్చిఇడెకాబోల్
మున్ను బృందావన
శ్రీ జన్మం డనసూయపాదముల
నిశ్రేయః పథోద్దేశుడై
రాజిల్లన్ ఇపుడిచ్చుచుంటిమిదె
స్వర్ణాంభోజ పుష్పమ్ములన్
పూజల్ కొండిక నీవు నీసతియు
సంపూర్ణానురాగమ్మునన్.

ఆటలాడితివయ్య ఆనాడు మాతో జ
గన్నాటకపు సూత్ర మెన్న గల్గి
పాటలు పద్యాలు పాడితివయ్య ఓం
కారశబ్దార్థ సంకాశుడయ్యు
అమృతము నిడగల్గు అధికారివయ్యు సా
పంక్తి అనగ ముందు సాగినావు
అధికారులందరి కారాధ్యుడయ్యు న
ణకువ నున్నావు వినయమెసగగ
సత్యముగ నీవు ఈశ్వరాంశను జనించి
మహిత నాగేశ్వరాఖ్యతో మసలి - మమ్ము
లోకజననికి బిడ్డలై లోగొనంగ
జేసితిగదయ్య నీకు జేజేలు తండ్రి !

ఏ మహాత్ముని దయా హేవాక సంపత్తి
అమ్మ పదాబ్జము లందె మనకు
ఏ పూజ్యకారుణ్య మింతయై అంతయై
అన్నపూర్ణాదేవి అందె మనకు
ఏ భూసురేంద్రుని ఇష్ట సంతుష్టి చే
అనసూయ మాతయే అందె మనకు
ఏ ఈశ్వరుని కోర్కె యీడేర్చ బడుటకై
అద్వైత ఆలయమ్మందె మనకు
అట్టి జగదేకపావను అమ్మ యొక్క
గుండె గుడిలోన కూర్చున్న కూర్మి దేవు
శతవసంతోత్సవమ్ములు సాగిరందు
అర్కపురికేడుగడ నాన్న అమ్మయయ్యె



లాలించె విద్యార్థి జాలంబునెల్లను
కష్టనష్టాలను కాచి ప్రోచి
తేలించె నానాడు తీర్థప్రజల నెల్ల
తిండితిప్పలు కూర్చి నిండు ప్రేమ
పాలించె సతి నిత్య వాత్సల్య భావము
తన సౌఖ్యసంపత్తి త్యాగమొసగి
ఏలించె తన కూతు లీలావిశేషాల
కల్పవృక్షమ్మయి కాంక్ష తీర్ప
నరుని అవతారమెత్తి ననంతశక్తి
సంతతాశ్రిత పోషణానన్యరక్తి
శాశ్వతుడు నేడొ అనసూయ ఈశ్వరుండు
వెన్నపోలిన మనసున్న నాన్నగారు

స్థానము వారింటి సత్యభామాదేమి
నరసింహరావు సంగాతికాడు
కోనా ప్రభాకరుండానాటి మంత్రి తా
ననుగు స్నేహితుడయి అలరినాడు
నెచ్చెలి కథకుడు బుచ్చిబాబెంతయు
నిస్తుల నేస్తమై నెగడినాడు
నాగులూ అని పిల్చు నంతటి నెయ్యుడు
కోన సుబ్బారావు కూర్మి వాడు
నోరి వెంకటేశ్వరులో అనుంగువాడు
రాజశేఖరమిత్రుడు ప్రాజ్ఞుడతడు
సంగడీంద్రయి నీతోడ చనువరులయి
ఎన్నికెక్కిరి లోకాన నాన్నగారు !

వారు కూడను బిడ్డలైవరలినారు
విశ్వజనకుడవయినీవు వెలుగునపుడు

చందరు డమృతమ్ము విందు కూర్చుచునుండు
నందాక నీ కీర్తి అలరునయ్య
మందరస్థైర్యమ్ము మహిపై వెలంగెడి
నందాక నీ కీర్తి అలరునయ్య
మందారమున తావి మసలుచు నుండెడి
నందాక నీ కీర్తి అలరునయ్య
తామరలో లక్ష్మి స్థావరమ్మయి నిల్చు
నందాక నీ కీర్తి అలరునయ్య
సూర్యుడుదయాద్రి ఉదయించుచున్న వరకు
అంతవరకును నీకీర్తి అలరునయ్య
అమ్మ పతివయి అద్వైత మందువరకు
అంతవరకును నీకీర్తి అలరునయ్య
అనసూయేశ్వర పురమది
అనయమ్మాదేవళమున అమ్మానాన్నల్
మన కోరికలీడేర్చెడి
తనయ నిడిరి తాము కూడ తగ నిలిచిరిలే.

సురపారిజాతాలు విరజాజిపూవులు
పున్నాగ పుష్పాలు పొగడపూలు
మల్లెలు మొల్లలు మాలతీసుమములు
మందారములు నందివర్ధనాలు
శంఖుపుష్పంబుల సౌగంధికమ్ములు
కలువపూవులు దేవకాంచనములు
గరుడవర్ధనములు కనకాంబరంబులు
గడ్డిపూవులు చంద్రకాంతివిరులు
బంతి చామంతి పున్నాగ పద్మచయము
తులసిదళములు బిల్వముల్ తుమ్మిపూలు
మంత్రపుష్పాలు తెచ్చి నోమంగరమ్ము
సంతతి మనమ్ములకును ప్రసాదమగుచు

అమ్మకాధారమై అవనిలో నిలచిన
బంగారుమొలక శ్రీ బ్రహ్మచిలక
అమ్మకై కోవెలై అటచేరి ఘంటలో
కంఠారవమ్మొంచు కర్మయోగి
అంతర్ముఖుండౌచు అమ్మ పేర్మిని మించి
సార్థదేహుండైన చక్కనయ్య



నాగేశ్వరులె కాదు రాగేశ్వరులు నౌచు
ప్రజ్ఞాప్రభావులౌ ప్రణవమూర్తి
ప్రేమధామమ్ము నేలిన ప్రియవధూటి
సరసుడవు నిరాడంబర చక్రవర్తి !
వందనంబులు శాబ్దిక స్యందనములు
నందనులపైన ఆశీస్సు చిందుగాక !
జయజయ విశ్వమాత పరిచర్య నిరంతర తృప్తజీవనా!
జయజయ లోక సంతతి ప్రశస్త మహోన్నత దివ్య సద్గుణా!
జయజయసత్యశాశ్వత ప్రశాంత మహాలయ నిత్యపూజితా!
జయ అనసూయ భవ్య గుణసౌరభ కాంతికళా విలాసమా!

జయ అనసూయా నాథా !
జయ లోకేశ్వరి విభూతి సత్యచరిత్రా !
జయ మానవతా పరిమళ !
జయ జగదీశ్వరి హృదీశ ! జయనాగేశా !



కళ్యాణ వార్షికోత్సవంలో నాన్నగారు, అమ్మ, హైమక్కయ్య





# "భలే మొండి" (అమ్మ డైరీ నుండి)

శ్రీమతి బ్రహ్మాండం వసుంధర, జిల్లెళ్ళమూడి



అమ్మ 5 గంటలకు లేచి ముఖం కడుక్కొని ఎఱ్ఱ రవికె వేసుకుని ఎఱ్ఱంచుగల పసుపు పచ్చ చీర కట్టుకున్నది. కనకాంబర పూలతో జతచేసిన పచ్చ చేమంతి పూలచెండును వేలి ముడిపై అలంకరించుకుని నొసట ఎఱ్ఱని కుంకుమ తిలకం దిద్ది సువర్ణచ్ఛాయ కలిగి నిత్య మంగళ స్వరూపిణి అయిన అమ్మ స్నానానికి నీళ్ళు తోడండి అని చెప్తూనే హాల్లో వచ్చి కూర్చున్నది.

అధరాపురపు శేషగిరిరావన్నయ్య, రుక్మిణక్కయ్య, యోగయ్యగారు, క్రిష్ణవేణక్కయ్య, నేను అమ్మ దగ్గరున్నాము.

స్నానానికి నీళ్ళు తోడారమ్మా !- అని చెపితే కబుర్లు చెపుతూ నవ్విస్తున్న అమ్మ - నేనిప్పుడు పోసుకోనని మారాం చేసింది.

ఇంతలో నాన్నగారు కూడా వచ్చి కూర్చున్నారు. నాన్నగారు "ఇదిగో" అని అమ్మను సంబోధిస్తూ "సరే గాని సగటున ఎంతవుతుందంటావ్?" అన్నారు.

సడన్‌గా, సందర్భం లేకుండా నాన్నగారు అట్లా అడగటం ఎవరికీ అర్థం కాలేదు.

"ఏవిషయంలో" ? అన్నది అమ్మ.

నాన్నగారు: అదే ఇప్పుడు హరిదాసుగారు లెక్క తేల్చు కొచ్చారులే.

అమ్మ : తేల్చుకొచ్చారుగా.

నాన్నగారు: ఆయన తేల్చుకొచ్చారులే ఇదా నిన్ను చెప్పమన్నది ? షుమారున భోజనాల ఖర్చు ఎంతవుతుందో చెప్పు.

అమ్మ : అది నాకు తెలియదు.

నాన్న : నిజంగా నీకు తెలియదూ !

అమ్మ : నిజంగా తెలియదు.

నాన్నగారు: (శేషగిరిరావన్నయ్య వైపు చూస్తూ) ఎంత నిజంగా అబద్ధ మాడుతున్నదండీ అని మళ్ళీ అమ్మవైపు చూస్తూ - అంతా చెప్పమని అడగనులే నీ సొమ్ము ఏం పోయింది చెపితే".

అమ్మ : నాకు ప్రత్యేకమైన సొమ్ములేదు. పోదు.

నాన్నగారు: (అమ్మవైపు చూస్తూ - నాలుగు వేళ్ళూ ముడిచి చేయిచాచి) కాస్త చెవుదూ... అని బ్రతిమాలు తున్నట్లుగా అన్నారు.

అమ్మ : నాకేం తెలుసో మీకు తెలియదూ ?

నాన్నగారు: (గంభీరంగా) ఈ కబుర్లకేంలే చెపుదూ

అమ్మ : మీరిట్లా అడుగుతుంటే ఏం చెప్పాలో నాకు తెలియటం లేదు. ఒకరోజు తేలితే ... నెల తేలుతుంది. నెల తేలితే ...

నాన్నగారు: అమ్మ ఏదో చెప్తుందన్న ఆశతో ఆ..ఆ... నెల తేలితే...

అమ్మ : నెల తేలితే ... సంవత్సరం తేలుతుంది. ఇంతకూ లక్ష్మీనరసమ్మ గారి నడగండి. (ఆ రోజుల్లో ఆమె అన్నపూర్ణాలయంలో వంట చేసేవారు).

నాన్నగారు: ఊ..ఊ.. అని (వాకిట్లో కెళ్ళిన శేషగిరి రావన్నయ్యతో) పితలాటకమండీ ! బ్రహ్మాండ మైన పితలాటకం.

అమ్మ : (అక్కడే వున్న క్రిష్ణవేణక్కయ్యను చూపిస్తూ)



క్రిష్ణవేణమ్మగారి నడగండి.

నాన్నగారు: (శేషగిరిరావన్నయ్య వైపు చూస్తూనే) కాస్త జారింది మళ్ళీ వెనక్కి తిరిగి ఆలోచించుకుని మార్చేసింది. వారా ? వీరా ? అంటున్నది. వాళ్ళందరి సంగతి నాకెందుకూ? సరాసరి చెప్పాలనేం లేదు. బొటాబటీ చెప్పాలనీ లేదు. షుమారు చెప్పు. ఏమిటో ఆలోచిస్తున్నావు.

అమ్మ : అబ్బే ! ఏం లేదు.

నాన్నగారు: చెప్పవా ఏమిటి ? పోనీ చెప్పనని చెప్పు. నేను వెళ్ళిపోతాను.

అమ్మ : వెళ్ళిపోవటం ఎందుకు ? కూర్చోండి. కేవలం దీని కోసం కాదుగా వచ్చింది.

నాన్నగారు: నాకవతల పనున్నది. కూర్చున్నది దీనికోసం. ఒకే మాట చెప్పు. నేను వెళ్ళిపోతాను.

అమ్మ : చెప్పనని చెప్పను. తెలియదని చెపుతా.

నాన్నగారు: ఏంపోయింది నీ సొమ్ము ? నేనేం ఎకరం 2పుట్ల పంట అడుగుతున్నానా ? బేరన్‌లో డబ్బు కావాలని అడుగుతున్నానా ?

అమ్మ : ఊఁ నేనన్నానా ?

నాన్నగారు: ఇష్ ! అబ్బబ్బ ! చెపుదూ !

అమ్మ అప్పుడే లోపలకి వస్తున్న గజేంద్రమ్మను చూపిస్తూ...

గజేంద్రమ్మను అడగండి.

నాన్నగారు: నాకేంపని ? సింగినాదమ్మను, జీలకఱ్ఱమ్మను అడగమంటావేం నేను నిన్నడుగుతుంటే

అమ్మ : తెలియనిదేం చెప్పమంటారు ?

నాన్నగారు: తెలియదంటావ్ ?

అమ్మ : తెలియదు... తెలియదు.

నాన్నగారు: తెలియదూ ? (అని గట్టిగా అంటారు.)

అమ్మ : నిజంగా తెలియదు. మీరు గట్టిగా అడిగితే ఎట్లా మాట్లాడాలో తెలియకుండా పోతున్నది. ఇహ ఇప్పట్నుంచీ జాగ్రత్తగా వాడి ఒక సంవత్సరంలో చెపుతానన్నది (భయపడుతున్నట్లుగా) ఎంతో వినయంగా.

నాన్నగారు: (ముక్కు రాచుకుంటూ) ఎన్నాళ్ళకూ, ఎన్ని రోజుల్లో ?

అమ్మ : ఒక సంవత్సరం లోపల.

నాన్నగారు: (ఏడిసినట్లే వుంది) అని, లేదూ ? కొన్ని రోజులు టైం తీసుకో ?

అమ్మ : నాకు చాలదు. అంత తెలివా ? అదెంత చిక్కంటే ... మీరు అడుగుతున్నారు కానీ, ఒక వీశె గోంగూర వచ్చిందనుకోండి ఒక సొరకాయ వచ్చింది. వాటికి కిమ్మతు వేయం. అవి రెండూ ఒక పూట తేలికగా గడుపుతాయి కదా ! అవీ న్యాయంగా లెక్కకు రావలసినవేగా. అవి గుర్తుతో చెప్పటం ఎంత కష్టం ?

నాన్నగారు: ఈ కబుర్లకేమొచ్చె. చెప్పు. అవన్నీ వేసుకునే చెప్పు. అయినా నీకు గుర్తుండక పోవటం ఏమిటి ? (శేషగిరిరావన్నయ్యతో మీ అమ్మగారికి భలే జ్ఞాపకశక్తుండోయ్, నాకు తక్కువ గానీ. ఇది వరకు బేరన్ ఉన్న రోజుల్లో డబ్బు తెచ్చి మీ అమ్మగారికి ఇచ్చేవాడిని.

క్రిష్ణవేణమ్మ: నిజంగా ఇచ్చారా, నాన్నగారూ ! మా అమ్మగారు ఎట్లా వాడేది ? మా అమ్మ



అసలు పిచ్చమ్మ అయితే (ఆమె ఆ మాట అనగానే అట్లా అనచ్చా నాన్నగారిని అన్నట్లు కళ్ళతోనే ఆమె వైపు మందలింపుగా చూసింది.)

నాన్నగారు : వచ్చింది వచ్చినట్లుగా ఇచ్చేవాడినండీ .. మీ అమ్మగారికి తెలియకపోవటం ఏమిటండీ? బలే చిక్కని స్థితి.

అమ్మ : నేను చిక్కినంతగా ఎవరూ చిక్కలేదు.

నాన్నగారు: ఏం చిక్కావు ?

అమ్మకు నీళ్ళు తోడిన సోదరి శకుంతల నీళ్ళు చల్లారి పోతున్నయ్యంటూ వచ్చింది. అమ్మ సాన్నానికి లేవబోతుండగా

నాన్నగారు: "ఏం స్నానానికి లేవబోతున్నావా ? ఎందుకు? ఆ కాస్త చెపితే నువ్వు స్నానానికి పోవచ్చు. నేను వెళ్ళి నా పని నేను చూసుకుంటాను. అదేదో చెప్పేసేయి. ఉడాయిస్తాను" అన్నారు పట్టుదలగా. అమ్మ చేత ఎలాగయినా చెప్పించాలని నాన్నగారు.

అమ్మ ఏం మాట్లాడకుండా దిండు ఒడిలో పెట్టుకొని దాన్ని ఊపుతూ కూర్చున్నది.

నాన్నగారు: చిటికెవేసి ఊ, ఊ ! పోనీ షుమారుగా వెయ్యి ఒక రోజుకు చెప్పు. మేము లెక్కవేసుకుంటాం. (అని అమ్మ ఏం చెప్తుందోనని ఆకలి వేసిన బిడ్డ తల్లి ముద్ద కోసం చాలా ఆశగా, ఆసక్తిగా ఎదురు చూస్తున్నట్లుగా-)

అమ్మ మాత్రం చీమలు మంచంకోడుమీదుగా అమ్మ చేతివేళ్ళసందుల్లోకి వచ్చి కరుచుకున్నె ఏదో మధుర రసాస్వాదన కోసమన్నట్లు, ఈగలు ఎగురుతూ అమ్మను చుట్టిముట్టి ఆ స్పర్శకోసం తపిస్తున్నట్లుగా ఉన్నె, అయినా వేటినీ వదులుకోలేదు. విదిలించలేదు.

నిశ్చలంగా, ప్రశాంతంగా నాన్నగారి మాటలు వింటూ కూర్చున్నది. నాన్నగారు అడిగీ, అడిగీ ఇహ సమాధానం రాదని నిశ్చయించుకుని

"ఎందుకు నీతో - సరే పో, స్నానం చెయ్యి" అన్నారు. నాన్నగారు అన్నదే తడవుగా అమ్మ లేచి స్నానానికి వెళ్ళింది.

అమ్మ లేచి వెళ్తుండగా "భలేమొండి" అంటూ నాన్నగారు వెళ్ళారు.





అమ్మతో ముచ్చటిస్తున్న నాన్నగారు





# ఆ నాగేంద్రుడే నాగేశ్వరుడై వచ్చాడు



శ్రీమతి నందిగామ చిన్నాదేవి, విశాఖ

అమ్మ ఈ వాక్యం అనటానికి ఎంతో అర్థం వుంది. అసలు నాన్నగారు ఎవరు ? అమ్మ భర్త నాన్నగారు. ఆయన చివరిదశలో అమ్మని తన భార్యగా చూడక అమ్మగానే తలచారు. 'అమ్మ' అనే పిలిచారు. పాతివ్రత్యానికి చరమదశ భర్త భార్యను 'అమ్మ' గా తలచటమేనని అమ్మ చెప్పింది. అమ్మ తన బిడ్డలకు అన్నం పెట్టి పంపటం నాన్నగారికీ ఇష్టమే. ఎందువల్లనో నేను 'అమ్మ'ను తప్ప నాన్నగారిని ఎప్పుడూ అనుకునేదాన్ని కాదు. తలచుకొనే దాన్ని కాదు. కాని 2007లో జరిగిన మహాశివరాత్రి పర్వదినం నాడు (తెల్లవారుఝామున) నాకు చిత్రమైన కల వచ్చింది. ఆ కలలో నేను హైమాలయానికి వెళ్తున్నాను.

నాగేశ్వర ఆలయానికి వెలుపల ద్వారంలో ఒక బ్రాహ్మణుడు నుంచొని వున్నాడు. ఆయన నన్ను పిల్చి కొబ్బరి చిప్ప ప్రసాదంగా ఇచ్చారు. అది తీసుకొని నేను ఆయన పాదాలకు నమస్కరించి తలపైకి ఎత్తి చూశాను. అంతలోనే ఆయన నాన్నగారు గా కనిపించారు. వెంటనే మెలకువ వచ్చింది. ఇదేంటి నాన్నగారు కలలో కనిపించారు అనుకున్నాను. ఓహో ఈ రోజు శివరాత్రి కదా ! నాన్నగారు ఇలా బ్రాహ్మణుడు రూపంలో వుండి పిల్చి తరువాత నాన్నగారిగా మారిపోయారు. ఇలా కల ఎందుకు వచ్చిందా అని నేను చాలాసార్లు ఆలోచించాను. అప్పుడు అర్థం అయింది అమ్మ చెప్పిన వాక్యం ఆ నాగేంద్రుడే నాగేశ్వరుడై వచ్చాడు అని. మరి ఈ విషయం అమ్మకు మాత్రమే తెలుసు. తరువాత నేను జిల్లెళ్ళమూడి వెళ్ళినపుడు అన్నపూర్ణాలయం ఆఫీసులో అమ్మ, నాన్నగారి ఫోటో చూశాను. నేను కలలో చూసిన నాన్నగారు, నాకు కనిపించిన నాన్నగారు ఒకే విధంగా ఉన్నారు. ఆ కళ్ళు ఎంతో పరిశీలనగా చూశాను. అవే కళ్ళు, అదే నాన్నగారు. నేను జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడల్లా అనేకసార్లు నాన్నగారిని పరిశీలనగా చూశాను. సందేహము లేదు. అమ్మ చెప్పిన ఈ వాక్యానికి అర్థం దొరికింది. నాన్నగారికి తెలియక పోవచ్చేమో కాని అమ్మకు మాత్రం పూర్తిగా తెలుసు నాన్నగారి జన్మరహస్యం. అందుకే అమ్మ నాన్నగారినే చేసుకుంటానన్నారట. ఎన్ని సంబంధాలు తెచ్చినా. అమ్మకు మాత్రం ముందే తెలుసు నాన్నగారు ఈశ్వర రూపమని. అమ్మ రాజరాజేశ్వరి అయినపుడు నాన్నగారు ఈశ్వరుడు ఎందుకు కాదు? అందుకే అమ్మ ఆలయానికి 'అనసూయేశ్వ రాలయం' అని నామకరణం చేశారు. అందుకేనేమో రాచర్ల లక్ష్మీనారాయణగారు నవనాగేశ్వర ఆలయనిర్మాణం చేపట్టి అందమైన దేవాలయం నిర్మించారు. అందుకే అమ్మ ఫిబ్రవరి 17న ధాన్యాభిషేకానికి ప్రేరణ ఇచ్చారు.

ఇదంతా చూస్తుంటే అమ్మ, నాన్నగారు మనకు సాధారణ మానవ రూపాలుగా కనిపించినా, ఆది దంపతులుగా రాబోయే తరాల వారికి మార్గదర్శకంగా వుంటారని ఈ సంవత్సరం జరిగిన ధాన్యాభిషేకము తెలియజేస్తున్నది. ఆ రోజున కొన్ని వేలమందికి అన్నదాన కార్యక్రమము జరిగినది. అన్నివేల మందికి అన్నం పెట్టడం సామాన్యమైన విషయం కాదు. అమ్మ, నాన్నగారు వారి 'అభయహస్తం' ద్వారా తమ బిడ్డలకి భోజన కార్యక్రమం నిర్వహించారు. సాక్షాత్తు అమ్మ 'అన్నపూర్ణయై' లలితాపరమేశ్వరియై తన బిడ్డలకి అన్నప్రసాదాన్ని పంచిపెట్టింది.







# నాన్న is greater than అమ్మ



శ్రీమతి ఎన్.రమాదేవి, గుంటూరు

అది ఒక మారు మూల కుగ్రామం. సుమారు 100 ఇళ్ళు, తూర్పు పడమర తెలీని జనం. అక్కడకు ఒక ముద్దుగుమ్మ, పరువాల రెమ్మ, ఉంగరాల సొగసు లొలికే జడ ముంగురులతో, మురిపాల సొగసుతో, దారితప్పి, ఎటులనో ముళ్ళ కంచెల్లోకి ఏతెంచింది. అందరినీ బయట పడవేయడానికే భూలోకానికేతెంచింది.

స్వర్గంలో విష్ణుమూర్తి పాదాల చెంత పరవశించే శుభసమయంలో. మాతృహృదయం విలవిలలాడింది. తల్లడిల్లింది. బిడ్డల చెంతకు పరుగులిడింది. ముల్లోకముల నేలెడు మూలవిరాట్, తల్లి హృదయం ఎరిగిన వాడై కొంగును వదిలివేశాడు. బిడ్డల యొక్క పరిష్వంగంలో ఆమె ఊరడిల్లింది. ఆ ఆనందం ఆమెకు తృప్తినిచ్చింది. ఇక వీరినొదలి నేను వెళ్ళనే వెళ్ళను. అనెడి దృఢసంకల్పంతో నేటి అన్నపూర్ణాలయ సామ్రాజ్యస్థాపన జరిగింది.

చారు నీళ్ళు, ఉసిరిక, చింత, గోంగూర పచ్చళ్ళు, నీళ్ళ మజ్జిగ, ఇవే అలనాటి వైభవం. జనం తక్కువే. ఇప్పటి జనం అంతకంతకు 100 రెట్లు అయినది. అయినా పిండివంటలు, గడ్డపెరుగు - అన్ని రుచులతో కూడిన పౌష్టికాహారం ఈనాటి వైభవం, జనం ఎక్కువైతే సరిపోదనేది మన పిచ్చి వాదన.

ఈ Ratio నిష్పత్తి సరిపోవడం లేదు. So it is a miracle. ఆనాటి P.M. శ్రీనెహ్రూగారు భారతదేశం జనాభా పెరిగింది పెరిగిపోతోంది. పంటలు ఎక్కువగా పండించా లని అన్నారు. పవిత్రభారతదేశం పారిశ్రామికంగా (Industrialization) వృద్ధి చెందాలన్నారు. సంవత్సరానికి 3 పంటలు వేసి పండిస్తున్నారు. ఐనా చాలడం లేదు. కరువు తీరడం లేదు. అందరికీ తెలిసిన విషయమే. అప్పుడు అందరింటి జనం తక్కువ. చారు నీళ్ళ భోజనం. ఇప్పుడు అందరింటి జనాభా ఎక్కువ - కమ్మటి భోజనం. ఇది అర్థం కాని issue. దైవం అనండి. miracle అనండి - అమ్మకంటే నాన్నగారు మరీ విజృంభిస్తున్నారు. తల్లి బిడ్డలను వెనుక వేసుకొస్తుంటే - తండ్రి ఏం ఇస్తాడు? ఇది లోక సహజం. అమ్మనాన్నగార్లది భిన్నత్వంలో ఏకత్వం. వీరిది సహజప్రేమ. ఇక్కడ నాన్నగారే అమ్మతనం. అమ్మే నాన్నతత్త్వం అయింది. అమ్మ - నాన్న కాలేదు. నాన్న - అమ్మ - నాన్న is greater than అమ్మ అయినారు. నాన్నకు జై జై జైలు. అమ్మ తన Ammaness నాన్నకే అర్పించింది. భోళాశంకరులైన నాన్నగారు స్వీకరించారు. ఇద్దరికి - ఇద్దరూ ఇద్దరే; నాన్న > అమ్మ. ✤✤✤







# అమ్మే మా అమ్మాయి - నాన్నగారు నా తండ్రి



శ్రీమతి నాదెండ్ల భ్రమరాంబ, జిల్లెళ్ళమూడి

అమ్మ నా కన్నతల్లి, నాన్నగారు నా కన్నతండ్రి. ఆ ఆదిదంపతుల ప్రేమకు నోచుకున్న మేము ధన్యులం. అది మా పురాకృత పుణ్యఫలం; కఠోర తపస్సుకు వరం.

హైమక్కయ్య శరీర త్యాగం చేసిన ఏడాదే మేము జిల్లెళ్ళమూడి వచ్చాము. నాన్నగారు, అమ్మ ఇరువురూ నాలో హైమను చూసుకున్నారు అనిపించేది.

అమ్మ అందరమ్మ కాగా నాన్నగారు 'భ్రమరాంబ మా అమ్మాయి' అని ఆప్యాయంగా చూడటం నాకు గర్వకారణం. ముఖ్యంగా నాన్నగారు డాక్టర్ జె.వి.కృష్ణారావుగారి ఆస్పత్రిలో శస్త్రచికిత్స చేయించు కున్నప్పుడు వారికి శేషుతోపాటు నేనూ కించిత్ సేవ చేసుకునే భాగ్యం కలిగింది. తర్వాత కొద్దిరోజులు నాన్నగారు మా ఇంట్లో ఉన్నారు. "మా అమ్మను గురించి చెప్పండి" అని అడిగేదాన్ని. "మీ అమ్మగారు ఏనాడూ ఇది కావాలి అని అడిగేది కాదు. ఏం చెప్పినా 'సరే' అనేది. 'సరే' తప్ప రెండో మాట లేదు' అనేవారు.

అమ్మ సర్వశక్తిమత్వం మీద నాన్నగార్కి విశ్వాసం ఉంది. వారు ఆస్పత్రిలో ఉన్నపుడు "నీవు జిల్లెళ్ళమూడిలో ఉన్నా, ఇక్కడ ఆస్పత్రిలో జరిగేదానిని ప్రత్యక్షంగా చూడగలవనే నా నమ్మిక" అంటూ అమ్మకి లేఖ వ్రాశారు. దానిని మా శ్రీవారు (శ్రీ ఎన్. లక్ష్మణరావుగారు) తీసికొని వెళ్ళి అమ్మకి అందజేశారు. అమ్మ దానిని కళ్ళకు హత్తుకుని దానిపై ఒక పుష్పాన్నుంచి తిరిగి ఇచ్చి 'frame కట్టించు, నాన్నా!' అన్నది.

నాన్నగారికి స్వస్థత చేకూరిన తర్వాత మేమంతా జిల్లెళ్ళమూడి వచ్చాం. నాయందలి అభిమానంతో నాన్నగారు స్వయంగా ఒక చీరె కొని తెచ్చి అమ్మ చేత నాకు పెట్టించారు. నాన్నగారు నన్ను కూతురిలా చూసినట్లే మా శ్రీవారిని అల్లునిగా గౌరవించేవారు. జిల్లెళ్ళమూడిలో వాన్ దిగగానే 'శేషమ్మా! లక్ష్మణరావుగారు వచ్చారు' అంటూ ఆప్యాయంగా ఆహ్వానించేవారు. తన సరసనే కూర్చుండ బెట్టుకుని, ఇరువురూ భోజనం చేసేవారు. నాన్నగారు మా ఇంటికి వచ్చినపుడల్లా ఎదురేగి వారి పాదాలు స్వయంగా కడిగి శుభ్రవస్త్రంతో తుడిచేవాళ్ళం.

ఒకసారి అమ్మకి చట్టమీద పెద్ద గడ్డ లేచింది. దానికి ఆపరేషన్ చేశారు. వైద్యం నిమిత్తం అమ్మ కొంతకాలం నెల్లూరులో డాక్టర్ ఎస్.వి.సుబ్బారావు గారింట్లో ఉంది. అమ్మను చూడటానికి మేము నెల్లూరు వెళ్ళాం. తిరుగు ప్రయాణంలో నాన్నగారు, మేము కలిసి రైలులో వస్తున్నాం. రైలు చీరాల స్టేషన్ దాటింది; బాపట్ల చేరబోతోంది. నాన్నగారు ఆప్యాయంగా, "మా అమ్మాయి భ్రమరాంబను దీపావళి పండుగకి మా ఇంటికి తీసుకు వెడతాను. మీరు కూడా రావాలి" అన్నారు. వారి మాటకాదనలేక మావారు, "నేను పనిమీద గుంటూరు వెళ్లాల్సి ఉంది. భ్రమరాంబను తీసుకు వెళ్ళండి" అని అంగీకరించారు.

నాన్నగారి హృదయంలో నాకున్న ఆత్మీయ స్థానానికి నాకు మహదానందమైంది. నాన్నగారు, నేనూ బాపట్ల స్టేషన్‌లో దిగాం. ఆరోజున వాన్ తిరగడం లేదని తెలిసింది. వెంటనే నాన్నగారు రెండు రిక్షాలు మాట్లాడారు. చెరియొక రిక్షాలో జిల్లెళ్ళమూడి చేరాం. పండుగ వెళ్ళిన మర్నాడు నాన్నగారి దగ్గర సెలవు తీసుకొని గుంటూరు వెళ్ళాను.



జిల్లెళ్ళమూడిలో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఉన్న మా భవనంపై మరొక అంతస్థు కట్టుకున్నాం. ముందుగా అమ్మ గృహప్రవేశం చేయాల్సి ఉంది. అమ్మను సాదరంగా ఆహ్వానించాం. ఉగాదిపండుగ వెళ్ళిన మర్నాడు అమ్మ మా ఇంటికి రావటానికి అంగీకరించింది. నూతన సంవత్సర శోభను, శుభాకాంక్షలను మూటగట్టి సిద్ధం చేసుకున్నది.

మరొక దృష్టితో చూస్తే అమ్మ 'మా కూతురు'. తరచుగా అమ్మ, "నన్ను పెంచుకో" అని పోరేది. 'అమ్మకి నేను బిడ్డా? అమ్మ నాకు బిడ్డా?' రెండూ సత్యమే. అమ్మను 'మేనా'లో కూర్చుండబెట్టి మేళతాళాలతో పుట్టింటికి తీసికొని వచ్చినట్లుగా తెచ్చుకున్నాం. అమ్మరాకతో మా ఇల్లంతా పండుగ వాతావరణంతో నిండిపోయింది. ఆరోజే ఉగాది పండుగ అనిపించింది. ఆ సందర్భంగా ఎందుకో అమ్మ ఏడు గజాల పచ్చని నేత చీర పెట్టింది నాకు. పొలాల్లో పనీపాటా చేసుకునే స్త్రీలు కట్టుకునే ముతకచీరెలా ఉంది. నాకు అయోమయమైంది. 'ఏమిటి ఇది?' అని అనుకున్నాను. వెంటనే అమ్మ నాగడ్డం పట్టుకొని "అమ్మా! నువ్వు పదికాలాలు పాటు చల్లగా ఉండాలని పచ్చచీర పెట్టానమ్మా" అన్నది నిండు మనస్సుతో.

అది పట్టుచీరె అయితే కొద్ది రోజులు కడితే చినిగిపోయి ఉండేది. కానీ ఆ నేతచీరె చెక్కు చెదరకుండా నేటికీ ఉన్నది. విపత్కర పరిస్థితులలో, పరీక్షాసమయాల్లో ఆ చీరె కట్టుకుంటే ఒక రక్షకకవచంలా, వజ్రాయుధంలా, బ్రహ్మాస్త్రంలా పనిచేస్తుంది. ఏదో తెలియని సంతోషం, రక్షణ చేకూరుతాయి. ఇదమిద్ధమని మాటలలో చెప్పలేను. అది అమ్మ అనిర్వచనీయమైన ఆశీర్వచనానికి నిలువెత్తు రూపం.

నన్ను కన్నబిడ్డలా ఆదరించే నాన్నగారు 1981లో శరీరత్యాగం చేశారు. అమ్మ తన కన్నీళ్ళను తానే తుడుచుకుని బిడ్డల కోసం శ్వాసించింది. నాన్నగారిని ఆలయ ప్రవేశం చేయించి దానికి అనసూయేశ్వరాలయం అని పేరు పెట్టింది. 'అనసూయ అంటే అమ్మ. ఈశ్వరుడు అంటే అమ్మ భర్త నాన్నగారు' అని అనుకున్నాను. పన్నెండు రోజులలోపు ఒకసారి అమ్మ వద్దకు వెళ్ళాను. "అమ్మా! నీ నామం ఉంది; హైమ నామం ఉంది; చేస్తున్నాం. నాన్నగారి నామం కూడా పెట్టించు" అని అర్థించాను. అంతేకాదు. "నాకు నామం ఇలా ఉండాలి అని తోస్తోంది.

"అనసూయేశ్వర నమోనమో

శ్రీ నాగేశ్వర నమో నమో –" అని నామాన్ని పాడి వినిపించాను. అమ్మ అంగీకరించింది. "నువ్వే చెప్పి చేయించు" అని ఆదేశించింది. "అమ్మా! నువ్వే చెప్పి చేయించాలి' అని విన్నవించుకున్నాను. అమ్మ అలా, నేను ఇలా – మరల మరల అనుకున్నాం. అది ఆనాటి మాట.

నేడు నాన్నగారి శతజయంతి ఉత్సవాల నిర్వహణ సందర్భంగా 'నాన్నగారి నామ ఏకాహం' జరుపుకోవాలని శ్రీ విశ్వజననీపరిషత్ తీర్మానించింది. ఆ సంగతి తెలిసిన మరుక్షణం నేను పరుగు పరుగున ఆఫీసుకు వెళ్ళాను. అక్కడ ఉన్న దినకర్ అన్నయ్య, శ్రీరామమూర్తి అన్నయ్యలకి పాడి వినిపించాను. వారు వెంటనే ఆమోదించారు. నేడు అందరూ ఆర్తితో ఆనందంగా నాన్నగారి నామ సంకీర్తన చేస్తున్నారు. ఆనాటి మాట నేటి బాట అయింది. సంకల్పం అమ్మది; నేను సాధనం మాత్రమే.

నాన్నగారి హృదయంలో 'కన్నకూతురి'గా,

అమ్మ హృదయంలో 'కన్నతల్లి'గా

సుస్థిర స్థానాన్ని పొందటం నా భాగ్యం. కావున మా దంపతులకి సంతానం లేదనే లోటు లేదు. అమ్మే మా అమ్మాయి.







# అలుకయే ఎఱుంగని అజాతశత్రువు నాన్నగారు



ప్రొ॥ నందమూరు కామరాజు, తిరుపతి

చిన్నప్పటి నుండి నాన్నగారితో మాకు పరిచయ భాగ్యం ఉంది. ఆయనతో చిన్నప్పటి నుండీ మీరు కలసి మెలసి మాట్లాడటము, సన్నిహితంగా మెలగటం. మా అదృష్టంగా భావిస్తున్నాను. మాకు చిన్నప్పటి నుండి తెలిసిన మా కనకమ్మ అమ్మ కొడుకే, నాన్నగారని, 1956వ సంవత్సరము జనవరి నెలలో మొదటి సారిగా జిల్లెళ్ళమూడి సందర్శించినపుడు గానీ నాకు బాగా అవగతం కాలేదు. చిన్నప్పటి నుండి నాన్నగారు (అప్పట్లో మా కుటుంబ సభ్యులందరూ ఆయనని నాగులు అన్నయ్య అని పిలిచేవాళ్ళం) గుంటూరు, అరండల్‌పేట అయిదవ లైనులోని మా సొంత ఇంటికి తరచుగా వస్తుండేవారు. సాధారణంగా రాత్రి పొద్దు పోయిన తరువాత ఎప్పుడో ఒకప్పుడు, మొదటి ఆట కాదు రెండవ ఆట సినిమా చూసిన తరువాత మా ఇంటికి వచ్చి మా వరండలో నున్న అరుగుమీద, మంచం మీద పడుకొని నిద్రపోయి పొద్దునే లేచి కాఫీ త్రాగి, మా నాన్నతో పాటు వార్తాపత్రికలు చదివి, రాజకీయాలు అవీ మాట్లాడి, స్నానం చేసిన తరువాత ఆయన దారిన ఆయన వాళ్ళ ఊరికి వెళ్ళి పోయేవారు. వచ్చినప్పుడల్లా, మా కుటుంబసభ్యులందరినీ ఎంతో ప్రేమానురాగాలతో, ఆప్యాయతతో పలకరించేవారు. నాన్నగారిని గురించి చిన్నప్పటి నుండి నాకు తెలిసిన విషయాలు ప్రొద్దునే కాఫీతాగటం, వార్తాపత్రికలు చదవటం, రాజకీయాలు చర్చించటం, సినిమాలు చూడటం తనకు ఇష్టమని. మా ఇంట్లోనే కాకుండా, నాన్నగారిని తరచుగా అనేక సందర్భాలలో మా మేనమామగారు, రామబ్రహ్మం గారింట్లో (పొన్నూరులో)ను, ఇంకా మా అమ్మ తరపున బంధువుల ఇంట్లో శుభకార్యాలలో కలుస్తుండేవాళ్ళం. నాన్నగారితో పాటు అమ్మను కూడా కలుస్తుండేవాళ్ళం. (అప్పట్లో అమ్మ మా సీతాపతి మామయ్యకూతురు, అనసూయా గానే మాకు తెలుసు) లోకనాథం అన్నయ్య(నాన్నగారి తమ్ముడు) వివాహము గుంటూరు బ్రాడీపేట, ఉన్నవలక్ష్మీ నారాయణగారింట్లో జరగటం, మేమందరం ఆపెండ్లికి వెళ్ళటం నాకు బాగా గుర్తు. 1956 జనవరి నుంచి జిల్లెళ్ళమూడి రావటం ప్రారంభించాను. మా కుటుంబ సభ్యులందరు కూడా అప్పటి నుండి అమ్మను తరచుగా కలవటం, దాంతో పాటే, నాన్నగారితో కూడా సాన్నిహిత్యం మరింతగా పెరిగి పోయింది. నేను హైదరాబాదులో ఉన్నపుడు కూడా (అప్పట్లో హిమాయత్‌నగరు కొంతకాలం, భర్కత్‌పురాలో కొన్నాళ్ళు, విద్యానగరులో కొన్నాళ్ళు ఉన్నాను). నా దగ్గరకు వచ్చేవాళ్ళు అప్యాయంగా నా క్షేమ, సమాచారములు కనుక్కొనేవాళ్ళు.

నాన్నగారికి కోపము రావటం అంటూ సాధారణంగా ఎపుడూ చూడలేదు. ఆ ఒక్క సందర్భములో తప్ప అపుడు వేసవిశెలవులు. .... అమ్మ దగ్గర జిల్లెళ్ళమూడిలో కాలక్షేపం చేయటం, నాకు పరిపాటి అయిపోయింది. ఒకరోజు మధ్యాహ్నం, నేను ఇంకా కొంతమంది అమ్మ సన్నిధికి (అప్పట్లో అమ్మ ధ్యానమందిరంలోనే ఎక్కువకాలము గడిపేది). కూర్చొని అమ్మ చెప్పే మాటలు వింటూ కూచున్నాము. ఇంతలో ఎంతో హడావుడిగా ఆవేశంతో, కోపంతో నాన్నగారు ప్రవేశించారు. అమ్మ మందిరంలోకి ..... గుంటూరువాణి పత్రిక ఉంది. మా అన్నయ్య స్వర్గీయ నందమూరి సత్యనారాయణ గారి సంపాదకత్వంలో గుంటూరు నుండి ప్రచురించే వారపత్రిక. “ఏడీ ! కామరాజు ఎక్కడ ? వాడు ఇక్కడే ఉన్నాడా! వాడిని పిలవండి” అంటూ పెద్దగ అరిచారు. నేను అక్కడే అమ్మసన్నిధిలో కూర్చుని ఉన్నట్లుగా ఆయన గమనించలేదు. అమ్మ నా వంకచూసి, “వాడు ఇక్కడే



ఉన్నాడు" అని వెంటనే చెప్పింది. నాన్నగారు, ఎంతో కోపంతో, ఉద్రేకంతో గుంటూరువాణి పత్రిక నాకు చూపిస్తూ ఏంటిరా ! ఈ పిచ్చివ్రాతలు, సత్యం (మీ అన్నయ్య - గుంటూరు వాణి పత్రిక సంపాదకుడు) ఎందుకు ఇట్లా వ్రాస్తున్నాడు? వాడికి సీతారామమూర్తి చౌదరిగారిని గురించి ఏమి తెలుసు? ఆయన ఎంత మంచి టీచరు ఎంత మంచి కవి ! మా గురువుగారు. ఏమన్నాడు., వీడు ఏమిటి వ్రాస్తాడు. నీవు సత్యంతో వెంటనే చెప్పరా! ...... చౌదరిగారికి క్షమాపణలు చెప్పమను. వెంటనే వాడి పేపర్లో గూడా వాడు చేసిన తప్పులు క్షమాపణలతో ప్రకటించమను" అని ఆవేశంతో చెప్పారు. ఇదంతా గమనిస్తున్న అమ్మ వెంటనే నా వంక చూసి, "నీవు గుంటూరు వెళ్ళి, అన్నయ్యకు చెప్పరా, ఆయన చెప్పినట్లు చెయ్యమని" అని చెప్పింది. అంతే, కాసేపు అయిన తరువాత అంతా సర్దుమణిగి పోయింది. నాన్నగారు, సహజ ధోరణిలో నాతో ప్రేమగా మాట్లాడారు.

అసలు జరిగిన సంగతి ఏమిటి ? అని నేను కాసేపు మధనపడ్డాను. నాన్నగారు, ఆయన చేతిలోని గుంటూరు వాణి పేపరు నాకు ఇచ్చారు. ఆ పేపరు చదివిన తరువాత, నాన్నగారు ఇంత ఆవేశంలో ఎందుకు మాట్లాడారో తెలిసింది. నాన్నగారికి హైస్కూలులో తెలుగు టీచరు (గురువుగారు) తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, ఒక వారం రోజుల క్రితమే బాపట్లకు సమీపగ్రామంలో ఒక చోట ఉపన్యసిస్తూ, జిల్లెళ్ళమూడిలో ఒకామె, సాధారణ వనిత, దుర్గ అమ్మవారి వలె వస్త్రాలంకరణ చేసుకొని ఆభరణాలు అవీ అన్నీ ధరించి, ఒక చేతిలో శూలము, మరొక చక్రము చేతపట్టి, కిరీటము ధరించి, అమ్మవారివలె తన వద్దకు వచ్చిన భక్తులకు దర్శనం ఇస్తున్నారని. ఉపన్యాసాలు ఇస్తున్నారని - ఇదంతా చాలా మహా అపచారమని అమాయక జనులు ఆమె సందర్శనానికి తండోప తండాలుగా వెళ్తున్నారు. ఆమె చేసేదంతా కపటవేషము. కపట నాటకమని అమాయక ప్రజలను ఇట్లా మభ్యపెట్టటం వెంటనే మానుకోవాలి అని చెప్పినట్లుగాను, ఒక కథనం వ్రాసి, అటు తర్వాత తుమ్మల సీతారామమూర్తిగారు (అభినవ తిక్కన బిరుదాంకితులు) అమ్మ ధీరత్వం గురించి ఏమి తెలియకపోవటం వలన ఇలా అమ్మ మీద అవాక్కులు, చెవాక్కులు, అర్థం పర్థం లేని వ్యాఖ్యలు చేసారని ఆయన అమ్మను గురించి వాస్తవం తెలుసుకొని ఉంటే, ఇట్లా మాట్లాడేవారు కాదని, ఇప్పటికి అయినా సరే అమ్మ దైవత్వము గురించి ఆమె ఒక మహామాన్వితమయిన, ఆరాధ్య దైవము మంగళ స్వరూపిణి అని తెలుసుకొని, అమ్మ మీద దుష్ప్రచారము మానుకోవాలి. గుంటూరు వాణి పత్రికను గురించి వ్రాసారు. నేను వెంటనే గుంటూరు వెళ్ళి మా అన్నయ్యకు జరిగిన సంగతంతా చెప్పి, నాన్నగారు కోరినట్లుగా, చేయమని చెప్పాను. నాన్నగారు, అమ్మ మీద మాకు అచంచల భక్తి విశ్వాసం. మా అన్నయ్య గుంటూరువాణి పత్రికలో ఆ సంచికలో చిన్న సవరణ వ్రాసారు. కథ కంచికి. మనం ఇంటికి.

ఈ సంఘటన తరువాత నేను, మా అన్నయ్య ఇద్దరం నాన్నగారికి, ఎంత ప్రగాఢమయిన గురుభక్తి ఉన్నదో, వారి గురువుగారు మీద ఒక చిన్న విమర్శ కూడా వినటానికి గాని, చదవటానికి గాని ఆయన సుతారంగా ఒప్పుకోరని తెలుసుకొన్నాము. నాన్నగారి ఈ ప్రగాఢ గురుభక్తి, ఆరోజు జిల్లెళ్ళమూడికి ఆయన అంతగా కోపంతో మాట్లాడటానికి కారణమని, ఆయనకు మా యందేకాదు, అమ్మదగ్గర, భక్తులందరి మీద ఎనలేని ప్రేమానురాగాలు, ఆదరాభి మానములు ఉన్నాయని, ఆయన, దగ్గర వాళ్ళందరికీ ఎన్నో విధాలుగా అనేక సందర్భాలలో ప్రచారము, అర్భాటాలు లేకుండా ఎంతో సహాయము చేసేవాళ్ళని తెలుసుకొన్నాం. తరువాత కూడా నాన్నగారికి. జిల్లెళ్ళమూడిలోనే కాకుండా, హైదరాబాదులో కలిసి నపుడల్లా ఎంతో ఆప్యాయంగా పలకరించేవారు. మా క్షేమ సమాచారాలు కనుక్కొనేవారు. నాన్నగారితో అనుభూతులు అనిర్వచనీయము. మరపురాని మధురానుభూతులు. చిరస్మణీయములు. ఆయన ఒక అమృతోక్తి. ✤✤✤





# నాగేశ్వరాలయం



శ్రీ పర్సా హరగోపాల్, యు.యస్.ఎ.

ఇది జరిగింది 2001వ సంవత్సరం ఉత్తరాయణంలో. తన సర్వస్వం అంఆ యే యని తలచి, చివరి క్షణాల్లో 'అంఆ' చేతితో గంగాజలం తీసుకొని, 'అంఆ' లో ఐక్యం అయినవారు మా కన్నతండ్రి, అదృష్టజీవి. మా నాన్నగారు నాకు ఇచ్చిన వారసత్వం "అంఆ" పాదాలు. తిరుపతి వెళ్లినా భద్రాచలం వెళ్లినా, వైష్ణవీదేవి దర్శనం చేసినా నేను చేసేది మాత్రం ఒకటే. "జయహోమాతా" అన్ని రూపాలు "అంఆ" యే. అన్నినామాలు 'అమ్మే' అని పూర్తిగా విశ్వసిస్తూ, అమ్మపైనే భారం వుంచి 30 సం॥లు పైగా అమెరికాలో వున్నాను. అటువంటి అంఆ, నా ఉపనయన సమయంలో మంత్రోపదేశం చేసినా 'అంఆ' సర్వకాల సర్వావస్థల యందు నన్ను కంటికి రెప్పలా కాపాడుతున్న 'అంఆ', నన్ను అడిగిన (ఆజ్ఞాపించిన) చిన్నమాట ఈ సంఘటన. సాధారణంగా అంఆ చెప్పే ఏ సందేశమైనా (ఉదయం) బ్రాహ్మీముహూర్తంలో తెలియ పరుస్తుంది.

నా ఆర్తికి సమాధానం, నా బాధకు ఉపశమనం సాధారణంగా 'అంఆ' తెలిపే సమయం బ్రాహ్మీ ముహూర్త కాలం. ఆ రోజు గురువారం. ఇంకా నేను నిద్రలేవలేదు. ఎవరో తట్టిలేపినట్లనిపించింది. అది నిద్ర మెలకువ మధ్య వుండే సంధి. ఏమి జరుగుతున్నదో తెలుస్తూనే వుంది. కండ్ల ముందు ఏవో కనిపిస్తున్నాయి. సంభాషణలు వినిపిస్తున్నాయి. సమాధానం చెప్తున్నాను. నాకు తెలుస్తూనే వుంది. అయినా మగతగా వుంది.

తట్టిలేపినవారు ఎవరో కాదు. నా 'అంఆ' నన్ను లేపి ఈవిధంగా అన్నది.

"నాన్నా ! నాన్నగారికి గుడికట్టాలి" 'అంఆ' ! నా వల్ల అయ్యే పనా అది? అని అజ్ఞానంతో తిరుగు ప్రశ్నవేశాను. అదేదో నేను చేస్తున్నానని అనుకొని.

'అంఆ' కొన్ని క్షణాలు అలాగే కనపడుతూ వుంది. ఇంతలో తెలివి వచ్చేసింది. ఇది జరిగింది 2001 సంవత్సరంలో.

అమ్మది 'సరే'' మంత్రం. నా అశక్తత విన్నవించుకోగా "సరే" అందనుకున్నాను. అయినా ఆగలేకపోయాను. ఈ విషయం ఎవరైనా ఆత్మీయులైన పెద్దలతో మాట్లాడాలను కున్నాను. ఆ వారం చివరలో హైద్రాబాదులోని మా ఆత్మీయులు అమ్మ భక్తులతో మాట్లాడాను.

"అన్నయ్యా ! నాన్నగారి పేర గుడికట్టాలనివుంది అంటూ అది నా కోరికగా మాత్రమే తెలిపాను. "అంఆ" సందేశంగా చెప్పలేదు.

"హరగోపాల్! ఉన్న ఆలయాలను ఉద్ధరించే కార్యక్రమంలో వున్నాము. కొత్తవి ప్రారంభించడానికి ఆలోచనలు ఏమీ లేవు. నువ్వు కావాలనుకుంటే మగపిల్లల హాస్టల్‌కు సహాయం చేయవచ్చు లేదా కాలేజీ స్కాలర్‌షిప్పులు ఇవ్వవచ్చు అన్నారు. నేను వారి సలహాను అంగీకరించలేను. అమ్మ ఆజ్ఞను కాదనలేను. పూర్తి బాధ్యత వహించి ముందుకు వెళ్లలేను.

'అంఆ' ఆజ్ఞను అమలుపరచలేకపోయిన దురదృష్ట వంతుడినని బాధపడ్తున్నాను. 'అంఆ' కరుణామయి. ఆ జగజ్జనని కరుణ అపారం. అందుకే నన్ను క్షమించింది. ఇంతలో కొన్ని సంవత్సరాలు గడిచాయి.

'అంఆ' ది తోలు నోరు కాదు కదా ! తాలు మాట రావడానికి. ఆలయ నిర్మాణం చేయలేను. 'అంఆ' ఆజ్ఞను ఉల్లంఘించలేను. నా అశక్తతను అర్థం చేసుకున్న మాతృమూర్తి నాకొక అవకాశం ఇచ్చింది. మరియొక



ఆలయ నిర్మాణంలో నాచేత 'ఉడుత' సహాయం చేయించింది. పసివాని చేత కొండలు మోయించలేదు. (మోయించదు కూడాను) తల్లి. చిన్నరాయిని మోయించినా కోరిక తీర్చి నాకు సంతోషం కలిగించింది. నా సంతోషం చూసి 'అంఆ' తాను సంతోషించింది.

ఆ సంతోషంలో కొన్ని సంవత్సరాలు గడిచాయి. 2005వ సంవత్సరంలో Full bright స్కాలర్‌షిప్పుతో ఇండియా వచ్చి, హైద్రాబాదు వచ్చాను. అక్కడి నుంచి మా ప్రశాంత అన్నయ్య వదిన కూతురు యోష్టితతో కలసి జిల్లెళ్ళమూడి వెళ్లాను. 'అంఆ' దయ, ఆరోజే నవనాగేశ్వ రాలయానికి అభిషేకం చేయించారు. మళ్లీ అనుకున్నాను "అమ్మా క్షంతవ్యుణ్ణి" అని.

ఇంకా రెండు తెలుసుకోవాల్సిన విషయాలు వున్నాయి. 'అంఆ' నా ఉపనయన సమయంలో ఉపదేశం చేసిన గురువు. గురువుగా నన్ను అడిగింది. అందుకే గురువారం చెప్పింది. శుక్రవారం చెప్పలేదు. శుక్రవారం అయితే "అంఆ" జగజ్జనని అయిపోతుంది కాబట్టి.

2) తనకు ప్రాణస్వరూపమైన నాన్నగారి ఆలయం కోసం ఖర్చుపెట్టే అవకాశం ఇద్దామనుకున్నది. (వరం అనుగ్రహించేదేమో)

'అంఆ' గొప్ప యజమాని. తనకు, ఎవరి దగ్గర నుంచి, ఎంతకావాలో, ఖచ్చితంగా అంతే చెప్పి తీసుకుంటుంది. ఏ విధంగా ఖర్చుపెట్టాలో ఆ విధంగా ఖర్చుపెట్టిస్తుంది.

2010-2013 మధ్యకాలంలో 'అంఆ' నానుంచి 4 న్నర లక్షలు ఇంకొక పథకానికి ఖర్చు పెట్టించింది. అమ్మ అనుగ్రహం. ఇచ్చిపుచ్చుకోవడం 'అంఆ'కు ఆట, ఆనందం కాబోలు. ఈ 4 న్నర లక్షల ప్రత్యేకత ఏమిటి? అన్నీవుండి, అన్నీ తెలిసిన 'అంఆ' పట్టువదలని విక్రమార్కుడిలా నా దగ్గర నుంచి ఎందుకు వసూలుచేసింది. ఈ మాత్రం ధనం ఇవ్వగల్గినవాళ్లు ఎందరో వున్నారు. అప్పటి కింకా పిల్లల కాలేజి చదువులు పూర్తికాలేదు.

"శివఃశక్త్యాయుక్తో" యన్నట్లుగా అమ్మ మెడలో తాళి కట్టిన నాన్నగారికి అమ్మదే లోకం. తనపిల్లలను ఆశీర్వదించే అర్హత 'తనకు' ఆ మాంగళ్యాన్ని అభిషేకించడం ద్వారానే లభించిందని చెప్పినది అంఆ. ఆ విధంగానే తనకేమీ తెలియదని చెప్తూనే నాన్నగారి కోరికపై ముందుగా ఆయనను ఆలయ ప్రవేశం చేయించి తరువాత తాను ప్రవేశించింది. ఈశ్వరుని కోరిక తీర్చిన కామాక్షి. తన ఈశ్వరుడి కోసం కట్టించుకున్న ఆలయం. అది ముందు కామేశ్వరాలయం తరువాతే నవనాగేశ్వరాలయం. అమ్మబిడ్డగా, నేను అమ్మ కోరిక తీర్చడానికి ఆ నాగేశ్వరాలయానికి ఋణపడి వున్నాననుకుంటాను. అయినా తల్లికి బిడ్డకు గురువుకు శిష్యునికి ఇచ్చి పుచ్చుకోవడాలే కాని ఋణాలు వుండవనుకుంటాను.

'అంఆ' కన్నతల్లి క్షమించదా? బుజ్జగించి ఎప్పటికీ తాను అనుకున్నది మన చేత చేయిస్తుంది అని ధైర్యం. సంతోషం.



విదేశీయుడు నీలెండ్‌తో నాన్నగారు





# ఒకే శక్తి రెండు రూపాలు



శ్రీ కొండముది సుబ్బారావు, విజయవాడ

అమ్మ ఆదిపరాశక్తి - నాన్నగారు పరమశివుడు

అమ్మ సకల వేదసారం - నాన్నగారు సకల కళావల్లభుడు.

అమ్మ అవ్యాజానురాగమూర్తి - నాన్నగారు ఆపేక్షకు నిలువెత్తురూపం.

అమ్మ స్థితప్రజ్ఞ - నాన్నగారు నిత్యసంతోషి.

అమ్మ నాన్నగారు మనకు ఆదిదంపతులు. అమ్మ నాన్నగారి గురించి ఎప్పుడు ప్రస్తావించినా 'తనదైవం' అనే చెప్పింది. అట్లాగే ఆచరించింది. అట్లాగే ఆరాధించింది. మరొక సందర్భంలో అమ్మ నాన్నగారిని తన "గొడుగు" గా అభివర్ణించింది. ఇంకో సందర్భంలో "వారి కాలిగోటిలోని మట్టియే తనకు సర్వసంపదలూ సకల సౌభాగ్యాలూ" అని మురిసిపోయి అందరిని విస్మితులను చేసింది.

"నాన్నగారి సౌకర్యము, నాన్నగారి ఆనందమే ధ్యేయంగా, లక్ష్యంగా అమ్మ భావించినట్లు అమ్మ జీవిత చరిత్ర పరిశీలిస్తే మనకు అవగతమవుతుంది" అని అంటారు అమ్మ చరిత్ర "జీవిత మహోదధిలో తరంగాలు" కర్త శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య.

ఒకనాడు నాన్నగారు ప్రసంగవశాన "మీ అమ్మగారికి భావబలం ఎక్కువ" అన్నారు. అమ్మ వెంటనే "అది భావబలం కాదు 'బావబలం'' అని చమత్కరించింది.

మరి నాన్నగారు ? ఆయన 'అమ్మ'ను ఎలా దర్శించారు? అమ్మతో అనుభవాలు ఏమిటి? ఈ కోణంలో విషయ సేకరణ జరిగితే కడురమ్యంగా ఉంటుంది. అదీ ఈ శతజయంతి సంవత్సరము అయితే మరింత అర్థవంతం.

మామూలుగా అందరికీ జిల్లెళ్ళమూడి ప్రవేశం అమ్మకోసం. అయితే మా "కొండముది" కుటుంబానిదో ప్రత్యేకం. మా జిల్లెళ్ళమూడి ప్రవేశం నాన్నగారు శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారి ద్వారా. దాదాపు '8' దశాబ్దాల క్రితం 'నాన్నగారి'తో మా తాతగారు శ్రీ కొండముది వెంకట సుబ్బారావుగారికి సోదర బంధుత్వముతో పాటు విడదీయరాని స్నేహం ఉండేది. ఆ స్నేహం, బాంధవ్యంతోనే అమ్మ-నాన్నగార్ల కళ్యాణంలో మా తాతగారు ప్రముఖపాత్ర నిర్వహించారు. ఆ విధి నిర్వహణలో నాన్నగారికి మా తాతగారు చేదోడు వాదోడుగా ఉండేవారు. అందుకోసం తరచుగా జిల్లెళ్ళమూడి వచ్చేవారు.

రామకృష్ణ అన్నయ్యకు నాన్నగారికి మధ్య ఉన్న 'అనుబంధం' ఈ లౌకిక బంధాలతో పోల్చలేనిది. "ఒరేయ్ రామకృష్ణుడు" అని నాన్నగారు పిల్చేపిలుపు రామకృష్ణ అన్నయ్యకు ఎప్పుడూ కర్తవ్యం ఉపదేశించేది. అలాంటి సంఘటనే ఇది. అమ్మ మాట - నాన్నగారి నోట.

ఒకరోజు రామకృష్ణ అన్నయ్య అమ్మ గది ముందు ఎంతో ఆదుర్దాగా తిరుగుతున్నాడు. అప్పుడే అక్కడకు వచ్చిన 'నాన్నగారు' అన్నయ్య అవస్థ చూసి "ఏమిటి రామకృష్ణుడు అలా ఉన్నావు?" అని ఆరా తీశారు. "ఏమి లేదు బాబాయి. సంస్థ అభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని కొంతమంది పెద్దవారిని జిల్లెళ్ళమూడి ఆహ్వానించి ఉన్నాను. ఎన్నో ప్రయత్నాల తర్వాత వారు ఇవాళ వచ్చారు. కాని దురదృష్టం ఇవాళ 'అమ్మ'కు బాగా అనారోగ్యంగా ఉన్నది. 'దర్శనం' ఇప్పించటానికి వీలులేని పరిస్థితి. అందుకే ఆందోళనగా ఉన్నాను" అని అన్నయ్య



జవాబిచ్చాడు.

అన్నయ్య ఆదుర్దా చూసి నాన్నగారు గుంభనంగా నవ్వి "మీ అమ్మగారి సంగతి నన్ను అడగరా చెబుతాను. వాళ్లు వచ్చిన విషయం మీ అమ్మగారికి చెప్పు. అవసరం అయితే ఎంత బాధనయినా చొక్కాను చిలకకొయ్యకు తగిలించినట్లు తగిలించి, బాధ తీసివేసుకొనగలదు. ఇది నేను ఎన్నో సార్లు గమనించాను" అని సలహా ఇచ్చారు. నాన్నగారి సలహా విని, తూచా తప్పకుండా ఆచరించాడు అన్నయ్య. అమ్మ వెంటనే లేచి స్నానం చేసి తయారై 'దర్శనం'కు రెడీ అయింది. ఇప్పుడు అన్నయ్యను మరో ధర్మసందేహం పీడించింది. అమ్మకు ఆరోగ్యం సరిగ్గాలేదని ఆ పెద్దమనుషులకు చెప్పి ఉన్నాను. కాని ఇప్పుడు 'అమ్మ'లో ఆ ఛాయలు ఏమి లేకుండా ఉన్నది. నా మాట అబద్ధం అని ఆ పెద్ద మనుషులు ఎక్కడ అపార్థం చేసికొంటారో అని.

అమ్మ అలౌకిక శక్తులను అనేకం నాన్నగారు స్వయంగా దర్శించారట. అమ్మ పొందిన యోగ పరాకాష్ఠ స్థితులయిన భృకుటీభేదనం, కపాల భేదనం నాన్నగారు చూశారట. ఒకనాడు అమ్మ నాన్నగారికి అన్నం వడ్డిస్తుండగా భ్రుకుటీభేదనం జరిగి రక్తం స్రవించిందట. ఆ రక్తం నాన్నగారి విస్తట్లో పడకుండా అమ్మ చేయి పట్టిందట. చేతిలో రక్తం భస్మంగా మారిందట. ఆ భస్మాన్ని అమ్మ నాన్నగారికి పెట్టిందట. నాన్నగారు దాన్ని తిన్నారట. ఈ విశేషం నాన్నగారు అనేక పర్యాయాలు అతి సంభ్రమాశ్చర్యాలతో చెప్పేవారు.

అమ్మ, నాన్నగార్లు ఒకే శక్తికి రెండు రూపాలు. అనంతమైన ఆశక్తికి అలౌకిక రూపం 'అమ్మ' అయితే, లౌకిక రూపం 'నాన్నగారు'. అమ్మ యోగానంద, శివశక్తి ఏకాత్మకమైన యోగమే అమ్మకు ఆనందం.

అమ్మ నాన్నగారి యందు కూడా వాత్సల్యామృతాన్ని అభివర్షించిన సర్వజనయిత్రి. అందుకే "భర్త చేత కూడా అమ్మ అని పిలిపించుకోవటమే పాతివ్రత్యానికి పరాకాష్ఠ" అన్నది అమ్మ. సాధించి చూపించింది కూడా.

ఒక కళ్యాణ దినోత్సవం నాడు 'దేవాలయం' పై భాగాన నాన్నగారు అమ్మ చరణాబ్జాలపై సభక్తికంగా పువ్వులుంచిన అపూర్వమధుర సన్నివేశం ఎంతమందినో పులకాంకితులను చేసింది. అమ్మ శివప్రియయే కాదు నాన్నగారు శివారాధ్య కూడా.

✤✤✤



అమ్మ రెండవ కుమారుడు రవి అన్నయ్య వివాహం సమయంలో స్నాతక దృశ్యం





# నాన్నగారి జన్మదినోత్సవం

మన్నవ జయ, రమ



అమ్మ సంప్రదాయ కుటుంబంలో అన్ని పండుగలు, సంప్రదాయ సిద్ధంగా జరిగినట్లు మనకు మహోదధిలో తరంగాలు చెబుతుంది. మనం అమ్మ సన్నిధిలో అనేక పండుగలు సంక్రాంతి, దీపావళి, దసరా లాంటివి అనేక సంవత్సరములు జరుపుకున్నాము. ఇవిగాక యితర మత ప్రధానమైన క్రిస్‌మస్, ఈద్ పండుగలు కూడ జరుపుకున్నాం. హిందూ సంప్రదాయం అంత ఎక్కువ ప్రచారంలో లేని అట్లతద్దె, ఉండ్రాళ్ళతద్దె, అనంత పద్మనాభ వ్రతం మొదలైన పండుగలు చాల శాస్త్రోక్తంగా జరిగాయి.

ఇది యిలా వుండగా అమ్మ గర్భ సంజాతయైన హైమ, అమ్మ భర్త యైన శ్రీనాన్నగారు శ్రీ నాగేశ్వరరావు గారు అమ్మ సమక్షములోనే అమ్మలో లీనమైనందున వీరి జన్మదినములు ప్రత్యేక రీతిలో జరుపబడుతున్నాయి. శ్రీ హైమవతి జన్మదినం ఆశ్వీజ శుద్ధ ఏకాదశి నుండి కార్తీక బహుళ షష్టి వరకు మండల దీక్షగా, కార్తీక పౌర్ణమి నుండి బహుళ షష్టి వరకు సప్తాహంగా జరగటం ఆనవాయితి.

నాన్నగారి ఆరాధనోత్సవం ఫిబ్రవరి 17న ధాన్య పూజోత్సవంగా జరుపుకుంటున్నాము. ఈ వుత్సవం వలన మనసంస్థకు సంవత్సరానికి కావలసిన ధాన్యం సమకూరు తున్నది.

మహాత్ముల జీవితాలలో జయంతి, వర్ధంతులు సమాన ప్రాధాన్యత కలిగి వుండి చిరస్మరణీయములు అవుతాయి. ఇదే లక్ష్యంతో అమ్మ నాన్నగారు గుడిలో ప్రవేశించాక నాన్నగారి జన్మదినం గురించి ప్రస్తావించి, వారికి యిష్టమైన పదార్థాలు జాబితా తెలియచేసి ఆ శుభదినాన్ని మా కుటుంబసభ్యులను చేసుకోమని ఆశీర్వదించింది. నాన్నగారి జన్మదినం 1984 సంవత్సరం అమ్మ సన్నిధిలో ఆ పండుగ జరుపుకున్నాము. ఆ తర్వాత నాన్నగారి పుట్టినరోజున అమ్మ మూలవిరాట్‌కి క్షీరాభిషేకం చేసుకున్నాం.

ఒక సంవత్సరం 11 రుద్రులకు పంచె కండువాలు సమర్పించుకున్నాము. కొన్ని సంవత్సరములు, అన్నప్రసాదం చేయించాము. క్రిందటి సంవత్సరం మహారుద్రాభిషేకం చేయించాము.

ప్రతి సంవత్సరం అమ్మ నాన్నగార్లకు నూతన వస్త్రములు సమర్పించుకుంటున్నాము. ఏదీ వీలుకాని పరిస్థితులలో మా స్వగృహంలోనే యథాశక్తి నాన్నగారిని, అమ్మను అర్చించుకుంటున్నాము. మేము పెద్దగా కలవారం కానందువలన మా పట్ల అపూర్వ కటాక్షంతో ఈ అవకాశం అమ్మ కలుగచేసిందని సంతోషిస్తున్నాము. ఇటీవల అమ్మ ఆరాధ్యదేవుడైన నాన్నగారి జన్మదినోత్సవం అఖండంగా వైభవంగా జరగాలని, అమ్మ, నాన్నగారి బిడ్డలు అందరూ ఈ శతజయంతి వుత్సవాన్ని, అత్యంత వుత్సాహంతో జరపాలని అనుకున్నారు.

మా ప్రాణాలున్నంతవరకు ఈ సదవకాశాన్ని మా కుటుంబసభ్యులు వినియోగించుకొని అమ్మ నాన్నగార్ల దీవెనలు పొందటమే మా అభిలాష.





# నాన్నగారు - నేను



శ్రీ బులుసు లక్ష్మీ ప్రసన్న సత్యనారాయణ శాస్త్రి

1973 అమ్మ స్వర్ణోత్సవాలలో మొదటిసారి వచ్చిన నేను తరువాత చాలాసార్లు జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించుకోవడం జరిగింది. నాన్నగారు, సుబ్బారావు, చి.రవి, శ్రీరామకృష్ణ, శ్రీ కె.బి.జి., శ్రీ పన్నాలవారు, శ్రీ విఠాలవారు, శ్రీ యార్లగడ్డ రాఘవయ్యగారు, శ్రీమతి వసుంధరక్కయ్య, శ్రీ రాధన్నయ్య, శ్రీ కొమరవోలు గోపాలరావు గార్లతో పరిచయాలు పెరిగాయి.

అలా ఒకసారి జిల్లెళ్ళమూడి వచ్చిన సందర్భంలో నాన్నగారిని ప్రత్యేకంగా కలుసుకోవడం జరిగింది.

నాన్నగారి ఇంట్లో వారిని కలుసుకుని, నమస్కరించు కొని వెళ్ళాను. నన్ను చూస్తేనే వారు ఆప్యాయతతో పిలిచి, తమ ప్రక్క కుర్చీలో కూర్చోమన్నారు.

నా గోత్రనామాలు చెప్పుకుని వారికి నమస్కరించాను.

"మీరేం చేస్తోంటారు" అని నాన్నగారు అడిగారు.

"తూర్పుగోదావరిజిల్లా కలెక్టరు కార్యాలయంలో ప్రణాళికా విభాగం చూసే గుమాస్తాగా పనిచేస్తున్నానండి అని చెప్పాను.

"అయితే రెవిన్యూ డిపార్టుమెంట్ అన్నమాట" అన్నారు నాన్నగారు.

"అవునండి" అన్నాను.

"నేనూ రెవిన్యూడిపార్టుమెంట్‌లో పనిచేశాను, జిల్లెళ్ళమూడి గ్రామకరణంగా. ఆ ఉద్యోగం మూలంగానే మేము కుటుంబంతో సహా జిల్లెళ్ళమూడి గ్రామం రావటం జరిగింది. మీ అమ్మగారు జిల్లెళ్ళమూడి అమ్మ అయింది" అన్నారు నాన్నగారు నవ్వుతూ.

"అవునండి" అన్నాను సంతోషంగా.

"మీ నాన్నగారు ఏం చేస్తోంటారు" అని అడిగారు.

"మా నాన్నగారూ రెవిన్యూ డిపార్టుమెంట్‌లోనే డిప్యూటీ తహశీల్దారు. మేజిస్ట్రేట్‌గా పనిచేసి రిటైర్ అయ్యారండి.

"అయితే మనవి రెవిన్యూ డిపార్టుమెంట్ కుటుంబాలు" అన్నారు నాన్నగారు నవ్వుతూ.

అనంతరం మా సంభాషణ అనేక విషయాలకు మళ్ళింది. అమ్మ తనను అందరికీ అమ్మను అనడం, అందరినీ తన బిడ్డలుగా చూడడం, ఈ మహత్తర ఆదర్శం గురించి మా సంభాషణ సాగింది.

ఆ సంభాషణ సందర్భంలో నాన్నగారు "ఇది జిల్లెళ్ళమూడి కల్ట్" అన్నారు. నేను వెంటనే "నాన్నగారూ ! అమ్మది ఒక కల్ట్ కాదండి అన్నాను. నేను 1973లో మొదటిసారిగా జిల్లెళ్ళమూడి వచ్చినపుడు అమ్మ, హైమను హైమాలయంలో ప్రతిష్ఠించి, అక్కడ భద్రాద్రి రామశాస్త్రిగారి చేత ప్రతిరోజూ ఏకాదశ రుద్రాభిషేకం చేయిస్తోందని, ఆ ఏర్పాటే ఇప్పటికీ కొనసాగుతోందని తెలుసుకున్న తరువాత అమ్మ సనాతన ధర్మానికి నిలువెత్తు నిదర్శనమనిపించింది. మానవుల ముఖంలో ఉదారంగు కనిపిస్తే అది వారి ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని తెలియజేస్తోందని విన్నాను. స్వర్ణోత్సవాల సందర్భంగా అమ్మను మొదటిసారిగా దర్శించినపుడు అమ్మ మోము అంతా ఉదారంగుతో వెలిగిపోతున్నట్లు కనిపించింది. ఆనాటి నుండి అమ్మకు గులామునయ్యాను" అని కొంచెం ఆవేశంగానే ప్రతిస్పందించాను.

చాలాసేపటివరకూ నాన్నగారు మాట్లాడలేదు. చివరకు వారు నెమ్మదిగా "మీరు అలా అంటారా" అన్నారు.

"అవునండి" అన్నాను.

అన్నపూర్ణాలయంలో భోజనాలకు గంట కొట్టారు.

"భోజనానికి వెళ్ళండి" అన్నారు నాన్నగారు.

వారి దగ్గర సెలవు తీసుకుని కొమరవోలు గోపాలరావుగారి ఇంటికి వెళ్ళాను. నేను జిల్లెళ్ళమూడి వచ్చినప్పుడల్లా గోపాలరావుగారి ఇంట్లోనే ఉండేవాణ్ణి. ఇద్దరం కలసి, భోజనం చేసేవాళ్ళం.

తరువాత నాన్నగారు నేను జిల్లెళ్ళమూడి ఎప్పుడు వచ్చినా నన్ను చాలా ఆప్యాయంగా పలకరించేవారు. ఆ మహానుభావుడికి నా శతకోటి నమస్కారాలు.





# నమస్సు మనస్సు



- శ్రీ ఏ.అంజిబాబు

ఏ మహాత్ముని త్యాగ ప్రేమానురాగాల
అమ్మ జగన్మాతయయ్యె పృధివి
ఏ సోమశేఖరు వాసాన కాల్పెట్టి
విశ్వమంతయు నిండి వెలుగులీనె
ఏ అర్కపురి నేలు ఈశ్వరు కృపచే
లోకేశ్వరిగతేలె శ్రీ కిశోరి
ఏ పూజ్యుని లసన్మహేచ్ఛాక్రియాశక్తి
సృష్టిని ఒడిలోన చేర్చగల్గె
అతడు సామాన్యుడే జగద్ధితము కొరకు
భార్య నొగ్గిన జగదేకపావనుండు
మహిని నాగేశ్వరాఖ్యచే మసలినట్టి
సత్యసుందర శివశక్తి సాధుమూర్తి

జగదీశ్వరి యటంచు సతిని లోకమ్మెంచ
సామాన్యువోలె తా సాగుచుండు
అధికారులెందరో అమ్మ సేవకు రాగ
గ్రామకరణముగా క్రాలుచుండు
అమ్మ నాన్నలకల్పి అర్చింపనెంచగా
మోమోటపడుచు ఆమోదమిడును
సహపంక్తి భోజనాల్ సాగింప నెంచగా
ఆదర్శమూర్తిగా అమలుపరచు
ఆయన నిగర్వి భేషజా లస లెఱుగఁడు
ధర్మ మర్మ కర్మజ్ఞతా శర్మదీప్తి
స్వచ్ఛసహజానురాగ ప్రసాదమూర్తి
మంజులగుణుండు - నాదు నమనస్సులివియె

కనకమ్మతల్లి నిన్ కన్నాకుగా పెంచి
కంటిరెప్పైనట్టి కన్నతల్లి
వెంకట సుబ్బారావే పితృమూర్తియై
చదువు సంధ్యలు నేర్పి సాకినాడు
బ్రహ్మాండ వంశంబు రమ్యమై రాజిల్లి
బ్రహ్మాండ మేలెడి ప్రభుతగూర్చె
భార్గవచ్యవనాది వంశర్షులే నీకు
పరమేశ్వరిని గూర్చి పరగినారు
లోకమెల్లను బిడ్డలై నీకు మ్రొక్క
సోమశేఖర మూర్తివై శోభఁజెలఁగి
నిత్యసమభిషేకార్చనా నియతినుంటి
సతియుత ! అనసూయేశ్వరస్వామి వొచు

నీ సతీనామమా ! నీ నామముంగల్పి
సంకీర్తనల్ సల్పి సాగదురిక
నీ సుతనామమా ! నీ నామముం గూడ
సప్తాహముల్ చేసి సాగుదురిక
విశ్వజనకుడవౌ విశ్వహితైషివౌ
నీ విభూతిని గాంచి నెగడుదురిక
నీ ప్రేమతత్వము నీ సాధువృత్తము
నిత్య సంసేవ్యమై నిలుచునింక
శుభము ప్రభవింప చేయు నీ చూపులోన
అమలినంబైన నీ మందహాసమందు
తరతరాలును తృప్తితో తనియగలరు
విశ్వజననికి పతిదేవ ! వినుతి నీకు

చిలికింపవయ్య ! నీ చెలువైన నగవులే
తాతవై జగతికి త్రాతవగుచు
మురిపింపవయ్య ! నీ పరమ పావన శృతిన్
పలుకులో ఆనంద మొలుకునట్లు



తనియింపవయ్య ! నీ దాతృతా శక్తిచే
దీనుల కాపాడు దీప్తి తోడ
లాలింపవయ్య ! నీ పాలి దీనుల నెల్ల
అన్న వస్త్రము లిచ్చి ఆదుకొనుచు
అన్నపూర్ణగ నీ సతి అండనుండ
దేవతయె యయి నీబిడ్డ దీవి నుండ
భూసురుడవైతి పౌర ! నీ భూరి కృపయె
అర్కపురినేలు – దివ్యసంపర్కశక్తి !

జయ జయ అనసూయేశ్వర !
జయ జయ నాగేశ్వరాఖ్య ! సజ్జన వినుతా !
జయ జయ మానవ హిత రత !
జయ జయ సురుచిర చరిత్ర ! జయ భూమీశా !

**జయ అనసూయేశ్వర**

జయ జయ శ్రీనాగేశ్వర ! జయజయ అనసూయేశ్వర!
జయ శతవర్షోత్సవ శుభావరణా! శ్రీచరణా! ॥జయ॥

జయ జయ అర్కపురీ విభవోజ్జ్వలరాయా !
జయ అనసూయా హృదయాంతర నిలయా !
శతసహస్ర సంతాన విరాజిత పూజిత పదయుగళా॥జయ॥

జయ ప్రశాంత మధురాంతఃకరణా దరహాసితాంచిత ముఖతరుణా
మాతృశ్రీ సమభిషిక్త నిత్యార్చిత శుభచరణా! తీర్థవితరణా
హైమవతీ కామధేను కరుణాన్విత సుతాభరణ! కరుణకిరణ
॥జయ॥

జయ క్రీడావిస్ఫూర్జిత శీలా !
జయనటనా ప్రతిభార్జితసుకళా!
జయ సమాజ పరివర్జిత జనతా
విద్యావిజ్ఞానాంచితకాంక్షిత
అన్నవితరణాత్యున్నతకీర్తి !
నిరాడంబరోద్దామస్ఫూర్తీ ॥జయ॥

**జయగీతికలు – ఉత్తర తార**

జయ జయ జయ నాగేశ్వర – లోకవినుత పరమపూత
మాతృశ్రీ పతిదేవా మమతామృత మృదుహృదయా
ప్రశాంతమధుర హృదయోజ్జ్వల వినయాన్విత గుణశీలా
॥జయ॥

దరహాసాన్విత భాసిత అర్కపురీ నిజవాసిత
హైమవతీదేవీపిత ఆశ్రితజనపారిజాత ॥జయ॥
క్రీడా వ్రీడా హిత రత – నటనా ఘటనా చరితా
సమదర్శన భావాన్విత !– విధి వంచిత కృపాభరిత॥జయ॥
అంతరంగ జనతరంగ – అర్థాంగీ హృదయభృంగ
ప్రణవనిభృత ప్రణుతచరిత– ముక్తకంఠ విజయగీత
॥జయ॥

**శతజయంతి శుభదినము**

మాతృశ్రీ (ముఖ) శతపద్మము వికసించిన శుభదినము
నాన్నగారి శతజయంతి అందరింటి పర్వదినము ॥
పరమపురుషుడై యుండి పరమేశ్వరి పురుషుడైన
పరమాత్మయె పురుషుడైన నాగేశ్వరు శతజయంతి ॥
తన భార్యను లోకానికి తల్లిగ త్యాగము చేసి
ఆగ్రహమెఱుగని వ్యక్తి నిగ్రహమ్ము గల శక్తి
లోకేశ్వరు శతజయంతి ॥
ఒక ఉన్నత ఆదర్శము ఒక ఉదారమౌ మనస్సు
తన యిల్లే ఒక సత్రము జగతి కెల్ల స్తుతిపాత్రుని
జగదీశ్వరు శతజయంతి ॥
సీతారాముల కన్న రాధాకృష్ణుల కన్న
అత్రీ అనసూయకన్న ఆదర్శపు దాంపత్యపు
పరాత్పరుని శతజయంతి ॥
ఋషుల కన్న పరమఋషిగ బ్రహ్మగన్న పరబ్రహ్మ
అదెమ్మతో కలసి ఉన్న ఆదిదేవు శతజయంతి ॥





# గిరిబాల గీతాలు



శ్రీమతి గిరిబాల

## దేవతకే దేవుడు

దేవతకె దేవుడై తేజరిల్లిన యట్టి
దేవాదిదేవా ! మహానుభావ !
వందనం వందనం హరిచందనం ||దేవతకె||

దివ్యత్వమును దాచి మానవత్వము దాల్చి
మా అమ్మనచ్చగా మా అమ్మ మెచ్చగా
అమ్మకరమును బట్టి బ్రహ్మవౌ జగజెట్టి ||దేవతకె||

అర్కపురికే పాలవెల్లివై నిలిచి
అందరికి దిక్కైన అమ్మకే దక్కిన
కామేశ్వరస్వామి నాగేశ్వరా ||దేవతకె||

వెన్న మనసున్న ఓ జగదేక సంపన్న !
బంగారు బొమ్మ మా హైమమమ్మనే కన్న
మహిమాన్వితంబై సృష్టికే నాన్నా ||దేవతకె||

అందరింటికి మూలపురుషుడై నిలచిన
అన్నపూర్ణాలయమ్మాదిగా వలచిన
"అనసూయ" నామాలయంబున వెలసిన ||దేవతకె||

## మా జోతులందుకోండి

మాతలకే మాతయైన మాతృశ్రీ పతిదేవా ! రండి రండి
శతసంవత్సర వైభవ నేతగా విజేతగా
మా జోతలందుకోండీ ||మాతలకే||

పరమేశ్వరశక్తితోడ పరమపురుషుడై వెలసి
పరంజ్యోతివై వెల్గిన పరాత్పరా ! నాగేశ్వర !
బ్రహ్మాండమె నీయిల్లై పరమేశ్వరి ఇల్లాలై
పరబ్రహ్మవై నిల్చిన ||మాతలకే||

సర్వమంగళ గళమున మాంగళ్యమ్మును కట్టి
అర్కపురిని కాలుపెట్టి విశ్వమ్మును ఒడినిగట్టి
విశ్వజనని విశ్వేశ్వరి నీలో సగమై మెలగగ ||మాతలకే||

శిష్టులలో విశిష్టుడవు విశిష్టులలో వశిష్ఠుడవు
వశిష్టులను ఎందరినో సృష్టించెడి స్రష్ట వీవె
జగదీశ్వర ! యోగీశ్వర ! మాతృశ్రీ రాగేశ్వర ||మాతలకే||

## విశ్వకుటుంబ వీరులం

మాతృశ్రీ భారతులం మాతృభూమి భక్తులం
రవి తదుపరి అమ్మ కన్న అరుణారుణ కిరణాలం
అమ్మ పసిడి చరణాలం ||మాతృశ్రీ||

అమ్మ తీర్చిదిద్దినట్టి అఖండశక్తియుక్తులం
అనంతగుణ విధేయులం అమ్మ ప్రేమ మూర్తులం
బాలలం వీరులం అర్కపురీ సైనికులం ||మాతృశ్రీ||

అందరింటి సభ్యులం అమ్మ ముద్దు బిడ్డలం
అన్నలం తమ్ముళ్ళం అక్కలం చెల్లెళ్ళం
అరమరికలు లేకుండా హాయిగా కలిసుంటాం
||మాతృశ్రీ||

విద్యాలయమున్నది వైద్యాలయమున్నది
అందరి ఆకలి తీర్చే అన్నపూర్ణాలయమున్నది
కరుణతో కనిపెట్టే హైమాలయమున్నది ||మాతృశ్రీ||

మాదంతా ఒక్కమాట మాదంతా ఒక్కపాట
మానవతా సమైక్యతయె మా నేర్చిన బాట
మాతృశ్రీ రూపమ్మే కనిపించును ప్రతిచోట
మాతృశ్రీ నామమ్మే వినిపించును ప్రతినోట
||మాతృశ్రీ||

విశ్వమెల్ల కని పెంచిన ఒకే తల్లిపిల్లలం
విశ్వకుటుంబమ్ములోని వీరులం శూరులం
మానవతా కేతనమే మా మతమని చాటుతాం||మాతృశ్రీ||





# నాన్నగారి వాత్సల్యం

శ్రీ గోటేటి శ్రీరామారావు, ప్రముఖాంధ్ర పత్రిక సంపాదకులు, మద్రాసు



'నాన్న'గారు అందరికీ 'నా' అన్నవారు. 'అమ్మగారు' నాన్నగారిని చూసారా నాన్నా! నాన్నగారు 'అమ్మగారి'ని చూచిరండి అనేవారు. ఈ పరస్పరాన్యోనత గల దాంపత్యాన్ని వర్ణించడానికి సద్గుణభూషణుడైన పరమశివుడే రావాలి. ఆ పరమశివుని వంటి నిరాభరణ, నిరాడంబరుడే ఈ నాగేశ్వరుడు. 'బ్రహ్మాండం నాగేశ్వరుడు. ఆయన ఇంటిపేరు ఎంతటి బ్రహ్మాండమనిపిస్తుందో, ఆయనంతటి నిరాడంబరుడు. గ్రామకరణంగా, పోస్టుమాష్టరుగా, కాంగ్రెస్ అభిమానిగా, ప్రసిద్ధ సినిమా నటుడు, కాంగ్రెస్‌లో విలువగల స్థానాల్లో, మహారాష్ట్ర వంటి పెద్దరాష్ట్రాలకు గవర్నరుగా పనిచేసిన కోన ప్రభాకరరావు నాన్నగారికి పరమ ఆత్మీయుడైన మిత్రుడు. ఇలా ఎంతోమంది కాంగ్రెస్‌నందు పెద్దలైనప్పటికినీ, నాన్నగారు కాంగ్రెస్ సభ్యత్వం తీసుకోలేదు. కాంగ్రెస్ విషయం వచ్చేసరికి వీరాభిమానంతో మాట్లాడేవారు. ఎవరైనా కాంగ్రెసును చిన్నమాట అన్నప్పటికినీ సహించేవారు కాదనీ ప్రముఖ పత్రికా సంపాదకులు, పత్రికా రచయితయైన పొత్తూరి వేంకటేశ్వరరావుగారు చెప్పినట్లు 'ప్రముఖాంధ్రలో వారు వ్రాసిన వ్యాసాన్ని బట్టి గ్రహించాను. వ్యక్తిగతంగా నాన్నగారెంతో ప్రతిభావంతులైన వ్యక్తులు. సంగీతాభిమాని కాస్త విరామసమయం దొరికినప్పుడూ, సమయం చేసుకుని నాటకాల్లోని పద్యాలు శ్రావ్యంగా పాడుతున్నపుడు -నాన్నగారి మిత్రులు వాద్యాలను పట్టుకుని వచ్చి నాన్నగారి పద్యాలాపనకు సహకరించేవారు.

ఒకసారి నాన్నగారు ఆరుబయట మంచమ్మీద పడుకుని, హుషారుగా పౌరాణిక నాటకాల్లోని పద్యాలు పాడుతున్నపుడు ఇంటిలోపల్నుంచీ ఉన్న అమ్మ విని, నాన్నగారికి జ్వరం వచ్చినట్లున్నది. ఆయన టెంపరేచర్ చూచి హోమియో మందిచ్చి రా నాన్నా అని ప్రక్కనున్న వారికి చెప్పడం, నాన్నగారికి నిజంగానే జ్వరమున్నదనడం "అంతఃపురంబులో ఆమూలసౌధంబులో ఉన్నట్టువంటి అమ్మకీ విషయం ఎలా తెలిసి ఉంటుంది ! అమ్మ నాన్నగారి పట్ల అంత శ్రద్ధ దృష్టి ఉండేది!'.

అమ్మ అనారోగ్యంతో ఆసుపత్రిలో ఉన్నపుడు ప్రక్క గదిలో నాన్నగారి హృదయం విపరీతమైన కలతకు గురయింది. 'అమ్మ'కు ఏమీకాదనీ, అందరి రుగ్మతల్నీ నివారించే 'అమ్మ'కు ఏమీకాదని తెలుసు. అయినా ఆయన ఆవేదనను బట్టి నాన్నగారికి ఎంత గౌరవం కల ఆత్మీయత ఉన్నదీ అర్థంగాకపోదు. కాళిదాసు శ్లోకంలో కూర్చినట్టు 'పార్వతీపరమేశ్వరౌ' అన్న ఏకత్వభావం, అమ్మ నాన్నగారి విషయంలో సత్యమనిపిస్తుంది.

'అమ్మ'ను చూడాలని ఎందరెందరో వచ్చేవారు. పగలనక, రాత్రి అనక భక్తజనం వచ్చేవారు. అన్నపూర్ణాలయానికి వెళ్ళి భోజనాలు చేసేవారు. ఎన్నో కార్యక్రమాలు జరుగుతూండేవి. ఏ ప్రచారమూ 'అమ్మ'గానీ, 'అమ్మ'తో ఉన్న కార్యకర్తలు గానీ తీసుకోక పోయినప్పటికినీ, దేశం నలుమూలల నుండీ, పశ్చిమ దేశాల నుండీ భక్తులు వచ్చేవారు. 'నాన్న'గారు నిరాడంబరంగా కూర్చునేవారు తప్ప, 'అమ్మ' భర్తగా తనకొక గుర్తింపు కలగాలనే తపన కనిపించేది కాదు. అలాంటి ప్రఖ్యాతి గన్న 'అమ్మ' దర్శనం చేసుకుని సరాసరి అన్నపూర్ణాలయానికి వెళ్ళి భోజనం చేసిన తరువాత వెళ్ళేవారు, ఉండాలనుకునేవారుండేవారు. ప్రపంచానికి



ఆరాధ్యదేవతయైన 'అమ్మ' తనకు ఆరాధ్యదైవం నాన్నగారేనని చెప్పేది. నాన్నగారికి నమస్కారం పెట్టి వెళ్ళాలన్న అభిప్రాయం కూడా వారికి కల్పించని, ప్రత్యేకత గల నిరాడంబరత్వం నాన్నగారిది. కానీ వారిని దర్శించు కోవాలని వెళ్ళినవారినీ, దగ్గరవారినీ ఎంతో కలుపుగోలు తనంతో మాట్లాడేవారు. వారు కళాకారులైతే పద్యాలు పాడించుకొనేవారు, తనూ పాడేవారు. రాజకీయ సంబంధీకులు వచ్చినపుడు దేశం గురించి, గాంధీ నెహ్రూల గురించీ మాట్లాడేవారు. తన ఇష్టాయిష్టాలతో గాకుండా, బిడియపడకుండా వెలిబుచ్చండి అనేవారు. ఎవరినీ విమర్శించేవారు కాదు.

బోళాశంకరుడు. పద్యాలు పాడేవారిని చూచినపుడు నాగుపాము పడగెత్తి పరవశించే నాగేశ్వరుడనిపించేవారు. నాన్నగారి మహాభినిష్క్రమణ సమయంలో ఓ నాగేశ్వనిలా ఓ రూపం కాంతివంతమై మేఘాల వైపుగా వెళ్ళిలీనమై పోయిందంటారు.

నాన్నగారు నిరాడంబరుడు, నిరాలంకారుడు, బోళాశంకరుడు; అమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మ కడుపాకలి యెరింగిన అమ్మ - 'అమ్మ' ప్రేమ ప్రేమమయి । ఆనందమయి । అమృతమయి । విస్తరించిన ఆకాశమంత మనసు అమ్మదయితే। పరుచుకున్న నేలంత విశాలం నాన్నగారి వాత్సల్యం.

రెండు అనాచ్ఛాదిత అంతరంగంలో మమేకమైన నేను - యిప్పటికీ అమ్మనూ, నాన్నగారినీ కలలు కంటూనే ఉన్నాను. ఈ కల వందలు, వందల వందల కాలం జగంలో పూజితం కావాలి.

జగడాలు లేని జగంగా జనులు సుఖశాంతుల నొందాలని బ్రహ్మాండంలో ఉన్న నాన్న బ్రహ్మాండ నాగేశ్వరుణ్ణి, అమృతాలు పంచి, వాటినింకా పెంచుతున్న 'అమ్మ'కూ నా వందన సహస్రములు. శిరము వంచి సమర్పించుకుంటున్నాను.









# శ్రీ నాగేశ్వరాలయం



సంకలనం : రాచర్ల రహి



"నాకే కాదు - చెట్లకు చేమలకు, యీ ప్రకృతికి - మీ పాదాలే శరణ్యం. ఈ సమస్త చరాచరంలో ఒకటయి; చరాచరానికే ఆధారమయినాయి. మీ పాదాలు - యుగయుగాలుగా చెప్పే పాదాలున్నాయే - ఆ పాదాల్లోని ప్రథమ పాదమే మీ పాదాలు. ఈనాడు అందరూ (వారి వారి పూజా) సంకల్పంలో ప్రథమ పాదే అంటారే - ఆ పాదమే యీ పాదాలు, యీ పాదాలే ఆ పాదం" అని జగత్తుగా మూర్తీభవించిన అంఆ, ముగ్గురమ్మల మూలపుటమ్మ మన అమ్మ - నాన్నగారి (శ్రీ నాగేశ్వరరావు గారి) స్థానాన్ని నిర్దేశించినది కనుకనే ఇప్పటి ఈ నాగేశ్వరాలయం.

అన్ని సాకారనిరాకారాలకు మూలమైన ఆ పరతత్వము తనకు తాను అనసూయ (సాకారం)గా అవతరించాలి అని సంకల్పించుకున్ననాడే, తనకి ఆధారంగా శ్రీ నాగేశ్వరరావుగారిని ఎంచుకున్నది. ఆ విషయము అమ్మ జీవితచరిత్రలోని అనేక సంఘటనల ద్వారా మనకు అవగతమవుతుంది.

ఒక సందర్భంలో, అమ్మ పదమూడవ యేటన మౌలాలి (అమ్మ చిన్నతనంలోనే అమ్మను దైవంగా గుర్తించి వీలు కుదిరనప్పుడల్లా, అమ్మ సాన్నిధ్యంలో గడిపే ఋషితుల్యుడైన ఓ అనాధ వయోవృద్ధుడు) "అమ్మా ! నీకు పెళ్ళి లేకపోతే యేం ? నాకు కలుగుతున్న దర్శనాల ద్వారా ఆ నీ దారి కత్తుల మార్గంలా, నిప్పుల సుడిగుండంలా అనిపిస్తోంది. ఆ భయంకర దృశ్యాలు గుర్తుకు వచ్చినప్పుడల్లా భయంతో నా మనస్సు, శరీరము వణికిపోతున్నాయి... అదీ కాక, ఈ మధ్య నల్లని నాగేంద్రుడు నీ కంఠానికి చుట్టుకుని నీ వైపు విషము జిమ్ముతున్నట్లు..." అని అంటుంటే - "నాన్నా, నాగేంద్రుడిలో విషతత్త్వం పోయి అమృతతత్త్వం కలిగినట్లు నీకు కనబడలేదా!" అని మౌలాలిని అమ్మ సవరిస్తుంది.

మరొక సందర్భంలో నాగేశ్వరరావుగారికి, అమ్మకి వివాహమని పెద్దలందరూ కలిసి నిశ్చయించి, శుభలేఖలు కూడా అచ్చువేసిన తరుణంలో, కుటుంబాలలోని మనః స్పర్ధల వల్ల ఆ కళ్యాణము ఆగిపోతుంది. ఒకరోజున, అమ్మ నాగేశ్వరరావుగార్లు, తెనాలి బంధువుల ఇంట్లో ఒకరికొకరు తారసపడితే, అమ్మ నమస్కరించుకునేందుకు వారి పాదాలు పట్టుకుంటుంది. "నా పాదాలు పట్టుకున్నావెందుకు!" అని ఆశ్చర్యపడుతున్న నాగేశ్వరరావు (నాన్నగారు) గారితో - "మనో వాక్కాయ కర్మలతో అంటున్న మాట, ఈ మాట - మీ పాదసేవ సర్వార్థ సాధకం" అంటూ చెమర్చిన కళ్ళతో నాగేశ్వరరావు



(నాన్నగారు) గారి పాదాలను తడిపి ఆ కన్నీటి బిందువులలో నాన్నగారి వైామును చూస్తూ "కన్నీటిబొట్లలో చూసిన ఈ మూర్తిని సర్వత్రా చూడాలి" అని అమ్మ తనకు తాను తీర్మానించు కుంటుంది.

ఈ సంఘటన జరిగే నాటికి అమ్మ వయస్సు ఆరు సం॥లు. లక్ష్మణాచార్యులనే అరవై సంవత్సరాల గొప్ప నృసింహోపాసకులు అమ్మతో కలిసి చిదంబరరావు గారింటికి వస్తుండగా, దారి మధ్యలో ఓ పెద్ద త్రాచు లక్ష్మణాచార్యులవారి ఎత్తున లేచి, వారినే సూటిగా చూస్తుంటుంది. ఆయన భయంతో బిగుసుకుపోయి, కొంతసేపటికి స్పృహలోకి వచ్చి, ఎదురుగా ఉన్న దృశ్యాన్ని చూసి మరింత నిర్ఘాంతపోతారు. ఆయన్ని భయపెట్టిన ఆ పెద్ద త్రాచు ఇప్పుడు అమ్మని చుట్టుకుని ఉంటుంది. చూస్తున్న ఆ దృశ్యము కరిగిపోయి మామూలు స్థితికి వచ్చిన తరువాత – "అమ్మా! పాము నిన్ను చుట్టుకోవటమేమిటి?" అని ఆశ్చర్యపడితే – "పాము కాదు నాయనా, నాగేంద్రుడు. ఆ నాగేంద్రుడే నన్ను చుట్టుకుని ఉన్నాడు. నేనే నాగేంద్రుడితో చుట్టించుకున్నాను. ఆ నాగేంద్రుడే నాగేశ్వరుడై వస్తాడు. వాడే నా కాధారం. **వాడి ఆకారమే నేను**" అని అమ్మ విశదపరస్తుంది.

'వాడే నాకాధారం' అనే మాట ఆచార్యుల వారికి రుచించదు. అమ్మా, అమ్మా, అమ్మా ముగ్గురమ్మల మూలపుటమ్మా! అంటూ పెద్దగా కేకలు వేస్తూ – 'నీ కాధార మేమిటమ్మా! నువ్వే ఆధారం' అని అయోమయంగా ప్రశ్నిస్తే "ముగ్గురమ్మల మూలపుటమ్మా అంటే – ఆదియై; అనాదియై; యీనాటికిది అయ్యింది. ముగ్గురు మూర్తులకు తల్లి మూలమపుటమ్మ – మూడు భాగాలై, అన్ని అవస్థల్ని మూడుగా జేసి; తను త్రిపుటియై; బాలై; బాలత్రిపురసుందరి అయి; మూడు గుణములు; మూడు కాలములు; మూడు పూటలు; మూడు అవస్థలు; మూడు శరీరభాగాలు; మూడు మూర్తులై; ఆ మూడు మూర్తులకు ముగ్గురు భార్యలై; ప్రపంచమై; ఒక భూతములో నుండే అనేకంగా మారి ప్రపంచముగా పంచబద్ధది. అందుకే నాకాధారం కావాలసివచ్చింది" అంటూ – ఆది అంతు లేకుండా, భూమిని ఆకాశాన్ని తాకుతూ, వారి ఇష్టదైవము నారసింహుడై దర్శనభాగ్యాన్ని కల్పిస్తుంది. మన అమ్మ – ముగ్గురమ్మల మూలపుటమ్మను తపస్సులో దర్శించే కాబోలు ఆదిశంకరాచార్యుల వారు సౌందర్యలహరిలో **"మనస్త్వం వ్యోమ త్వం మరుదసి మారుత్సారథి రసి...** నీవు మనస్సువు, నీవు ఆకాశానివి, వాయువువి, అగ్నివి నీవే, నీవే నీటివి, నీవే భూమివి. ఈ విశ్వం నీ పరిణామమే. (మనఃస్థానమైన ఆజ్ఞాచక్రం నుండి భూతత్త్వమైన మూలాధారం వరకు ఆరు చక్రాలు నీ పరిణామ రూపాలే) నీవు కానిది ఏదీ లేదు. విశ్వశరీరంగా పరిణమించడానికి నీ చిదానందాకారాన్నే శివ, శక్తి అనే దంపతీ రూపంగా ధరించుతున్నావు తల్లీ!" అలా అన్నీ తానైన ఆ బ్రహ్మాన్ని వర్ణించారు.

విశ్వచైతన్యము మహాచైతన్యంగా ఉన్నప్పుడు రూపం లేదు. ఆ శక్తి పరిపూర్ణంగా ఉన్నప్పుడు ఏ రూపమూ లేదు. రూపంతో రావాలనే సంకల్పము కలిగింది కనుకనే ఆ శక్తి రెండుగా – నాగేశ్వరుడితో కూడిన అనసూయగా ఆవిర్భవించింది. అన్ని ధర్మాలకు, సంప్రదాయాలకు అతీతమైన ఆ అనంతం, సాకారం (శరీరము)తో రెండుగా రావాలని నిర్ణయించుకున్ననాడే తన జీవనధర్మంగా – పాతివ్రత్యాధర్మాన్ని ఎంచుకున్నది. ఆ ధర్మంతో నాన్నగారికి అన్ని సేవలూ చేస్తూ, ఆయన మనస్సులో కలిగే ఆలోచనలకు కూడా సానుకూలంగా ప్రతిస్పందిస్తూ, ప్రతిక్షణము తన మనస్సుతో నాన్నగారిని వెన్నంటే ఉంటూ, ఆయనని శాంతిలో, అమృతస్థితిలో నిలిపి, తనకి ఆధారమైన వాడిని నాగేశ్వరాలయం ద్వారా పరమపూజనీయుడిని జేసింది.



నాగేశ్వరాలయంలోని మూలవిరాట్ ఇద్దరు మూర్తుల సంగమంగా కనిపిస్తుంది. అలా ఎందుకంటే - అమ్మ లేని అయ్యా లేడు, అలాగే అయ్య లేని అమ్మా లేదు. ఉన్న ఆ ఒక్క శక్తే రెండుగా వచ్చింది. కాబట్టే ఆ మూలవిరాట్ ఇద్దరు మూర్తులుగా, అమ్మానాన్నగారిలా దర్శనమవుతుంది.

అమ్మ (అంఆ) అంటే **'ఆది, అంతులేనిది; అన్నింటికీ ఆధారమైనది'** ఈ అంఆ తత్త్వాన్ని - ఆదిమధ్యాంతములు లేని బ్రహ్మాండాన్ని - గోళాకారంగా భావించి దానికి లింగం అని నామకరణం జేసాయి పురాణాలు. మరి లింగం అంటే (పురాణాల నిర్వచన ప్రకారము) - "సర్వజగత్తు దేనియందు లీనమై ఉన్నదో అది - లిం, సర్వజగత్తు దేనిని చేరుతున్నదో అది - గం. విశ్వమును నడిపించే లీనతత్త్వము, గమనతత్త్వము, గమ్యతత్త్వము - **లింగం**". ఈ లింగ రూపియైన పరమేశ్వరుని పరిమాణం **'ఆపాతాళ నభఃస్థలాంత భువనం'** - పాతాళం నుండి ఆకాశం వరకు ఉండే సమస్తమైన భువనము అయి ఉన్నది. నిరాకార, నిర్గుణ, నిరంజనమైన జ్యోతి స్వరూపానికి భక్తానుగ్రహ రూపమే లింగరూపము. అవయవరహితమై, ఆద్యంతములు లేనిదై **అంఆ తత్త్వాన్ని** ఆవిష్కరిస్తున్నందువల్లే ఆలయంలో అమ్మ లింగరూపంగా కనిపించీ, కనిపించకుండా ఉంటే, అమ్మ (లింగరూపాన్ని)ని చుట్టుకుని నాన్నగారు నాగేంద్ర రూపంతో ప్రముఖంగా, గంభీరంగా దర్శనమిస్తున్నారు.

యోగపరంగా చూస్తే సర్పము అంటే నడచునది - అంటే చైతన్యానికి సంకేతము. నాగములు అంటే జీవి దేహము నందు నాడుల ద్వారా సంచరించే ప్రాణశక్తులు. నాగేశ్వరాలయంలో సర్పరూపం (పరిమితిగా ఉన్న చైతన్యము - అంటే ప్రతి జీవి) - విశ్వమహాచైతన్యానికి సంకేతమైన లింగరూపాన్ని ఆధారంగా చేసుకుని, చుట్టలు చుట్టుకుని ఉండడము గమనిస్తే - విశ్వంలో ప్రతి జీవికీ ఆధారమై, వాడిలో ప్రాణశక్తులుగా జ్వలిస్తూ, ప్రాణనాధుడుగా, ప్రాణేశ్వరుడిగా, వాడే నాగేశ్వరుడిగా ఉన్నాడనిపిస్తుంది. ఆలయంలో లింగరూపంగా ఉన్న అమ్మని నాగేశ్వరుడని పిలవడానికి కారణము - ఆది, అంతు లేకుండా అన్నింటికీ (సర్వచైతన్యాలకీ) ఆధారమవుతున్నాడు గనుకనే.

నాగేశ్వరాలయంలోని మూర్తిని జూడగానే అమ్మ జీవితములోని ఓ మహోన్నత సంఘటన - ఋషితుల్యులు మౌలాలికి కలిగిన దివ్యదర్శనం జ్ఞప్తికి వస్తుంది. ఆ దివ్యదర్శన తత్త్వము రూపంగా మారితే నాగేశ్వరాలయం లోని మూలవిరాట్‌లా ఉంటుంది.

అమ్మ తన జీవితములో అసలు స్థితి (పరతత్త్వ స్థితి)ని మరుగున పరిచి, అందరికీ అతి సామాన్యంగా కనిపిస్తూ, ఏ కొందరికో (బహుశా వారి వారి ప్రారబ్ధాన్ని బట్టి కాబోలు?) అప్పుడప్పుడు తన మూలప్రకృతిని ఎఱుకపరుస్తుండేది. అలా ఎవరికైనా, ఎప్పుడైనా ఓ తత్త్వ దర్శనాన్ని ఇవ్వదలచుకున్నప్పుడు - ఆ స్థితి తానై - ఆ స్థితి తత్త్వదర్శన భాగ్యాన్ని ప్రత్యక్షంగా వారికి కల్పించి, సందేహ నివృత్తి జేసేది. అలాంటి సంఘటనలలో ఒక మహా సంఘటనను ఇప్పుడు చూద్దాము. అమ్మకు అప్పుడు పన్నెండు సంవత్సరాల వయస్సు. అమ్మ తోటలోకి వచ్చి, అక్కడ ఉన్న చింతచెట్టు క్రింద కళ్ళు మూసుకుని కూర్చుంటుంది. దాదాపు ఇరవై ఎనిమిది రోజులు అలా గడిచి పోతాయి. మొదటి రోజున ధరించి వచ్చిన ఆ పరికిణీ చొక్కాతోనే, తిండి తిప్పలు లేక, ఎండనక, వాననక, రాత్రి పగలు అక్కడే అలా కళ్ళు మూసుకుని కూర్చునుంటుంది. మౌలాలి మధ్య మధ్యలో తోట నుండి ఊళ్ళోకి వెళ్ళి, తిరిగి వస్తుండేవాడు.



మౌలాలి అమ్మను చూస్తూ, రకరకాల అనుభవాలను పొందుతుండేవాడు. తాను పొందిన, పొందుతున్న అనుభవాలను అమ్మకి చెబుతుండేవాడు. అమ్మ కళ్ళు మూసుకుని అలానే కూర్చుని ఉండేది. చివరి రోజు రాత్రి పన్నెండు గంటల సమయంలో మౌలాలికి - ఓ మహాసర్పము అమ్మ చుట్టూ చుట్టుకుని, అమ్మ తలపై గొడుగులా - లెక్కలేనన్ని శిరస్సులతో, అనేక రంగులతో, పౌర్ణమి వెన్నెల కాంతిలో మెరిసిపోతూ దర్శనమిస్తుంది. భ్రమేమో అనుకుంటూ, బాగా దగ్గరికి వెళ్ళి చూస్తే, యింకా బాగా స్పష్టంగా కనిపిస్తుంది. అమ్మ తెల్లవారుఝామున నాలుగు గంటలకు లేచి, మౌలాలికి చెప్పి, యింటికి వెళుతుంది.

ఇక్కడ మనల్ని ఆశ్చర్యంలో ముంచెత్తే విషయము - పన్నెండు సంవత్సరాల బాల - ఇర్వై ఎనిమిది రోజుల పాటు ఏకబిగిన అత్యంత కఠినతర పరిస్థితులలో - పగలు రాత్రి ఎండకి ఎండి, వానకి తడిసి, ఆహారము నీళ్ళు లేక, కళ్ళు మూసుకుని కూర్చుని అంత కఠోర యోగము జేయడమెందుకూ? యోగము, యోగవిద్య, యోగ లక్ష్యం తానే గదా !

మౌలాలి ఒక యోగి. తనకి ఎవరు కనబడ్డా అమ్మలా అనిపించేదిట. స్త్రీలు, పురుషులు, పిల్లలు, వృద్ధులు ఎవరైనా - ఎవరు కనిపించినా అమ్మలా అనిపించేదిట. అమ్మే అన్నిగా; అనంతంగా ఉన్నదని విశ్వసించి జీవించిన వాడు మౌలాలి. అందుకనేమో ! యోగవిద్యను గురించి చెప్పేటప్పుడు ఆ స్థితి తానై ఆ తత్త్వదర్శనాన్ని మౌలాలికి ప్రసాదించడమే కాకుండా, ఆయన సందేహాలను సవివరంగా వాక్కుల రూపంలో తీర్చింది.

ఆ దివ్యదర్శనము (మహాసర్పముతో చుట్టించుకున్న అమ్మ) కలిగిన రెండు రోజులకి మౌలాలి, అమ్మని తోటలో కలిసినప్పుడు - "సరేగాని అమ్మా!, మొన్న నీ తలపైన గొడుగల్లే పామున్నదే, యెందుకని ?" అంటూ జిజ్ఞాసతో ప్రశ్నిస్తూ ... ఆ దర్శనతత్త్వాన్ని అమ్మ ద్వారా తెలుసుకో గలిగాడు. ఆ సందర్భంగా అమ్మ చేసిన తత్త్వవిచారణా సారాంశము.

మానవ శరీరంలోని కుండలినీ (ప్రాణశక్తి) - 'మూలాధారములో మూడున్నర చుట్టుగల సర్పాకార ప్రాణశక్తి', బ్రహ్మదండం ('మూలాధారం నుండి శిరస్సు వరకు గల వెన్నెముక యందలి నాడీ దండమే బ్రహ్మదండం. ఇందు ఇడ, పింగళ, సుషుమ్న అను మూడు నాడులు ఒకదాని కొకటి పెనవేసుకుని, వెన్నెముక చివర నుండి శిరస్సులోనికి వ్యాపించి ఉంటాయి. మధ్యలో సుషుమ్నా నాడి ఒక దండము వలె ఉండగా, దానికటుయిటూ పెనవేసుకునియున్న రెండు సర్పములవలె ఇడ, పింగళ నాడులున్నాయి. ఈ సర్పముల శిరస్సులు దండము పై కొన కటుయిటూ ఉంటాయి. సుషుమ్న నాడి కనుబొమ్మల మధ్యభాగము నుండి వెన్నెముక చివరి వరకూ నిలిచి యుంటుంది')

మొత్తంగా చూసినా - పైకి లేచి నించుని, పడగ విప్పిన పాములా కనబడుతుంది. జీవి శరీరంలో ప్రాణశక్తి ప్రసరణ చేసే సర్వనాడీవ్యవస్థ నాగుల రూపంగా ఉంటుంది. శరీరములో ప్రవహించే ప్రాణశక్తి, దానికి ఆధారమైన సర్వనాడీవ్యవస్థ నాగుల రూపంగా ఎలా ఉంటుందో, విశ్వంలోని సర్వచైతన్య ప్రవాహపు తీరు అలాగ ఉంటుంది. అందుకే అమ్మ **"లోపల యేదో వెలుపలా అదే, రెండు కాదు"** అంటూ ఆ తత్త్వవిచారణ అంతటితో ముగిస్తుంది.

విశ్వమందలి మహాప్రాణశక్తి (అదే విశ్వకుండలినీ) పరిమితమై, ప్రతి జీవిలో కుండలినీ (ప్రాణశక్తి)గా



వెన్నెముక మొదలులోని **మూలాధారంలో పొగమంచులా అనిపించే లింగాకారానికి మూడున్నర చుట్టలు చుట్టుకుని** ఉంటుందని కొందరు యోగశాస్త్రజ్ఞుల నమ్మిక. ఆ యోగపరమైన తత్త్వానికి రూపంగా కూడా దర్శనమిస్తుంది నాగేశ్వరా లయంలోని ఆ మూలవిరాట్. ప్రతి జీవిలోని కుండలినీ శక్తి – షట్చక్రాలు (సహస్రారము కాకుండా), దాని అనుబంధ నాడీ మండల వ్యవస్థలతో పంచభూతాత్మక, పంచతన్మాత్రక, పంచజ్ఞానేంద్రియ, పంచకర్మేంద్రియ మరియు దేహ సప్తకోశాత్మక శరీరాన్ని నడిపిస్తుందని, యోగసాధన ద్వారా చుట్టలు చుట్టుకుని ఉన్న ఆ కుండలినిని తట్టిలేపి, మూలాధారం నుండి ఊర్ధ్వముఖంగా పయనింపజేసి, విశ్వమహాచైతన్యాని (విశ్వకుండలినీ) కి సహస్రారము ద్వారా తలుపులు తెరవగలిగితే తనలో ఉన్న చైతన్యమే సర్వత్రా మహా చైతన్యంగా ఉందనే అఖండమైన ఎఱుకను పొందినవాడై బ్రహ్మానంద స్వరూపుడవుతాడని యోగ శాస్త్రజ్ఞుల నమ్మిక.

విశ్వమహాచైతన్యాన్నే **కుండలినీశక్తి రూపంగా** కూడా దర్శించి, మన తల్లిని – **"సుధాధారసారై శ్చరణ యుగళాన్తర్విగళితైః ...** కుండలినీరూపమైన తల్లీ ! సహస్రార పద్మమున నీ పాదముల జంట నుండి జాలువారే అమృతధారల ప్రవాహాలచే, డెబ్బైరెండు వేల నాడులను, పంచభూత – మనోమయ ప్రపంచాన్నీ తడుపుచున్నదానవు. అనంతరము రసమయమైన తేజోరూపముతో సహస్రార చంద్రబింబము నుండి, నీ స్థానమైన **మూలాధారాన్ని చేరు కొందువు. అచట మూడున్నర చుట్టుగల సర్పాకారముగా నిన్ను నీవు మలచుకొని, కులకుండపు గుహలో నిద్రింతువు"** అంటూ ఆదిశంకరాచార్యులవారు సౌందర్యలహరిలో స్తుతించారు.

నాగేశ్వరాలయంలోని మూలవిరాట్ అనేక తత్త్వాలకు ఆలవాలమై విరాజిల్లుతున్నది. ముగ్గురమ్మల మూలపుటమ్మ అనసూయమ్మగా మానవ శరీరధారణతో వచ్చి, పాతివ్రత్యాధర్మంతో 'భర్తే భగవంతుడు' అనుకుని, అలానే జీవించి, తన ఇష్టదైవమైన నాన్నగారి ఆలయం నిర్మించుకుంది. 'నాగేంద్రుడే నాకాధారం' అన్న మాట ప్రకారము, ఆలయంలో ఆ మూర్తి గంభీరంగా, ఠీవీగా మనకు దర్శనమిస్తారు.

అమ్మ **'కామేశ్వరప్రాణనాడి'** కనుకనే నాగేంద్ర రూపంలో ఉన్న మూర్తి (అంటే నాన్నగారు) అమ్మని మూడున్నర చుట్టలు చుట్టుకుని (కుండలినీ శక్తి సంకేతము), 'రూపము నాన్న, శక్తి (రూపంలోని ప్రాణశక్తి) అమ్మ' అన్నట్లుగా **శివశక్త్యైక్య** స్వరూపంతో దర్శనమిస్తారు.

ఇక పురాణాల నిర్వచన ప్రకారము – బ్రహ్మాండానికి సంకేతమైన లింగాన్ని (అంఆ) ఆధారంగా చుట్టుకుని ఉన్న సర్పము (సర్పము అంటే నడచునది – జీవికి సంకేతము) చూస్తుంటే సర్వానికి ఆధారమైన వాడు (అంఆ) దర్శనమవుతున్నాడు. విశ్వమహాచైతన్యము – విశ్వకుండలిని నుండి జీవికి అవసరమైన ప్రాణశక్తిని మూలాధారంలో ఉంచి దానికి అవసరమైన నాడీవ్యవస్థను ఏర్పరచి ప్రాణనాథుడుగా, ప్రాణేశ్వరుడిగా (అంఆ) దర్శనమవు తున్నాడు.

యింతకీ ఆ గుడి ఎవరిది ? నాన్నగారి గుడి, అమ్మానాన్నగార్ల గుడి, అనంతుడైన అంఆ గుడి.

(బ్రహ్మర్షి సామవేదం షణ్ముఖశర్మ,
బ్రహ్మర్షి యార్లగడ్డ భాస్కరరావు గార్లకు
శతకోటి కృతజ్ఞతాభివందనములతో)



## పూజ్యులు బ్రహ్మాండం నాగేశ్వరరావు (నాన్న) గారి

## శతజయంతి సందర్భముగా





జిల్లెళ్ళమూడి సోదరీసోదరులందరికీ అభినందనలతో....

శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్
శ్రీమతి పి.వి.జె.యస్. గిరిబాల

డా॥ ప్రేమకుమార్ భార్గవ

శ్రీ పి. రవికిశోర్

పి. హైమానంద్ - శ్రీమతి పి. జానకీదేవి
చి॥ పి. అలేఖ్య, చి॥ రాధా విశ్వనాథ్



# MY FATHER : A PROFILE



*Sri M. Dinkar, Hyderabad*

Andarillu is the abode of one and all at Jillellamudi. Every person and every being seeks refuge in this House of All. The house of All thrives under the sheltered grace of AMMA. Many of the people who get tired in their strife and those in troubled times take cover here.

When one enters the House of All, the moment one crosses the threshold, he often finds a benign khadi clad figure. This person can be found either in the dining hall, a corner of the verandah or the village post office in the entrance end of the verandah. Whatever he is my father used to make it convenient to step out and greet the visitors to Andarillu warmly. He has an endearing say for everyone and a welcoming smile to all. This greeting used to place everyone at ease before seeking the darshan of AMMA.

Our Nannagaru being a firm believer in the congress ideology and an ardent supporter of the erstwhile freedom movement always preferred to dress himself in coarse Khadi. Never did he go in for ostentation either in dress or in his mode of life. He always lived simply and nurtured noble thoughts.

His affinity was universal. He had a care and concern for everyone in the complex. He used to take particular care of the students of Oriental College. This care was such that he sampled the cooked rice and the curries in Annapoonalayam and often preoccupied himself with the serving of food to the students. Not merely the students even the children and other individuals shared his thoughts equally in this respect. It was indeed a pleasant sight to see Nannagaru sitting on the steps of the dais and watch the common dinner during night times as he could not take rice in the nights. During the lunch hours he gleefully took his place along with the other diners totally oblivious of his unique stature. Such is his simplicity of manner.

In the play field he was as happy and joyous as a young lad of twenties. He forgot his age in such times and the others who were playing with him were hardly mindful of his elderly stature. Such was his disarming disposition in play times. My father took keen interest in all the games that were played in the House of All. He particularly delighted in the prize distribution ceremonies.

A major comforting feature of Nannagaru is he always had a kind word for the troubled and hard hit souls. For all those who are in deep distress, he expressed his personal concern. He had a sooth say for such times. He totally sympathized with the other in such moments and placed them at complete ease.

Nannagaru has been kindly inclined towards the erring. His sense of discipline was always mellowed in deep humanism and profound love. Whenever the college



students strayed from the expected norms of conduct and punishments were about to be inflicted on them, Nannagaru's presence redeemed the situation. He saw to it that a student got the right degree of correction without much of harsh tonalities. The student community always loved him for this kind intervention.

When he used to sleep in the nights either in the hall or in the verandah of the second floor he hardly was unware of the others. He always reacted with deep compassion. He used to observe whether everyone was comfortable. And he joined all of us at the time of dawn for the morning coffee. After finishing his coffee he came down and started his daily chores.

In the village his sway was without parallel. The villagers loved him beyond measure. His sense of fairness was such that he always upheld the interests of the villagers in all settlements of issues. At the time of golden jubilee when provisions were to be moved to the distant Kitchens the villagers jumped into the fray with great gusto at a simple word from Nannagaru. Even on the 16the Feb., they were edging to take out a procession of Nannagaru which in fact they did on the 28th February. Such is their unremitting love towards Nannagaru.

On all formal occasions Nannagaru was simple but subtle. His presence was keenly felt. His influence was always there on all occasions almost imperceptibly. His concern for Amma was stepped in his deep seated love and affection. Only those who are very close could gather at its depth.

In all ways Nannagaru was and is a source of stupendous strength and courage. The hitherto camouflaged divinity of Nannagaru has surfaced on the 16the Feb. Now he is always and for ever. His love and compassion are treasured for all times to come. His benediction is always and eternal for all beings. Blessed are those who can step into the sanctum of Anasuyeswaralayam where Nannagaru is consecrated, participate in the rituals there and partake Nannagaru's blessings.

***



అమ్మతో పూజాసమయంలో నాన్నగారు





# FATHER'S REMINISCENCES

*Sri E. Bhardwaja, Ongole*



It was a pleasant afternoon when I could get our father Sri B. Nageswara Rao into reminiscing about his own perceptions of the miraculous about Mother. I share them with the readers –

In a very general way father said that one of the remarkable phenomena he noticed was that whenever be suffered from serve headache – which was more or less a trait in the whole of his family he fell asleep as soon as Mother touched his forehead. Besides, he found that even though Mother suffered from very painful and dangerous ailments over prolonged periods of time ,her face remained as bright as ever. For instance, in 1942 Mother had a miscarriage and none recognized the fact till three days after the death of the foetus. She was rushed to the hospital at Chirala. Father said that Mother was somehow relieved of the dead foetus by the presence of mind of the nurse. But he was surprised to find Mother's appearance being bright as ever.

Father added that he first became anxious at the fit from which Mother seemed to suffer. He recollects that the fits started some where around 1936 and ended with the birth of her eldest child Subba Rao. She had to be rushed to Bapatla on a cot, carried by a couple of persons for medical aid. The fits, he said, were characterized by clenching of teeth, falling, weeping, talking without any sense, wrongly indentifying persons, and failing to recognize even father properly. He clearly remembered one such occasion in 1949. When every one was worried about her condition, she signed to all to be patient till 3. P.M on that day by which time she came to normalcy.

Father recounted that in 1965 Mother one day told him of events in his life that occured in 1953 which she had no chance of knowing , one of them being an attempt of his life by rivals in the village faction.

In 1956, when she was making ready to serve meal to father and a guest, the spot between her eye-brows suddenly burst open and a jet of blood shot out in a spurt. Mother immediately pressed her hand against the spot for a few seconds. When she took off her hand, he only found a small quantity of sacred ash in its place. Mother distributed that to both of them as a token of her grace.

In 1957 he was surprised to notice that Mother's person emitted strange scents. Every object that she touched be it clothes, food, stone or anything, smelt strongly in a pleasant manner and even the very movement of her body produced the same. The clothes which she held for him smelt sweet even after a few washes!

It is very rarely that he yields to any requests to speak about the unique features of Mother as he observed them, and on one such occasion, he gave us these glimpses for which we are all bound to be grateful to him.

***



